# అర్థశాస్త్రం

రచన:
లియాన్‌టీవ్





అనువాదం:
నండూరి ప్రసాదరావు



ప్రజాశక్తి బుక్‌హౌస్, విజయవాడ-2

# అర్థశాస్త్రం

(ప్రారంభ పాఠాలు)

రచన:

లియాన్‌టీవ్

అనువాదం:

నండూరి ప్రసాదరావు



ప్రజాశక్తి బుక్ హౌస్ : విజయవాడ-2

# రాజకీయ అర్థశాస్త్రం అంటే ఏమిటి?
# అది బోధించేదేమిటి?

కార్మికవర్గం, మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్‌ల బోధనల ననుసరించి, తన పోరాటాన్ని కొనసాగిస్తుంది. ఈ మహోపాధ్యాయులయిన కార్మిక వర్గ నాయకులు అత్యంత శక్తివంతమైన ఆయుధాన్ని రూపొందించారు. కార్మిక వర్గపు విప్లవకర సిద్ధాంతాన్ని సృష్టించి, అభివృద్ధి పరచారు. పెట్టుబడిదారీ విధానం క్రింద కార్మికవర్గం సాగించే పోరాటానికి మార్క్సిస్టు-లెనినిస్టు బోధనలు సరియైన దారి చూపుతాయి. పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా పోరాటం ప్రారంభించే వర్గచైతన్యంగల అన్ని దేశాల కార్మికులకు మార్క్సిజం-లెనినిజం అతి శక్తివంతమైన ఆయుధంగా ఉంటుంది. కార్మికవర్గ విప్లవం జయప్రదమైన తరువాత కూడా సోషలిజానికి శత్రువులైన వారందరికీ వ్యతిరేకంగా జరిపే పోరాటాన్ని జయప్రదంగా కొనసాగించటానికి దారిచూపుతుంది. పూర్తి సోషలిస్టు సమాజాన్ని నిశ్చయంగా నిర్మించుటకు సరియైన విధానాన్ని అవలంబించునట్లుగా మార్క్సిజం-లెనినిజం తోడ్పడుతుంది.

లెనిన్ బోల్షివిక్ పార్టీయొక్క మొదటి ముసాయిదా ప్రోగ్రాముకు వివరణ యిస్తూ ముప్పది సంవత్సరముల క్రితం యిలా వ్రాశాడు. "మార్క్సిస్టు సిద్ధాంతం ................ మొదటిసారిగా సోషలిజాన్ని ఊహాజనితమైన దానినుంచి శాస్త్రీయమైన దాన్నిగా మార్చింది. ఈ శాస్త్రానికి, సరియైన గట్టి పునాదిని ఏర్పాటు చేసి దానిని మరింత పూర్తి వివరణలతో అభివృద్ధి పరచి ఏ మార్గాన్ని అనుసరించవలసిందీ సూచించింది. నేటి పెట్టుబడిదారీ ఆర్థిక విధానం, భూములు, ఫ్యాక్టరీలు, గనులు మొదలగు వాటిని కలిగియున్న కొద్దిమంది పెట్టుబడిదారులు, అసంఖ్యాకంగా ఉన్న ఆస్తులు ఏమీలేని ప్రజానీకాన్ని, కూలీలుగా నియమించి వారి శ్రమశక్తిని కొనివేయటంద్వారా వారిని బానిసలుగా చేస్తున్న విషయాన్ని కప్పిపుచ్చుతున్నదని మార్క్సిజం బట్టబయలు చేస్తోంది. నవీన పెట్టుబడిదారీ ఆర్థికాభివృద్ధి అంతా ఏవిధంగా పెద్దపెద్ద పరిశ్రమలు చిన్న పరిశ్రమలను నాశనం చేయటానికి దారి తీస్తున్నదీ, సోషలిస్టు సమాజాన్ని నిర్మించవలసిన పరిస్థితులను, అవశ్యకతను ఏవిధంగా సృష్టిస్తున్నదీ మార్క్సిజం తెలియజేస్తోంది.

పాతుకుపోయిన ఆచారాల ముసుగు క్రింద, రాజకీయ కుట్రలు, మోస పూరిత చట్టాలు, జిత్తులమారి బోధనలు మొదలగువాని క్రింద ప్రతి ఒక్కరూ వర్గ పోరాటాన్ని గుర్తించేలా మార్క్సిజం బోధించింది. ఈ వర్గపోరాటం ఆస్తులున్న అన్నితరగతుల వారిమధ్యనూ, కార్మికవర్గం నాయకత్వం వహించే ఆస్తులు ఏమీలేని జనసామాన్యానికి మధ్యనూ జరుగుతుంది. మార్క్సిజం, విప్లవకర సోషలిస్టుపార్టీ యొక్క నిజమైన కర్తవ్యాన్ని సుస్పష్టం చేసింది అది చేయవలసింది సమాజాన్ని పునర్నిర్మించేటందుకంటూ చేసే మోసపూరిత ప్లానులు కావు. కార్మికుల స్థితిగతులను మెరుగుపరచాలని పెట్టుబడిదారులకు, వారి తాబేదారులకు నీతిబోధనలు చేయడం కాదు. కుట్రలను పన్నడం ఎంతమాత్రమూకాదు. అది కార్మికవర్గ పోరాటాలను నడుపుతూ వాటికి నాయకత్వం వహించాలి. రాజకీయాధికారాన్ని కార్మికవర్గం హస్తగతం చేసుకోవాలనీ, సోషలిస్టు సమాజాన్ని నిర్మించాలనీ, అంతిమ ఆశయం కలిగి వుండి పనిచేయాలి. *

మార్క్సిజం, మానవసమాజ చరిత్రను శాస్త్రీయదృక్పథంతో అధ్యయనం చేయడానికి మొట్ట మొదటిగా ఉపక్రమించింది. బూర్జువా శాస్త్రజ్ఞులు, సమాజాభివృద్ధిని తెలియజేసే సూత్రాలను వివరించటంలో అశక్తులయ్యారు. వారు సమాజపు చరిత్ర అంతా అనుకోకుండా జరిగే అనేక వరుసఘటనల గొలుసు మాత్రమేననీ, వాటిని కలిపే దానిని వివరించుటకు, ప్రత్యేక సూత్రం కనుగొనుట అసాధ్యమని చెప్పారు. మొట్టమొదటిసారిగా మార్క్స్ భౌతిక పరిణామం మాదిరిగానే సామాజిక పరిణామం కొన్నిఅంతరంగిక సూత్రాలననుసరించి జరుగుతుందని వివరించారు. అయితే ప్రకృతిపరిణామ సూత్రాలకన్నా సమాజపరిణామ సూత్రాలువేరు. మానవుని యొక్క ఇచ్ఛ మేరకు సంబంధం లేకుండా స్వతంత్రంగా యీ సమాజ పరిణామం జరగడం లేదు. పైపెచ్చు మానవ మేధ యొక్క కార్యాచరణవల్లనే ఈ పరిణామం జరుగుతున్నది. • పెట్టుబడిదారీ విధానం, తనలోనే వున్న పరస్పర విరుద్ధ శక్తుల

---

* లెనిన్ - కలక్టడ్ వర్క్స్ - సంపుటి 2.
అవర్ ప్రోగ్రాం - పే. 491 - రష్యన్ ఎడిషన్.

• చరిత్ర పరిణామానికి సంబంధించిన మార్క్సిస్టు మూలసూత్రాలు చారిత్రిక భౌతికవాదం (Historical materialism) అని అంటాము. ఉదాహరణకు ఈనాటి సమాజాన్నిపరిశీలిస్తుంటే, ఉన్నదున్నట్లుగా పరిశీలన ప్రారంభిస్తే తుది మొదలు కూడాతెలియదు. కాబట్టి ఏ సమాజ పరిస్థితులనుండి ఇప్పటి సామాజిక వ్యవస్థ ఏర్పడింది; ఈ వ్యవస్థనుండి ఏసామాజిక వ్యవస్థ ఏర్పడబోతున్నది—అనేది పరిశీలించాలి ఈ పరిణామం మానవుని ఇచ్ఛ అభీష్టముల ప్రకారం జరుగదు—అతడెంత వ్యతిరేకించినా; అతడు అసలు దానిని గుర్తించక పోయినా, అందుచే సమాజ పరివర్తనం, అభివృద్ధులు కొన్ని నిర్దిష్టమగు సూత్రాలప్రకారమే నడుస్తవి: ఈ సూత్రాలు మానవుని ఇచ్ఛ కోర్కె. చైతన్యములకు లోబడి వుండవు సరిగదా పైపెచ్చు, ఈ సమాజ పరిణామ సూత్రాలే మానవుని ఇచ్ఛ, చైతన్యములను నిర్ణయిస్తవి. ఇదే మార్క్స్ ప్రధాన సిద్ధాంతం.—(అనువాదకుడు)

మూలకంగా తన నాశనం వైపు తను తప్పనిసరిగా పోతూవుందని మార్క్సిజం స్పష్టం చేసింది. అయితే పెట్టుబడిదారీ విధానం యొక్క నాశనం దానంతటికదే రాదు; అది శ్రామికవర్గం పెట్టుబడిదారీ వర్గంతో జరిపే ఎడతెగని పోరాటంవల్లనే వస్తుంది. సమాజం ఏ విధగానో కొన్ని నిర్ణీతమైన సూత్రాల ప్రకారం నడుస్తోంది. కాబట్టి పెట్టుబడిదారీ వ్యవస్థ బదులు సోషలిస్టు వ్యవస్థ దానంతట అదే వస్తుంది. కాబట్టి కార్మికవర్గం ఏమీ చేయకుండా చేతులు ముడుచుకు కూర్చుంటే చాలు; సమాజ పరిణామ సూత్రాలు ఎట్లాగూ పనిజేస్తూ సోషలిజం దానంతట అదే వస్తుంది అనే సోషల్ డెమోక్రాటు * సిద్ధాంతం మార్క్సిజాన్ని ఘోరంగా వికృతంచేయటం తప్ప మరేమీ కాదు సమాజ పరిణామ సూత్రాలు వాటంతట అవే ఫలించవు సమాజంలో జరిగే వర్గపోరాటం మూలకంగానే ఈ పరిణామ సూత్రాలు ముందుకు త్రోసుకురాగలవు. పరిణామ సూత్రాలు ముందుకు పోగలవు.

శ్రామికవర్గం, మార్క్స్-లెనిన్ సిద్ధాంతాల సహాయంతో తమ పోరాటాన్ని సాగించగలదు. సమాజం ఎట్లా పరిణామం చెందుతున్నదో, తాము ఏ పంథాను ఏ వ్యూహాలను, ఎత్తులను అవలంబించాలో కార్మికులకు మార్క్సిజం — లెనినిజం తెలియజేస్తుంది.

సమాజంలో రెండుపక్షాలు వున్నవి. పీడించేవారు ; పీడింపబడేవారు. వీరి రువురి మధ్య ఎల్లప్పుడూ ఎడతెగని పోరాటం జరుగుతూ వుంటుంది. ఈ వర్గ పోరాటాన్నే మార్క్సిజం బట్టబయలు చేస్తూవున్నది. ఈ వర్గ పోరాటాన్ని ఎడతెగకుండా జరిపి, పెట్టుబడిదారీ వర్గం యొక్క అధికారాన్ని కూలద్రోసి, శ్రామికవర్గ నియంతృత్వాన్ని ఏర్పరుచుటద్వారానే సోషలిజం స్థాపన జరుగుతుందని మార్క్సిజం తెలియజేస్తుంది.

## పెట్టుబడిదారీ వ్యవస్థలో వర్గపోరాటం

ఏ కాపిటలిస్టు దేశాన్నిగాని, చూడండి : అది బాగా అభివృద్ధి పొందినదైనా, వెనుకబడినదైనా సరే, మొట్ట మొదటగా మనకు ఆ దేశంలో కనిపించేవి వర్గ విభేదాలు, రాజమందిరాలు, ఉద్యానవనాలు, విశాలమగు రాచబాటలు — వీటిలో నివసిస్తూ సమస్త భోగాలను అనుభవించే కొలదిమంది ధనాఢ్యులు కనపడుతారు : ఈ భాగ్యాన్నంతటినీ సృష్టిస్తూకూడా కూలిపోయే గుడిసెలలో మురికిగుంటల ప్రక్క బక్కచిక్కిన ఎండు డొక్కలతో కృంగి కృశించిపోయే కార్మికులు మరోప్రక్క కనపడుతారు.

---

* ప్రథమంలో, మార్క్సు సిద్ధాంతాలను అనుసరించేవారిని సోషల్ డెమోక్రాటు లనేవారు. కాని క్రమేణా సిద్ధాంత భేదాలు వృద్ధియౌతున్న కొలది సరియగు పంథా అవలంబించిన వారిని కమ్యూనిస్టులనీ, మార్క్సిజాన్ని తారుమారుచేసి, సంస్కరణ వాదాన్ని అవలంబించిన సోషలిస్టులనుసోషల్ డెమోక్రాటులనీ పిలవటం సాగింది. (అనువాదకుడు)

కాపిటలిజం క్రింద సమాజం "రెండు" శత్రు "పక్షాల" క్రింద ఒకరి నొకరు ఎదుర్కొనే "రెండు వర్గా" క్రింద చీలిపోతుంది. ఇవే బూర్జువా శ్రామిక వర్గాలు దేశంలోవుండే సంపదఅంతా భూమి, యంత్రాగారాలు, గనులు బ్యాంకులు, రైల్వేలు— సమస్తమూ బూర్జువా వర్గానిది. ఇదే "పరిపాలక వర్గం" కూడా. రాజ్యాధికారం ఈ వర్గంయొక్క చేతులలోనే వుంటుంది. శ్రామిక వర్గానికి వుండేదంతా దరిద్రం, బాధలు, పీడన. ఇందువల్ల ఏ దేశంలోనైనా మొట్టమొదటగా మనకు కన్పించేది "బూర్జువా. శ్రామికవర్గాల మధ్యగల తేడా. ఈ దేశంలో అన్నిటికన్న ప్రాధాన్యత వహించేది ఈ రెండు వర్గాల మధ్య "పోరాటం". ఈ రెండు వర్గాల మధ్య నుండే అఘాతం అంతకంతకూ పెరుగుతుంది. ఈ వర్గవిభేదాలు ఎక్కువైన కొలదీ కార్మిక ప్రజాసామాన్యం యొక్క కోపాగ్ని ప్రజ్వరిల్లుతుంది. వారి పోరాటాలు వృద్ధియౌతవి. వీరి విప్లవ చైతన్యం వృద్ధియౌతుంది; వారి బలంయెడ వారికి విశ్వాసం వృద్ధియౌతుంది; కాపిటలిజాన్ని నిర్మూలించ గలమనే విశ్వాసం గట్టి పడుతుంది.

కాపిటలిస్టు వ్యవస్థలో వచ్చే సంక్షోభంవల్ల శ్రామికవర్గానికి చెప్పరాని కష్టాలు కల్గుతాయి. అత్యధికులకు నిరుద్యోగం, స్వల్ప జీతాలు, హతాశులయిన వేల కొలది అభాగ్యుల ఆత్మహత్యలు, కరువువల్ల చావులు, పసిపిల్లల దుర్మరణాలు— కాపిటలిజం కార్మికులకు బహూకరించేవి ఇవే కార్మికు లీవిధంగా విపరీత దురవస్థలకు గురియౌతుంటేబూర్జువావర్గం మాత్రం యధావిధిగా విపరీత సంపదలను భోగు చేస్తూనే వుంటుంది.

ఉదాహరణకు, జర్మను వార్తాపత్రికల ప్రకటనల ప్రకారం రంగుల కంపెనీలో 43 మంది డైరెక్టర్లకు ఒక్కొక్కరికి ఏడాదికి 145000 మార్కులు, • స్కూటర్ల కంపెనీలోని 4 గురు డైరెక్టర్లకు ఒక్కొక్కరికి ఏడాదికి 145000 మార్కులు, మాన్నిమన్ కంపెనీలోని 7 గురు డైరెక్టర్లకు ఒక్కొక్కరికి 135000 మార్కులు, అలెవెన్స ఇమ్పారెన్స కంపెనీ యొక్క 32 మంది డైరెక్టర్లకు ఒక్కొక్కరికి 80000 మార్కులు సంపాదన వస్తుంది. *

కొలదిమంది పరాశ్రయ జీవులు సోమరిపోతులుగా సర్వసంపదలతో తుల తూగటానికై లక్షలు, కోట్లమంది తిండిలేక మలమల మాడిపోవలసి వస్తున్నది. కాపిటలిజం ప్రసాదించేది ఇదే. వర్గవిభేదాల ఫలితం ఇదే: ఈ వ్యవస్థవల్ల తరచు సంభవించే సంక్షోభములవల్ల ఈ వర్గవిభేదాలు మరింత తీవ్రమౌతవి.

కాపిటలిస్టు దేశాలలో బూర్జువావర్గం, శ్రామికవర్గం ఈ రెండే మూల వర్గాలు. వీరిమధ్య సంబంధాలు, వీరిమధ్య పోరాటాలు – ఇవే కాపిటలిస్టు సమాజం

• జర్మను నాణెం పేరు మార్కు (అనువాదకుడు)

* భారతదేశాన్ని ఉదాహరణగా తీసుకున్న ఈ వ్యత్యాసం స్పష్టంగా కన్పిస్తుంది

యొక్క భవితవ్యమును నిర్ణయించేవి. అయినా, కాపిటలిస్టు దేశాలలో బూర్జువా శ్రామికవర్గాలతోబాటు మధ్యతరగతి ప్రజలు కూడా వుంటారు. చాలా దేశాలలో ఈ మధ్యతరగతి ప్రజల సంఖ్య తగినంత ఎక్కువగానే వున్నది.

ఈ మధ్యతరగతి ప్రజలు అంటే ఎవరు ? రైతులలో ఒక మోస్తరు స్థితిపరులు, బీద రైతులు, గృహపరిశ్రమదారులు మున్నగువారు మధ్యతరగతి ప్రజలు. వీరికి కొంత భూమి, కొన్ని పనిముట్లు, ఉపకరణాలు మున్నగునవి వుండటంవల్ల బూర్జువావర్గ తో బంధుత్వము, కష్టజీవులు కాబట్టి శ్రామికవర్గంతో బంధుత్వము. ఈ విధంగా వీరి జీవితం ఇరువర్గాలతోనూ పెనవేసుకొని వుంటుంది. కాని కాపిటలిజం వల్ల ఈ మధ్యతరగతి క్రమేణ శిధిలమైపోతుంది. కాపిటలిస్టులు ఇట్టి మధ్యతరగతి ప్రజలను నలిపివేస్తారు. వీరిలో చాలా కొద్దిమంది మాత్రమే భాగ్యవంతులై బూర్జువా వర్గంలో కలసి దోపిడిగాండ్రుగా తయారౌతారు: కాని అత్యధిక సంఖ్యాకులు సమస్తమూ కోల్పోయి శ్రామికవర్గంలో చేరిపోతారు అందుచే, బూర్జువావర్గంతోటి పోరాటంలో శ్రామికవర్గంయొక్క మిత్రులు మధ్యతరగతి ప్రజలు.

## వర్గము లనబడేవి ఏమిటి ?

ప్రతి కాపిటలిస్టు దేశంలోనూ బూర్జువావర్గం, శ్రామికవర్గం – ఇవి రెండే ప్రధానమైన వర్గాలు. అధికారంలో వుండి పరిపాలన సాగించేది బూర్జువావర్గం. అయితే శ్రామికవర్గం లేకుండా బూర్జువావర్గం వుండలేదు. ఫ్యాక్టరీలలోనూ, గనుల లోనూ కార్మికుడు చెమటోడ్చి సంపదలు సృష్టించనిదే కాపిటలిస్టు భాగ్యవంతుడు కాలేదు. కార్మికుని స్వేదబిందువులే బూర్జువాలకు లక్ష్మీప్రసన్నము గావిస్తవి. అందుచే బూర్జువావర్గం పెరుగుతూ వుండటం, బలపడుతూ వుండటంతోబాటు శ్రామికవర్గమూ పెరుగుతూ, వారి ఐకమత్యం పెరుగుతూ వుంటుంది ఈ విధంగా బూర్జువావర్గం తన వినాశకులను తానే సృష్టించుకుంటుంది. కాపిటలిస్టు విధానం పెరుగుతూవున్న కొలది దాని వడిబొడ్డులోనే భావి సోషలిస్టు సమాజం యొక్క శక్తులు ఉద్భవిస్తాయి. వర్గాలు, వర్గపోరాటాలు, అంతర్విభేదాలు – ఇదే కాపిటలిస్టు సమాజంయొక్క జీవితం.

కాని వర్గాలంటే ఏవి ? ఈ ప్రశ్నకు లెనిన్ ఈ క్రింది విధంగా జవాబు చెప్పాడు:

"సామాన్యంగా వర్గాలు అంటే ఏమిటి ? సమాజంలో ఒకరి శ్రమశక్తిని మరొకరు అపహరిస్తూవుంటే వర్గాలు ఉద్భవిస్తాయి. సమాజంలో ఒక భాగానికే భూమి అంతా వుంటే, భూస్వాములు, రైతులు అనే రెండు వర్గాలు వుంటాయి. ఒక భాగానికే ఫాక్టరీలు, గనులు, బ్యాంకులు, షేర్లు, పెట్టుబడివుంటే, రెండో భాగం

ఈ ఫ్యాక్టరీలు వగైరాలలో పనిజేస్తూ వుంటే కాపిటలిస్టువర్గం, శ్రామికవర్గం ఏర్పడుతాయి".*

అయితే, సమాజంలో ఒక భాగం కష్టపడుతూవుంటే, మరో భాగం కష్ట ఫలితాన్ని అంతటినీ హరించే అవకాశం ఎట్లా ఏర్పడింది? "విత్తకుండా పంటను కోసుకుపోయే" పెద్దమనుష్యులు సమాజంలో తయారౌటకు కారణాలేమిటో చూడాలి.

ఈ రహస్యాన్ని తెలుసుకోవాలంటే సమాజంలో "ఉత్పత్తిక్రమం ఏ పద్ధతులపై నిర్మాణం గావింపబడి ఉన్నదో" పరీక్షచేయాలి. ఉత్పత్తి అంటే ప్రతి కార్మికునికీ తెలుసు. మనిషి బ్రతికి ఉండాలంటే తిండి, బట్ట ఇల్లు వుండాలి ఇల్లు కట్టాలంటే, పంటలు పండించాలంటే బటలు నేయాలంటే, ఈ విధంగా మానవుని వాంఛలకవసరమైన సరకుల నన్నింటినీ తయారు చేయాలంటే ఫ్యాక్టరీలు మున్నగు వాటిలో శ్రమ పడాలి ఈ సంగతి కార్మికులకు బాగా తెలుసు. ఎందుకంటే వారు రోజూ చేసేది ఆ పనే కాబట్టి.

మానవుడు ప్రకృతిలో లభ్యమయ్యే వస్తువులను తీసుకొని తన కోర్కెలను తీర్చుకుంటానికై తన శ్రమవల్ల వస్తువులను తయారు చేస్తాడు. భూగర్భంలో నుండి ఇనుము, బొగ్గు, చమురు, మున్నగునవి వుంటాయి తన శ్రమశక్తిద్వారా మానవులు వీటిని పైకితీస్తారు. ముడిఇనుము కరిగించి ఇనుము తయారు చేస్తారు. ఈ ఇనుముతో అసంఖ్యాకములయిన వస్తువులు— పెద్ద రైల్వే ఇంజను మొదలుకొని చిన్న గుండుసూదివరకూ— తయారు చేస్తారు. ఈ విధంగా మానవుని శ్రమశక్తిద్వారా ప్రకృతి సంపదను మానవుని కోర్కెలను తీర్చుటకవసరమైన సరుకులు వుత్పత్తి చేయబడుచున్నవి.

అయితే, మానవులు ఒంటరి ఒంటరిగా గాక కలిసి పనిజేస్తారనేది ప్రతి వారికీ తెలిసినదే ఒక్కగానొక్క మనుష్యుడు ఒక పెద్ద ఫ్యాక్టరీలోగాని, గనిలో గాని ఏమి చేస్తాడు? అసలు వందలు, వేలు కలిసి పనిజేస్తేనేగాని అట్టి పరిశ్రమలు యంత్రాలయాలు పనిచేయగలవా? అయితే, ఇట్టి భారీ పరిశ్రమలలోనేకాదు మనుష్యులు కలిసి పనిజేసేది; చిన్నవాటిలోకూడా కలిసి పనిజేస్తారు. అసలు ఒక్క మనుష్యుడే యితరుల సహాయం లేకుండా పనిజేస్తాడనేది ఊహించుటకే వీలులేదు. ఒక బీద రైతు చారెడంత భూమితునకలో ఒంటినాగలితో సాగుజేస్తున్నా, ఇతనికి వడ్రంగి, కమ్మరి మున్నగువారి సహాయం లేకపోతే, ఒక్క అడుగు సాగదు. ఇదే విధంగా చేతిపనులవారు కూడా వారు ఒక్కొక్కరే తమ ఇండ్లలో పనిజేయుచున్నా వారి పనులకు కావలసిన వుపకరణాలు ఇతరులచే తయారుచేయబడినవే.

---

* యువజన కమ్యూనిస్టు లీగు మూడవ కాంగ్రెసులో లెనిన్ యిచ్చిన వుపన్యాసం నుండి.

కాబట్టి సమాజంలో ఉత్పత్తి ఏవిధంగా జరుగుతోందో చూశాము. ఉత్పత్తి "సామాజికంగా" జరుగుతుంది; అయితే ఇది "అనేకవిధాల" జరుగుతుంది.

ఉత్పత్తి చేయాలంటే భూమి, ఫ్యాక్టరీలు, యంత్రాలు, ముడిసరుకులు మున్నగునవి కావాలి. వీటినే "ఉత్పత్తి సాధనాలు" అంటారు. అయితే "మానవుని కాయకష్టం" లేకుండా "మానవుని శ్రమశక్తి" జోడించకుండా ఈ వుత్పత్తి సాధనాలు వినియోగపడవు. ఉత్పత్తి సాధనాలకు మానవుని శ్రమశక్తి జతగూర్చబడ్డప్పుడే ఉత్పత్తి ప్రారంభమౌతుంది. "మానవ సమాజంలో వివిధ వర్గాల స్థానం, ప్రాముఖ్యత ఆయా వర్గానికి ఈ వుత్పత్తి సాధనాలతో వుండే సంబంధంవల్ల నిర్ణయింపబడగలవు." ఉదాహరణకు, ఫ్యూడల్ సమాజంలో, వుత్పత్తి సాధనమైన భూమియంతా భూస్వాముల చేతులలో వుండేది. భూమిమీది తన స్వత్వమువల్ల భూస్వామి రైతులను దోచుకునేవాడు. కాపిటలిస్టు పద్ధతిలో వుత్పత్తి సాధనాలన్నీ బూర్జువావర్గం చేతులలో వుంటాయి. శ్రామిక వర్గమునకు వుత్పత్తి సాధనాలేమీ వుండవు. బూర్జువావర్గం శ్రామికవర్గాన్ని దోచుకుంటానికి మూలం యిది.

వర్గముల యొక్కగాని, వర్గవిభేదాల యొక్కగాని పుట్టుకకు కాపిటలిజం కారణం కాదు. కాపిటలిజానికి పూర్వమే ఫ్యూడల్ విధానంలోనూ, అంతకుముందు కూడా వర్గము లుంటూవుండేవి. కాని కాపిటలిస్టు వ్యవస్థలో పాతవర్గాల బదులు కొత్తవర్గాలు వచ్చినవి. ఒక వర్గాన్ని ఇంకో వర్గం దోచుకుంటానికీ, వర్గపోరాటాన్ని సాగిస్తానికీ కొత్త పద్ధతులను తెచ్చిపెట్టటమే కాపిటలిజం చేసినపని.

## ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంఘాలు

మానవ సమాజం యొక్క అభివృద్ధిని గూర్చిన సూత్రములు మొట్టమొదటగా బహిరంగపర్చినది మార్క్సు. సమాజ పరిణామానికి మూలం ఆర్థిక విషయాలనీ, ఈ అభివృద్ధికి ప్రధానమైన స్ప్రింగు వర్గపోరాటమనీ మార్క్సు తెలియజేశాడు. పీడింపబడే వర్గాలు పీడించే వర్గాలతో పోరాడటమే చరిత్ర ముందుకు సాగటానికి కారణమయ్యే మూలశక్తి.

సామాజిక వుత్పత్తి క్రమంలో ఏయే వర్గానికి ఏయే స్థానం వుందో, అంటే ఉత్పత్తి సాధనాలకూ, వారికీ ఎలాటి సంబంధమున్నదో, వాటినిబట్టే వర్గ విభజన జరుగుతూ వున్నదని ఇంతవరకూ చూశాము. ఇంతేగాక, ఈ సామాజిక వుత్పత్తి విధానంగూడా బహురీతులుగా ఏర్పాటు కాబడి వున్నది. కాపిటలిస్టు దేశాలలో ఒక సామాజిక వ్యవస్థ, సోవియటు యూనియన్‌లో మరొక సామాజిక వ్యవస్థ ఏర్పడి వున్నవి. కాపిటలిస్టు దేశాలలో కార్మికులు కాపిటలిస్టులకు కూలిపని జేయాలి, అనేక నిర్బంధాలకు, బాధలకు గురికావాలి. ఈ దేశాలలో వుండే ఫ్యాక్టరీలు, గనులు, బ్యాంకులు వగైరా అన్నీ బూర్జువావర్గానికే చెందివుంటాయి. ఈబలం వల్లనే

కార్మికుల రక్తమాంసాలు పిండి డబ్బు కూడబెట్టుతారు. ఈ విధమైన సంబంధాలే, కాపిటలిస్టు దోపిడిగాండ్రు కష్టజీవులగు కార్మికులను దోచుకోవడమే, కాపిటలిస్టు దేశాలలోని వ్యవస్థకు రూపురేఖలు ఏర్పరుస్తవి. కాని సోవియటు యూనియన్‌లో ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. అక్కడ వుండే ఫ్యాక్టరీలు, గనులు, బ్యాంకులు అన్నీ శ్రామికవర్గానివే; వారే పరిపాలకులుగా వుంటారు.

ఉత్పత్తి క్రమంలో ప్రజల మధ్య; పూర్తి వర్గాల మధ్య నిర్ణీతమైన సంబంధాలు ఏర్పడుతవి వీటినే "ఉత్పత్తి సంబంధాలు" అంటాము. ఉత్పత్తి సంబంధాలంటే ఏమిటో కాపిటలిస్టులకు, శ్రామికులకు మధ్యగల సంబంధాలు చూస్తే తెలుస్తుంది. ఏ సామాజిక వ్యవస్థలోనైనాసరే; ఈ ఉత్పత్తి సంబంధాలు బలీయంగా పనిచేస్తూ వుండటం మనం చూస్తాము ఈ ఉత్పత్తి సంబంధాలు కాపిటలిస్టుదేశాలలో ఒక మోస్తరు, సోవియటు యూనియనులో పూర్తిగా అందుకు విరుద్ధమైన మరొక మోస్తరు.

అయితే, సమాజంలో ఈ వుత్పత్తి సంబంధాలను నిర్ణయించేది ఏది? మార్క్సు దీనికి సమాధానం చెప్పాడు. సమాజంలోని భౌతిక వుత్పత్తిశక్తులే, అనగా వస్తువులను ఉత్పత్తిగావించే సాధనాలరూపం, వాటి పద్ధతులు మున్నగునవే, ఈ వుత్పత్తి సంబంధాలను నిర్ణయిస్తవి. ఒక్కొక్క కాలంలో సమాజంయొక్క వుత్పత్తిశక్తులు ఒక్కొక్క స్థాయిలో వుంటాయి. ఈ కాలంలో చూస్తే, పెద్ద పెద్ద యంత్రాగారాల సహాయంతో ఫ్యాక్టరీలలో, యంత్రాలయాలలో వుత్పత్తి జరుగుతున్నది. నాగలి, దుక్కిటెడ్లతో సాగించబడే వ్యవసాయంలో కూడా అంత కంతకూ యంత్రముల వుపయోగం ఎక్కువౌతూ వున్నది. కాని పూర్వంనుండి ఇదే విధంగా లేదు. పూర్వం వుత్పత్తి ఇతర విధాల జరిగేది. ఈనాడు విభ్రాంతిగూర్చే యంత్రాలు అనాడు వూహించియైనా ఎరుగరు. పురాతనకాలంలో రాళ్ళు, కర్రలే మనుష్యుని సాధనాలు. ఇది వేల సంవత్సరాల క్రితం మాట. క్రమంగా రానురాను మానవుడు నూతన సాధనాలను, ఉత్పత్తి పద్ధతులను కనిపెట్టసాగాడు ఉపకరణాలు, యంత్రాలు ఇవి మానవునికి సహాయ భూతాలు. వీటి సహాయంతో మానవుడు మును పెన్నడూ ఊహించనంతటి బ్రహ్మాండమగు వస్తుసముదాయము నంతటినీ వుత్పత్తి చేయసాగాడు. అయితే, ఉత్పత్తి సాధనాలు మారటంతోబాటు మానవుని శ్రమకూడ మారుతుంది. గత 100, 150 ఏండ్ల చరిత్రలో ఇది స్పష్టంగా గోచరిస్తుంది. 150 ఏండ్లక్రితం స్టీము ఇంజనుమ ఎవ్వరూ ఎరుగరు. ఎలక్ట్రిసిటీ ఉపయోగం 50 ఏండ్ల నుండీ వచ్చింది. రైల్వేలు గత 100 ఏండ్లలోగానే వేయబడినవి. మోటార్లు గత 20, 30 ఏండ్లలోనే; వ్యవసాయానికి ఉపయోగించే ట్రాక్టర్లు మరీ ఇటీవల. 1914 యుద్ధానికి పూర్వం మొట్టమొదటిసారిగా ఎగురుతూండే ఒకటి, రెండు విమానాలను చూచినవారు ఇప్పటికీ బ్రతికే వున్నారు.

అయితే మానవుని ప్రధాన మిత్రములగు ఉత్పత్తి సాధనాలే కాదు

అభివృద్ధి అయ్యేది: వాటితోబాటు ప్రాణసహితమగు ఉత్పత్తిశక్తులుకూడా అభివృద్ధి అవుతూఉంటాయి. మానవుడే- కష్టజీవుల వర్గములే- సమాజంలోకెల్లా గొప్పవగు ఉత్పత్తిశక్తులు. నూతన యంత్రాలు కనుపెట్టబడిన కొలదీ, టెక్నిక్ అభివృద్ధియైన కొలదీ మానవుని సామర్థ్యము, నైపుణ్యం, విజ్ఞానం అభివృద్ధియౌతవి. విమానాలు లేకముందు పైలట్లు (విమానాన్ని నడిపేవారు) లేరు. మోటార్లు రాకపూర్వం మోటారు డ్రైవర్లు లేరు. అనేక రకాల యంత్రాలతో పనిచేయటమే కాదు మానవుడు నేర్చుకొనేది; వాటిని ఉపయోగించటానికి ముందు వాటిని నిర్మించటము, సృష్టించటము నేర్చుకుంటాడు.

ఉత్పత్తిశక్తుల అభివృద్ధితోబాటు ఉత్పత్తి సంబంధాలు కూడా మారుతవి. భౌతిక ఉత్పత్తి సాధనాల అభివృద్ధి, మార్పులతోబాటు ఉత్పత్తి శక్తుల మార్పుతోబాటు సాంఘిక ఉత్పత్తి సంబంధాలు కూడా మారగలవని మార్క్సు స్పష్టం చేశాడు.

ఇంతేగాదు: సమాజంలోని ఉత్పత్తి శక్తుల అభివృద్ధితో పెనవేసుకొనే, పెత్తనం వహించే వర్గముల రూపాలుకూడా మారుతవి. ఉదాహరణకు, భారీగా వుత్పత్తిగావించటం వృద్ధియౌటతో, భారీయంత్రాలు నెలకొల్పటంతో కాపిటలిజం అభివృద్ధి పెనవేసుకొని వున్నది.

పురాతన కాలంలో ఉత్పత్తిశక్తులు అభివృద్ధి జెందియుండలేదు. ఉత్పత్తి సాధనాలంతగా అభివృద్ధికాలేదు. ఇప్పటి యంత్రాలుగాని, ఇంతకు పూర్వపు నాగళ్ళు వగైరాలుగాని కూడా అప్పుడులేవు బహుస్వల్పమగు ఆయుధాలు, సాధనాలతోనే, రాళ్ళు కర్రలు మున్నగు వానితోనే మానవుడు ప్రకృతితో పెనగులాడేవాడు. అడవులలో కర్రలతో, రాళ్ళతో వేటాడటంద్వారానే పురాతనపు తెగలు జీవించేవి. అప్పుడు వారిలో స్వంతం అనేది వుండేదికాదు. ఒకరి శ్రమపై ఇంకొకరు జీవించే పద్ధతి అప్పుడు వుండేదికాదు. కాబట్టి ఉత్పత్తి శక్తులు కొంత అభివృద్ధియైన తర్వాత కాలంలోనే వర్గవిభేదములు, విభజన పొడసూపినవి.

ఉత్పత్తి సంబంధాలు కొంతవరకు మాత్రమే-ఒకమెట్టువరకూ మాత్రమే- భౌతిక వుత్పత్తి శక్తుల అభివృద్ధికి తోడ్పడుతవి. ఉదాహరణకు, కాపిటలిజం పూర్వపు వుత్పత్తి పద్ధతులను పూర్తిగా మార్చివేసి, బ్రహ్మాండమగు యంత్రాల సహాయంతో బహుళమగు వస్తువులను అతిత్వరగా, చౌకగా ఉత్పత్తిగావిస్తుంది. కాని ఒకానొక స్థితిలో, ఈ ఉత్పత్తిశక్తుల అభివృద్ధి, ఆ అభివృద్ధికి అవలంబనంగా వుండే ఉత్పత్తి సంబంధాలతో ఢీకొంటోంది.

"ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి దోహదమివ్వటానికి మారుగా ఈ ఉత్పత్తి సంబంధాలు అట్టి అభివృద్ధికి గుదిబండలుగా తయారవుతాయి. అట్టి సమయంలోనే సాంఘిక విప్లవం వస్తుంది".*

---

* "అర్థశాస్త్ర విమర్శ" మార్క్సు.

ఈనాడు మనం ఇట్టి "సామాజిక విప్లవ దశలో" వున్నాము. ఉత్పత్తి శక్తుల భావి అభివృద్ధికి కాపిటలిస్టు ఉత్పత్తి సంబంధాలు పెద్ద అడ్డంకుగా వున్నవి. కాపిటలిస్టు పరిపాలనను కూలద్రోయటం ద్వారానే శ్రామికవర్గం ఈ అడ్డంకులను కూలద్రోయగలదు. శ్రామికవర్గ విప్లవమే ఉత్పత్తిశక్తులకు కాపిటలిజం ఏర్పరచే అడ్డంకులను నాశనంగావించి, వీటి శీఘ్రాభివృద్ధికి అనంతమైన అవకాశాలను ఏర్పర్చగలదు.

## అర్థశాస్త్రం తెలుసుకొనవలసిన అవసరం

ప్రజా సామాన్యాన్ని దోచుకునే కాపిటలిస్టు పద్ధతి దానంతట అదే రంగం నుండి విష్క్రమించదు. రైతాంగ జనసామాన్యం యొక్క, వలస దేశాలలోని కష్టజీవుల యొక్క తోడ్పాటుతో కార్మికవర్గం జరిపే "విప్లవ పోరాటం" వల్లనే "కాపిటలిజం కూలద్రోయబడి ప్రపంచమంతటా సోషలిజం విజయం పొందగలదు".

ఐతే సోషలిజానికి, కాపిటలిజానికి మధ్యజరిగే యీ బ్రహ్మాండమైన పోరాటంలో ఉచితమైన పాత్రను నిర్వహించాలంటే కాపిటలిజం ఏ విధంగా ఏర్పాటయినదీ, ఏ సాధనాలతో ఆ దేశ కార్మిక ప్రజానీకాన్ని కొలదిమంది కాపిటలిస్టులు దోచుకుంటున్నారు అనే విషయాలు స్పష్టంగా తెలుసుకోవాలి. ఇందువల్లనే అర్థశాస్త్రాన్ని తెలుసుకొనటం అత్యంతావశ్యకం; ఉపయోగకరం. "సాంఘికోత్పత్తి క్రమం ఏ విధంగా చారిత్రకంగా అభివృద్ధి అయినదీ తెలిపే విజ్ఞానశాస్త్రం" అని లెనిన్ అర్థశాస్త్రాన్నిగూర్చి చెప్పాడు. మార్క్సు, లెనిన్‌ల ఉపదేశాలలో ఈ అర్థశాస్త్రం ప్రాముఖ్యత చాల ఎక్కువగా గోచరిస్తుంది. "కాపిటల్" గ్రంథం పీఠికలో మార్క్సు యిలా వ్రాశాడు :

"....ప్రస్తుత సమాజమైన కాపిటలిస్టు సమాజంయొక్క గమనమునకు కారణమైన ఆర్థిక సూత్రాలను బైటపెట్టటమే ఈ గ్రంథంయొక్క అంత్యాశయం.

తమ స్వాతంత్ర్యం కొరకై శ్రామికవర్గం జరిపే పోరాటంలో వారికి మార్గదర్శకంగా ఉండుటకై మార్క్సు ఈ కాపిటలిస్టు సమాజాభివృద్ధి మూల సూత్రాలను కనిపెట్టాడు.

బూర్జువా వర్గమూ, వారి ఉప్పు, పులుసు తినే ఆర్థిక శాస్త్రవేత్తలూ, ఈ కాపిటలిస్టు వ్యవస్థ సంబంధాలు అనాదినుండి ఉన్నవనీ, ఆదిమధ్యాంతరహితములనీ "రుజువు" చేస్తానికి ప్రయత్నిస్తారు. కాపిటలిజానికి నాశనంలేదని, కార్మికులను విశ్వసింపచేయ జూస్తారు. కాపిటలిజం నాశనం అంటే మానవజాతి నాశనమే నంటారు. ఇది సహజమేకదా! వారి వుద్దేశంలో కాపిటలిస్టు పద్ధతులలోనే మానవజాతి జీవించగలదు. అందుచేతనే కాపిటలిజం యొక్క మూల సూత్రాలు, ప్రధాన సాంఘిక సంబంధాలు అని తెలుపుతారు. పూర్వంనుండీ ఇలాగే వుందనీ: ఇకముందు కూడా యిలాగే వుండగలదనీ యీ బూర్జువా బంట్లు చెప్పుతారు.

అయితే మార్క్స్, లెనిన్ యీ బూర్జువా అర్థిక శాస్త్రమును సంపూర్ణంగా నేలగూల్చివేశారు. మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాలు, వెనకటి సమాజాన్ని శిధిలం జేసి నేటి కాపిటలిస్టు వ్యవస్థ ఏవిధంగా ఏర్పడిందీ, అది ఎట్లా అభివృద్ధి అవుతూందీ, ఆ అభివృద్ధిలోనే అంతర్విభేదాల సంఘర్షణ ఎలా తీవ్రమవుతూవుందీ, ఈ సంఘర్షణ ఫలితంగా కాపిటలిజం ఏవిధంగా తప్పనిసరిగా నాశనమౌవుదీ ఈ విధంగా కాపిటలిజాన్ని భూస్థాపితం జేయటంద్వారా ఎలాగు సోషలిస్టువ్యవస్థ ఏర్పడేదీ తెలుపుతాయి.

కాపిటలిజం అంటే ఏమిటో తెలియకుండానే వేలకొలదీ సంవత్సరాలు మనుష్యులు బ్రతికినట్లుగా మానవచరిత్రవల్ల తెలుస్తుంది. ఇందువల్ల బూర్జువా అర్థికశాస్త్రవేత్తలు చెప్పినట్లుగా కాపిటలిజం శాశ్వతమైనదీ అచంచలమైనదీ కాదనీ అట్లు చెప్పే మాటలు బూటకాలనీ తెలుస్తుంది. పైపెచ్చు చరిత్ర మనకు చెప్పేదేమంటే కాపిటలిస్టు వ్యవస్థకు సంబంధించిన సూత్రాలు ఆ వ్యవస్థతోనే పుట్టినవనీ అది అంతరించగానే ఆ సూత్రాలుకూడా మారిపోగలవనీ తెలుస్తుంది దీనివల్ల అర్థశాస్త్రాన్ని అభ్యసించాలంటే కాపిటలిస్టు వ్యవస్థ వొక్కదానినే తెలుసుకుంటే చాలదనీ, అంతకు పూర్వం వున్న సామాజిక వ్యవస్థలనుకూడా తెలుసుకోవాలనీ బోధపడుతుంది.

కాపిటలిజం యొక్క దోపిడీని, పీడనను మూల మూలల పరిశోధించి బట్టబయలు చేసేది మార్క్సిస్టు లెనినిస్టు అర్థశాస్త్రం. బూర్జువా అర్థిక శాస్త్రజ్ఞులు మరుగుపర్చే రహస్యాల నన్నిటినీ ఇది బయట పెట్టుతుంది.

మనం చూచినట్లుగా, నిర్ణీతమైన ఉత్పత్తి సంబంధాల పరిమితులలో వుత్పత్తి శక్తులు పెరుగుతూ వుంటాయి కాని కొంతకాలానికి ఈ ఉత్పత్తిశక్తులు తనను అవలంబించివున్న ఉత్పత్తి సంబంధాల పరిమితికి మించిపోతాయి. అప్పుడు ఈ ఉత్పత్తి సంబంధాలు భవిష్యదభివృద్ధికి ఆటంకమౌతాయి. అప్పుడు అభివృద్ధి అయ్యే ఉత్పత్తి శక్తులకు, వాటి అభివృద్ధిని విరోధించే ఉత్పత్తి సంబంధాలకు మధ్య తీవ్రసంఘర్షణ ప్రారంభమౌతుంది ఈ సంఘర్షణే, దోపిడీపై ఆధారపడిన వుత్పత్తి సంబంధాలను బలపర్చే బూర్జువా వర్గానికీ, మనిషిని మనిషి దోచుకునే పద్ధతులన్నింటినీ అంతమొందించాలనే శ్రామిక వర్గానికి జరిగే వర్గ పోరాటంగా పరిణమిస్తుంది.

## అర్థశాస్త్రం — సోషలిజం స్థాపన

కాపిటలిజమును త్రోసివేసి, దానిస్థానే సోషలిజం వస్తుంది. అప్పుడు కాపిటలిజంతో వుండే ఉత్పత్తి సంబంధాలకు పూర్తిగా విరుద్ధంగా వుండే సంబంధాలు వుంటాయి. వీటినికూడా అర్థశాస్త్ర తెలియజేస్తుంది. లెనిన్ అన్నట్లు, "యీ శాస్త్రం వృద్ధియౌతూవుండే ఉత్పత్తి సంబంధాల స్వరూపాలను ఆయా కాలాలలో ఎట్లా వుంటాయో తెలుసుకోవటం అర్థశాస్త్రం పని"

మార్క్సుకు రెండవ శరీరమా అన్నంత సన్నిహితుడగు ఎంగెల్సు "మానవ సమాజంలో జీవనముకు కవుసరమగు భౌతిక పరికరాల ఉత్పత్తి. మారక ములను శాసించే సూత్రాలకు సంబంధించిన సైన్సు అని అర్థశాస్త్రాన్ని సామాన్యంగా చెప్పవచ్చును" అని తెలియజేశాడు *

కాబట్టి అర్థశాస్త్రం కాపిటలిజాన్ని గూర్చి తెలియచేయటమేగాక, ఇంతకు ముందున్న శకముల పరిస్థితులను గూర్చి, భవిష్యత్తులో కాపిటలిజాన్ని త్రోసివేసి దానిస్థానే వచ్చు వ్యవస్థను గూర్చి తెలియజేయాలి.

అంటే అన్నిసాంఘిక ఉత్పత్తి పద్ధతులకూ ఒకేరకం సూత్రాలువర్తిస్తా యనుకోవటం తప్పు. పిడుగుకీ, బియ్యానికీ ఒకటే మంత్రమా? ప్రతి సాంఘిక ఉత్పత్తి వ్యవస్థకూ ప్రత్యేక సూత్రాలు వర్తిస్తవి. కాపిటలిస్టు వ్యవస్థకు వర్తించే సూత్రాలు సోషలిజానికి వర్తించవు.

అందులోనూ, నేడు ప్రపంచములో అరవ భాగంలో జయప్రదంగా సోష లిజం కొనసాగింపబడుతూ వుంటే, అక్కడ కాపిటలిజం నుండి సోషలిజానికిమార్పు ఎట్లా జరిగిందీ, సోషలిజంక్రింద ఆర్థిక వ్యవస్థ ఎట్లా వున్నదీ తెలుసు కొనటం అత్యంతావశ్యకము.

నవతు సిద్ధాంతం జీవచ్ఛవమగు మతాదేశముకాదు విప్లవ పోరాటానికి సిద్ధాంతీకరణ అత్యంతావశ్యకము విప్లవ సిద్ధాంతము అనేది కాకుండా, ప్రపంచంలో కల్లా మిక్కిలి విప్లవకారులగు పీడిత వర్గ యొక్క బ్రహ్మాండమగు విప్లవంసాగటం అసాధ్యం. ఈ విషయాన్ని లెనిన్ పదేపదే నొక్కి చెప్పాడు.

"సిద్ధాంతం అది సరియగు సిద్ధాంతం అయితే కార్యరంగంలో ప్రవేశించిన కార్మికులకు సరియగు దృక్పథాన్ని కల్గిస్తుంది. తమ కార్యాచరణలో విశ్వాసాన్ని కల్పిస్తుంది. తమ ఆశయం తప్పక ఫలవంతం కాగలదనే "ఆత్మ ధైర్యాన్ని" కలిగి స్తుంది. సోషలిస్టు నిర్మాణానికై మన కార్యకలాపాలకు యిది ఎంతో అవసరం" అని స్టాలిన్ తెలియజేశాడు.

అందుచే అర్థశాస్త్రం ఒక్క కాపిటలిస్టు వ్యవస్థ నిర్మాణం, దాని అభివృద్ధి వినాశములను గూర్చి మాత్రమే కాదు చెప్పవలసినది; కాపిటలిస్టు శిధిలాలపై నిర్మింప బడే సోషలిస్టు వ్యవస్థయొక్క సూత్రాలను కూడా తెలియజేయాలి కాబట్టి మార్క్సిస్టు లెనినిస్టు అర్థశాస్త్రం క్షీణించిపోయే కాపిటలిజాన్ని గూర్చే గాక దినదినాభివృద్ధిగా సోవియటు యూనియనులో వృద్ధిపొందుతూ వుండే సోషలిస్టు ప్రపంచాన్ని కూడా వివరిస్తుంది.

కేవలం కాపిటలిస్టు విధానమును గూర్చి తెలుసుకుంటానికి మాత్రమే అర్థశాస్త్రాన్ని వినియోగిస్తే? అది సోషలిస్టు నిర్మాణానికి శత్రువులయిన వారికి

---

* "దుహరింగు ఖండన" అన్న ఎంగెల్సు గ్రంథం నుండి

అవకాశమివ్వట మౌతుంది. ప్రపంచ మంతటిలోనూ ఉండే కార్మిక వర్గానికి మిక్కిలి ఉపయోగపడే సోవియటు యూనియను చరిత్ర, అక్కడ సోషలిజం నిర్మాణానికై జరిగే మహత్తరమగు కృషిని అవగాహన జేసుకుంటానికి వినియోగపడే సిద్ధాంతదర్శనమును మరుగుపర్చటమౌతుంది. ఇందువల్ల సిద్ధాంతమును కార్యాచరణ నుండి విడదీయుట యౌతుంది; సిద్ధాంతీకరణ వేరు, కార్యాచరణవేరు అనే వాదవను దారితీస్తుంది సిద్ధాంతానికి కార్యాచరణకూ ఎక్కడా అంటూ సొంటూకూడా లేకుండా పోతుంది. ఇదిమన శత్రువులకే ఉపయోగం. ఈ విధంగా కాపిటలిస్టు సమాజానికి చెందిన సూత్రాలను వివరించడమే రాజకీయార్థిక శాస్త్రం పని అని చాలామంది అర్థికశాస్త్ర వేత్తలు భావించారు. ఇందుకు దారితీసింది సోషల్ డెమోక్రటిక్ సిద్ధాంత కర్త హెల్‌వర్డంగు. ఈ పెద్దమనిషి మార్క్సు సిద్ధాంతాలను ఆదర్శవాదంలోకి యీడ్వ ప్రయత్నించిన ఘనుడు లెనిన్ ఇట్టిప్రయత్నాలను, అర్థశాస్త్రం పెట్టుబడిదారీ వ్యవస్థ సూత్రీకరణయే అనేవాదాన్ని తీవ్రంగా ఎదిరించాడు.

ఈనాడు రాజకీయార్థిక శాస్త్రంయొక్క దృష్టినంతా ఆకర్షించేవి రెండు ప్రపంచాలు. కాపిటలిస్టు ప్రపంచం ఒకటి. సోషలిస్టు ప్రపంచం ఒకటి ఉన్నవి.

కాపిటలిస్టు దేశాలలో సమాజ జీవితంలో కనీవినీ ఎరుగట్లుగా వినాశనం, ముక్క చెక్కలుగా విడిపోవటం జరుగుచున్నవి.

## రెండు ప్రపంచాలు – రెండు వ్యవస్థలు

1929 లో అతి విస్తారమైన, అగాధమైన సంక్షోభం బయలుదేరింది. మునుపెన్నడూ ఎరుగనంతటి బ్రహ్మాండమైన అర్థికసంక్షోభం యిది.

ఈ సంక్షోభం, పరిశ్రమలకూ, వ్యవసాయానికి కూడా నాశన పరిస్థితులను తెచ్చి పెట్టినది. అమ్ముకుంటానికి తగిన మార్కెటులు లేకపోవుటచే ఉత్పత్తి ఎంతో ఎక్కువగా తగ్గించి వేయబడింది. అనేక వేల ఫ్యాక్టరీలు, యంత్రాలయాలు మూసి వేయబడినవి: లక్షలకొలది కార్మికులు నిరుద్యోగులై ఆశ్రయంలేని పక్షులవలె అయినారు. గ్రామసీమలలో సాగుబడి తగ్గించబడినది; లక్షలాది రైతులు దివాళా తీశారు. సరుకులు పెద్ద పెద్ద మొత్తాలుగానే నాశనం గావింపబడినవి. బ్రెజిల్‌లో అమ్ముడుగాక మిగిలివుండే కాఫీగింజలు ఎన్నో సముద్రంలో పారబోయబడినవి. యునైటెడ్ స్టేట్సులో గోధుమలను ఇంజన్లలో బొగ్గుగా వుపయోగించారు. పాలను తీసుకుపోయి నదులలో పారబోశారు; పట్టిన చేపలను సముద్రంలో విసరివేశారు; పశువులను చంపి పారవేశారు: పంటలను ధ్వంసం చేసినారు: ఈ విధంగా మార్కెటుకు పంపే సరుకుల మొత్తాన్ని తగ్గించ జూచారు. సంక్షోభం కాస్తతగ్గిన తరువాత కాపిటలిజం కొంత పుంజుకున్నట్లు కన్పించినా పూర్వపు అంతస్తుకు చేరుకోలేక పోయింది. ఈ కోల్కొవటమైనా ఎట్లా జరిగింది? కార్మికులను దోచుకోవడం మరింత అతిశయింప జేయటంద్వారా, వలసదేశాల ప్రజలను దోచుకోవటం అధికం

జేయటంద్వారా, యీ కోల్కొవటమైనా కొద్దిగా జరిగింది. అయినా కాపిటలిజం పూర్తిగా కోల్కొన్నదని చెప్పటానికి లేము; ఎందుకంటే అది పతనం అయిపోయే దశలో, క్రమేణా శిథిలమై కుళ్లిపోయే దశలో వుండటంవల్ల కోల్కొనలేదు. కాని యీ పతనంనుండి రక్షించుకొనటకై బూర్జువావర్గం ప్రయత్నిస్తుంది. అందుకై కార్మికవర్గాన్ని దోచుకోవటంఅధికతరంగా చేస్తుంది మరొక సామ్రాజ్యవాద యుద్ధానికి దారితీస్తుంది. సోవియట్ యూనియన్ను ధ్వంసంచేయ దండయాత్రకు సన్నాహాలు చేస్తుంది. కార్మికులను అణచి వుంచటానికై భీతావహమగు పద్ధతులను అవలంబిస్తూ, ప్రత్యక్షంగా ఫాసిస్టు పద్ధతులకు దిగుతుంది.

ఈ విధంగా కాపిటలిస్టు ప్రపంచం వినాశకరమగు సంక్షోభంలోపడి కొట్టుకుంటూవుంటే, సోవియట్ యూనియన్లో ప్రథమ పంచవర్ష ప్రణాళిక అద్భుతంగా జయప్రదంగా సాగింపబడుతూ వచ్చింది. 5 ఏండ్ల కార్యక్రమమంతా 4 ఏండ్లలోనే పూర్తిగావించబడింది మరల ఇంకొక పంచవర్ష ప్రణాళిక మరీ పెద్దఎత్తున సాగింపబడుతూ వచ్చింది. ఈ రెండవ పంచవర్ష ప్రణాళిక జయప్రదం గావటంతో ఒకదానికొకటి శత్రువుగావుండే వర్గములు రద్దుగావింపబడగలవు; పూర్తి సోషలిస్టు వ్యవస్థ ఏర్పడగలదు.

మొదటి పంచవర్ష ప్రణాళికలో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ కవుసరమగు పునాదులన్నీ వేయబడినవి. సోషలిజానికి మూలస్తంభమగు భారీపరిశ్రమలు విరివిగా నిర్మింపబడినవి. ఇదివరకెన్నడూ రష్యాలో లేని అనేక నూతన పరిశ్రమలు నెలకొల్పబడినవి. ముఖ్యంగా జాతీయార్థిక సంపదకు పునాదియగు భారీ పరిశ్రమలు, కొంత పరిశ్రమలు విరివిగా అభివృద్ధి పొందినవి.

ఈ మొదటి పంచవర్ష ప్రణాళి లోనే, వ్యవసాయాన్ని కూడా సోషలిస్టు పద్ధతులపై నిర్మించుటకు మహత్తరమగు కృషి జరిగింది. రైతులకు ఒక నూతన మైన, సౌఖ్యప్రదమైన జీవితాన్ని ప్రసాదించే సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు (కోల్ ఖోజు) జయప్రదంగా సాగింపబడినవి. రైతాంగ లో అత్యధిక సంఖ్యాకులు ఈ సమిష్టి వ్యవసాయకులుగా తయారై, సోవియట్ వ్యవస్థకు బలీయమైన అండగా నిలబడ్డారు. ఇదే కాలంలో కాపిటలిస్టుల అండయగు భూస్వాముల ముఠా (కులక్కులు)కు స్వస్తిచెప్పబడింది.

కార్మికవర్గం విపరీతంగా వృద్ధిపొందింది. వీరి జీవన పరిస్థితులు ఎంతో బాగుపడినవి. దేశమంతా విజ్ఞాన చంద్రికలు వెదజల్లబడినవి. ప్రతి ఒక్కరికీ చదువు నేర్పబడింది; అజ్ఞానంలో మునిగి తేలుతూ ఉండే కోట్లకొలదీ ప్రజలకు అందరికీ స్వల్పకాలంలో విద్య గరపబడినది అనేక పాఠశాలలో లక్షలకొలది బాలురు, పెద్దలుకూడా చదువుకుంటున్నారు. సోషలిస్టు కార్మిక శిక్షణ ద్వారా అలవడింది సోషలిజాన్ని నిర్మించే ప్రజానీకంలో కార్యదీక్ష, శక్తియుక్తులు విపరీతంగా అతిశయించినవి.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక మూలంగా ఒక్క దేశంలో జయప్రదంగా సోషలిజమును స్థాపించ అవకాశమున్నదని చరిత్రలో మొట్టమొదటిసారిగా ప్రపంచ మందలి కష్టజీవులందరికీ రుజువు చేయబడింది. సోవియట్ యూనియన్‌లో ప్రతి కార్మికుడూ, ప్రతి సమష్టి వ్యవసాయకుడూ రేపటిని గురించి చింతపడనక్కర లేదు. మరుసటి దినం తనకెట్టి భవిష్యత్తు వుందో తెలుసుకున్నాడు; తన శక్తి తన శ్రద్ధ, తన కృషియొక్క స్వభావములనుబట్టి సమాజంయొక్క ఆర్థిక వైజ్ఞానిక పరిస్థితులు పెరుగుతూ వుంటాయనీ తెలుసుకున్నాడు. ఈ దేశంలో దరిద్రం, ఆకలిదప్పులు, నిరుద్యోగం మున్నగు బాధలు పూర్వస్మృతియై పోయినవి. ఇక మరల ఆ బాధలీ దేశంలో అడుగు పెట్టలేవు. సంతోషంతోనూ, ఆత్మ విశ్వాసంతోనూ కార్మికుడూ, సమిష్టి రైతూ భవిష్యత్తును గూర్చి ఆలోచిస్తూ, ఏ విధంగా విజ్ఞాన సౌఖ్యాలను వృద్ధిజేయాలా అని, అందుకై పాటుపడుతూ వుంటాడు. *

ఇదే సమయంలో కాపిటలిస్టు ప్రపంచం, మునుపెన్నడూ కనీవినీ ఎరుగ నంతటి క్లిష్టదశలో పడింది. ఆర్థిక సంక్షోభం ఈ ప్రపంచాన్నంతటినీ క్రిందుమీదులు చేసింది ప్రజాసామాన్యం బాధలు చెప్ప నలవిగాకుండా పెరిగినవి. నిరుద్యోగుల సైన్యం పెరిగి పెరిగి చివరకు 5 కోట్ల వరకూ వచ్చింది. అంటే వారి కుటుంబాలతో కూడా కలిస్తే యునైటెడ్ స్టేట్సు జనాభాకు మించిన నిరుద్యోగులు వున్నారన్నమాట. వీరు నిరుద్యోగంవల్ల కల్గేబాధలు, కష్టాలు అన్నీ పడుతున్నారన్నమాట. సంక్షోభం కాస్త సర్దుకొని, ఉత్పత్తి మరల కొంచెం కొంచెంగా కోలుకొంటున్నా కార్మికులస్థితి మరింత హీనం అవుతూ వుందేగాని బాగుపడటంలేదు. ఉత్పత్తి కొంచెముగా వృద్ధి అయింది. అంటే అది కార్మికులను మరింత దోచుకొనటం ద్వారానే, కార్మికులచే మరింత ఎక్కువపని చేయించటం ద్వారానే సాధ్యమౌతోంది.

రష్యాలో అంతర్యుద్ధం పూర్తి అయిన పిమ్మట, ఆర్థిక పునర్నిర్మాణానికి సాగివెళ్లినపిమ్మట లెనిన్ "ఇప్పుడు మన ఆర్థిక విధానంద్వారా ప్రపంచ విప్లవాలపై ఎక్కువ ప్రభావాన్ని ప్రసరింపజేయ గలుగుతాము" అని చెప్పాడు. అందుచేతనే సోవియటు యూనియన్‌లో సోషలిజం జయం పొందటం "అత్యంత అంతర్జాతీయ ప్రాముఖ్యత" గలిగినట్టిది. కాపిటలిస్టు దేశాలలో నలిగిపోతున్న కార్మికులు, ఫాసిస్టు దేశాలలో క్రూరబాధ లన్నింటికీ గురియౌతున్న ప్రజాసామాన్యం, ప్రపంచ మంతటి సామాన్య ప్రజలు సోవియటు దేశాన్ని ప్రపంచ శ్రామికవర్గం యొక్క పితృదేశంగా చూస్తారు. సోవియటు యూనియన్ విజయాన్ని చూచి కాపిటలిస్టు దేశాలలోని కార్మికులు కూడా పోరాటాలను సాగిస్తారు. ఈ విధంగా సోవియటు యూనియన్ సోషలిజం విజయం పొందటం "ప్రపంచ సోషలిస్టు విప్లవానికి ఎంతో అవసరం".

---

* సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 17 వ వార్షిక సమావేశంలో గావింప బడిన తీర్మానంలోని భాగం.

"కాపిటలిస్టు వ్యవస్థయొక్క గతి" రేపు ఏమిటా యని కాపిటలిస్టులు, వారి తాబేదారులూ కంగారు పడుతున్నారు. ఉరకలు వేస్తూ ముందుకు సాగిపోతున్న సోవియటు ఆర్థిక వ్యవస్థ. ఈ రెండింటి మధ్యగల భేదం అంతకంతకూ స్పష్టమవుతోంది. భవిష్యత్తు ఎవరిది — కమ్యూనిజముదా, కాపిటలిజముదా — అన్న ప్రశ్న అంతకంతకూ యీ కమ్యూనిస్టు శత్రువులను బాధిస్తోంది.

ఈ విధంగా నేడు ప్రపంచంలో ప్రధానంగా కన్పించే సమస్య, "రెండు వ్యవస్థలకు, రెండు సామాజిక పద్ధతులకు మధ్య జరిగే పోరాటం". ఇదే కాపిటలిజానికీ, సోషలిజానికీ మధ్య జరిగే పోరాటం. పూర్తిగా పరస్పర విరుద్ధమగు రెండు ప్రపంచాలు ఒకదాని నొకటి ఎదుర్కొంటున్నవి. ఒకటి దినదిన ప్రవర్ధమానం అవుతూ, కార్మిక కర్షకులకు సందనోద్యానంగా వుండే సోషలిస్టు సోవియట్ యూనియన్. రెండోది లాభాన్వేషణ, దోపిడి, నిరుద్యోగం, ఆకలి, దుర్మరణాలుండే బూర్జువా ప్రపంచమగు ఇతర అన్ని దేశాలు సోవియటు యూనియన్ పతాకంపై "పని చేయనివారికి తిండిలేదు" అని వ్రాయబడి వుంటుంది; బూర్జువా పతాకంపై "కార్మికులకు తిండిలేదు" అని వ్రాయబడి వుంటుంది. చైతన్యం పొందిన ప్రతి కార్మికునికీ సోవియటు యూనియన్ తన సోషలిస్టు పితృదేశం అని తెలుసు.

అయితే దోపిడీ దౌర్జన్యములపై ఆధారపడిన కాపిటలిస్టు వ్యవస్థ దానంతట అదే నశించిపోదు. "కార్మికవర్గ పోరాట ఫలితంగానే" అది నాశనం కాగలదు. ప్రజా సామాన్యాన్ని అధఃపాతాళానికి అణగద్రొక్కుతూ వుండే యీ కాపిటలిస్టు వ్యవస్థ చైతన్య పూరితులగు కార్మికులు గావించే విప్లవ పోరాటం ద్వారానే అంతం చేయబడగలదు.

సోవియటు యూనియను ఏర్పడగానే, సోషలిజమా? కాపిటలిజమా? అనే ప్రశ్న వచ్చింది. సోవియటు యూనియను నానాటికీ బలపడుతూ వుండటం, కాపిటలిజం నానాటికీ శిథిలమౌతూ వుండటంవల్ల యీ ప్రశ్న మరింత పెద్దదిగా ఏర్పడుతూ వున్నది.

## శ్రామికవర్గ నియంతృత్వం ద్వారానే సోషలిజం స్థాపించబడగలదు

కాపిటలిస్టు దేశాలలో రాజ్యాధికారమంతా బూర్జువా వర్గాలచేతులలోవుంది. ప్రభుత్వం ఎలాంటి రూపం కల్గివున్నా – ప్రజాస్వామికమైనా, ఫాసిస్టుయైనా, సోషల్ డెమొక్రసీయైనా — ఈ రూపాన్ని "బూర్జువావర్గ నియంతృత్వాన్ని" కప్పిపుచ్చేదిది మాత్రమే. బూర్జువా ప్రభుత్వంయొక్క ఉద్దేశమల్లా కాపిటలిస్టుదోపిడీని సాగించడం, బూర్జువా వర్గంయొక్క ఫ్యాక్టరీలు, గనులు మున్నగు సంపాదనలను కాపాడటం, భూస్వాముల స్వంత ఆస్తులను రక్షించటం మాత్రమే.

సోషలిజం విజయం పొందాలంటే, బూర్జువా పరిపాలనను కూలదోయాలి

బూర్జువా ప్రభుత్వాన్ని నాశనం చేయాలి. దానిస్థానే "శ్రామికవర్గ నియంతృత్వం" స్థాపనకావాలి. కాపిటలిస్టులతో ఎకతెగకుండా, వర్గపోరాటాన్ని శ్రామికవర్గం జరుపుట ద్వారానే, "శ్రామికవర్గ విప్లవం" ద్వారానే శ్రామికవర్గ ప్రభుత్వాన్ని ఏర్పర్చటం ద్వారానే కాపిటలిజం నుండి సోషలిజానికి మారటం సాధ్యమౌతుంది. తన ప్రభుత్వ యంత్రాన్ని శ్రామికవర్గం ఏర్పర్చుకోవటం ద్వారానే సోషలిస్టువ్యవస్థను ఏర్పర్చటం దాన్ని జయప్రదంగా సాగించటం చేయగలదు. ఇదొక్కటే కాపిటలిజంనుండి సోషలిజానికి గల మార్గం.

"కాపిటలిస్టు వ్యవస్థ నుండి కమ్యూనిస్టు వ్యవస్థకు మారటంలో మధ్య ఒక విప్లవకరమగు సంధికాలం వుంటుంది. దీనితోబాటే రాజ్యాధికారంలో కూడా ఒక విప్లవకరమగు సంధికాలం వుంటుంది. ఇదే "శ్రామికవర్గ నియంతృత్వం".* అని మార్క్స్ వ్రాశాడు.

యీ మార్గాన్నే, యీ సరియగు ఒకే ఒకటగు బాటనే రష్యను కార్మిక వర్గం 1917 లో నడిచింది.

సోవియటు యూనియనులో కార్మికవర్గం రాజ్యాధికారాన్ని సంపాదించుకున్నది. అక్టోబరువిప్లవంద్వారా "కార్మికవర్గ" పరిపాలన కార్మికవర్గ నియంతృత్వం ఏర్పడినది. కేవలం అధికార వాంఛతో కార్మికవర్గం ప్రభుత్వాన్ని స్వాధీనం జేసుకోవటంలేదు. శ్రామికవర్గం చేతులలో రాజ్యాధికారం వుండటం నూతనమగు సోషలిస్టు సమాజాన్ని స్థాపించుకోటానికైన మంచి సాధనం.

"కార్మికులు ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకోవటం సోషలిజాన్ని స్థాపన చేయుటకొరకై; సమాజాన్ని వర్గరహితం చేయటానికై, సమాజంలో అందరూ పనిచేసేవారుగా చేయుటకై ; ఒక మనిషిని ఇంకోమనిషి దోచుకొనే పద్ధతిని రూపు మాపుటకై ; ఇది ఒక్కరోజులో జరిగే పనికాదు; క్రమేణా జరిగేది: ఇందుకై కాపిటలిస్టు విధానం నుండి సోషలిస్టు విధానానికి మారటంలో కొంత సంధికాలం వుంటుంది. ఎందుకంటే; జీవితంయొక్క ప్రతిపద్ధతిలోనూ మార్పుతేవాలంటే కొంత కాలం పడుతుంది; పైగా ఆర్థికనిర్మాణంలో బాగా పాతుకుపోయిన, బూర్జువా, పెటీ బూర్జువా పద్ధతులను కూలద్రోయాలంటే, చాలాగట్టి పోరాటాన్ని దీర్ఘంగా జరుపవలసి వుంటుంది. అందుచేతనే శ్రామికవర్గ నియంతృత్వమంటే "కాపిటలిజం నుండి సోషలిజంకు మారే సంధికాలం" అని మార్క్స్ వ్రాశాడు. •

---

* "గోథా ప్రోగ్రాము విమర్శ" అన్న మార్క్స్ గ్రంథం నుండి.

• "వియన్నా కార్మికులకు అభినందనలు" అన్న లెనిన్ సందేశం నుండి.

కాపిటలిజంనుండి సోషలిజానికి మారటానికి కొంతకాలం పడుతుంది: ఇట్టి "మార్పుకాలం" తప్పనిసరి. ఈ కాలంలో రాజ్యాధికారం కార్మికవర్గం చేతిలో వుంటుంది.

బూర్జువావర్గ నియంతృత్వ మంటే అత్యధిక సంఖ్యాకులగు ప్రజా సామాన్యాన్ని కొలదిమంది పరాశ్రయ జీవులు దోచుకోవటం: శ్రామికవర్గ నియంతృత్వం అంటే: అత్యధికసంఖ్యాకులగు కష్టజీవుల మేలుకై వీరిని దోచుకుతినే దోపిడిగాండ్రను అణచివేయటం. శ్రామికవర్గం మనిషిని మనిషి దోచుకొనే అన్ని విధానాల పద్ధతులను తుదముట్టించుటకై తనఅధికారాన్ని వినియోగిస్తుంది. వుత్పత్తిని సోషలిస్టు పద్ధతులపై పెరుగుతుంది. దోపిడిగాండ్ర ప్రతిఘటనను నిర్మూలిస్తుంది. ఊగిసలాడే వర్గాలను. వ్యక్తులను సరియగు మార్గంలోకి తెస్తానికై పాటుపడుతుంది: వర్గరహితమగు సమాజాన్ని సృష్టించుటకై పాటుపడుతుంది.

లెనిన్ ఈ శ్రామికవర్గం నియంతృత్వాన్నిగూర్చి దీర్ఘంగా తెలియజేశాడు. వెనుకటి అధికారవర్గంయొక్క నామరూపాలు లేకుండా చేయుటకై ఎడతెగకుండా జరిపే వర్గపోరాటమే శ్రామికవర్గ నియంతృత్వమనీ, ఈ దశ కొంతకాలం తీసుకొంటుందనీ చెప్పాడు.

"సోషలిజం అంటే వర్గరాహిత్యం. ఈ వర్గరాహిత్యాన్ని సాధించుటకై శ్రామికవర్గ నియంతృత్వం పూర్తిగా పాటుపడుతుంది. కాని వర్గాలను వున్నపళంగా రద్దుచేయటం అసంభవం. శ్రామికవర్గ నియంతృత్వ దశలోకూడా "వర్గాలు వున్నవి. వుంటాయి కూడాను." వర్గాలు అంతరించి పోయినప్పుడు శ్రామికవర్గ నియంతృత్వం అవుసరమే వుండదు. అయితే ఇట్టి నియంతృత్వం లేకుండా మాత్రం వర్గాలు రూపుమాపబడవు. శ్రామికవర్గ నియంతృత్వ కాలంలో వర్గాలువున్నవి. కాని వాటి వాటి రూపురేఖలు మాత్రం మారుతాయి. శ్రామికవర్గ నియంతృత్వ కాలంలో వర్గపోరాటం అదృశ్యంకాదు. అది మరొక రూపం మాత్రమే ధరిస్తుంది." *

శ్రామికవర్గ నియంతృత్వ కాలంలో ఇతర రూపాలు ధరించిన వర్గపోరాటం మరింత తీవ్రంగా జరుగుతుంది. ఇది సహజమేకూడా. ఇంతవరకూ పరిపాలకులుగావుండి, ఇప్పుడు పదభ్రష్టులు గావింపబడిన బూర్జువావర్గం కోల్పోయిన రాజ్యాధికారాన్ని తిరిగి సంపాదించుకోటానికై అనేక ప్రయత్నాలు చేస్తుంది. ఏదో విధంగా తమ అధికారాన్ని నిలబెట్టుకోటానికై చెప్పరాని, చేయరాని దుష్కృత్యాలన్నీ జేసి కార్మిక ప్రభుత్వాన్ని కూలద్రోయ ప్రయత్నిస్తారు.

ఈ సత్యం సోవియటు యూనియన్‌లో సోషలిజం విజయంకై జరిపిన పోరాటంవల్ల రుజువు అవుతుంది. ఈ దేశంలో పాత బూర్జువా వ్యవస్థకు, దోపిడీ

---

* "శ్రామికవర్గ నియంతృత్వ కాలంలో ఆర్థిక రాజకీయాలు" అన్న లెనిన్ వ్యాసం నుండి.

వర్ధతులకు వ్యతిరేకంగా అతితీవ్రమైన, ఎడతెగని పోరాటాలు జరుపబడ్డవి. బూర్జువా వర్ధతుల వర్గాన్ని ఓడించి అనేక విజయాలు సాధించబడినవి. అయినా బూర్జువా వర్గంయొక్క ప్రతిఘటన వృద్ధియౌతూనే వచ్చింది. సోషలిజమును నాశనం జేయుటకై చేసేవారి ప్రయత్నాలు మరింత దుష్టం కాజొచ్చినవి. ప్రత్యక్ష పోరాటంలో ఓడిపోయిన విప్లవ భూస్వాములు, షావుకార్లు తదితర దోపిడీగాండ్ర ముఠాలవారు క్రమంగా సోవియటు పరిశ్రమలు, సంస్థలు మున్నగు వాటిలో ప్రవేశించి, వాటిని కుట్రలద్వారా, మోసంద్వారా భగ్నంచేయటానికి ప్రయత్నించారు. అందుచే శ్రామిక వర్గం అతి జాగరూకతతో వుండవలసి వచ్చింది. శ్రామిక వర్గ నియంతృత్వాన్ని మరింత బలపర్చవలసి వచ్చింది.

"నశించిపోయే వర్గంయొక్క హతశేషాలనుకూడా నిర్మించుటకై, వారి మాయోపాయములను భగ్నం గావించుటకై, మనం యిప్పుడు బలీయమైన సమర్థమైన శ్రామికవర్గ నియంతృత్వాన్ని నిర్పర్చాలి" అని స్టాలిన్ తెలియజేశారు కాబట్టి కాపిటలిజం నుండి సోషలిజంకు మారేదశనుకూడా శ్రామికవర్గ నియంతృత్వాన్ని గూర్చికూడా అర్థశాస్త్రం పూర్తిగా తెలియజెప్పాలి.

## అర్థశాస్త్రం వర్గంయొక్క పోరాట శాస్త్రం

తప్పనిసరిగా జరిగే కాపిటలిస్టు వ్యవస్థ నాశనాన్ని, సోషలిజం విజయాన్ని తెలియచేసే సూత్రాలను నియమాలను దాచుటకూ మరుగు పర్చుటకూ, తాయిమారు చేయుటకు బూర్జువావర్గం, దాని ఆర్థిక శాస్త్రవేత్తలూ ప్రయత్నిస్తారు ఇట్టి ఆర్థిక శాస్త్రవేత్తలు కాపిటలిజం అనాది సిద్ధమనీ, శాశ్వతమనీ చెప్పుతూ వుంటారు ఈ విధంగా వారు కాపిటలిజాన్ని దాన్ని నాశనంనుంచి రక్షించాలని ప్రయత్నిస్తారు

కాని యీ కాపిటలిజానికి వ్యతిరేకంగా జరిగే కార్మికవర్గ విప్లవ పోరాటంలో నాయకత్వం వహించేది కమ్యూనిస్టుపార్టీ. కమ్యూనిస్టుపార్టీ సరిగా నిర్వహించే పాత్రయే యీ శ్రామికవర్గ విప్లవాన్ని జయప్రదం గావిస్తుంది. అందుచేత నే కమ్యూనిస్టుపార్టీని ఇతరులందరూ ద్వేషిస్తూ వుంటారు. దాన్ని నాశనం చేయాలనీ, దానిలో చీలికలు కల్గించాలనీ చూస్తారు. పార్టీ పాలసీ నుండి పార్టీ సభ్యులు ఏమాత్రం వైదొలగినా, తప్పుదారిని బడినా, యీ కమ్యూనిస్టు విద్వేషులు ఎంతో హర్షిస్తారు.

కాపిటలిజంతోటి పోరాటంలో, కమ్యూనిజం స్థాపనకై జరిగే పోరాటంలో బహు సునిశితమైన ఆయుధం అర్థశాస్త్రం. అన్ని విజ్ఞానశాస్త్రాలవలెనే అందులోనూ ముఖ్యంగా మానవ సమాజం, దాని అభివృద్ధి క్రమములకు సంబంధించిన శాస్త్రాలవలెనే అర్థశాస్త్రం కూడా వర్గస్వభావం కలిగిన శాస్త్రమే.

శ్రామికవర్గం చుట్టూ శత్రువులున్నారు. బహు తీవ్రమైన వర్గపోరాటం నేడు జరుగుతూ వున్నది. కాబట్టి కమ్యూనిస్టు పార్టీలో ఏమాత్రం చీలికలు వచ్చినా పార్టీ పాలసీ నుండి ఏమాత్రం తొలగినా, సిద్ధాంతాలలో గాని, ఆచరణలో గాని ఏమాత్రం తప్పటడుగులు వేసినా శత్రువుల కుపయోగమే అవుతుంది. అందుచేతనే పార్టీ పాలసీనుండి తొలగి, తప్పుదారులకు తీసే సిద్ధాంతాలను, ప్రయత్నాలను బహు తీవ్రంగా ఎదిరించాలి ఈ డీవియేషన్లు మితవాద పూరితమగు అవకాశవాదం గానీయండి, అతివాదం గానీయండి- వాటిని పూర్తిగా నిర్మూలించవలసియే యున్నది.

విప్లవాన్ని భగ్నం చేయాలనీ, సోవియటు యూనియనును నాశనం జేయుటకు తిరుగు దండయాత్రను సాగించాలనీ, కుట్రలు పన్నే బూర్జువా వర్గానికి విప్లవ వ్యతిరేకమగు ట్రాట్స్కీయిజం బాగా వినియోగపడుతుంది. సోషల్ డెమాక్రసీ యొక్క మరొక రూపమే ట్రాట్స్కీయిజం. ఈ ట్రాట్స్కీయిజం వివిధ దేశాలలోని విప్లవోద్యమాలను, సోవియటు యూనియన్‌ను దూషించుతూ వాటి విశిష్టతావాన్ని మరుగుపర్చి తప్పుగా చూపించటం ద్వారా బూర్జువా వర్గానికి ప్రత్యేకంగా వుపయోగపడుతుంది. ఈ విధంగా విప్లవాన్ని నాశనం జేయుటకై తిరుగుబాటును లేవదీయ కుట్రలు పన్నుతున్న బూర్జువా వర్గానికి ట్రాట్స్కీయిజం ఒక ఆయుధం.

కాబట్టి అర్థశాస్త్రాన్ని సరిగా అధ్యయనం చేయటంలో ఒక ప్రధాన విషయాన్ని గుర్తుంచుకోవాలి మార్క్సిజమునకు వ్యతిరేకమూ, తప్పు మార్గాన పట్టించే సిద్ధాంతాలూ అయిన వాటియన్నిటితోనూ తీవ్ర పోరాటం జరుపవలసి యున్నది.



# అధ్యాయం 2

# సమాజం కాపిటలిజంలోనికి ఎట్లా పరిణమిస్తూ వచ్చింది?

## వర్గరహితమగు సమాజాన్ని స్థాపించటం మన ధ్యేయం

**1917** అక్టోబరులో జరిగిన రష్యను విప్లవం మానవ జీవిత చరిత్రలో ఒక నూతన అధ్యాయాన్ని ప్రారంభం చేసింది. అప్పటి నుండి సోషలిజం స్థాపనయే లక్ష్యమైంది. ఇట్టి సోషలిస్టు వ్యవస్థలో మనిషిని మనిషి దోచుకొనే పద్ధతులు అంతమొందింపబడతాయి. 1933 లో సోవియటు యూనియన్‌లో ప్రారంభింపబడిన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కర్తవ్యం వర్గరహితమగు సోషలిస్టు వ్యవస్థను నిర్మాణం చేయటమే.

1933 ఫిబ్రవరిలో సమిష్టి వ్యవసాయక్షేత్రాల షాక్ బ్రిగేడ్ వర్కర్ల (బహు నేర్పరులై, అతిత్వరగా, సుళువుగా కృషిజేసిగల రైతుల) సమావేశంలో ఉపన్యసిస్తూ, కామ్రేడ్ స్టాలిన్ ఈ విధంగా అన్నాడు :

"వివిధ జాతుల చరిత్రలో అనేక విప్లవాలు జరిగినవి. కాని అక్టోబరు విప్లవానికీ, ఈ పూర్వపు విప్లవాలకీ చాలా భేదం వున్నది. ఆ విప్లవాలన్నీ ఒక రకమువి. వాటి మూలకంగా కష్టజీవులను దోచుకొనే ఒక రకం పద్ధతిపోయి, మరో రకం పద్ధతి వచ్చేది; కాని ఏ పద్ధతిపోయి ఏ పద్ధతి వచ్చినా, దోపిడిమాత్రం సాగుతూనే వుండేది. ఒక ముఠా దోపిడిగాండ్రుపోయి, ఇంకో ముఠా దోపిడిగాండ్రు వచ్చేవారు. కాని దోపిడి, పీడన మాత్రం యథాతథంగానే వుండేవి. అక్టోబరు విప్లవం ఒక్కటే అన్నిరకాల దోపిడిగాండ్రను అంతమొందించాలనీ, శాశ్వతంగా, పూర్తిగా దోపిడినే అంతం చేయాలనీ లక్ష్యంగా పెట్టుకుంది.

వర్గరహితమగు సోషలిస్టు సమాజాన్ని స్థాపించాలంటే, దాని పూర్తి అవసరాన్ని, ప్రాముఖ్యతను తెలుసుకోవాలంటే, అసలు వర్గవిభేదాలతో కూడివున్న సమాజంయొక్క లోతుపాతులన్నీ బాగా గ్రహించాలి కాపిటలిజంలో ఏయే వర్గాలు

వున్నాయి అనేది బాగాగు గ్రహించాలి. అసలు వర్గాలేమిటి ? ఎట్లా ఏర్పడినవి ? మొదటి నుండీ ఈ వర్గాలనేవి వున్నవా ? అనే విషయాలుకూడా తెలుసుకోవాలి. ఇతర వర్గముల పరిపాలనకూ, కాపిటలిస్టు వ్యవస్థకూవున్న తేడాలనుకూడా తెలుసుకోవాలి. ఇంకా కాపిటలిజం ఏర్పర్చిన బానిసత్వాన్ని నిర్మూలనం చేయాలంటే కార్మికవర్గం ఎలా పోరాడాలి ? కాపిటలిజం ఏ విధంగా క్రమంగా నాశనమైపోతుంది ? మున్నగు విషయాలవన్నిటిని కూడా బాగా గ్రహించాలి.

## వర్గములు ఎల్లప్పుడూ వున్నవా ?

సమాజం ఎల్లప్పుడూ వర్గముల క్రింద విభజింపబడి వుండక తీరదని బూర్జువా తొత్తులు చెప్పుతారు. కాపిటలిజం శాశ్వతంగా, భద్రంగా వుండాలంటే ఇటువంటి కబుర్లుచెప్పి మోసం చేయడం వారికి చాలా అవసరం. పూర్వం ఒకప్పుడు రోమను సామ్రాజ్యంలో బానిసలు తమ యజమానులపై తిరుగుబాటు చేశారు. అప్పుడు ఆ ప్రభువర్గంలో ఒక బుద్ధిమంతుడు ఇట్లా చెప్పాడు: "మనిషి శరీరం చూడండి. చేతులు పనులు చేస్తాయి: చేతులు తెచ్చిపెట్టిన తిండిని పొట్ట తిని జీర్ణించు కుంటుంది. అట్లాగే సమాజంకూడా మానవ శరీరం వంటిదే. కొందరు కష్టపడి పని చేయాలి. మరికొందరు వారు తయారుచేసిన సంపదలను అనుభవించాలి." కాపిట లిజాన్ని సమర్థించే నేటి ఆర్థిక శాస్త్రవేత్తలుకూడా ఈ రోమను ప్రభువుకన్న రెండాకులు ఎక్కువ చదివినవారే.

కాని నిజానికి, వర్గ విభేదాలు, ఒక వర్గం ఇంకోవర్గాన్ని పాలించటం, దోచుకోవటం మున్నగు చీలికలు లేకుండానే మానవులు వేలకొలది ఏండ్లు నివసించా రని చరిత్ర స్పష్టంగా చెబుతోంది. మానవుడు కొన్ని లక్షల సంవత్సరాల క్రితం మృగజాతినుండి పరిణామం పొంది వచ్చినవాడు. అతడెప్పుడూ ఒంటరిగా నివసిస్తూ వుండలేదు : సమూహంలో నివసిస్తూ వుండేవాడు. మానవజాతి పరిణామం ప్రథమ దశలో ఈ సమూహాలు చిన్నవిగా వుండేవి. ప్రత్యేక వ్యక్తులు సమూహాలుగా ఎందు కేర్పడవలసివచ్చింది ? అనే ప్రశ్న వస్తుంది. దీనికి జవాబు తేలికే. తమ బ్రతుకు తెరువుకై వారందరూ కలిసి పోరాడవలసివున్నది ; తిండిని సంపాదించుకుంటానికై కలిసి పని చేయవలసివున్నది. అందుకై సమూహములుగా చేరవలసి వచ్చింది.

## పురాతనపు తెగ కమ్యూనిజం

మానవజాతి అభివృద్ధికై మొట్టమొదటి దశలో మానవుడు చాలా ఇబ్బందులకు లోనౌతూ ప్రకృతితో పోరాటాన్ని సాగించవలసి వచ్చేది. చాలా వేల సంవత్సరాల తరబడి అతనికి పోరాటంలో వున్న ఆయుధాలల్లా రెండే : ఒకటి కర్ర ; రెండవది రాయి. అడుగడుగుకీ అతనికి అపాయాలే. ప్రతి అడుగునా అతడు ప్రకృతి నుండి గొప్ప మహా ఆపదలను ఎదుర్కోవలసి వచ్చేది. అప్పటి కాలానికి ప్రకృతి మూలసూత్రాలు ఏమీ తెలిసినవికావు.

ఇటువంటి పరిస్థితులలో మానవులు చిన్న చిన్న సమూహాలుగా నివసించే వారు. వాటినే తెగలు అంటాము. అందరూ కలిసి పనిచేసేవారు. సంపాదించిన దానిని అందరూ కలిసి అనుభవించేవారు. ఆస్థితిలో వారిలో హెచ్చుతగ్గుల భేదాలు వుండేవికావు. ఎందుచేతనంటే, వారి సంపాదన అంతా వేటవల్ల వచ్చిన కొద్ది మాంసమో, పశుపాలనమో, లేక బహు పురాతనమగు స్వల్పపాటి వ్యవసాయమో.

ప్రతి మానవుడు, చరిత్రలో పూర్వం ఒకప్పుడు ఇట్టి పురాతనపు తెగ లలో నివసించినవాడే. ఇట్టి తెగలనే పురాతనపు కమ్యూన్ లనేవారు. ఇట్టి కమ్యూన్‌లు మొన్న మొన్నటివరకూ మారుమూల ప్రాంతాలలో వుంటూ వుండేవి. నవీన నాగరికతా ప్రభావం ఇంకా వాటికి సోకలేదు. కాని క్రమేణా ఐరోపా కాపిట లిస్టులు ఆ మారుమూలలను కూడా కదిలించి, అట్టి తెగల సంఘాలను విచ్ఛేదం జేసే వారు. కాని ఈ కాపిటలిస్టులు కూడా ఒకప్పుడు 1000, 1500 ఏండ్ల క్రితం ఇట్టి తెగంలో నివసించినవారే.

ఈ విధంగా సమాజంలో వర్గవిభేదాలు పొడసూపే కాలం వరకూ మాన వులు ఇట్టి పురాతనపు కమ్యూనిజంలో నివసించేవారని తెలుస్తోంది. వివధ ప్రాంతా లలో, వివిధ తెగలలో ఈ పద్ధతి వివిధ రూపాలలో వుండేవి. కాని ఈ భేదాలు ఎలాంటివైనప్పటికీ మూల ప్రకృతిలో మాత్రం ఈ సాంఘిక వ్యవస్థ అంతా ఒకటే నని తెలుస్తోంది

సామాజికాభివృద్ధి ప్రథమ దశలో యీ పురాతనపు కమ్యూనిజంవుండేది. ఆదశలో చాలా మెల్లగా సమాజం పరిణామం చెందుతూ వుండేది. వేలకువేల యేండ్లు యీ దశలో గడిచిపోయినవి. ఒక్కొక్క అడుగే అభివృద్ధివైపుకు వేయుటకు మానవులకు వందల, వేల యేండ్లు బట్టేవి. చాలా మెల్లిగా, క్రమేపీ మానవుడు తన పనిముట్లను పున్నితం చేసుకొనుట ప్రారంభించాడు. పనిలో మెలకువ, నిపుణత్వం నేర్చాడు.

ఇట్టి పురాతనపు కమ్యూనిజంలో సాంఘిక సంబంధాలెట్లుండేవి? ఇట్టి పురాతనపు తెగలో వుండేవారి సంఖ్య చాలా కొద్దిగానే వుండేది. అనాడున్న టెక్నికల్ నిపుణత్వం బట్టి స్వల్పసంఖ్య కాక పెద్ద సంఖ్య అయితే, వారినందరినీ పోషిం చటం కష్టతరమౌతుంది. అట్టితెగ సంఘములో పనులన్నీ ఒక ప్లానుప్రకారం జరిగేవి: అందరకూ నిర్ణీతమైన పనులుండేవి. ఉదాహరణకు : పురుషులందరూ వేటాడేవారు: స్త్రీలందరూ ఇంటివద్దవుండి పిల్లలను పోషించడం, పశుపాలనం, లేదా వ్యవ సాయం చేసేవారు. వేటనుండి తిరిగి వచ్చిన తర్వాత, వారి వారి పూర్వాచారముల ప్రకారం వేటమాంసము నందరూ పంచుకొనేవారు.

"జనాభా ఆ కాలంలో చాల తక్కువగా వుండేది. ఒక్కొక్క తెగ ఒక్కొక్క ప్రాంతంలో నివసించేది. నివాసస్థానానికి చుట్టూ ఒకే పరిమితి వరకూ వున్న అడవి అంతా ఆ తెగకు చెందినది. ఒక తెగ అడవికి మరొక తెగ అడవికి

మధ్య కొంత ప్రదేశం తటస్థ ప్రాంతంగా వుండేది. ఈ తెగలలో శ్రమ విభజన చాలా సులభంగా వుండేది. స్త్రీ-పురుషు లిద్ద్వరూ రెండు వేర్వేరు రకాల పనులను చేసేవారు. పురుషులు యుద్ధం చేసేవారు, వేటాడేవారు, చేపలు పట్టేవారు. తిండికి కావలసిన పదార్థము లన్నిటినీ సేకరించేవారు. ఇందుకు కావలసిన పనిముట్లను, ఆయుధాలను అన్నిటినీ తయారుచేసేవారు. స్త్రీలు గృహనిర్వహణ గావించేవారు; భోజనం వండేవారు; బట్టలు తయారుచేసేవారు. ఇందుకు పనిముట్లు తయారు చేసే వారు. ఎవరి కార్యరంగ లో వారు సర్వాధిపతులు; పురుషులు అడవిలో అధిపతులు; స్త్రీలు గృహంలో అధిపతులు, ఎవరు తయారుచేసుకొన్న ఆయుధాలు, పనిముట్లు వారివే. గృహం కమ్యూనిస్టు పద్ధతులపై నడిచేది. ఒక్కొక్క ఇంట్లో చాలా కుటుంబాలు నివసిస్తూ వుండేవి * సమిష్టిగా యేది యేది ఉత్పత్తి చేయబడి, ఉపయోగింపబడేదో అది అంతా సమిష్టి ఆస్థిగా చూడబడేది. ఇల్లు, తోట, పడవ మున్నగు ఇట్టి వస్తువులు అన్నీ సమిష్టి ఆస్థిగానే వుండేవి." •

ఇట్టి పురాతనపు కమ్యూనిస్టు సమాజంలో, కష్టపడి జీవించేవారు, కష్టపడకుండా ఇతరుల శ్రమమీద జీవించేవారు అనే విభాగాలు వుండేవికావు. సమాజంలో ఒక భాగం ఇంకొక భాగాన్ని దోచుకుతినటం వుండేదికాదు. ఆ కాలంలో వుత్పత్తి సాధనాలైన పనిముట్లు చాలా స్వల్పంగానూ, అల్పంగానూవుండేవి. అందుకు వాటిలో స్వంతఆస్థి అనే ప్రశ్నయే వుదయించేదికాదు. ఎవరికి వారే సులభంగా కొద్దికాలంలో బల్లెమునో, రాతి ఆయుధమునో, విల్లంబులనో తయారు చేసుకొనేవారు. ఇదే విధంగా భూమిపైగూడ స్వంత ఆస్థి హక్కులుండేవికావు. సమాజంలో తర్వాత తర్వాత వర్గవిభేదాలు పొడసూపినా, వ్యవసాయంలో మాత్రం సమిష్టిజీవనం చాలా కాలం నిల్చివున్నది. అటుపిమ్మట సామాజికాభివృద్ధిలో దోపిడీగాండ్రవర్గం పైరకపు గ్రామ వ్యవస్థను కృత్రిమంగా నిలబెట్ట ప్రయత్నించింది. ఇందుకు కారణం స్పష్టమే. ఇట్టి గ్రామవ్యవస్థకు పునాదులు కూల్చివేయబడినా, పైపై స్వరూపం నిల్పటం దోపిడీ. వర్గం స్వలాభంకొరకే నీటిద్వారా పన్నులు వగైరా తేలికగా వసూలు చేయవచ్చును. రైతాంగమును దోచుగానే పద్ధతులను మరుగుపర్చవచ్చును. కాపిటలిజం పూర్తిగా విస్తరిస్తానికై బూర్జువావర్గం యీ గ్రామ వ్యవస్థను సమూలంగా, విశ్లేషంగా నాశనం గావించినది.

వ్యవసాయమే ప్రధానమైన వృత్తిగా తయారైన పిమ్మటకూడా భూమిపై సమిష్టిస్వత్వం వుండేవి. సాగుజేసుకుంటానికి భూమి విభాగాలుగావింపబడి, ప్రత్యేక

---

* "ముఖ్యంగా ఇట్టి పద్ధతి అమెరికా ఈశాన్యంలో వుండేది. ఈ విషయం బాంక్రాష్ట తెలియజేశాడు. క్వీన్ ఛార్లెటీ దీవులలో కొన్ని కొన్ని ఇండ్లలో 700 మంది వరకూ నివసించేవారు. నూట్కా తెగలలో, ఒక్కొక్క ఇంట్లో ఒక్కొక్క తెగ మొత్తం ఐనాధ నివసించి వుండేది.'' ఎంగెల్సు.

• "కుటుంబం, దాని పుట్టు పూర్వోత్తరాలు" అన్న ఎంగెల్సు గ్రంథము నుండి.

ప్రత్యేకంగా కుటుంబాలకు యివ్వబడినా, గ్రామ సమిష్టి ఆస్తిగా మాత్రమే వుండేది. అప్పుడప్పుడూ లాటరీ వేయబడి, భూమి ఈ కుటుంబాలమధ్య మరల పంచబడుతూ వుండేది. పశువుల బీళ్ళ విషయంలో ఈ సమిష్టి ఆస్తిపద్ధతి యింకా ఎక్కువకాలం నిల్చివున్నది. ఈనాడు కూడా, కాపిటలిజం బాగా ప్రబలిన దేశాలలో గూడా గ్రామాని కంతటికీ కలిపి సాముదాయిక బీటిభూములు వుండుట సామాన్యమే.

ఈ విధంగా వర్గవిభేదాలు నొడసూపక పూర్వం సమాజం పురాతనపు తెగ కమ్యూనిస్టు విధానంలో ఉండేది. కమ్యూనిజం అంటేనూ, స్వంత ఆస్తిహక్కులు రద్దుకాబడువంటేనూ గంగవెఱ్ఱులెత్తే బూర్జువా వర్గానికి స్వంత ఆస్తి అనేది ఎరుగని సమాజం ఉండేదనీ ఆ విధంగా మానవులు చాలాకాలం సమాజజీవనం గడిపారనీ చెపితే ఒప్పుకోరు. అది అసంభవం అంటారు. కాని వీరి వాదనలు పూర్తిగా తప్పు అనీ, వర్గరహితమగు సమాజం ఒకప్పుడు వుండేదనీ చరిత్ర ఘోషిస్తోంది.

పురాతనపు కమ్యూనిస్టు సమాజంలో రాజ్యాంగయంత్రము వుండేదికాదు. సమాజం వర్గములక్రింద చీలిపోయి స్వంతఆస్తి అన్నది ఏర్పడ్డప్పుడే రాజ్యాంగ యంత్రం అనేది పుట్టింది. రాజ్యాంగ యంత్రాన్ని గూర్చిన ఉపన్యాసంలో లెనిన్ ఇట్లా చెప్పారు:

"పురాతనపు సమాజంలో ప్రజలు చిన్న చిన్న తెగలుగా నివసించేవారు. వీరి నాగరికతాభివృద్ధి అప్పుడు చాలా స్వల్పంగావుండేది. చాలామొరటుగా, అనాగరిక జీవనం గడుపుతూ వుండేవారు. ఇవి కొన్నివేల ఏండ్లక్రితం - నాగరిక మానవునికి చాలా వేలఏండ్లక్రితం - వుండే పరిస్థితులు. అప్పటికి రాజ్యాంగ యంత్రం చిహ్నాలే ఉండేవికావు. ఆ కాలంలో పరిపాలన అంతా పూర్వాచారాల ప్రకారం, సాంప్రదాయాల ప్రకారం, పెద్దలయెడవుండే భయభక్తుల ననుసరించీ, ఆనాడు పురుషులతో బాటుగానో, కొద్దిగా ఎక్కువగానో హోదాకలిగివున్న స్త్రీల ఆజ్ఞప్రకారం సాగుతూ వుండేది. ప్రత్యేకంగా పాలకులనేవారు ఉండేవారుకారు. రాజ్యాంగ యంత్రం అనేది క్రమేణా వచ్చినది. సమాజంలో ఒకరినొకరు దోపిడీ చేసుకునే విధానాలు వచ్చి, వర్గవిభేదాలు నొడసూపిన పిమ్మటనే దోచుకొనేవారు. దోచుకొనబడేవారిని అణచి వుంచటానికై ఏర్పరచబడినది యీ రాజ్యాంగ యంత్రం అని చరిత్రవల్ల మనకు తెలుస్తోంది".

## పురాతన సమాజం శిధిలమైన పద్ధతి

పురాతన కాలంలో మానవ సమాజం అభివృద్ధి చాలా మెల్లగా జరిగేది. కాని అభివృద్ధి యనేది మాత్రం వుండేది. సమాజ జీవితంలో స్తబ్దత, నిశ్చలత అని వుండనే వుండవు. మెల్లగా క్రమంగా పనిముట్లు సౌష్టవంగా చేయబడ సాగినవి. ఇదివరకు అగమ్యగోచరంగా వుండే ప్రకృతిశక్తులను మానవులు క్రమంగా తమ కుపయోగకారులుగా చేసుకో ప్రారంభించారు. నిప్పును చేయటం ఒక బ్రహ్మాండమగు

విప్లవాన్ని తెచ్చిపెట్టినది. తరువాత వేటాడుటకు విల్లంబులను కనిపెట్టారు. మొదట్లో కర్రలను, రాళ్ళను వుపయోగించేవారు. కర్రమచెక్కి మొనదేల్చి ఈటెలను తయారు చేశారు. రాళ్ళను నునుపుదేల్చి మంచి పదునైన ఆయుధంగా తయారుచేశారు. మట్టితో కుండలు చేసే విద్య నేర్వగానే మరొక నూతనదశ ప్రారంభమైనది. పిమ్మట పెంపుడు పశువులను పెంచటం, ధాన్యములను పండించటం బహు ముఖ్యమగు పరివర్తనమును తెచ్చిపెట్టినవి. పశుపాలనం, వ్యవసాయం ప్రధాన వృత్తులయినవి. తర్వాత ముడి యినుమును కరిగించి మంచి యినుమును తయారుచేసి, దానితో అనేక పనిముట్లను గావించటం, వ్రాయటాన్ని కనిపెట్టటం జరిగింది. ఇంతటితో పురాతన కాలం అంత మైంది; నాగరికతా శకం ప్రారంభమైంది. ఇప్పటి నుండే మానవ సమాజంలో వర్గ విభేదాలేర్పడినవి. ఇక చరిత్ర యంతా వర్గపోరాటాల చరిత్రయే. ఈ విషయాన్ని మార్క్సు, ఎంగెల్సులు కమ్యూనిస్టు మానిఫెస్టోలో స్పష్టంగా వ్రాశారు.

అయితే వర్గాలు ఎట్లా ఏర్పడినవో వివరంగా చూడాలి. వర్గాలు ఎప్పుడో అకస్మాత్తుగా పుట్టుకొచ్చినవికావు. సామాజికాభివృద్ధి అవుతూ వున్నప్పుడే క్రమంగా వర్గ విభేదములు పొడసూపుతూ వచ్చినవి. పసుపాలనం ప్రారంభమైంది. అప్పుడు పశుపాలనము వృత్తిగాగల తెగలు ఇతర తెగలనుండి వేరైనవి. ఈ విధంగా సమాజంలో మొట్టమొదటగా శ్రమ విభజన జరిగింది. ఇప్పటినుండి వివిధ తెగలు వివిధ వస్తు సముదాయములను కలిగి యుండటం కూడా ప్రారంభమైంది. పశుపాలన వృత్తిగా గలవారికి పశువులు, వాటి పాలు ఉన్ని, మాంసము, తోళ్ళు వగైరాలు వుండేవి. ఇతర తెగలకి వుండేవికావు. అందువల్ల ఒక తెగ మరొక తెగతో తమ తమ వస్తువులను మార్పిడి చేసుకొనే పద్ధతి ఏర్పడింది. మొట్టమొద టగా తెగ పెద్దలు ఈ మారకాన్ని (exchange) సాగిస్తూ వుండేవారు. ఒక వస్తు వుకు యింకో వస్తువును యిచ్చి పుచ్చుకోవటమే అనాటి మారక విధానం. దీనినే మార్పిడి (Bartar) అంటారు. మొట్టమొదటిగా ఈ వస్తు మార్పిడి వ్యక్తుల మధ్య జరిగేది కాదు. తెగల మధ్యనే జరిగేది.

ఇదే సమయంలో జనాభా పెరుగుతూ వచ్చింది; దీనితో పాత పద్ధతులు సమాజమునంతటినీ పోషించుటకు సరిపోలేదు. దీనితో చెట్లు చేమలు పెంచటం, క్రమంగా ధాన్యాలు పండించటం ప్రారంభమైంది. ఇది వ్యవసాయ కృషిలో మొదటి మెట్టు; వ్యవసాయం ప్రారంభం కావటమంటే కొన్ని కుటుంబాలవారు భూమిని ఎల్లప్పుడూ ఒకేచోట అంటిపెట్టుకుని యుండవలసి వస్తుంది. దీనితో స్వంత ఆస్థి అనేది ఏర్పడుటకు ప్రాతిపదిక ఏర్పడింది.

"పశుపాలనం, వ్యవసాయం, గృహపరిశ్రమలు మున్నగు వివిధ రకాల ఉత్పత్తి మార్గాలు ఏర్పడిన పిమ్మట మానవుడు తన శ్రమశక్తిని వినియోగించటం ద్వారా, తన జీవనాని కవసరమైన వస్తువులకన్న ఎక్కువగా ఉత్పత్తి చేయగలుగు చున్నాడు. ఇదే సమయంలో, తెగలోగాని, యింటిలోగాని, కుటుంబంలోగాని ఉండే

ప్రతివ్యక్తికీ రోజూ చేయవలసిన పనికూడా ఎక్కువౌతూ వచ్చింది. పనిచేసేవారిని ఇంకా జేర్చుకోవటం అవుసరమనిపించింది. యుద్ధంలో ఇట్టివారు దొరికేవారు. పూర్వం యుద్ధంలో ఓడిపోయినవారు సామాన్యంగా వధింపబడేవారు. ఇప్పుడు గెల్చిన వారు ఓడిపోయిన వారిని పట్టుకొని బానిసలుగా చేసుకున్నారు. ఈ విధ గా సామాజికాభివృద్ధిలో, ఒకానొకప్పుడు బానిసత్వం అవసరమైనది బానిసవిధానంవల్ల సమాజం యొక్క సంపదా పెరిగింది ఉత్పత్తి కృషికూడా విస్తరించింది ఈ విధంగా సమాజంలో మొటమొదటి సారిగా జరిగిన పెద్ద శమవిభజనతో పాటు మొట్టమొదటసారిగా రెండువర్గాలేర్పడినవి ఒకటి బానిసలు; రెండోది బానిస యజమానులు– దోచుకోబడేవారు, దోచుకునేవారు." *

మనుష్యుడు పనిచేయటంలో నూతన మార్గాను, రూపాలను అవలంబిస్తున్న కొలదీ శ్రమ విభాగం అంతకంతకూ పెరుగుతూ వుంటుంది. వంట సామాగ్రిని రకరకాల పనిముట్లను, అనేకములగు ఆయుధములను చేయుట ప్రజలు నేర్చారు. దీనితో వ్యవసాయం నుంచి చేతిపనులు వేరైనవి. ఇందువల్ల మారకంలో కూడా అభివృద్ధి కల్గుటకు పునాది ఏర్పడింది.

## కాపిటలిజమునకు పూర్వమువున్న దోపిడీ రూపాలు

పురాతనపు కమ్యూనిస్టు సమాజం క్రమంగా ఈ విధంగా శిధిలమైపోయింది. దీనితోపాటు పశువులు, భూమి పనిముట్లు వగైరా పనిస్థి హక్కుల మంది స్వంత ఆస్థిగా మారినవి. ఈ విధంగా స్వంత అస్థి హక్కులు ఏర్పడగానే సమాజంలో హెచ్చుతగ్గుల భేదం ఏర్పడుటకు కూడా పునాది యేర్పడింది.

"స్వతంత్రులు, బానిసలు అనే విభాగానికితోడు భాగ్యవంతులు బీదవారు అనే విభాగంకూడా ఏర్పడింది. అంతకంతకూ పెరిగే శ్రమవిభాగమూ ఈ బీద, భాగ్యవంతులనే విభాగమూకలిసి సమాజాన్ని వర్గముల క్రింద చీల్చుటకు తోడ్పడినవి."•

పురాతన కమ్యూనిజం శిధిలం కావటంతో సమాజంలో దోచుకొనేవారు, దోచుకోబడేవారుగా వర్గాలు ఏర్పడినవి ఒకరి శ్రమ ఫలితంపై మరొకరు జీవించటం ప్రారంభమైంది. ఇక ఇప్పటినుంచి సమాజంలో ఒకవర్గం ఇంకొక వర్గాన్ని దోచుకోవడమే చరిత్రగా అభివృద్ధియైంది. అయితే ఈ అభివృద్ధి క్రమం ఒక్కొక్క దశలో ఒక్కొక్క రీతిగా వుండేది. అట్టి వివిధ దశలలో దోపిడి వివిధ రూపాలను కలిగి వుండేది.

"నాగరికత ప్రారంభమెవప్పటినుండి శ్రమవిభాగం ఏర్పడడం వర్గవిభజన ఏర్పడటం, ఒకవర్గాన్ని ఇంకొకవర్గం దోచుకోవడం ప్రారంభమైంది. ఇక ఇప్పటి

---

* ఎంగెల్సు "కుటుంబం దాని పుట్టుపూర్వోత్తరాలు" అన్న గ్రంధంనుండి.

• ఎంగెల్సు "కుటుంబం దాని పుట్టుపూర్వోత్తరాలు"

మందే సమాజం ఎల్లప్పుడూ ఈ విధంగానే దోపిడీతో కూడుకొని యున్నది మొట్ట మొదటి దోపిడీరూపం బానిసత్వం. తర్వాత మధ్యయుగాల కాలంలో భూస్వామ్యంకు కౌలుదార్ల వూడిగము వుండేది ఈనాడు కాపిటలిస్టు సమాజంలో కూలిపని వున్నది. ఈ విధముగా నాగరికత ప్రారంభమైనప్పటినుండి మూడు పెద్ద చారిత్రక కాలాలు, వాటిలో మూడురకాల బానిసత్వం వున్నది. ప్రత్యక్షముగా గానీయండి, మరుగుపడి వుండనీయండి, బానిసత్వం అనేది ఎల్లప్పుడూ వుంటూనే వచ్చింది." *

సమాజంలో ఒకవర్గమున కున్నస్థానం, వుత్పత్తి సాధనాలతో దానికున్న సంబంధాలను బట్టి నిర్ణయింప బడుతుందని ముందటి అధ్యాయములో చూశాము. దోపిడిపై ఆధారపడిన బానిసత్వం, కౌలుదారీ ఊడిగం, కాపిటలిజం. ఈమూడురకాల సమాజ వ్యవస్థలు ప్రత్యేకముగా వుత్పత్తి సంబంధాలను కల్గివున్నవి. అసలు సమాజానికి ప్రత్యేకమైన వుత్పత్తిసాధనాలను, వుత్పత్తిసంబంధాలు వున్నవి.

బానిస విధానం మానవ సమాజంయొక్క వ్రాయబడిన చరిత్రలో మొట్ట మొదటిదశలో వున్నది. ఇదే దోపిడివిధానం యొక్క మొట్టమొదటిరూపం ఈ పద్ధతి క్రింద దోచుకోబడేవారు దోచుకొనేవారి అస్థి ఒక ఇంట్లోని కుర్చీవో, పశువుట్లో యజమాని స్వంతంఅయినట్లుగానే బానిసకూడా యజమాని స్వంతమే. పూర్వం రోమను సామ్రాజ్యంలో ఈ బానిస విధానం జాస్తిగా అమలులో వుండేది. ఆ కాలంలో "పశు వులను నోరులేని పనిముట్లు"ని, బానిసలను "నోరువున్న పనిముట్లు"ని పిల్చేవారు. బానిస యజమాని యొక్క సామాన్య వస్తువుగా చూడబడేవాడు. అతడు ఖూనీ చేయరాదా కాదనేడిలేదు యజమానికి ఎంతమంది బానిసలువుంటే, అతడంత భాగ్య వంతుడని పించుకొంటాడు. యజమాని బానిసలచే పనిచేయించుకొంటాడు నిర్బంధ ముగా భయంతో ఈ పని చేయబడేది. కాని ఆ కాలంలో టెక్నికల్ అభివృద్ధిలేదు. బానిసలు చాలా బండ పనిముట్లతో, తమకండలను కరిగించి, పనిచేయవలసి వచ్చేది. అందుచేత వారి వుత్పత్తి శక్తిగూడ చాలతక్కువగానే వుండేది. యజమాని బానిస లకు కష్టం తగ్గించుటకు ఆలోచించే వాడేకాదు.

ఈ విధంగా బానిస విధానంలో పనిముట్లు, వస్తువులు యజమానికి చెంద టమేగాక బానిసలుకూడా యజమాని స్వంత అస్థియే. బానిసచే పనిచేయించుకోవాలి కాబటి బానిస చనిపోతే తన సంపదకు నష్టం కాబట్టి యజమాని వానిని తిండిపెట్టి పోషించుతాడు ఆ కాలంలో వస్తుహూర్పిడి తక్కువగానే వుండేది; కాబటి యజమాని బానిసలచేతను, తనకుటుంబమునకు పరివారమునకు కావలసిన వస్తువులకు మాత్రమే వుత్పత్తి చేయించేవాడు. అందుచేతనే బానిసవిధానం ఉన్నసమాజంలో అధికారవర్గం తమ్మనిమన్న గానని భోగలాలసతో తేలియాడేవారు. కాని వారి భోగాలు ఎంతపై నప్పటికీ, వుత్పత్తి ఒక హద్దును మించిపోయేదికాదు. ఎందుకనగా వుత్పత్తి

* ఎంగెల్సు "కుటుంబం దాని పుట్టుపూర్వోత్తరాలు"

ఎక్కువైతే, దాని మనమోగించే దిక్కువుండదు అందుచే బానిస విధానంక్రింద వస్తూత్పత్తి, సంపదాభివృద్ధి కొంది పరిమితిలోనే వుండేది. ఇందుచేతనే బానిస సమాజంలో టెక్నికల్ అభివృద్ధి చాలా తక్కువ.

ఈ విధంగా సమాజంలో ఒక వర్గం పెత్తనం సంపాదించగానే అధిక సంఖ్యాకులను కొలదిమంది దోచుకోటానికి వీలుగా బలాన్ని వుపయోగించుటకై "రాజ్యాంగ యంత్రం" ఏర్పాటుబడింది. బానిస విధానం వున్న కాలంలో ఇట్టి రాజ్యాంగ యంత్రం నేటి రాజ్యాంగ యంత్రం కన్న తక్కువ పరిమితులలోనే వుండేది. ఆనాటికి రహదార్లు అభివృద్ధికాలేదు. సముద్రం, పర్వతాలు జయింపబడ లేదు అందుచే ఆ విధంగా అనాడుండేవి రాజ్యాంగ యంత్రంకూడా రాజరికం, ప్రజాస్వామికం మున్నగు రూపాలలో వుండేవి. కాని రూపం ఎటువంటిదయినా, బానిస యజమానుల ఆధిపత్యాన్ని కాపాడుటకే ఇవి వుపయోగపడేవి. బానిసలు సామాన్యంగా సమాజంలో సభ్యులు కానట్లే చూడబడేవారు.

పూర్వం గ్రీకు రోమను సామ్రాజ్యాలలో బానిస సమాజంలో లలిత కళలు పైన్సు చాలా అభివృద్ధి చెందినవి. కాని ఈ నాగరికత మాత్రం లక్షలకు లక్షల బానిసలు అస్థిపంజరాల పునాదులపై నిర్మింపబడినది.

యుద్ధాలు ఎక్కువౌతున్న కొలంది బానిసల సంఖ్య పెరిగేది. దీనితో వీరి జీవితాలు చాలా స్వల్పమై పోయినవి; యజమానులు వీరిని నిర్దాక్షిణ్యంగా, అశ్రద్ధగా జూచేవారు. అందుచే అనేకతూర్లు బానిసలు యజమానులపై తిరుగుబాట్లు గావించారు. బానిసత్వం చరిత్రయంతా బానిసలకు, యజమానులకు జరిగిన ఘోర పోరాటాల చరిత్రయే.

ఇట్టి తిరుగుబాటు బానిస సమాజంయొక్క పునాదులనే కదిలించి వేశాయి. చివర చివరకూ యీ పోరాటాలు, తిరుగుబాటూ మరీ వృద్ధియైనవి రోమను సామ్రాజ్యం విస్తీర్ణం అయినకొద్దీ, లోపలి కుళ్ళు కూడా పెరుగుతూ వచ్చింది. అంతర్విభేదాలు పెరిగినవి సమాజపునాదులు కూకటివేళ్ళతో పెల్లగింపబడే తిరుగు బాట్లు బయలుదేరినవి. వీటిలోకల్లా ప్రధానమైనది 2000 ఏండ్ల క్రితం స్పార్టకస్ అనేవాని నాయకత్వాన రోమ్‌పట్టణములో జరిగిన బానిసల తిరుగుబాటు ఈ తిరుగు బాట్లు బానిసలకు విజయాన్ని తేలేకపోయినమాట వాస్తవమే; దోపిడీని అంతము చేయలేకపోయినమాటా నిజమే. ఇందుకు కారణాలు, వీరికి సరియగు లక్ష్యం లేక పోవడమే; నాయకత్వం వహించే సరియగు సంఘం లేకపోవటమే చాలాపార్లు బానిస యజమానులలో, ఒక ముఠా ఇంకొక ముఠాపైన పగతీర్చుకొనుటకు కూడా ఈ తిరుగుబాట్లను ప్రేరేపించటం కూడా జరిగింది. కాని ఎన్ని లోపాలు జరిగినా, ఈ అంతర్యుద్ధాలు, బానిసల తిరుగుబాట్లు బానిస విధానానికి చావుదెబ్బ కొట్టినవి; దాని వినాశానికి పునాదులను వేసినవి.

కాని సమాజంలో బానిసత్వానికి బదులు వేరొక దోపిడీరూపం వచ్చింది. మధ్యయుగాలనాడున్న దోపిడీ రూపం ఫ్యూడలిజం:* దీని అంతిమదశలో ఇది కౌలుదారీ వూడిగంగా మారింది. ఇట్టి ఫ్యూడల్ విధానం చాలాకాలం వుంది. ఈ విధానంలో భూమి అంతా ప్రభువుది. రైతులు ఈ భూమిపైన పనిచేసి, వుత్పత్తి నంతా ప్రభువులపరం జేసేవారు. ప్రభువు ఈ రైతులను పోషించేవాడు భూమి మీద పనిజేసే హక్కును కల్గియున్నందులకై రైతు ప్రభువుకు అనేక వెట్టి చాకిరీలు చేయాలి; నజరానాలు చెల్లించాలి.

వుత్పత్తి స్వంత వుపయోగానికేగాని అమ్ముకొనేందుకు కానట్టి సామాన్య ఆర్థిక విధానంలో ఈ ఫ్యూడల్ దోపిడీ కొంది పరిమితులలో వుండేది. రైతులు పండించిన పంటలో ప్రభువు తన కవసరమైనంత భాగాన్ని తీసుకునేవాడు. ఈ భాగంతో తన సైన్యాలను పోషించేవాడు. తనకు అవసరమగు ఆయుధాలు, ఇతర దేశాలనుండి వచ్చే భోగ వస్తువులు మున్నగువాటిని కొనుటకై వుపయోగించేవాడు. కాని క్రమేణా వస్తువుల మారకం పెరిగింది. దానితోబాటు ఫ్యూడల్ ప్రభువుల దాహం కూడ వృద్ధియైంది. దీనితో తనయొక్క, తన పరివారం యొక్క పోషణ కవసరమైనంతయేగాక, ఇతర అన్ని సరుకులను కొనుట కవసరమైనంత కప్పమును రైతుల దగ్గరనుండి గుంజేవాడు. ఈవిధంగా మారకం వృద్ధియైన కొలదీ రైతులను దోచుకోవటంకూడా వృద్ధియైనది. దీనితో ఇంతవరకూ ఫ్యూడల్ ప్రభువుకు రైతులకూ వుండే సంరక్షకుడు, సంరక్షింపబడే వానికుండే పైతృక సంబంధము పోయి పూర్తి కౌలుదారీ వూడిగం, అనగా వ్యవసాయక బానిసత్వం వచ్చింది.

భూస్వాములు రైతులను దోచుకునే పద్ధతులలోకెల్లా ఈ వ్యావసాయిక బానిసత్వం మహా దారుణమైంది. ఈ పద్ధతి క్రింద భూమియంతా భూస్వాములది. రైతులు తరతరాలుగా సాగుజేస్తున్నా వారికేమీ హక్కులు లేవు. కాని యీ పంట నంతటినీ భూస్వామి కాజేస్తాడు. అంతేకాదు, ఒకానొకవిధంగా రైతును తన బానిసగా చేసేస్తాడు. రైతుకూడా భూమికి అంటివుండే ఒక వస్తువుగా పరిగణింపబడతాడు. భూస్వామియొక్క స్వంత ఆస్తిగా పరిగణింప బడతాడు.

మారక విధానం యీసరికి బాగా పరిణతి చెందింది. విదేశ వ్యాపారం జోరుగా సాగుతూవుంది. రకరకాల వస్తుసామాగ్రి వచ్చిపడుతూ వుంది. ధనం యొక్క ప్రాముఖ్యత పెరిగింది. కాబట్టి భూస్వామి బానిసరైతునుండి ఇంకా ఎక్కువగా పిండనారంభించాడు. ఇందుకై అనేక నూతన పద్ధతులవలంబిస్తాడు. భూమిని చీలికలు చీలికలుగా జేసి ఒక్కొక్కరైతుకు ఒక్కొక్క చీలిక యిచ్చి తన స్వంత భూములనబడే వాటినికూడా ఈ భూములతోబాటు సాగుచేయాలని నిర్బంధించుతాడు. వెట్టిచాకిరి చేయించుకుంటాడు. నజరానాలు, ఇతర అక్రమ వసూళ్ళు సాగిసాడు.

* ఫ్యూడలిజమును జమీందారీ వ్యవస్థయని చెప్పవచ్చును. (అనువాదకుడు)

బానిస రైతాంగాన్ని దోచుకొనే ఇట్టి దారుణ పద్ధతికి వ్యతిరేకంగా అనేక తీవ్ర పోరాటములు జరిగినవి. ప్రతి దేశ చరిత్రలోనూ ఇట్టి పోరాటాలు చూడగలం. జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లాండు, రష్యా మున్నగు ఫ్యూడలిజం వున్న దేశాలలో ఇట్టి తిరుగుబాట్లు అనేకం వచ్చి అంతర్యుద్ధాలకు దారితీసినవి. దశాబ్దాలు అంతఃకలహాలతో గడిచిపోయినవి. ఫ్యూడల్ ప్రభువులు, వారి ప్రభుత్వాలు ఈ తిరుగుబాట్లను అతి క్రూరంగా అణచివేశారు. కాని, గమనించవలసిన విషయం ఏమిటంటే భూస్వాముల దోపిడికి బదులు కాపిటలిస్టు దోపిడీని ప్రవేశపెట్ట ప్రయత్నిస్తూ అప్పుడప్పుడు తలఎత్తుచున్న బూర్జువావర్గం ఈ వ్యావసాయిక బానిసత్వాన్ని దెబ్బకొట్టుటకై యీ రైతు పోరాటాలను వుపయోగించుకుంటూ వచ్చింది.

ఈ విధంగా ఒక సామాజిక వ్యవస్థకుబదులు మరొక సామాజిక వ్యవస్థ వస్తూండేది. దీనిని గూర్చియే స్టాలిన్ యిట్లా చెప్పాడు :

బానిసల తిరుగుబాటుతో బానిసత్వం అంతమొందింపబడింది. దీనితో బానిస యజమానుల దోపిడీ రూపంకూడా పోయింది. దీనిస్థానే ఫ్యూడల్ ప్రభువులు కౌలుదార్లను దోచుకొనే పద్ధతి వచ్చింది. అంటే దోపిడిగాండ్ర రూపం మాత్రం మారిందన్నమాట. బానిస పద్ధతిలో యజమానులు బానిసలను చంపుటకు కూడా "న్యాయశాస్త్రం" ఒప్పుకున్నది. ఫ్యూడల్ విధానంలోని వ్యవసాయిక బానిసత్వంలో భూస్వామి బానిస రైతును అమ్ముకొనుటకు "మాత్రమే" "న్యాయశాస్త్రం" హక్కును కల్గజేసింది. చంపటానికి మాత్రం కాదు.

రైతు విప్లవాల ఫలితంగా ఇట్టి వ్యావసాయిక బానిసత్వం అంతరించిపోయింది. ఫ్యూడల్ వర్గం పోయింది. కాని వీరి స్థానంలో కాపిటలిస్టులూ, భూస్వాములూ వచ్చారు. కాపిటలిస్టు భూస్వామ్య దోపిడీ విధానాలు వచ్చినవి. దోపిడిగాండ్ర ముఠాలు మాత్రమే మారినవన్నమాట. వ్యవసాయిక బానిసత్వ పద్ధతిలో, రైతులను అమ్ముకుంటానికి "న్యాయశాస్త్రం" ఒప్పుకున్నది. కాపిటలిజంలో కష్టజీవులు నిరుద్యోగానికీ, దరిద్రాలచే కరువుకాటకాలవల్ల నశించిపోవటానికి "మాత్రమే" "న్యాయశాస్త్రం" ఒప్పుకుంటుంది.

"ఒక్క మనదేశంలోనే, అక్టోబరు విప్లవానంతరం ఒక మహత్తరమగు సంఘటన జరిగింది ఒక దోపిడిగాండ్ర ముఠా బదులు మరో దోపిడిగాండ్ర ముఠా వచ్చేపద్ధతికి స్వస్తి చెప్పబడింది. అన్నిరకాల దోపిడీలను, దోపిడిగాండ్రను అంతం జేయడం జరిగింది." *

## మారకం యొక్క పుట్టుక, అభివృద్ధి

మానవ చరిత్రలో పూర్వకాలంలోనే మారకం పద్ధతి పుట్టిందని లోగడ చూశాము. సమాజంలో కొందరు కొందరు ప్రత్యేక ప్రత్యేక వస్తువులను తయారు

* 'లెనినిజమ్' నుండి.

చేసేటట్లుగా క్రమవిభజన జరిగినప్పుడే మారకం పద్ధతికి బీజాలు పడినవి. మొదట్లో ఇరుగు పొరుగునవున్న తెగలమధ్యనే ఈమారకం జరిగేవి. ఎప్పుడైతే ఇట్టిమారకం పద్ధతి వచ్చిందో వెంటనే వ్యవసాయంలో అంతర్గతంగాకూడా మార్పులు రాసాగినవి. డబ్బు అనేది వుపయోగంలోకి వచ్చింది. అయితే నాణెములు, కాగితం నోట్లుకాదు. అప్పుడు డబ్బు అంటే, అనాడు ఏ వస్తువులు మార్చుకోబడుటకు ప్రధానంగా కావలసి వచ్చినవో అవే డబ్బుగా వుపయోగపడినవి. పశుపాలనం ప్రధాన వృత్తిగా గల తెగలలో పశువులు డబ్బుగా, మారకానికి వినియోగ పడినవి. ఒక్కొక్క తెగకు స్వంత అస్థిఅనేది ఏర్పడ్డ పిమ్మట, ఒక్కొక్క మనిషికి, ఎన్ని పశువులు వుంటే అతడంత సంపన్నుడని గుర్తింపబడుతూ వుండేవాడు.

కాని సామాన్య వుత్పత్తి పద్ధతి చాలాకాలంవుంది. సామాన్య వుత్పత్తి అనగా, అమ్మకానికికాక, స్వంత ఉపయోగానికై ఉత్పత్తి చేయటం. మారకం అమలులోకి వచ్చిన పిమ్మట కూడా చాలాకాలం ఇట్టి సామాన్య ఉత్పత్తి వున్నది. ఎంతోకాలానికి గాని అమ్మకానికి ఉత్పత్తి చేయటం రాలేదు. అమ్మకానికి ఉత్పత్తి చేయటాన్ని "సరుకుల ఉత్పత్తి" అంటాము.

బానిసత్వం, ఫ్యూడలిజం కాలములలో సామాన్య వుత్పత్తియే వుండేది. ఇట్టి ఉత్పత్తి పద్ధతిపైననే ఈ పూర్వపు దోపిడివిధానములు వుండగల్గేవి. మారకం హెచ్చినకొలది ఈ వ్యవస్థల పునాదులు కదిలిపోనారంభించినవి. ఈ అభివృద్ధి క్రమమును గురించి ఎంగెల్సు ఈ విధంగా వ్రాశాడు:

పూర్వకాలంలో ఉత్పత్తి కమ్యూనిస్టు పద్ధతులపై జరిగేది. అప్పుడు ఉత్పత్తి అయిన వస్తువును ఉత్పత్తిదారులే అనుభవించేవారు. తర్వాతనే చాలా కాలానికి, తమకు సరిపోగా మిగిలిన వస్తువులను ఇతరులకిచ్చి, వారికి మిగిలిపోయిన వస్తువులను తీసుకునే మారకం పద్ధతి వచ్చింది. మారకం పద్ధతి రావటమంటే వస్తువులు సరుకులుగా అనగా అమ్మకం కొరకే ఉత్పత్తి బడిన వస్తువుల రూపంగా మారటానికి మొదటిమెట్టు అన్నమాట. మొదట్లో ఈ మారకం తెగల మధ్యనే జరిగేవి. క్రమంగా తెగలలో అంతర్గతంగానే ఈ మారకం జరగటం వచ్చింది. ఇందువల్ల తెగలు పెద్ద, చిన్న కులముల క్రింద అనగా కొన్ని కుటుంబాలు ముఠాలుగా చీలిపోవటం జరిగింది. కాని ఈ విధంగా కులాల క్రింద విభజింపబడినా, కుల పెద్దల ద్వారా మారకం జరుగుతూ వుండేది. ఈ కులపెద్దలు కూడా కులంలోని ఇతరుల సహాయంతో తమకు కావలసిన వస్తువుల నన్నిటినీ ఉత్పత్తి చేసుకొనే కష్టజీవులుగా వుండేవారు. చాలా అత్యల్పమగు వస్తువులను మాత్రమే తమకు మిగిలిన వస్తువులను మారకంగాయిచ్చి, తెచ్చుకొనేవారు. కుటుంబం వ్యవసాయం చేయటం, పశువులను పెంచటమేగాదు చేసేపని. వీటివల్ల ఉత్పత్తి అయ్యే వస్తువులనుకూడా తామే యితర ఉపయోగముల కొరకు మార్చుటకై పనిచేసేవారు. తమ ధాన్యాన్ని తామే చిన్న చిన్న గాలిమరల, నీటిమరల సహాయంతో పిండిగా విసురు

కొనేవారు. రొట్టెలను కాల్చుకొనేవారు. వడికేవారు. నేసేవారు. రంగులద్దకం చేసేవారు. తోలువూనేవారు ఇళ్లుకట్టుకొనేవారు. వాటినిమరమ్మతులు చేసుకొనేవారు. తమకు కావలసిన పనిముట్లను చేసుకొనేవారు. వడ్రంగం, కమ్మరం చేసేవారు. ఇంతెందుకు సర్వసామాన్యంగా కుటుంబం అవుసరాలకు కావలసిన వస్తువుల నన్నింటినీ స్వయంగా తయారు చేసుకొనేవారు.

జర్మనీలో 19 వ శతాబ్దారంభంలోకూడా ఇట్టి కుటుంబాలు వుండేవి. వారు మారకంద్వారా తెచ్చుకొనేవి చేతిపనులవారు తయారుచేసే కొద్దివస్తువులను మాత్రమే. వీటినైనా వారు తయారు చేసుకొనలేకకాదు. తాముచేసిన వాటికన్న తాముకొనేవి "బాగుండటంవల్లగాని చవుక అవటంవల్లగాని మాత్రమే." *

ఈ విధంగా బానిసత్వం, ఫ్యూడలిజం ఉన్న కాలములలో సామాన్య ఉత్పత్తి ఉండేది. ఇంతేగాదు, నూతన పరిస్థితులలో కూడా, కాపిటలిజం ప్రారంభ దశలో కూడా మరోరూపంలో ఈ సామాన్య ఉత్పత్తి ఉండేది. కాపిటలిజం పూర్తిగా వికసించిన పిమ్మటనే సామాన్య ఉత్పత్తి పూర్తిగా అంతరించింది.

కాపిటలిజానికి పూర్వంకూడా సరుకులు, అనగా అమ్మకానికై తయారు కాబడిన వస్తువులు ఉత్పత్తి కాబడేవి. మారకంకూడా ఉండేది. అంతకంతకూ శ్రమ విభజన ఎక్కువౌతూ వచ్చినకొద్దీ ఇవన్నీవచ్చినవి. మొట్టమొదటగా వ్యవసాయం నుండి చేతిపనులు వేరైనవి. వ్యవసాయదారు తన పోషణకై తాను పండించు కొనే వాడు. ఈ విధంగా సామాన్య ఉత్పత్తి ఉండేది. కాని చేతిపనుల వారి పరిస్థితి ఇది కాదు. మొదటినుండీ వారు తయారుచేసేవి తమ ఉపయోగానికే కాక, అమ్మకానికై ఉద్దేశింపబడేవి. చెప్పులలో, గుర్రపుజీనులలో, నాగళ్ళు, బిందెలు, చెంబులు మున్నగు పాత్రలలో ఉత్పత్తి చేశారంటే వాటిని మార్కెటులో అమ్ముటకే తయారు చేసేవారు. కాని కాపిటలిస్టు వ్యవస్థలోవలెగాక, ఈ చేతిపనివారలు తమ పనిముట్లపై పూర్తి హక్కులు కలిగి వుండేవారు. తన పనిముట్ల నుపయోగించి, శ్రమశక్తిని జోడించి వస్తువులను ఉత్పత్తి చేసేవారు. కూలికి కాక తనకుతానే శ్రమపడి అమ్మకానికై ఉత్పత్తిగావించే ఇట్టి ఉత్పత్తి పద్ధతిని "సరుకుల సామాన్య ఉత్పత్తి" సింపుల్ కమోడిటీ ప్రొడక్షన్ అని అంటాము.

అయితే కాపిటలిజానికీ, సరుకుల సామాన్యవుత్పత్తి విధానానికీ వుండే భేదం ఏమిటి? చేతిపనులవారూ, వ్యవసాయదారులు, మున్నగువారు తాము పనిచేసే సాధనాలపై తామే స్వంతహక్కులు కల్గివుంటారు. వీటిసహాయంతో, తమ శ్రమ శక్తిని వినియోగించి వీరు సరుకులను తయారుచేసి అమ్ముతారు. కాని కాపిటలిజంలో ఇట్లాకాదు ఉత్పత్తి సాధనాలైన ఫ్యాక్టరీలు, యంత్రాగారాలు, గనులు మున్నగున వన్నీ కాపిటలిస్టులవి. కష్టపడి శ్రమశక్తిని వెచ్చించి సరుకులను ఉత్పత్తి చేసేది

---

* 'కాపిటల్‌పై' అన్న ఎంగెల్సు గ్రంథంనుండి

కార్మికులు. వీరికి ఉత్పత్తిసాధనాలపై ఎలాంటి హక్కులేదు వీరు కేవలం కూలికి మాత్రం పనిచేస్తూ వుంటారు. ఈ విధంగా రెండింటికీ పూర్తిభేదం వున్నది. అయితే సరుకుల సామాన్య ఉత్పత్తి కాపిటలిజానికి ముందున్న పరిస్థితి. సరుకుల సామాన్య ఉత్పత్తి లేకుండా కాపిటలిస్టు వ్యవస్థ వచ్చివుండేదికాదు; సరుకుల సామాన్యఉత్పత్తి విధానమే పెట్టుబడిదారీ విధానానికి మార్గాన్ని తయారుచేస్తుంది.

"చాలామంది కాపిటలిజానికి పూర్వం ఈలాటి స్వీయోపయోగ వుత్పత్తి విధానం వుండేదన్న విషయాన్ని గ్రహించటంలేదు. ఈ విషయాన్ని గుర్తించ వలసిన అవసరం - రాజకీయావసరం - చాలావున్నది. కాపిటలిజం బాగా వృద్ధి నొందిన దేశాలలో కూడా ఇట్టి పూర్వపద్ధతి - సరుకుల సామాన్యవుత్పత్తి - వుంటూ వున్నది. లక్షల కొలది చిన్నరైతులు, చేతిపనుల వారు వున్నారు. వీరు క్రమంగా కాపిటలిస్టు విధానానికి బలియై పోతున్నారు. పైకి వీరు స్వతంత్రులుగా, స్వేచ్ఛా జీవులుగా కన్పించినా అనేక విధాల కాపిటలిజానికి బానిసలే. కాబట్టి కాపిటలిజంతో పోరాడటంలో ఈ తరగతి ప్రజలు కార్మిక వర్గానికి బాసటగా నిలుస్తారు. ఈ విషయాన్ని గుర్తించక పోవటంవల్ల కార్మికవర్గం, తన పోరాటంలో పెద్ద సహాయాన్ని కోల్పోతున్నదన్నమాట. రైతులు, కార్మికులకు సహాయపడరని, గ్రామిక విప్లవంలో పాల్గొనరని సిద్ధాంతీకరించుట యన్నమాట. ఇట్టి సిద్ధాంతాలే విప్లవ ప్రతికూలమగు ట్రాట్స్కీయిజంకు దారితీసినవి."

అయితే కాపిటలిజానికీ, సరుకుల సామాన్య ఉత్పత్తి విధానానికీ మధ్య పెద్ద హిమాలయ పర్వతం వున్నదనీ, దానికి, దీనికి ఏమీ సంబంధంలేదనీ చెప్పటం కూడా బండసద్ధతేకాని మార్కిస్టు - లెనినిస్టు సిద్ధాంతం కాదు. ప్రతిరోజూ, ప్రతి గంటా, ప్రతి నిమిషమూ సరుకుల సామాన్య ఉత్పత్తి విధానం కాపిటలిజంగా పరిణామం చెందుతూ వున్నది. ఈ విషయాన్ని గుర్తించకపోతే చాలా పెద్ద ప్రమాదం కల్గుతుంది. గ్రామాలలో వ్యవసాయం ఎక్కువగా స్వీయోపయోగం ఉత్పత్తి పద్ధతులపై జరుగుతూవుంది. అంచేత ఇది భారీఎత్తున జరిగే సమిష్టి వ్యవసాయం క్రిందకు మారదనే నిర్ణయానికి దారితీస్తుంది. దీని ప్రకారం సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు పద్ధతులపై వ్యవసాయాన్ని పునర్నిర్మించటం అసాధ్యమని తేలుతుంది. ఇది చాలా తప్పుడు సిద్ధాంతమని పైకి స్పష్టంగానే తెలుస్తున్నది.

## కాపిటలిస్టు వుత్పత్తి పుట్టుక

ఫ్యూడలిజంలోని ఉచ్ఛదశ యగు వ్యవసాయక బానిసత్వం నుండియే కాపిటలిజం పుట్టుకు వచ్చింది. పెట్టుబడి మొదటగా వ్యాపారరీత్యా; వడ్డీవ్యాపార రీత్యా వుండేది. సామాన్య వుత్పత్తి విధానంలో మారకం ఎక్కువౌతున్న కొలదీ వర్తకుల ప్రాముఖ్యత హెచ్చింది. ఫ్యూడల్ ప్రభువుల, వ్యవసాయ బానిసల యజమానుల భోగాలకై అనేక వస్తువులను సరఫరాచేస్తూ వర్తకులు విశేష లాభాలు ఆర్జించారు. ఈ విధంగా రైతాంగాన్ని దోచుకోవటంలో వీరు కూడా భాగస్వాము

లైనారు. దోపిడీలో ఒక భాగం వీరికి ముట్టుతూ వుండేది. వ్యాపారం వృద్ధిఅయిన కొలది వడ్డీ వ్యాపారం కూడా పెరిగింది. రాజులు, ప్రభువులు యుద్ధాలకు, విందులు-విలాసాలకు ఖర్చుపెట్టేవారు. దీనికై ఋణదాతలనుండి అప్పులు చేసేవారు. ఋణదాతలు విపరీతమైన వడ్డీరేట్లు గుంజుతూ, వ్యవసాయాన్ని దోచుకోవటంలో తామూ భాగస్వాములైనారు. ఈ విధంగా వ్యాపారం, వడ్డీవ్యాపారం పద్ధతులు క్రమంగా వేళ్ళూనుకొని ఫ్యూడల్ సమాజం యొక్క పునాదులను కదల్చివేసినవి. వ్యాపారం అభివృద్ధియైన కొలదీ ఫ్యూడల్ ప్రభువులు వ్యవసాయదార్లను దోయడం మరింత వృద్ధియైంది. దీనితో రైతుల పడుములు విరిగిపోయినవి. దివాలా స్థితికి వచ్చారు. ఈ విధంగా వ్యావసాయిక బానిసత్వం శిథిలమైపోతూ, కాపిటలిజానికి దారితీసింది.

మొదట్లో వ్యాపార పెట్టుబడి కేవలం వర్తకంలోనే వుండేది. చేతి వృత్తులవారు, వ్యవసాయదారులు ఉత్పత్తిచేసిన సరుకులను కొని అమ్మటమే అనాటి ప్రధాన రూపం. కాని వ్యాపారం వృద్ధియైనకొలదీ స్థానికంగా దొరికే వస్తువులు చాలకపోయినవి. గృహ పరిశ్రమలు ఈ పెరిగే వ్యాపారానికి తగినన్ని సరకులను ఉత్పత్తి చేయలేకపోవుచున్నవి. అందుచే వ్యాపారం అభివృద్ధియైనకొలదీ ఉత్పత్తి అధికం చేయవలసి వచ్చింది.

కాని ఉత్పత్తి నధికం చేయాలంటే పెట్టుబడి ఉండాలి. చిన్న ఎత్తున జరిగే వస్తూత్పత్తి విధానంలో ఇంత పెద్ద పెట్టుబడి పెట్టలేదు. ఇట్టి పరిస్థితులలోనే చిన్న ఎత్తున జరిగే గృహపరిశ్రమలకు మారుగా భారీఎత్తున జరిగే పెద్ద పరిశ్రమలు ఏర్పడినవి. నూతన రకమైన దోపిడీవిధానం - మానవుని మానవుడు దోచుకొనే పద్ధతులలో ఆఖరి రూపం- అనగా కాపిటలిష్టు దోపిడీ విధానం అమలులోకి వచ్చింది.

చిన్న గృహ పరిశ్రమలనుండి భారీ పరిశ్రమలకు దారితీసిన పద్ధతినిగూర్చి లెనిన్ ఈ విధంగా వివరించాడు :

"ఇదివరకు చిన్న చిన్న మేస్త్రీలు సరుకులను ఉత్పత్తి చేసేవారు. సమాజంలో వీరి సంఖ్య చాలా అధికంగా ఉండేది, తమకు కావలసిన వస్తువులన్నిటినీ తామే స్వయంగా తయారు చేసుకొంటూ కొద్దిగా మిగిలితే పక్క గ్రామాలలోనో, మార్కెట్లలోనో అమ్ముకుంటూ నిశ్చలమైన, కదలికలేని జీవితాన్ని గడిపేవారు. ఫ్యూడల్ ప్రభువుల విలాసాలకు, భోగాలకు కావలసిన వస్తువులను కూడా వీరే తయారుచేస్తూ వుండేవారు. స్వల్పమైన సాధనాలతో పనిచేస్తూ గ్రామాంవెంట పని కొరకై తిరుగుతూ, చేతిపనులవారు జీవిస్తుండేవారు.

"కాని వ్యావసాయిక బానిసత్వం అంతం కావటంతో ప్రజల జీవితంలో బ్రహ్మాండమగు మార్పువచ్చింది. గృహ పరిశ్రమలస్థానే పెద్ద పెద్ద పరిశ్రమాలయాలు వచ్చినవి. ఈ ఫాక్టరీలు చాలా త్వరితంగా వృద్ధిజెందినవి. మేస్త్రీలు తమ వృత్తులను వీగొట్టుకొని, ఈ ఫాక్టరీలలో కూలీలుగా తయారైనారు. వందలు వేల

కొలది కూలీలు ఒకే ప్రదేశంలో పనిచేస్తూ, కుప్పతిప్పలుగా సరుకులను తయారు చేస్తూ వుంటున్నారు. రష్యా అంతటా ఈ సరుకులు అమ్మబడుతూ వుండేవి."*

"గృహ పరిశ్రమల స్థానే భారీపరిశ్రమలు స్థాపించబడుతాయి. ఈ భారీ పరిశ్రమలలో కేవలం కూలి డబ్బులకై కూలీలు పనిచేస్తారు. ఈ పరిశ్రమల అధిపతులైన కాపిటలిస్టులు చాలా పెద్ద పెద్ద ధనరాశులను కల్గివుంటూ విశేషమైన పెట్టుబడిని కల్గివుంటారు. ఎంతో ముడిసరుకును కొంటారు. వీటిని సరుకులుగా ఉత్పత్తిచేసి, అమ్మి విశేషమైన లాభాలు ఆర్జిస్తారు. ఆ లాభాల నన్నిటినీ తమ జేబులలో వేసేసుకొంటారు. అయితే ఈ లాభాలు ఎక్కడనుండి వస్తున్నవి? కూలీలు కష్టపడి పనిచేసి, వివిధ వస్తుసముదాయాన్ని సృష్టించటం మూలాన్నే. ఉత్పత్తి కాపిటలిస్టు పద్ధతులపై జరుగుకొలది గృహపరిశ్రమలు నాశనమౌతవి. వారు నిశ్చలంగా గడిపే గ్రామజీవనం తారుమారు అవుతుంది. ఇంక వారు పొట్ట చేతపట్టుకొని, ఎక్కడైనా కూలిపని దొరుకుతుందేమోనని వూరూరా తిరగటం ప్రారంభిస్తారు. ఏ పెట్టుబడిదారైనా పని చెప్పతాడాయని ఎదురు చూస్తుంటారు. ఈ విధంగా క్రమంగా ఒక పెద్దభాగం గ్రామజీవనం నుండి, వ్యవసాయం నుండి శాశ్వతంగా దూరమైపోతారు. పట్టణాలలో, ఫాక్టరీలు వున్న ప్రాంతాలలో, పారిశ్రామిక కేంద్రాలలో జేరుకుంటారు. తమ శ్రమశక్తిని అమ్ముకొనుట మినహా మరేమి స్వంత ఆస్తిలేని శ్రామికవర్గం, ఈ విధముగా ప్రత్యేకవర్గముగా తయారౌతుంది."•



---

* "సోషల్ డెమాక్రటిక్ పార్టీ ప్రోగ్రాముయొక్క విస్తరణ" అనే వ్యాసం నుండి.

• లెనిన్‌పై వ్యాసంలోనుండి.

# అధ్యాయం 3

# సరుకు ఉత్పత్తి

క్యాపిటలిస్టు ఉత్పత్తి విధానంలో రెండు ముఖ్యలక్షణాలు గోచరిస్తాయి. ఒకటి: కాపిటలిజంలో సరుకుల ఉత్పత్తి వుంటుంది. రెండవది: మానవ శక్తివల్ల తయారుకాబడే వస్తువేగాక, మానవ శ్రమ శక్తియే కొనుక్కొనే, అమ్ముకొనే వస్తువుగా తయారౌతుంది.

అయితే ఒకటి గుర్తుంచుకోవాలి. కాపిటలిజంకు పూర్వం కూడా సరుకుల ఉత్పత్తి వుండేది. కాని కాపిటలిజంలోదే సరకుల ఉత్పత్తి పద్ధతి సర్వసామాన్యమూ విశ్వవ్యాప్తమూ అయింది. కాబట్టి సరుకుల ఉత్పత్తి లేకుండా కాపిటలిజం అనేది వుండలేదు.

అందుచే కాపిటలిజాన్నిగూర్చి అవగాహన చేసుకోవాలంటే ముందు సరుకును గూర్చి, దాని ప్రత్యేక లక్షణాలనుగూర్చి, దానికి సంబంధించిన సూత్రాలను గూర్చి తెలుసుకోవాలి.

కాపిటలిస్టు దేశాలలో ఒక ప్లాను, క్రమం లేకుండా వుత్పత్తి జరిగిపోతూ వుంటుంది. ఫాక్టరీలు, గనులు మున్నగు వుత్పత్తి సాధనాలన్నీ కాపిటలిస్టుల ఆస్థి. వీరు "సరుకులను" మార్కెటులో అమ్ముకుంటానికై తయారు చేస్తారు. కాని ఏయే సరుకులను, ఎంతెంత మొత్తంలో తయారు చేయాలో ఈ కాపిటలిస్టులకు యెవ్వరూ చెప్పరు. అదికాపిటలిస్టుల ఇష్టం. అతడు ఉత్పత్తిని ఎక్కువ చేయవచ్చు, తక్కువ చేయవచ్చు, లేదా ఫ్యాక్టరీని మూసివేసి అసలు ఉత్పత్తినే ఆపివేయవచ్చు. అతడిని అడిగేవారెవ్వరూ వుండరు. అంతేగాదు. అతడు ఏది ఉత్పత్తి చేస్తున్నాడో కూడా అతడి యిష్టమే. ప్రజలకు తిండికావాలా, బట్టలు కావాలా, మందులు కావాలా అన్న విషయం అతడికి అక్కరలేదు. దేనిని ఉత్పత్తిచేస్తే ఎక్కువ లాభం వస్తుందో దానికే పరుగెత్తుతాడు. దేనిలో లాభం రాదనుకుంటాడో దాని ముఖమే చూడడు.

ఈ విధంగా లాభాన్నే ప్రధానంగా పెట్టుకొని కార్మికులను దోచేసి ఉత్పత్తిసాగించే కాపిటలిస్టువిధానం నేడు ప్రపంచమంతా వ్యాపించివుంది. ఇది నేడు

లేని దేశమల్లా ఒక్క సోవియటు యూనియన్ మాత్రమే. సోవియట్ యూనియన్‌లో మాత్రమే ప్రభుత్వాధికారమంతా కార్మికుల చేతులలో వున్నది. ఆర్థిక జీవనమంతా ఒక ప్లాను ప్రకారం జరుగుచున్నది.

కాపిటలిజం క్రింద జరిగే ఉత్పత్తి విధానంలో అరాజకం వ్యాపించి వుంటుంది. సామాజికోత్పత్తి * లో ఒక ప్లాను, క్రమం అనేది వుండవు.

కాపిటలిస్టు అంతకంతకూ ఎక్కువలాభాలను సంపాదించాలని తలుస్తాడు. ఇందుకై ఫ్యాక్టరీలలో కార్మికులను పనిజేయిస్తూ కాసిస్తాడు. కాని మొత్తం సామాజికోత్పత్తిలో అరాజకం వుంటుంది. ఈ అరాజకం అంతకంతకూ అతిశయిస్తూ, సంక్షోభంపై సంక్షోభమును తెస్తూఉంటుంది. ఇట్టి ఆర్థిక సంక్షోభంలో, కుప్ప తిప్పలుగా పడివుండే వస్తువులను కొనేవారు ఉండరు. కార్మికులకు పనిపాటలు దొరకవు వారు మాడి చావవలసిందే" అని లెనిన్ వ్రాశాడు.

## సరుకు అంటే ఏమిటి?

కాపిటలిస్టు సమాజంలో ఉత్పత్తి ఇంత అరాజకంగా జరగటంలో ఉన్న కిటుకు ఏమిటి? అని చూడాలి. కాపిటలిస్టు సమాజంలో సరుకుల ఉత్పత్తి విధానం ఉంటుంది. ఉదాహరణకు ఒక కాపిటలిస్టుకు ఆముదము నూనెమిల్లు ఉందనుకుందాము. అంటే ఆ కాపిటలిస్టు తన మిల్లులో తయారైన ఆముదాన్నంతటినీ తానే తాగుతాడా? అట్లాగే, మరో కాపిటలిస్టుకు గాజుకళ్ళు తయారుచేసే ఫ్యాక్టరీ వుందనుకుందాము. అంతమాత్రాన అతడు వున్నకళ్ళు వూడపీక్కుని గాజుకళ్ళను పెట్టుకుంటాడా? ఇనుము, ఉక్కు తయారుచేసే మిల్లులు వుంటాయి. ఆ ఇనుమును, ఉక్కును అంతటినీ మిల్లు యజమాని ఉపయోగించుకోగలడా? కాబట్టి కాపిటలిస్టు విధానంలో తయారుకాబడే వస్తువులన్నీ మార్కెటులో అమ్ముకుంటానికే వుత్పత్తి కాబడు చున్నవి. స్వంత ఉపయోగానికైగాక అమ్మకానికై మానవ శ్రమశక్తి వల్ల ఉత్పత్తి కాబడ్డ వస్తువునే "సరుకు" అని అంటాం.

ఇంతకు పూర్వం కమ్యూన్ సభ్యులుగాని, కుటుంబ సభ్యులుగాని తమకు కావలసిన వస్తువులను తామే తయారుచేసుకొని తామే అనుభవించేవారు. దీనినే సహవుత్పత్తి అని పిలిచాము. ఇట్టి సామాన్య ఉత్పత్తివిధానం చాలా శతాబ్దాలు వుంది. కాపిటలిజానికి పూర్వంవున్న దోపిడీపద్ధతులైన బానిసత్వం, ఫ్యూడలిజాలతో బాటు సామాన్య ఉత్పత్తి విధానం కూడా ఉండేది. కాని కాపిటలిజంలో అట్లుకాదు. సరుకుల ఉత్పత్తివిధానాల అభివృద్ధితోనే కాపిటలిజం ప్రభవించింది.

---

* ఎవరికివారేగాని, కుటుంబం అంతా కలిసిగాని ఉత్పత్తి చేసేదిగాక వేలకొలది కార్మికులు కలసి ఫ్యాక్టరీలలో పనిచేస్తూ, ఒకరికొకరు ఆధారభూతంగావుంటూ ఉత్పత్తిని గావించటాన్ని సామాజిక ఉత్పత్తి అంటాము. (అనువాదకుడు)

"కాపిటలిస్టు ఉత్పత్తివిధానం ఉన్న సమాజంలో ఒక్కొక్క సరుకేకలిసి బ్రహ్మాండమయినసరుకుల సముదాయం అవుతుంది. అదే ఆ సముదాయం యొక్క సంపద అంటాము" అన్న వాక్యంతో మార్క్సు తన "కాపిటల్" అన్న గ్రంధాన్ని ప్రారంభించాడు. ఈ గ్రంధంతో కాపిటలిస్టు సమాజాన్ని శాసించే అర్థిక సూత్రాలేమిటో మార్క్సు వివరించాడు. అందుచేత కాపిటలిజానికి ప్రాణమైన సరుకులను పరిశీలించటంలో "కాపిటల్" ను ప్రారంభించాడు.

## సరుకుయొక్క రెండు గుణాలు

మానవుడు తన శ్రమశక్తిని వెచ్చించి ఉత్పత్తిగావించే ప్రతి వస్తువు అతని ఏదో ఒక వాంఛను తీర్చాలి. లేదా అతని శ్రమ వృధాఅయినట్లే. ఈ విధంగా శ్రమశక్తి జనితమగు వస్తువుకు వుండే ఒక గుణమును "ఉపయోగపు విలువ" అని అంటాము. గడియారంవుంది. దాని ప్రయోజనము, అది మనకు కాలమును తెలియజేయటమే. ఇది గడియారము ఉపయోగపువిలువ. అయితే మానవ శ్రమశక్తి ఖర్చు కాకుండా తయారైన వస్తువులకుకూడా ఉపయోగపు విలువ వుంటుంది. ఊటనీరు, అడవిపండు మున్నగునవి ఎవ్వరూ కష్టపడకుండానే వచ్చినవి. వాటికీ ఉపయోగపు విలువ వున్నది. కాబట్టి సామాన్య ఉత్పత్తి విధానంలోనైనా సరే, సరుకు ఉత్పత్తి విధానంలోనైనాసరే వస్తువులకు వుపయోగపు విలువ వుంటుంది. తన తిండికై రైతు పండించిన పంటకు వుపయోగపు విలువ వుంటుంది.

కాని కాపిటలిస్టు విధానంలో రైతు కూడా అమ్ముకుంటానికై పంటలను పండిస్తాడు. అప్పుడు ధాన్యం సరుకుగా మారుతుంది. ఇట్టి ధాన్యానికి కూడా ఉపయోగపు విలువ వుంటుంది. ఎందుచేతననగా అది మానవునికి ఆహారంగా ఉపయోగపడుతుంది. ఖర్మం చాలక ధాన్యం పురుగుపట్టిపోతుంది. అపుడాధాన్యాన్ని ఎవరూ కొనరు. అట్టి పుచ్చిపోయిన ధాన్యానికి ఉపయోగపు విలువ వుండదు.

ఈ అమ్ముకునే సమయంలో ధాన్యానికి మరోగుణం కల్గుతుంది. ధాన్యం ఒక సరుకు అయింది. దీనిని మరేసరుకుకైనా మార్చుకోవచ్చును. అంటే ఒకవస్తువు సరకుగా మారిన పిమ్మట అది అనేకములగు ఇతర సరుకులతో మార్చుకొన బడుటకు ఒక ప్రత్యేక గుణాన్ని కల్గివుంటుందన్నమాట. సరుకుకు కొత్తగా కల్గే గుణానికి చాలా ప్రాధాన్యతవుంది.

"ఒక సరుకుకు రెండు గుణాలు ఉన్నవి. ఒకటి: అది మానవుని వాంఛను తీరుస్తుంది. రెండవది: అది మరొక సరుకుతో మార్చబడుతుంది. వస్తువులయొక్క ప్రయోజనంవల్ల దాని ఉపయోగపు విలువ ఏర్పడుతుంది; ఇతర సరుకులకు బదులుగా మార్చుకొనటవల్ల "మారకపు విలువ" ఏర్పడుతోంది. మారకపు విలువ (సామాన్యంగా విలువ అంటాము.) అంటే ఉపయోగపు విలువను కల్గివుండే ఒకరకం వస్తువులు, ఉపయోగపు విలువను కల్గివుండే మరోరకం వస్తువులతో మారేనిష్పత్తి.

ఒకరకం వస్తువులు ఎంత ప్రమాణంకల్గిన మరోరకం వస్తువులలో మారునో తెల్పుట వల్లనే మారకపు విలువ ఏర్పడుతుంది. ప్రతినిత్యం మనం ఒక విషయాన్ని చూస్తునే యున్నాము. లక్షలకొలదివస్తువుల వుంటాయి. ఒకదానితో ఇంకొకదానికి సంబంధమూ, సాదృశ్యమేలేదు. అయినా ఒ దానితో ఇంకొకటి మారుతూనేవుంటాయి. ఈ విధంగా సరుకుకు మారకపు విలువ యేర్పడుతోంది" అని లెనిన్ వ్రాశాడు.

ఈ విధంగా సరుకుకు ఉపయోగపు విలువ, మారకపు విలువ లేదా విలువ అనే రెండు గుణాలు ఉన్నవి. అయితే ఈ రెండింటిమధ్య వైరుధ్యం ఉన్నది. సరుకును ఉత్పత్తిచేసేవానికి ఆ సరుకు ఉపయోగపు విలువలేదు. ఎందు చేతననగా అతడు దానిని ఉపయోగించడు. అయితే ఇతరులకు దాని ఉపయోగపు విలువ ఉంటుంది. అదేవిధంగా సరుకు కొనేవానికి సరుకుయొక్క ఉపయోగపు విలువయే ఉంటుంది. దాని విలువ అతనికుండదు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఒకడు చెప్పులను తయారుచేసి మరొకనికి అమ్మాడు. చెప్పులను కుట్టినవాడు వాటిని అమ్ముకుంటున్నాడుగాని స్వయంగా తొడుక్కొనడంలేదు. కాబట్టి వానికి సంబంధించి నంతవరకూ ఆ సరుకుకు ఉపయోగపు విలువలేదు. విలువ మాత్రం, అనగా 4 సేర్ల బియ్యం తెస్తున్నది. కాబట్టి మారకపు విలువ ఉన్నది. అనగా ఒక చెప్పులు జత 4 సేర్ల బియ్యంతో మారుతున్నది. కాబట్టి చెప్పులు కుట్టినవానికి చెప్పులలో విలువ మాత్రమే కనిపిస్తున్నది. అయితే చెప్పులు కొనుక్కొని, 4 సేర్ల బియ్యం యిచ్చిన వానిమండి చూద్దాం. ఈతడికి తొడుక్కొంటానికి చెప్పులు కావాలి. అంటే చెప్పుల ఉపయోగం ఈతడికి ఉంది కాబట్టి చెప్పులలోని ఉపయోగపు విలువయే ఈతడికి వస్తోంది. చెప్పుల నీతడు అమ్ముకోబోవటంలేదు. ఏ వస్తువు కొరకూ ఈతడు చెప్పులను మార్చుకొనదలచుట లేదు. కాబట్టి చెప్పుల విలువ ఈతనికిలేదు. కాబట్టి సరుకును అమ్మేవానికి ఉపయోగపు విలువ; కొనేవానికి విలువ కన్పించవు.

సరుకులు ఉత్పత్తి కాగానే ఉపయోగించబడవు. అవి అమ్మబడతాయి. ఈ విధంగా సరుకు ద్వారా సమాజంలో కొనేవాడు, అమ్మేవాడు కలుస్తున్నారు. ఈ విధంగా సరుకుద్వారా సామాజిక సంబంధాలు ఏర్పడుచున్నవి. ఉత్పత్తి చేసే వానికి సమాజంలో ఇతరులతో సరుకు, సంబంధాలను ఏర్పరుస్తున్నవి. అయితే ఈ సంబంధాలు సూటిగా ఏర్పడటంలేదు: సమాజంవచ్చి ప్రతి ఒక్కనితోను అతడు ఫలానా వస్తువును ఫలానా మొత్తమునకు చేయాలని చెప్పదు. కాబట్టి కాపిటలిస్టు సమాజంలో సరుకుల ఉత్పత్తి ఒక క్రమం ప్రకారం జరుగదు.

## శ్రమశక్తివల్లనే విలువ ఏర్పడుచున్నది

అయితే సరుకు యొక్క విలువ దేనిమీద ఆధారపడి ఉన్నది? దాని ప్రమాణం ఎట్లా తెలుసుకోగలం? కొన్ని సరుకులు పెద్దవి: కొన్ని చిన్నవి. కొన్ని సరుకులు ప్రియం, కొన్ని చవుక. ఈ విధంగా ఉపయోగపు విలువను కలిగివుండే

వస్తువులు అనగా ఉపయోగకర వస్తువులు వాటి స్వరూపాలలో, మొత్తాలలో ప్రమాణాలలో వివిధములుగా ఉంటాయి. మాంసపు ముక్కకూ, పట్టు పంచెలకూ సంబంధం ఏమిటి? అయినా ఒకదానితో ఇంకొకటి మార్పచ్చును. కాబట్టి విలువఅంటే ఏమిటి? సరుకుల మారకంలో ఉపయోగపు విలువ గణించదు. అయితే మరింకేమిటి? మార్క్సు చెప్పినట్లు:

"సరుకులకున్న గుణాలలో వాటి ఉపయోగపు విలువను మినహాయిస్తే మరొక్కటే మిగులుతుంది. సరుకులన్నీ మానవ శ్రమఫలితాలే. ఈ గుణమే ప్రతి వస్తువులోనూ ఉన్నది."

ఒకసరుకుయొక్క విలువ, దాని నుత్పత్తి చేయటంలో ఖర్చుపడిన మానవ శ్రమశక్తి మొత్తంవల్ల నిర్ణయింపబడుచున్నది.

వస్తువులను ఒకదానికి బదులుగా ఇంకొకటిఇచ్చి పుచ్చుకునే మారకపు పద్ధతి ఎక్కువగా అమలులోనికి రానంతకాలం, వున్నకొద్ది మారకం ఏదోయాదృచ్ఛికంగా జరిగేది. పూర్వకాలంలో ఒక వేటగాడు మాంసాన్ని తెచ్చి యింకొకనితో ధాన్యానికి మార్చుకొన్నాడంటే, ఈ మారకపు నిష్పత్తి ఒక నియమం వుండేదికాదు. ఏదో కొంత యివ్వటం, కొంత పుచ్చుకోవడమే ఉండేది.

కాని త్వరలో పరిస్థితులు మారినవి. సామాన్య ఉత్పత్తి పద్ధతి పోయింది. వస్తువుల మారకం ఎక్కువైంది. ఇట్టిపరిస్థితులలో ఈ మారకపు నిష్పత్తి క్రమంగా మార్చుకొనే వస్తువులను తయారు చేయుటకు ఖర్చుఅయిన శ్రమశక్తికి దగ్గరగా వచ్చింది. ఉదాహరణకు, స్వీయోపయోగ ఉత్పత్తి పద్ధతివుండే కాలంలో ఒకరైతు కొంత ధాన్యాన్నిఇచ్చి ఒక గొడ్డలిని కొన్నాడనుకొందాము. అయితే ఎంత ధాన్యాన్ని ఇచ్చాడు? గొడ్డలిని తయారు చేయటానికి ఎంత శ్రమశక్తి అవసరమైనదో, అంత మొత్తపు శ్రమశక్తితో తయారైన ధాన్యాన్ని యిచ్చాడు. కాపిటలిజానికి పూర్వం ఉన్న స్వీయోపయోగ ఉత్పత్తి విధానములో వస్తువుల మారకం ఈక్రింది విధముగా వుండేని అని ఎంగెల్సు తెలియ జేశాడు.

"తాను కొనుక్కొనే వస్తువులను తయారుచేయుట కెంత శ్రమకాలం పడుతుందో మధ్య కాలాలనాటి రైతులకు బాగా తెలుసును. అతని కళ్ళ ఎదుటనే కమ్మరి, వడ్రంగి, కుమ్మరి వగైరాలు పనిచేస్తున్నారు. దర్జీ, ముచ్చీ మున్నగువారు కూడా ఇంతే. ఇంతెందుకు, నా చిన్నతనంలోనే రైన్ ప్రాంతంలో * దర్జీ, ముచ్చీ ఇంటింటికీ తిరిగి బట్టలు, చెప్పులు కుడుతుండేవారు. వీరు కాయకష్టం చేసేవారు. రైతూ కాయకష్టం చేసేవారు. కాబట్టి వీరు ఇచ్చిపుచ్చుకునే వస్తువులు వీరి శ్రమ ఫలితాలే. వీటిలో సమానంగా ఉన్నది మానవుని శ్రమ: శ్రమ మినహా మరేదీ

---

* ఎంగెల్సు జర్మన్ దేశస్థుడు. రైన్‌నదీ ప్రాంతాన్ని గూర్చి ఎంగెల్సు తెలియ జేస్తున్నాడు. (అనువాదకుడు)

సమానమైన వస్తువు వీటిలోలేదు. తమ పనిముట్లకైతేనేమి, ముడిసరకులకైతే నేమి, వాటిని అమ్ముకునే తయారు సరుకులుగా నైతేనేమి తయారుచేయుటకు శ్రమశక్తినే ఖర్చుచేశారు. కాబట్టి ఒక సరకు వింకొకరు మార్చుకోవటంలో, ఆ సరుకులలో ఉన్న శ్రమశక్తి యొక్క ప్రమాణాన్ని బట్టిగాక, ఇంకెట్లు? ఈ సరుకు లలో వున్న శ్రమశక్తి యొక్క ప్రమాణాన్ని బట్టి గాక మరే విధంగానూ వస్తువు యొక్క విలువ ఎంతో, దాని కాహతు ఎంతో తెలిసికోలేము. అసలు ఊహించనే లేము. 10 గంటలు శ్రమపడి తయారుచేసిన ధాన్యాన్ని తీసుకుపోయి 1 గంటలో తయారయి చెప్పులతో మార్చుకొనేటంత బుద్ధిహీనుడా రైతు? కాదు. 10 గంట లలో తయారైన చెప్పులతో మార్చేవాడు. లేదా ఒక్క చెప్పుంజతే కావలసివస్తే 1 గంట శ్రమవల్ల తయారైన ధాన్యాన్ని ఇచ్చేవాడు. ఈ విధంగా వ్యవసాయంలో సహజ ఉత్పత్తి వున్నంతకాలం క్రమముగా వస్తువులు శ్రమశక్తి లెక్కప్రకారమే మారుతూ ఉండటం జరుగుతూవచ్చింది. మరొకవిధపు మారకమే సాధ్యం అయ్యేది కాదు........

ఇదేవిధంగా రైతు పండించే పంటలను చేతిపనుల విషణులు తయారు చేసే వస్తువులతో మార్చుకొనేవారు. చేతిపనుల విషణుడు పట్టణాలలో నివస్తున్నా తనూ కొంతవరకు ఒకరైతే. తనకూ ఇల్లూ, దొడ్డీవుంది. దొడ్లో కూరగాయలు, పళ్ళు, ఫలాలు పండిస్తూ తింటాడు. లేదా, ఇంకా తనకూ గోచిపాతంత భూమి వున్నది. రెండు ఆవులు, నాలుగు పందులు వగైరాలు వున్నవి. కాబట్టి వ్యవసా యంలో సన్నిహితంగావుండే చేతిపనుల విషణులుకూడా వ్యవసాయోత్పత్తి వస్తు వులకయ్యే శ్రమశక్తి ప్రమాణం ఎరుగుదురు. అట్లే రైతులు ఈ చేతిపనులవారి సరుకుల విలువ ఎరుగుదురు. ఇందువల్ల సరుకులను శ్రమశక్తి కాలం ప్రమాణాన్ని బట్టి మార్చుకునేవారు."*

సరుకులు వాటిలో అంతర్భూతమై వుండే శ్రమశక్తి యొక్క ప్రమా ణాన్ని అనుసరించి మార్చబడుతూ ఉంటాయని అనేక విషయాలవల్ల తెలుసుకో వచ్చును. ఒకప్పుడు బాగా ప్రియంగాఉన్న వస్తువుల ధరలు తర్వాత చౌక కావచ్చును ఎందుచేత? వాటిని ఉత్పత్తి చేస్తానికి కావలసిన శ్రమశక్తి తక్కువగానే ఖర్చు అవుతోందన్నమాట. ఉదాహరణకు కొన్ని దశాబ్దాల పూర్వం అల్యూమినియం వెండికి 8, 10 రెట్లు ఖరీదు ఉండేది. కిలోగ్రాము 1 కి 225 డాలర్లు ఉండేది. కాని ఎలక్ట్రికల్ టెక్నిక్ వృద్ధియైన తర్వాత అల్యూమినియం సులభంగా తయారు చేయుటం సాధ్యమైంది. అందువల్ల దాని ధర కిలోగ్రాము 1 కి 27 సెంట్లు*. అనగా డాలరులో సుమారు నాలుగవ వంతును పడిపోయింది. అంటే పూర్వం ధరకు 1000

---

* ఎంగెల్సు "కాపిటల్ పై" అన్న గ్రంథంనుండి.

* 100 సెంట్లు 1 డాలరు, డాలరు అనగా సుమారు 4 రూపాయలు డాలరు అమెరికన్ నాణెము. (అనువాదకుడు)

రేట్లు తగ్గిపోయిందన్నమాట. ఎందువల్ల ఇంత చౌక అయిందో కారణం స్పష్టమే గదా: ఇప్పుడు దానిని తక్కువ శ్రమతో, తక్కువ కాలంలో తయారు చేయవచ్చు గనుక.

అందుచే ఒక సరుకుయొక్క విలువ, ఆ "సరుకు తయారు చేయటంలో వెచ్చింపబడిన శ్రమపై ఆధారపడి వుంటుందని" చూశాము. ఒకే మొత్తపు శ్రమతో ఎక్కువ వస్తువులను తయారు చేశాము అనుకోండి. అనగా ఇదివరకు గంటకు 1 చెప్పులజత కట్టితే ఇప్పుడు 2 జతలు కుట్టాము అనుకోండి. ఇప్పుడు ఉత్పత్తి సామర్ధ్యము పెరిగింది అంటాము లేదా గంటకు ఒక చెప్పునే కుట్టగలిగా మనుకుంటే శక్తి సామర్ధ్యం తగ్గింది అంటాము. దీనివల్ల ఉత్పత్తి సామర్ధ్యం హెచ్చితే, సరుకును తయారుచేయుటకు వెచ్చించవలసిన శ్రమ తగ్గుతుంది అని తెలుసుకోవచ్చును. ఇందువల్ల సరుకు విలువ తగ్గుతుంది. అందుచే అది చౌక అవుతుంది. ఇదేవిధంగా ఉత్పత్తి సామర్ధ్యం తగ్గుతుంది. అంటే సరుకును తయారుచేయుటకు ఎక్కువ శ్రమ కావాలి. అంటే సరుకువిలువ హెచ్చుతుంది. అందువల్ల అది ప్రియం అవుతుంది. దీనినే మార్క్స్ "శ్రమయొక్క ఉత్పత్తి సామర్ధ్యం పెరుగుతరుగులకు తల్లక్రిందులుగా సరుకుయొక్క విలువ మారుతూ వుంటుంది" • అని చెప్పాడు.

సరుకును తయారు చేస్తానికి వెచ్చింపబడిన శ్రమవల్లనే సరుకు విలువ నిర్ణయింపబడుచున్నది. ఇందువల్ల సరుకు విలువ అంటే ఆ సరుకులో ఇమిడివున్న (అంతర్గతమైవున్న) శ్రమకాలం యొక్క మొత్తం అన్నమాట. కాని ఈ విలువ ఎన్నడు బయటపడుతుంది? ఒక సరుకు మరొక సరుకుతో మార్చబడినప్పుడే. ఉదాహరణకు ఒక టన్ను ఇనుమును తయారుచేయుటకు ఎంత శ్రమకాలం పట్టిందో ఒక కిలోగ్రాం వెండిని తయారు చేయుటకూ అంతే శ్రమకాలం పట్టిందని అనుకుందాము. అప్పుడు 1 టన్ను ఇనుము, 1 కిలోగ్రాం వెండి విలువతో సమానం అంటాము. ఈవిధంగా ఒక సరుకు విలువతో మరొకసరుకు విలువ పోల్చబడినప్పుడే మారకపు విలువ అంటున్నాము. ఈవిధంగా మారకపు విలువగానే సరుకు విలువ బహిర్గతమౌతుంది. ఒకడు 1 చెప్పులజత తయారుచేశాడు. దాన్ని తనే తొడుక్కొని తిరిగితే దాని విలువ అతనికి తెలియదు ఉపయోగపువిలువ మినహా తయారుచేశాడు. తొడుక్కొన్నాడు. చింపేశాడు. అంతేకాని దానితో బియ్యం కొనుక్కొంటానికి వెళ్ళినప్పుడే దానివిలువ ఎంతో తెలుస్తుంది. 4 పేర్ల బియ్యంతో 1 చెప్పులజత సమానం అనగా చెప్పులజత విలువ 4 పేర్ల బియ్యం అని తేలుతుంది. కాబట్టి ఒక వస్తువు యొక్క విలువ, అంటే దానిని తయారు చేయుటకు పట్టిన శ్రమ కాలం అనీ, ఈ విలువ వస్తువుల మారకంలోనే బహిర్గతమౌతుందని తెలుస్తుంది.

క్రమంగా మారకం హెచ్చింది. డబ్బు రూపంలోనే మారకం ప్రారంభమైంది. ప్రతి వస్తువూ ఏదో కొంతమొత్తం డబ్బుకు మారుతున్నది. అంటే సరుకు

---

• "కాపిటల్" నుండి

యొక్క విలువ డబ్బు రూపంలో బైటపడుచున్నది. ఈ విధంగా సరుకు యొక్క మారకపు విలువ సరుకు ఖరీదుగా అగుచున్నది. "సరుకు యొక్క విలువను డబ్బు రూపంలో లెక్కగట్టుటనే 'ఖరీదు'"అని అంటాము.

## సర్వసామాన్యపు నిర్దిష్ట శ్రమ

సరుకులలో అంతర్భూతమైవుండే పరస్పర విరుద్ధ శక్తులను అర్థం చేసుకోవాలంటే, ఈ సరుకుల వుత్పత్తికి కారణమైన శ్రమయొక్క ప్రత్యేక లక్షణాలను గమనించాలి.

సరుకుల మారకంలో అనేకరకాల శ్రమ ఒకదానితో ఒకటి పోల్చబడుతూ వుంది అన్నమాట. చెప్పులు కుట్టేవాని శ్రమ ధాన్యం పండించేవాని శ్రమతో పోల్చబడుతున్నదన్నమాట. గుండీలు తయారుచేసే వాని శ్రమ చొక్కాలు కుట్టేవాని శ్రమతో పోల్చబడుచున్నది. కాని ఒకదానికి ఇంకొకదానికి పోలికేలేదు. ఒకటి చెప్పులు, రెండోది ధాన్యం. ఒకటి గుండీలు, రెండోదిచొక్కాలు. కాని యీచెప్పులు, ధాన్యం, గుండీలు, చొక్కాలు, అన్నింటిలోను సమానంగావున్నది మానవుని శ్రమ. అందుచే అన్ని సరుకులకు సమానగుణం మానవుని శ్రమ. దీనినే "మానవుని సర్వసామాన్యపు శ్రమ, (abstract human labour) అంటాము. ఇది రూపొందిన శ్రమ (concrete labour) కన్న భిన్నం. రూపొందిన శ్రమఅంటే ఒకరూపాన్ని, అనగా చెప్పులుకుట్టే శ్రమగానో, ధాన్యాన్ని పండించే శ్రమగానో వున్న శ్రమ.

"ఒక సమాజంయొక్క సంపద అంటే ఆ సమాజానికి వున్నసరుకుల సముదాయపు మొత్తం. ఈ సరుకులలో ఒక్కొక్కటి మానవ శ్రమశక్తి వల్లనే తయారౌతున్నది. ఈ విధంగా సమాజంయొక్క సంపద అంటే ఆ సమాజంలోని మానవులందరూచేసే కాయకష్టం - శ్రమ. సంపద అంతటా నిండియున్నది యీ మానవశ్రమే. లక్షల లక్షల మారకాలు దీనినే స్పష్టం జేస్తున్నవి. లేకపోతే, ఒకదానితో ఒకటి ఎట్లా మారగలవు? ఈ విధంగా మొత్తంగా, సమాజంయొక్క సర్వసామాన్యపు శ్రమను వేరు వేరుగా విభాగించిచూస్తే అనేక రకాల శ్రమగా కన్పడుతుంది."

రూంపొదిన నిర్దిష్ట శ్రమవల్లనే ఉపయోగపు విలువ, వస్తువులు ఏర్పడుచున్నవి. అనగా ఆ శ్రమవెనక ఒకవుద్దేశంవుంది. ఆ వుద్దేశంలో శ్రమజేసి, ఒక ఉపయోగం గల్గిన వస్తువును తయారుచేస్తున్నాము. ఈ విధంగా ముచ్చివానిచే రూపొందించిన శ్రమవల్ల చెప్పులు తయారవుతున్నవి. దర్జీవాడు రూపొందించిన శ్రమవల్ల చొక్కాలు వస్తున్నవి. వాస్తుశిల్పి రూపొందించిన శ్రమవల్ల మేడలు, మిద్దెలు కట్టబడుచున్నవి. ఈ ఒక్కొక్క సరుకుయొక్క విలువ కేవలం సర్వసామాన్య శ్రమనే, అందరికీ సామాన్యమైన శ్రమ ఖర్చు అయిందనే విషయాన్నే తెలియ జేస్తుంది.

"ఫిజియాలజీ" (శారీరక శాస్త్రం)ని బట్టి చూస్తే, శ్రమ అంతా మానవుని శ్రమశక్తిని ఖర్చుపెట్టటమే. అనేక వస్తువులు తయారౌతున్నా, వాటి అన్నిటిలోనూ మానవశ్రమ అనేది యిమిడివున్నది. అందువల్లనే అవి ఒకదానితో ఒకటి మార్చగల్గుచున్నవి. ఇందువల్ల సరుకుకు సర్వసాధారణమయిన శ్రమ విలువ (మారకపు విలువ) ఏర్పడుచున్నది. అయితే మానవుని శ్రమ అంతా ఒకే రూపంలో బైటపడటంలేదు. చెప్పుల రూపంలో కొంత, ధాన్యరూపంగా కొంత, చొక్కాల రూపంగా కొంత బైటపడుతోంది. అంటే మానవ శ్రమ రూపురేఖలు కల్గి ఒక ఉపయోగకరమైన వస్తువులను సృష్టిస్తోందన్నమాట. ఈ విధంగా ఉపయోగకరమైన రూపొందిన శ్రమగా బైటపడుచున్నది. అట్లు బైటపడుటలో ఉపయోగపు విలువలను అంటే సరుకులకు ప్రత్యేక ఉపయోగాలను కల్గిస్తుంది" *

ఈ విధంగా సరుకుల వుత్పత్తి విధానంలో మానవుని శ్రమ రెండు రకాలుగా – రూపొందిందిగానూ, సర్వ సామాన్యమైనదిగాను – కనిపిస్తుంది. ఒక సరుకుకు వుపయోగపు విలువను కల్గించటం వల్ల అది ఒక రూపమును పొందుచున్నది: దీనిని రూపొందిన శ్రమ అంటాము. సరుకుకు విలువను, అనగా మారకమునకు వీలుగా వుండునట్టి గుణమును కల్గించుటవల్ల, సర్వసామాన్యపు శ్రమ అంటాము. ఉదాహరణకు ప్రతి వుత్పత్తి దారుడూ చెప్పులు, చొక్కాలు, గ్లాసులు, ఎలెక్ట్రిక్ బల్బులు మున్నగువాటిని సృష్టిస్తాడు. ఇది ముచ్చి, దర్జీ మున్నగువారిచే రూపొందిన శ్రమ. ఇదే సమయంలో, ఈ చెప్పులు, చొక్కాలు వగైరాలు ఒకదానితో ఒకటి మారకమునకు వీలుగా వుంటున్నవి. అంటే వాటి యన్నిటిలోనూ సమానంగా మానవ శ్రమ ఇమిడివుంది. ఇందువల్ల వాటికి విలువ ఏర్పడుచున్నది. ఈ విధంగా దర్జీ, ముచ్చి మున్నగువారి శ్రమ సర్వసామాన్యపు శ్రమరూపాన్ని పొందుచున్నది.

ఈ విధంగా ప్రతి సరుకుకు రెండు గుణాలు వుంటాయి. ఒకటి ఉపయోగపు విలువ, రెండవది విలువ. రూపొందిన శ్రమ ఫలితంగా ఉపయోగపు విలువ అనగా ఉపయోగకరమగు వస్తువులు సృష్టింపబడుచున్నవి. మానవులందరికీ సామాన్యంగావున్న శ్రమ ఫలితంగా వస్తువులు ఒకదానితో ఒకటి సరితూగుటకు, మారుటకు విలువను పొందుచున్నవి. ఈ విధంగా శ్రమా రెండు రూపాలు కల్గి వుంటున్నది; సరుకూ రెండు గుణాలను కల్గివుంటున్నది.

ఈ విధంగా సర్వసామాన్య శ్రమ అనీ, రూపొందిన శ్రమ అనీ మానవ శ్రమ విభజింపబడటం సరుకుల వుత్పత్తి విధానంలోనే వుంటుంది. ఇట్టి సరుకుల ఉత్పత్తి విధానంలో ఒక్కొక్క వ్యక్తియొక్క పనిమొత్తం సమాజం అంతా చేసే శ్రమలో భాగం అవుతుంది. అంతేకాదు. అది ప్రత్యేక వ్యక్తియొక్క పని కూడా అనిపించుకుంటుంది. మార్క్సు 'విలువ, ఖరీదు, లాభం' అన్న పుస్తకంలో ఈ విధంగా వ్రాశాడు :

* "కాపిటల్" నుండి.

"తన స్వంత ఉపయోగానికే ఒకడు ఒకదానిని సృష్టిస్తే అది 'వస్తువు' అనిపించుకుంటుందికాని 'సరుకు' అనిపించుకోనదు. తన మట్టుకు తనకు కావలసి నవి తానే సృష్టించుకొంటున్నాడు కాబట్టి ఈ వ్యక్తికి సమాజం మొత్తంతో పనిలేదు. కాని ఒకసరుకును (అమ్ముకునేవస్తువును) తయారుచేశాడంటే ఈతడు సమాజంయొక్క వాంఛను తీర్చే వస్తువునే సృష్టించాలి. లేవా, దీనినెవ్వరూ కొనరు. ఈతడి శ్రమ వృధా అవుతుంది. ఇంతేగాదు. ఈతడి శ్రమ సమాజం అంతా చేసే శ్రమలో భాగ స్వామి కావాలి. సమాజంలో ఉండే శ్రమ విభజనకు లోబడి పనిచేయాలి. అంటే చొక్కాలుకుట్టే దర్జీ, బట్టకై నేతగానితోనూ, వడికేవాడితోనూ, మిషనుకై మిల్లు కూలితోనూ, బ్రాడిగేటింగ్ అయిలుకై మానెగనుల కార్మికులతోనూ కలిసి పని చేయాలిగాని, అన్నీ నేనే సృష్టించుకుంటాను అంటే పనిసాగదు. ఈ విధంగా అతడి శ్రమ సమాజంలో వున్న శ్రమ విభజన ప్రకారం కాకుండా జరగదు. కాని ఇదే సమయంలో ఆ శ్రమ విభజన ప్రకారం జరిగే ఇతర పనులను ఈతడి వ్యక్తి గత శ్రమ పరిపూర్ణం చేస్తుంది. అంటే నేతగాడు, వడికేవాడు, మిల్లు కూలీ మున్నగువారి శ్రమలేకుండా దర్జీవాని శ్రమ అసాధ్యం. కాని అదే సమయంలో మిల్లుకూలీ, నేతగాడు, వడికేవాడు, వీరందరి శ్రమ నంతటినీ పరిపూర్ణంచేసే ఒక చొక్కాను తయారుచేస్తుంది దర్జీవాని శ్రమ.

ఈ విధంగా కాపిటలిస్టు సమాజంలో ప్రతి శ్రామికునియొక్క శ్రమ రెండుగుణాలనుకల్గి ఉంటుంది. రెండవ శ్రమ విభజన లేకుండా ఇది వుండజాలదు; ఆ రెండవదానిని పరిపూర్ణం జేస్తానికై ఇది వుంటుంది."

సరుకుల వుత్పత్తి విధానంలో ప్రతిఒక్క కార్మికునిశ్రమ మొత్తం సామా జిక శ్రమలో ఒక అణువు. అది ప్రత్యేకంగానూ వ్యక్తిగతంగానూ ఉంటుంది. అదేసమయంలో సమాజపు మొత్తపుశ్రమలో భాగమైవుంటుంది. దర్జీవాని శ్రమ చొక్కారూపం పొందుతుంది. కాని దర్జీవాడు, నేతగాడు, వడికేవాడు మున్నగు వారితో కలిసిపనిజేస్తాడు. కాబట్టి చొక్కాకై చేసిన శ్రమ సమాజపు మొత్తం శ్రమలో భాగమౌతోంది. ఈ విధంగా చొక్కాను తయారు చేయటంవల్ల శ్రమ రూపు రేఖలుకల్గి, రూపొందిన శ్రమ అవుతున్నది. కాని సమాజంలో అనేకుల శ్రమతో కలిసిపోయి కేవలం మానవుని శ్రమగా మాత్రమే కన్పించటంవల్ల సర్వ సామాన్యపు శ్రమ అనిపించుకుంటుంది. ఈ విధంగా ప్రత్యేక వుత్పత్తిదారుల స్వంతశ్రమ సమాజపు మొత్తం శ్రమలో కలిసిపోవటం అనే వైరుధ్యం సరుకుల వుత్పత్తి విధానంలోనే కన్పిస్తుంది. అంతకు పూర్వం సామాన్యపు వుత్పత్తి విధానంలో ఇది ఉండేదికాదు. అనాడు ఎవరికివారే తమకు కావలసినవన్నీ వుత్పత్తి గావించుకొని, తామే అనుభవించేవారు. ఇందుకై సమాజం అంతటియొక్క తోడ్పాటు వుండనవసరంలేదు. కాని సోషలిస్టు సమాజాన్ని తీసుకుందాము. ఇక్కడ మరొక

విపరీతం కల్పిస్తుంది. వ్యక్తియొక్క శ్రమ సమాజపు శ్రమతో మరింత ఎక్కువగా కలిసిపోతుంది. సమిష్టి శ్రమద్వారానే వుత్పత్తి జరుగుతూవుంటుంది. కాని ఇక్కడ కూడా సరుకుల ఉత్పత్తి విధానంలోవుండే వైరుధ్యం కల్పించదు. ప్రతి శ్రామికుడు ఒక ప్లాను ప్రకారం సమాజక్షేమంకై ఇతరులతోకలిసి పనిజేస్తాడు. శ్రమ ఫలితంగా వచ్చిన వుత్పత్తి వస్తువులను, వ్యక్తిగతంగా ఒక్కొక్క శ్రామికుడుగాక సమాజం మొత్తంగా అనుభవిస్తుంది. ఈ విధంగా సామాజిక శ్రమ ప్రధానమౌతుంది: ఇట్టి పరిస్థితులలో శ్రమ సామాజికం కావటం, ఫలితం వ్యక్తిగతం కావటం, అనే వైరుధ్యం వుండదు.

## సామాజికంగా అవుసరమగు శ్రమ

ఇంతవరకూ ఒక వస్తువును తయారుచేయుటకు వెచ్చించబడిన శ్రమ మొత్తమునుబట్టి ఒక సరుకుయొక్క విలువ ఉంటుందని చూచాము. అంటే ఒకడు బద్ధకస్తుడై ఎ క్కువ కాలందీ అతడు తయారుచేసే సరుకుయొక్క విలువ పెరుగుతుందన్న అర్థం స్ఫురిస్తుంది. ఉదాహరణకు, ఇద్దరు ముచ్చివాండ్లువున్నారు. ఒకడు చురుకుగా పనిజేసి రోజుకు ఒకజత చెప్పులు కుట్టుతాడు. రెండోవాడు మందకొడిగావుండి రోజుకు ఒకచెప్పునే కుట్టుతాడు. మొదటివాడిజత చెప్పులకూ, రెండోవాని ఒక చెప్పుకూ కూడా ఒక్కరోజుపట్టింది. కాబట్టి రెండోవాని ఒకచెప్పు మొదటివాని ఒక్కచెప్పుకు రెట్టింపు విలువనుకల్గి వుంటుందా?

"ఒక సరుకుయొక్క విలువ ఆ సరుకులో ఇమిడ వున్న "శ్రమ మొత్తమును" బట్టి వుంటుందంటే అర్థం ఏమిటి? ఆనాటి సమాజంలో వున్న సామాజిక పరిస్థితులేమిటి, పని నిపుణత్వం ఏమిటి, పని ఎంతత్వరగా ఎక్కువగా చేయబడుతుంది - అనే వన్నీ చూసి సరుకును ఉత్పత్తి చేయుటకు అవుసరమగు శ్రమమొత్తం ఎంత అని చూస్తాము. ఇంగ్లాండులో మొదట్లో చేమగ్గాలమీద బట్టను నేసేవారు. పిమ్మట మరమగ్గంవచ్చింది. ఒకగజం బట్టను చేమగ్గంమీద నేస్తానికిపట్టే కాలంలో సగంకాలంలో మాత్రమే మరమగ్గంమీద నేస్తానికిపట్టుతోంది. అందుచేతమర మగ్గంకుపట్టే కాలంలో ఒకగంట కాలానికి చేమగ్గానికి 2 గంటలు పడుతోంది అయినా ఒక గజం గుడ్డ మాత్రమే నేస్తోంది. దానివల్ల తేలేదేమిటి? చేమగ్గపు 2 గంటల శ్రమ మరమగ్గపు గంట శ్రమతో సరిసమానం. ఎందు చేతనంటే, సాంఘి కంగా జూస్తే ఇప్పుడు విజానికి 2 గంటలు శ్రమపడ వవుసరంలేదు. అందుచే చేమగ్గంమీద నేసే సాలెవానికి రెండు గంటలు పట్టినా అది సామాజిక శ్రమలో గంటగానే లెక్కగట్టబడుతుంది." *

సరుకుల వుత్పత్తి విధానంలో శ్రమ సామాజికమైనది. అంటే ప్రతి వ్యక్తియొక్క శ్రమ సామాజిక శ్రమ మొత్తంలో ఒక అణువుగా మాత్రమే అవు

* 'విలువ, ఖరీదు, లాభం' అన్న మార్క్సు గ్రంథం నుండి.

తుంది. అందుచేత, ఒక వ్యక్తి ఎంతకాలం శ్రమపడినా అది లెక్కలోనికి రాదు. ఆ సామాజిక ఉత్పత్తి పరిస్థితులలో ఎంత శ్రమ పడవలసివున్నదో ఆ సగటు లెక్కనే అతని శ్రమ లెక్కించబడుతుంది ఒక గంటలో ఒక గజం గుడ్డను సగటున నేసే వుత్పత్తి విధానంలో బద్ధకస్తుడై 2 గంటలు తీసుకుంటే, 2 గంటల విలువ కట్టబడదు; అతని 2 గంటల శ్రమ 1 గంట సామాజికంగా అవసరమగు శ్రమగానే లెక్కగట్టబడుతుంది.

## సులభ శ్రమ : నైపుణ్య శ్రమ

మనం శ్రమ అని మామూలుగా ఉపయోగిస్తున్నాము. కాని శ్రమ అంతా ఒకటి కాదు: దర్జీవాని శ్రమ; గడియారపు నిర్మాత శ్రమ ఒకటికావు. బట్టలు కుట్టడం సులభంగానే నేర్చుకోవచ్చును. దీనికి ఎక్కువకాలం పట్టదు. ఎక్కువ నైపుణ్యం అక్కరలేదు. కాని గడియారాన్ని చేయటం అల్లాకాదు. కనీసం ఏ 3 ఏండ్లో ఆ విద్యను నేర్చుకొనుటకై శ్రమపడాలి. ఎంతో నైపుణ్యం కావాలి. కాబట్టి శ్రమ కూడా సులభశ్రమ అనీ, నైపుణ్య శ్రమఅనీ రెండు రకాలుగా వుంటుంది. అయితే ఈ రెండింటిని జోడించటం ఎట్లా ? రెండింటిని పోల్చడం ఎట్లా ? ఉదాహరణకు గడియారాన్ని తయారుచేస్తానికి 20 గంటలు పట్టింది అనుకుందాము. ఈ గడియారాన్ని మారిస్తే 40 గంటల సులభశ్రమతో తయారయిన చొక్కాలు వచ్చినవనుకుందాము. అంటే గంట నైపుణ్యపు శ్రమ 2 గంటలు సులభ శ్రమతో సమానమౌతున్న దన్నమాట.

ఒకవేళ, ఈ తేడా లేదనుకుందాము. ఒక్కడి శ్రమలో నిపుణత్వంతో తయారుచేసిన సరుకును సులభశ్రమతో తయారుచేసిన సరుకుతో సమాన మొత్తాలకే మార్చాలనుకుందాము. అప్పుడు ఏమి జరుగుతుంది? ఎవ్వరూ నైపుణ్యశ్రమను కోరరు. ఎక్కువ శ్రమను ఖర్చుపెట్టగోరరు. గడియారాలు తయారుచేయటం, మెకానిజం నేర్చుకోవడం, రసాయనిక పదార్థం చేయటం మున్నగునవి చేయరు. అందుచే గడియారాలు, మిషన్లు, రసాయనిక పదార్థాలు దొరకవు సరుకు కొద్దియౌట వల్ల ప్రతివారూ వాటికొరకై పరుగెత్తుతారు. అందువల్ల వాటిఖరీదులు పెరుగుతవి. అందుచే మళ్ళీ గడియారములు, మిషన్లు మున్నగునవి చేయటం లాభసాటి అని బయలుచేరుతారు. తిరిగి మళ్ళీ గడియారంలో వున్న 1 గంట నైపుణ్య శ్రమ చొక్కాలో, లేక తేలికగా తయారయ్యే ఇతర సరుకులలో వున్న 2గంటల సులభ శ్రమతో సరితూగుతుంది. అప్పుడు తిరిగి నిపుణత్వంతో కూడిన వృత్తులను నేర్చుకోవటం ప్రారంభిస్తారు.

## బజారు — పోటీ

ఇంతవరకూ మనం విలువ అంటే ఏమిటో చూశాము. ఒక సరుకును తయారుచేయుటకు ఆనాటి సామాజిక వుత్పత్తి పరిస్థితులలో ఎంత సగటు కాలం

కావాలో అదే ఆ సరుకుయొక్క విలువ అని చూశాము. అయితే, ఈనాటి సరుకుల ఉత్పత్తి సంబంధాలలో ప్రతిసరుకు తన పూర్తి విలువకే మారుతోందా? 10 గంటల సగటు శ్రమ కలిగివున్న ఇతర సరుకులతోనైనా మారుచున్నవా? లేదు. దీనికి కారణం వుంది. ఒక సరుకు తయారుకాగానే దాన్ని కొనుక్కొనే క్రయదారు వుండాలి. ఈ విధంగా సప్లై (తయారై అమ్మకానికి సిద్ధంగా వున్న వస్తువుల సముదాయము) డిమాండుతో (కొనాలని సిద్ధంగా కాచుకు కూర్చొనుట) సరితూగాలి. అప్పుడే తయారయిన సరుకులన్నీ సఫలీకృతం కాగలవు. కాని నిజంగా ఇది సంభవమా?

కాపిటలిస్టు ఉత్పత్తి విధానంలో ఎవరెవరు, ఏయే సరుకును ఎంతెంత ఉత్పత్తి చేయాలో నిర్ణయించే సంస్థ ఏదీ లేదు. బజారునుబట్టి పోతూ వుంటారు ఉత్పత్తిదారు. తన స్వంత ఉపయోగానికే ఉత్పత్తి చేసుకొని కాస్తోకూస్తో మిగులుతో దగ్గరున్న వూళ్ళో అమ్ముకొనే కాలంలో బజారుయొక్క ప్రాముఖ్యత లేదు. కాని సరుకుల ఉత్పత్తి విధానం వృద్ధియైన కొలదీ బజారు ప్రాముఖ్యత కూడా హెచ్చింది.

ప్రతి ఉత్పత్తిదారుడూ ఏదో వస్తువును తయారుచేస్తాడు. అది అమ్ముడు అవుతుందా లేదా? అనేది; దాన్ని కొనేవాళ్ళు ఎంతమంది వున్నారు అనేది చూడడు. అతనికి తెలిసే మార్గమూ లేదు అతడు తనసరుకును ఉత్పత్తి చేసినతర్వాత దానిని చేతితో పట్టుకొని ఎవరు కొంటారా అని బజారువెంట తిరుగుతాడు. అప్పుడే అతనికి తన సరుకుకు డిమాండు వుందా, లేదా అని తెలుస్తుంది.

సరుకుయొక్క ఖరీదు అంటే ఆ సరుకువిలువను ధనరూపంలో చెప్పటం. కాని ఈ ఖరీదు ఎప్పుడూ బజారులో అటూ ఇటూ వూగులాడుతూ వుంటుంది. బజారులో అమ్మేవాడు, కొనేవాడు ఎదురు బదురే అవుతాడు. బేరసారాలు సాగుతాయి. అమ్మేవారిమధ్య కొనేవారిమధ్య పోటీ వస్తుంది. యిప్పటికి డబ్బు వాడకంలోకి వచ్చింది గనుక కొనేవాడు తక్కువ డబ్బు యిచ్చి కొందామని చూస్తాడు. అమ్మేవాడు ఎక్కువ డబ్బుకు అమ్ముదామని చూస్తాడు. ఈ విధంగా సరుకుకు ఖరీదు నిర్ణయించబడుతుంది. అయితే ఈ ఖరీదుమాత్రం అసలు విలువకు దగ్గరలో అటూఇటూగా వుంటుందిగాని ఎన్నడూ దానితో సరిసమానంగా వుండదు. ఈ ఖరీదు ఎపుడూ విలువనే కేంద్రంగా పెట్టుకొని అటూఇటూ వూగిసలాడుతూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు కాస్త తక్కువగా వుంటుంది.

దీనికి కారణం చూద్దాము. ఒక్కొక్కప్పుడు డిమాండుకన్న సప్లయి ఎక్కువవుంది అంటే 100 చొక్కాలు కావలసివుండగా బజారులోనికి 200 చొక్కాలు వచ్చినవి. 200 చొక్కాలు అక్కరలేదు. కాని వుత్పత్తిదారుడు 200 చొక్కాలు అమ్మేసుకోవాలి. దగ్గరపెట్టుకు కూర్చుంటే అతనికేమి ప్రయోజనం? కాబట్టి 200 చొక్కాలను తక్కువ ఖరీదుకు అమ్మేస్తాడు. అంటే వుత్పత్తిదారుడు 200 చొక్కాలను తయారుచేస్తానికి ఎంతశ్రమను వెచ్చించాడో అంతశ్రమకు ప్రతిఫలం పూర్తిగా

పొందలేదన్నమాట. ఈ విధంగా అసలు విలువకు చొక్కా ఖరీదు తగ్గుతున్నది. అందుచే రెండవసారి చొక్కాలు తయారుచేయరు. బజారులో చొక్కాలు వుండవు. 100 చొక్కాలు కావలసివుంటే 50 మాత్రమే వుంటాయి. అందుచే వాటిని కొంటా నికి ప్రతివారూ ఎగబడతారు. ఎక్కువ ఖరీదు పెట్టి కొంటారు. అంటే చొక్కా అసలు విలువకన్న ఎక్కువకు అమ్మబడుతున్న దన్నమాట. ఇప్పుడు చొక్కాలు తయారుచేయటం మళ్లీ లాభసాటిగా కన్పిస్తుంది. మళ్ళీఅందరూ చొక్కాల ఉత్పత్తికి పరుగెత్తుకు వస్తారు. మళ్ళీ చొక్కాలు 200 వుత్పత్తి కాబట్టి డిమాండుకు సప్లయి మించుతుంది. మళ్ళీ చొక్కాల ఖరీదు తగ్గుతుంది. ఈ విధంగా మార్కెటులో ధర లెప్పుడూ వూగిసలాడుతూ వుంటాయి. కాని అవి అసలు విలువ అనే ఇరుసుచుట్టూ మాత్రం తిరుగుతూ వుంటాయి.

ఈ విధంగా బజారు వూగిసలాటను బట్టి ధరలు మారుతూ వుంటవి. ఈ విధంగా విలువకు సంబంధించిన సూత్రం బహిర్గత మౌతుంది. సరిగ్గా సప్లయి డిమాండులు సరితూగితేనే సరుకులు పూర్తి విలువకు అమ్మబడుతవి. కాని యిది దాదాపు అరుదు. సప్లయి డిమాండులు ప్లానులేని కాపిటలిస్టు ఉత్పత్తి విధానంలో ఎన్నడూ సరితూగవు.

బజారు అంతా గుడ్డిగా పరిగెత్తుతూ వుంటుంది. ఈ గుడ్డి శక్తికి ప్రతి ఒక్క ఉత్పత్తిదారుడు లొంగిపోవలసిందే. మార్క్సు చెప్పినట్లుగా ఇల్లు కూలి పోతే అందులోవాళ్ళు ఎట్లా నలిగిపోతారో అట్లే బజారుయొక్క గుడ్డి నడకవల్ల క్రయ విక్రేతలు నలిగిపోతూ వుంటారు. ఈవిధంగా కాపిలిస్టు వుత్పత్తి విధానంలో బ్రహ్మాండమయిన అరాజకం వ్యాపించి వుంటుంది. ఒక ప్లాను "ఒక క్రమం" ఒక నియమం అనేది లేకుండా వుత్పత్తి, అమ్మకములు సాగిపోతూ వుంటాయి:

## మారకంయొక్క వృద్ధి : విలువయొక్క స్వరూపాలు

సరుకుల ఉత్పత్తివిధానం ఒక్కసారిగానే వుద్భవించలేదని మనం ఇంత వరకూ చూచాము. సామాన్య ఉత్పత్తివిధానం ఎన్నో శతాబ్దాలు ఉన్న పిమ్మట క్రమంగా మారకం పద్ధతి వృద్ధియౌతూ దాన్ని తుడిచిపెట్టి వేసింది. మారకం వృద్ధి యైన కొలదీ సరుకుల ఉత్పత్తివిధానం వచ్చింది.

అయితే సరుకులు ఒకదానితో ఒకటి నూటిగా మారవు. ఈరోజున ఒక చెప్పుల జతను బజారుకు తీసుకొనివెళ్ళి పేరుతున్న, 4 కోడిగుడ్లు, 1 గజం చొక్కా గుడ్డ తెచ్చుకోవటం సాధ్యపడదు. సరుకులుఅన్నీ డబ్బుకే మారుతవి. ఒక సరుకును అమ్మి ఇంకో సరుకును కొనాలంటే ముందు వీటిని డబ్బురూపంలోకి మార్చుకోవాలి. ఈ విధంగా సరుకుల విలువ డబ్బురూపంలోకి మారుతుంది. దీనినే విలువ యొక్క ధనరూపం అంటాము. అయితే విలువయొక్క ధనరూపం అనాదినుండీ లేదు. ధన రూపం ఇటీవలనే కొన్నివందల ఏండ్లక్రితమే వచ్చింది. ఇది అంతకు పూర్వమున్న

పరిస్థితుల వల్లనే క్రమంగా పరిణామం జెందుతూ వచ్చింది. కాబట్టి విలువ యొక్క ధనరూపానికి పూర్వం ఏ రూపములున్నవో కూడా చూడాలి.

పురాతన కాలంలో ఉత్పత్తి బహు సామాన్య పద్ధతులలో జరుగుతున్నప్పుడు (సామాన్య ఉత్పత్తి విధానం వున్నప్పుడు) వస్తువుల మధ్య మారకం ఒకసూత్రం ప్రకారం జరిగేదికాదు. సాధారణ పద్ధతిలో, లెక్కలేకుండా జరిగేది. ఒకడు పశుచర్మాన్ని తెచ్చి, ఇంకొక తెగలోని వారికిచ్చి రెండు యీటెలు తెచ్చుకునేవారు. పశుచర్మం రెండు యీటెలకు మారుటకు ఏమిసూత్రమున్నది? ఏమీ లేదు. ఈ మారకం తలవని తలంపుగా జరిగింది. అందుచే విలువ యొక్క ఈ స్వరూపాన్ని సామాన్య రూపం అనిగాని, విలువయొక్క తలవనితలంపు రూపం అనిగాని అంటారు.

అయితే విలువ యొక్క సామాన్య రూపంలో కూడా ఒక విషయాన్ని మనం చూస్తాము. ఇక్కడ ఒక పశుచర్మం రెండు యీటెలతో మార్చబడుచున్నవి. పశుచర్మం విలువ యెంత? రెండు యీటెలు కాబట్టి పశుచర్మంయొక్క విలువ యీటెలతో పోల్చిచూస్తేగాని తెలియటంలేదు. కాబట్టి పశుచర్మంయొక్క విలువ మొత్తము ఎంతో దానంతట అదే బహిర్గతంకాదు: దానిని ఈటెలతో పోల్చినప్పుడే బైటపడుతుంది. కాబట్టి పశుచర్మం విలువను "తారతమ్యపు విలువ" అంటాము. ఈటెల విషయములో: ఇక్కడ ఈటెలు ఎందుకు వుపయోగపడుచున్నవి? చర్మంలో ఎంతవిలువవున్నదో కొలిచిచెప్పుటకు. ఉప్పుబోగువున్నది. దాని ప్రమాణం యెంత వున్నది చెప్పాలంటే పేర్లతో కొలుస్తాము. అంటే పేరుఉప్పుయొక్క ప్రమాణాన్ని తెలియజేయుటకు సాధారణంగా వినియోగపడుచున్నది. అట్లే చర్మంవిలువ యొక్క ప్రమాణాన్ని తెలియజెప్పుటకు ఇక్కడకూడా యీటెలు వుపయోగపడుచున్నవి. కాబట్టి యీటెల విలువను సరిసమానపు విలువ అంటాము. చర్మంయొక్క విలువ రెండు యీటెలు ఉపయోగపు విలువద్వారా బహిర్గతమవుతుంది.

ఈ సందర్భంలో మనం ఒకటి చూస్తున్నాము. ఒక సరుకుయొక్క ఉపయోగపు విలువ (రెండు ఈటెల ఉపయోగపు విలువ) ఇంకొక సరుకు (చర్మము) యొక్క విలువను కొలుచుటకు ఉపయోగపడు చున్నది. ఒకే వస్తువుకు యీ రెండు గుణాలు, విలువ, ఉపయోగపు విలువ వుంటాయి. కాని మారకంలో ఒక్కొక్క వస్తువుకు ఒక్కొక్క గుణమే ప్రాధాన్యం వహిస్తుంది. ఇక్కడ ఒక మనిషికి రెండుయీటెలు కావాలి. అంటే ఆ యీటెలు అతని ఉపయోగార్థం కావాలి. అందుచే ఆ యీటెల ఉపయోగపు విలువ ఈతనికి కావాలి. అదే సమయంలో ఈతడు యీటెలను కొనటకై ఒక పశుచర్మాన్ని ఇచ్చేస్తున్నాడు. ఈ పశుచర్మం కూడా ఉపయోగకరమైన వస్తువే అయినా, ఆ ఉపయోగం ఇతడికి అవసరం లేదు. అతడికి కావలసినది యీటెను కొనడానికి చర్మం సాధనం మాత్రమే. అందుచే ఈతనికి సంబంధించినంత వరకూ చర్మానికి మారకం విలువ మాత్రమే వుంటుంది. చర్మం

చర్మానికిగాని, యీచెలు యీచెలకుగాని మారవు. చర్మం ఈచెలకు మాత్రమే మార్పిడవుతవి. అందుచేత తేలేదేమిటంటే, సరుకు యొక్క విలువ ఇంకొక సరుకు యొక్క ఉపయోగపు విలువ ద్వారా మాత్రమే బహిర్గతమవుతుంది.

ఉదాహరణకు : 4 చెప్పుల విలువ ఎంత? 4 చెప్పుల విలువ 4 చెప్పులు అని అనము. 4 చెప్పుల విలువ 2 చొక్కాలుఅని చెప్పుతాము. ఎందుచేత? చెప్పులు ఇచ్చి చెప్పులు పుచ్చుకోము. చెప్పులు ఇచ్చి చొక్కాలు పుచ్చుకుంటాము. కాబట్టి చెప్పుల విలువ చొక్కాల ద్వారా కన్పిస్తుంది. అంటే ఒక సరుకు విలువ మరొక సరుకు ఉపయోగపు విలువద్వారా కన్పిస్తుంది.

కాబట్టి ఒక సరుకుయొక్క వుపయోగపు విలువద్వారా మరొక సరుకు యొక్క విలువ బహిర్గతమౌతుంది- అంటే రూపొందిన శ్రమద్వారా సామాన్య శ్రమ ఎంత యిమిడివుందో తెలుస్తుంది.

అయితే, పురాతనకాలంలో రెండు వస్తువుల మధ్యనే మారకం జరిగి వున్నా, క్రమంగా ఎక్కువ వస్తువుల మధ్య మారకం ప్రారంభమైంది. ఇట్టి సందర్భంలో విలువ యొక్క సామాన్యరూపం పోయి విలువయొక్క విస్తారిత రూపం వస్తుంది. అంటే ఒక వస్తువు మరొక వస్తువుతోనేగాక, అనేక వస్తువులతో మార్పిడుటకు వీలు ఏర్పడుతుంది. ఉదాహరణకు : చర్మం రెండు ఈచెలతోనేగాక, 1 జత చెప్పులు లేక పడవ తెడ్డు, లేక ఒక కట్టువంచ, లేక ఒక బస్తా ధాన్యం - దేనితోనైనా మారుతుంది. అంటే విలువ యొక్క సామాన్య రూపం, విస్తారిత రూపం యీ విధంగా వుంటాయి :

సామాన్య రూపం

1 పశు చర్మం = 2 ఈచెలు

విస్తారిత రూపం

| | | |
|---|---|---|
| 1 పశు చర్మం | = | 2 ఈచెలు<br>లేక, 1 జత చెప్పులు<br>లేక, 1 పడవ తెడ్డు<br>లేక, 1 కట్టువంచ<br>లేక, 1 బస్తా ధాన్యం |

ఈ పై ఈక్వేషన్‌వల్ల తెలిపేదేమిటి? మానవ శ్రమజనితమైన ఒక వస్తువు ఏ యితర వస్తువుతోనైనానరే మారుతుంది. ఈనాటికి మారకం కూడా వృద్ధియైంది. కాబట్టి ఇది అవసరమైంది.

విలువయొక్క విస్తారితరూపంలో విలువయుక్క రూపం అభివృద్ధియైన దన్నమాట. ఒక సరుకు యొక్క విలువ అనేక సరుకుల ద్వారా బహిర్గత మవుచున్నది. విలువకు, ఉపయోగపు విలువకూ మధ్య విభాగం ఎక్కువ అయింది.

కాని మారకం వృద్ధిఅయినకొలదీ ఈ విలువయొక్క విస్తారిత రూపం కూడా చాలలేదు. ఇందులోని లోపాలు స్పష్టంగా కానవచ్చినవి. ఒకనివద్ద చర్మం వుంది. ఒకనివద్ద ఈటెలు వున్నవి. ఇంకొకని వద్ద చొక్కా వున్నది. ఇంకొకని వద్ద ధాన్యం వున్నది. చర్మం కావలసినవానికి ధాన్యం కావాలి. కాని ధాన్యం కావలసినవానికి చర్మం అక్కరలేదు. చొక్కా కావాలి చొక్కా వున్నవానికి ధాన్యం అక్కరలేదు. ఈటెలుకావాలి. ఇటువంటి పరిస్థితులలో చర్మం వున్నవానికి ధాన్యం ఎట్లా వస్తుంది? చర్మంతో చొక్కానుకొని, చొక్కాతో ధాన్యాన్ని కొనాలి. లక్షల రకాల సరుకు లున్నపుడు ఇట్టి వస్తుమార్పిడి ఎట్లా సాధ్యం అవుతుంది? అందుచే మారకంలో మరింత సులభమగు పద్ధతి వచ్చింది. విలువ యొక్క సర్వసాధారణ రూపం వచ్చింది. మారకం కొద్దిగా జరుగుతూవుండే కాలంలో విలువయొక్క విస్తారిత రూపం వుండేది. ఆ కాలంలోనే యితర సరుకులకన్న ఏదో ఒక సరుకు యొక్కువగా చలామణి అవుతూ వుండేది. చర్మం, చొక్కా, చెప్పులు, ధాన్యం, ఈటెలు, పశువులు, తెడ్లు, కట్టువంచలు మున్నగు అనేక సరుకులలో ఏదో ఒక సరుకు యితర వాటికన్న ఎక్కువగా ఇచ్చిపుచ్చుకోబడుతూ వుండేది. క్రమంగా యితర సరుకులన్నీ ఈ సరకుద్వారానే మారటం వచ్చింది. ఉదాహరణకు: విలువ యొక్క విస్తారిత రూపంలో ఎద్లు యితర సరుకులకన్న ఎక్కువగా చలామణి అవుతూవుండేవి అనుకుందాము. కాబట్టి ఎద్ల విలువ అనేక యితర సరుకుల ద్వారా వెల్లడింపబడేది అంటే ఒక ఎద్దు, ఒక పడవతో, లేక 3 జతల చెప్పులతో, లేక మూడు బస్తాల ధాన్యం, లేక 20 అ బులతో మారేదని అనుకుందాము. ఈ వరుసను వెనకకు తిప్పితే విలువయొక్క సర్వసాధారణ రూపం వస్తుంది.

| | |
|---|---|
| 1 పడవ, లేక<br>2 జతల చెప్పులు, లేక<br>3 బస్తాల ధాన్యం, లేక<br>20 అంబులు, లేక<br>6 చొక్కాలు మొ॥ | = 1 ఎద్దు |

ఇందువల్ల ఏమి ఏర్పడుచున్నది? ఒక్క సరుకు యితర సరుకులన్నిటి యొక్క విలువను నిర్ధారణచేయుటకు ఏర్పడియున్నది. ఈ విధమైన సరుకును విశ్వవ్యాపితమగు సరిసమాన వస్తువుగా పిలుస్తాము. ఈ సరుకు ఏ సరుకుకు బదులుగానైనా వెంటనే స్వీకరింపబడుతుంది. ఇందువల్ల విలువయొక్క విస్తారిత రూపంలోవున్న యిబ్బందికాస్తా తొలగిపోతుంది. చర్మం కావలసినవాడు అమ్మి వేసుకొని విశ్వవ్యాప్తమగు సరిసమాన వస్తువును అనగా ఎద్దును సంపాదిస్తాడు. ఆ ఎద్దుతో తన కవుసరమైన ధాన్యమును కొనుక్కుంటాడు. ఇట్టి పరిస్థితిలో విలువకూ వుపయోగపు విలువకూ మధ్య విభాగం మరింత పెరుగుతుంది. అన్ని సరుకుల విలువలూ ఒక్కసరుకులో ప్రతిఫలిస్తవి. ఈ ఒక్కసరుకుయొక్క పని ఏమిటంటే

యితర అన్ని సరుకులయొక్క విలువనూ కొలిచి తెలియజేయడమే. ఈ విధంగా అన్ని సరుకులూ రెండు పరస్పర వ్యతిరేకమగు గ్రూపులక్రింద విడిపోతాయి. అన్ని సరుకుల విలువలనూ ప్రతిఫలించే విశ్వవ్యాప్త పరిసమానవస్తువు ఒక్కటే ఒకగ్రూపు. తక్కిన సరుకులన్నీ ఒకగ్రూపు.

విలువయొక్క సర్వసాధారణరూపం, పిమ్మట విలువయొక్క "ధన రూపం" అమలులోకి వచ్చినవి ఈ రెండింటికీ తేడా స్వల్పమే. బంగారం వెండి లోహాలు యీ విశ్వవ్యాప్త సరిసమాన వస్తువును ధరించగానే విలువయొక్క ధన రూపం వచ్చింది. ధనరూపానికి సామాజిక కర్తవ్యం ఒకటి యేర్పడింది. దీనివని యితర అన్ని సరుకులయొక్క విలువల ప్రమాణాన్ని తెలియజేయటమే. అద్దంలో అన్ని వస్తువులు ఎట్లా ప్రతిఫలిస్తాయో, అట్లాగే ధనరూపంలో అన్ని సరుకుల విలువ ప్రతిఫలిస్తాయి. అయితే మనం ఒకటి మరిచిపోరాదు. విలువగల సరుకులే- అనగా మానవ శ్రమపూరితములగు సరుకులే - ఒకదానితో ఒకటి మారగలవు. అందుచే బంగారం గాని, వెండిగాని ధనంగా తయారై యితర సరుకులతో మారుతున్నవి. అంటే బంగారం, వెండి లోహాలుకూడా విలువను కల్గివుండాలి. అవి కూడా ఒక సరుకు అయివుండాలి. బంగారంకూడా ఒక సరుకుయేనని, అదికూడా మానవశ్రమ పూరితమేనని, మనం యెరుగుదుము. యెంతో కష్టపడి గనులుత్రవ్వి తీసి, శుభ్రపరిస్తేనేగాని బంగారం, వెండిలోహాలు రావు. వాటిని కరిగించి పోత పోస్తేనేగాని రూపాయలు మున్నగునవిరావు. కాబట్టి వాటిలో విలువ వున్నదని మనం తెలుసుకోవగలం. కాబట్టే ధనం ఇతరసరుకుల విలువను తెల్పుటకు, వాటితో మారుటకు అర్హతను పొందుచున్నది.

విలువ అనేది మనుష్యుల మధ్య ఏర్పడిన ఒక నిర్ణీతమగు సాంఘిక సంబంధం. కాని సరుకులమధ్య సంబంధంగా బహిర్గతమౌతుంది. ఒక సరుకుయొక్క విలువ ఆ సరుకులను బట్టే తెలుసుకోబడదు. మరొక సరుకు సహాయంతోనే, మరొక సరుకుతోపోటీ పెట్టబడినప్పుడే ఈ విలువ తెలుస్తుంది. కాబట్టి ఒక సరుకు మరొక సరుకుతో వుండే మారకం సంబంధం, లేదా "మారకం విలువ" ద్వారానే ఆ సరుకు విలువ తెలుస్తుంది. విలువయొక్క వివిధరూపాలు, సామాన్య రూపం నుండి ధనరూపంవరకు మారినక్రమం చూశాము. సరుకులలో ఇమిడివున్న పరస్పర వైరుధ్యాల అభివృద్ధితో విలువయొక్క వివిధరూపాల అభివృద్ధి జోడింపబడి వుంది. మారకం పెరిగినకొలదీ, దానితోబాటు విలువయొక్క రూపాలు మారినకొలదీ సరుకుయొక్క విలువ, వుపయోగపు విలువల మధ్యవుండేవైరుధ్యం మరింత పెరుగుతుంది. ధనంలో ఇది మరింత స్పష్టంగా కనిపిస్తుంది. ధనం ఒక్కటే విలువను తెలియజేసే విశ్వవ్యాప్తమగు సాధనం. ఇతర అన్ని సరుకులూ ధనం ముందు వుపయోగపు విలువలుగా వచ్చి నిలబడుతాయి. ఈ వుపయోగపు విలువలలో ఒక్కొక్కదాని విలువను తెలియజేస్తానికి ధనం ఒక కొలతబద్ద.

# పరుకుల భూతశక్తి

పరుకుల వుత్పత్తి విధానంలో ఒక విచిత్రం గోచరించుతుంది. వుత్పత్తి సామాజికమైంది. మనుష్యులమధ్య సంబంధాలు హెచ్చినవి. కాని మనుష్యులమధ్య ఈ సంబంధాలు వారిపట్ల సంబంధాలుగా గాక పరుకులమధ్య సంబంధాలుగా పైకి కప్పిస్తాయి. ఉదాహరణకు ముచ్చివానివీ, దర్జీవానివీ చూద్దాము. ముచ్చి చెప్పులు తయారుచేశాడు. దర్జీ చొక్కాలు కుట్టాడు. ముచ్చికి చొక్కాలు కావాలి. దర్జీకి చెప్పులు కావాలి. అంటే ముచ్చియొక్క శ్రమ, దర్జీయొక్క కోర్కెలను తీరుస్తానికి కావాలి. అట్లే దర్జీవాని శ్రమ ముచ్చివాని కోర్కెలు తీరుస్తానికి వుపయోగపడు తోంది, కాబట్టి ఈ ఇద్దరిమధ్య సంబంధం ఏర్పడుతోంది. పరుకుల వుత్పత్తి ప్రకారం మానవులమధ్య - దర్జీ, ముచ్చివాండ్రమధ్య - సంబంధం ఏర్పడుతున్నది. కాని ఈ సంబంధం ఎట్లా బహిర్గతమౌతోంది ? ఏ విధంగా అది కనపడుతోంది ? పరుకులు ఒకరి చేతులలో నుండి మరొకరి చేతులలోనికి మారినవి. చెప్పులు దర్జీవానికి, చొక్కాలు ముచ్చివానికి చేరినవి. అయితే నరాసరి చొక్కాలు దర్జీవాని నుండి ముచ్చికి, చెప్పులు ముచ్చినుండి దర్జీవానికి వెళ్ళవు. ముచ్చి తీసుకువెళ్ళి చెప్పులను షాహుకారుకు అమ్ముతాడు. అందుకు డబ్బువస్తుంది. తన డబ్బుతో దర్జీ చెప్పులను, తన డబ్బుతో ముచ్చి చొక్కాలను కొనుక్కుంటారు. ఈ విధంగా పరుకుల ఉత్పత్తి విధానంలో మనుష్యుల మధ్య వుండే ఉత్పత్తి సంబంధాలు పరుకుల కదలికగా, పరుకుల సంబంధాలుగా కప్పిస్తవి.

విలువ అనేది పరుకులను ఉత్పత్తిచేయు మనుష్యుల మధ్య సంబంధం. కాని యిది వస్తువులమధ్య - పరుకుల మధ్య - సంబంధంగా కప్పిస్తుంది. ఉత్పత్తి సంబంధాల నిజస్వరూపం ఒక తెరవల్లె వస్తువుల మార్పిడి వెనుక దాగివుంటుంది. ఒక పరుకుకు రంగు, బరువు మున్నగు గుణాలున్నట్లే విలువ గూడా సహజ గుణంగా కప్పిస్తుంది. ఉదాహరణకు ధాన్యం బరువు 1 మణుగు। దాని విలువ 5 రూపాయలు అని అంటాము. ఈ విధంగా పరుకుకు ఒక సహజ విలువ గుణంగా కప్పిస్తూ వుంటుంది; పరుకు అనేది చాలా విచిత్రంగా తయారౌతుంది. ఒక ఉత్పత్తి దారుని అదృష్టమంతా అతని పరుకులపై ఆధారపడి వుంటుంది. ముచ్చివాడు తన చెప్పులను అమ్ముకోగల్గితేనే ధాన్యం కొనగల్గుతాడు. అమ్మలేదా తిండిలేక వస్తు వండుకోవలసిందే. చెప్పుల ధర తగ్గిందా అతడు కొనగల్గిన ధాన్యం కూడా తక్కువ వస్తుంది. అందుచే అర్థాకలితో వుండవలసి వస్తుంది. అయితే ముచ్చివాడు ఎందు చేత చెప్పులు అమ్ముకోలేడు; లేక చెప్పుల ధర ఎందుకు పడిపోయింది ? దీనికి కారణాలు అర్థిక జీవితంలో మార్పులలోనే కప్పిస్తాయి. కాపిటలిస్టు సమాజంలో మనుష్యుల మధ్య వుత్పత్తి సంబంధాలలో కల్గిన మార్పులలో గోచరిస్తాయి. అర్థిక సంక్షోభం వచ్చివుండవచ్చు. లేదా తమ జీతాలు తగ్గించబడడం ద్వారా కార్మికులు

చెప్పులను కొనటం తగ్గించేశారు. ఇందువల్ల చెప్పుల ధరలు పడిపోయినవి. ఈ విధంగా మనుష్యుల మధ్య వుత్పత్తి సంబంధాలలో వచ్చిన మార్పులు సరుకుల ధరలను ఏర్పరుస్తున్నవి. కాని సామాన్య వుత్పత్తిదార్లకు, ఉదాహరణకు ముచ్చి వాటికి నిజమైన కారణాలు చాలాకాలం వరకూ తెలియవు. ఎప్పుడో తెలుసుకున్నప్పటికీ ఆ జ్ఞానం కూడా సరియైనదిగా వుండదు.

సరుకుల వుత్పత్తి విధానంలో వుత్పత్తి ద్వారా మనుష్యుల మధ్య ఏర్పడిన సంబంధాలు సరుకుల మధ్య సంబంధాలుగా కన్పిస్తవి. ఈ విధంగా సరుకులకు విచిత్రమైన సామాజిక ధర్మాలు ఏర్పడుతవి. సరుకులే ప్రపంచమంతాను. సరుకుల సంబంధాలే ప్రపంచంలో మనుష్యుల మధ్య సంబంధాలుగానూ కన్పిస్తవి. సరుకునే సర్వంగా పూజించటం జరుగుతుంది. దీనినే "సరుకుల భూతశక్తి (Fetishism) * అని అంటాము. కాపిటలిజంలోని మనుష్యుల మధ్య ఏర్పడిన సంబంధాలు వస్తువుల వెనుక మరుగుపడి వుంటాయి. వ్యక్తుల మధ్య వుత్పత్తి సంబంధాలన్నీ వస్తువుల మధ్య సంబంధాలుగా, వస్తువుల ద్వారా ఏర్పడిన సంబంధాలుగా కన్పిస్తాయి. ఈ విధంగా కాపిటలిస్టు సమాజంలో మానవుల మధ్య ఏర్పడిన సామాజిక సంబంధాలు వస్తువుల వెనుక మరుగు బడిపోయి, వాటి ప్రాధాన్యత, స్వరూపం మున్నగునవి కన్పడకుండా వుంటాయి. అందుచే ఈ సరుకుల భూతశక్తిని బట్టబయలు చేయాలి; దాని స్వరూపాన్ని పూర్తిగా గ్రహించాలి.

ఈ సరుకుల వైచిత్ర్యాన్ని మార్క్సు ఒక్కడే మొట్ట మొదటగా బట్టబయలు చేశాడు. ఇంతవరకు ప్రతివాడూ సామాజిక సంబంధాలను-సరుకుల మధ్య సంబంధాలే, సరుకుల వల్ల ఏర్పడిన సంబంధాలే - అనుకుంటూ వుండేవారు. కాని మార్క్సు ఇది తప్పుఅనీ, నిజానికి అవి మనుష్యుల మధ్య ఏర్పడిన సామాజిక సంబంధాలనీ చెప్పాడు. సరుకుల ఉత్పత్తి విధానంలో మనుష్యులలో ఏర్పడిన సామాజిక సంబంధమే విలువ అనీ మొట్ట మొదటగా మార్క్సుయే స్పష్టం చేశాడు.

"అర్థశాస్త్రం" "సరుకులతో", ప్రారంభమవుతుంది. ఇద్దరిమధ్య గాని, రెండు తెగల మధ్యగాని ఉత్పత్తికాబడిన వస్తువులు మారటం ప్రారంభమైనప్పటి నుండి ప్రారంభమవుతుంది. మారకం కాబడే వస్తువునే సరుకు అంటాము. ఇద్దరు మనుష్యులు వున్నారు; అందులో ఒకడు ఉత్పత్తిదారుడు, రెండోవాడు కొనుగోలుదారుడు వీరిరువురూ వేర్వేరు పనులు చేసినవారు. వీరిరువురి "మధ్య సంబంధాలు" ద్వారా ఒక "వస్తువు" మారుచున్నది. అప్పుడే సరుకు అనేదిగా ఆ వస్తువు తయారవుతున్నది. ఇది అసలు విషయం. అర్థశాస్త్రంలో మనం ఈ విషయాన్ని మొదటి నుండి కొనవరకు చూస్తాము. కాని దీనినే బూర్జువా ఆర్థిక శాస్త్రవేత్తలు

---

* భూతశక్తి (Fetishism) అంటే ఒక వస్తువుకు కొన్ని అమానుష శక్తులను ఆపాదించి, దానిని కొలవటం [అనువాదకుడు]

గ్రహించలేక తికమకలుపడ్డారు. మనుష్యులమధ్య సంబంధాలతోనే, చివరి చివరికి వర్గాల మధ్య సంబంధాలతోనే ఆర్థిక శాస్త్రం సంబంధించి వున్నదిగాని, వస్తువుల మధ్య సంబంధాలతో కాదు అనే విషయాన్ని వీరు గ్రహించలేక పోయారు. కాని నిజానికి వ్యక్తులమధ్య వర్గాల మధ్యవుండే సంబంధాలు ఎల్లప్పుడూ "వస్తువులతో జోడింపబడివున్నవి. పైకి వస్తువులుగా కన్పిస్తవి." కొద్దికొద్దిగా కొంతమంది ఆర్థిక శాస్త్రవేత్తలు ఈ విషయాన్ని గ్రహించినా, మార్క్సే మొట్టమొదటగా దీని పూర్తి స్వరూపాన్ని బైటపెట్టాడు. అది ఈనాడు సర్వప్రామాణికంగా బూర్జువా ఆర్థిక శాస్త్రవేత్తలచేత గూడా అంగీకరింపబడక తప్పలేదు. *

## సరుకుల వుత్పత్తిలో ధనంయొక్క పాత్ర

ప్రస్తుత కాలంతో ఒక సరుకు ఇంకొక సరుకుతో సూటిగా మారటం అనేదిలేదు. ఇప్పుడు జరిగేదల్లా, ఒక సరుకును వుత్పత్తి చేసినవాడు, ఆ సరుకును డబ్బుకు అమ్ముతాడు. ఆ వచ్చిన డబ్బుతో తనకు కావలసిన సరుకును కొంటాడు. ఈ విధంగా సరుకులు సూటిగా ఒకదానితో ఒకటి మారటంలేదు. అయినా సరుకుల మారకం అని ఎందుకంటాము? దీనికి కారణం స్పష్టమే. నిజానికి సరుకుల మధ్యనే మారకం జరుగుతోంది. ఈ మారకం జరగటానికి ధనం మధ్యవర్తిగానే, దళారిగానే వుంటున్నది. కాపిటలిస్టు తన సరుకులను అమ్మివేసి డబ్బు సంపాదిస్తాడు కాని అతనికి డబ్బు డబ్బుగా మాత్రమే కాదు కావలసింది. ఇంకా ఎక్కువ మిగిలి పదార్థాలను కొని సరుకులను ఎక్కువగా ఉత్పత్తి చేయటమే అతని కోర్కె. అందుకే అతడు ధన సముపార్జన చేస్తున్నాడు. కాబట్టి ఉత్పత్తిని అధికం చేస్తానికే యితనికి ధనం అవసరం అవుతున్నది.

అయితే ఒక సరుకుతో ఇంకొకసరుకు సూటిగా మారేపద్ధతి నుండి ధనం ద్వారా మారేపద్ధతి చాలా భిన్నమైనది. మారకంలో ధన రూపంగానే సరుకులో ఇమిడివున్న పరస్పర వైరుధ్యాలు మరింత అధికమౌతాయి.

మారకంలో, ఎవరియొక్క అంగీకారంతో గాని, ఒప్పందంతోగాని ధనం ప్రవేశ పెట్టబడలేదు. దానంతటఅదే ఆచరణలోనికి వచ్చింది. మారకంలో ధనరూపం వచ్చిన తర్వాతనే సరుకుల ఉత్పత్తి విధానం క్రింద ఉత్పత్తి గావించే లక్షలాది వ్యక్తుల మధ్య సామాజిక సంబంధాలు దృఢమైనవి.

శ్రమయొక్క రెండురూపాలను చూశాము. ఇవే సర్వసామాన్యపు శ్రమ, రూపొందిన శ్రమ ఈ రెండు రూపాలమధ్య వైరుధ్యాలను కూడా చూశాము. శ్రమ యొక్క రెండురూపాల మధ్య వైరుధ్యాలే సరుకుయొక్క రెండు గుణాల మధ్య-ఉపయోగపు విలువ, విలువల మధ్య - వైరుధ్యాలుగా కూడా చూశాము. విలువ యొక్క ధనరూపం వ్యాప్తిలోకిరాగానే ఈ వైరుధ్యాలు మరింత వృద్ధియౌతాయి.

---

* "లడ్విగ్ ఫ్యూయర్ బక్" అనే ఎంగెల్సు గ్రంథం నుండి.

సరుకు రెండు రూపాలు పొందుతుంది. ఒకటి ధనం; రెండవది సరుకు. ధన రూపంలో మారకం జరిగినపుడు సరుకు బదులు డబ్బు యివ్వబడుతుంది. అంటే ఆ డబ్బులో సరుకుయొక్క విలువ యిమిడివున్నదన్నమాట.

సరుకుయొక్క విలువ దాని ఖరీదుగా బహిర్గతమౌతుంది. అనగా కొంత మొత్తపు ధనంగా చెప్పబడుతుంది. ఒక సరుకును ఉత్పత్తిచేయటంతో కాపిటలిస్టు పని పూర్తిగాదు. అతడు దానిని డబ్బుక్రై మార్చుకోవాలి. అనగా ఆ సరుకు అమ్మ బడాలి. దాని ధరను అతడు పొందాలి. ఆ సరుకు అమ్మబడలేదంటే ఉత్పత్తిదారుని శ్రమ వృధా అయిందన్నమాట.

ధనం విశ్వవ్యాపితమైన సరుకు. విశ్వవ్యాప్తంగా అన్ని సరుకులకు సరి సమానమగు కొలత. ధనం విలువయొక్క మూర్తి. సర్వసామాన్యపు శ్రమయొక్క మూర్తి ప్రత్యేక వ్యక్తులు సృష్టించిన వస్తుసముదాయమంతా సరుకులుగా మారు టచే. సామాజిక శ్రమవల్ల సృష్టించినవిగా పరిగణింపబడుచున్నవి. అట్లు సరుకులు, సామాజిక శ్రమజనితములన్న విషయాన్ని ధనం రూఢిపరుస్తుంది.

అయితే ఇందులో ఒక ప్రమాదం వున్నది. ఎవరైనా ఒకరి సరుకు బజారులో అమ్ముడుపోదు అంటే, అతడి వ్యక్తిగతశ్రమ సామాజికశ్రమలో భాగం కావటం లేదన్నమాట. ఎందుచేత? అతడు వుత్పత్తిగావించిన సరుకు సమాజానికి అవసరం లేకపోయింది. అతడు అనవసరంగా శ్రమపడి ముడివస్తువులను, సని ముట్లను ఖర్చుచేసి అమ్ముడుపోవటుసంటి సరుకులను తయారుచేశాడు. ఇది ఉత్పత్తి విధానంలోవున్న అరాజకంవల్ల జరుగుచున్నది. సమాజానికి ఏది అవసరమో, ఏది వుత్పత్తిచేయాలో తెలియక అతడొక వస్తువును వుత్పత్తిజేశాడు. అది అమ్ముడు కాలేదు. అందుచే అతడి శ్రమ వినియోగపడక, వేరుగానే వుండిపోయింది. ఈవిధంగా ధనరూపంలో సరుకుల భూతశక్తి మరింత స్పష్టంగా గోచరిస్తుంది. మార్క్సు చెప్పినట్లు కాపిటలిస్టు వుత్పత్తి సంబంధాలలో వుత్పత్తి అంతా గిడ్డపూత పూయబడి వుంటుంది. అంటే వెండి, బంగారముల రూపంలో వుంటుంది. ధనమునకు అమానుష శక్తులన్నీ, దైవిక శక్తులన్నీ అంటుగట్టబడుతాయి. సామాజికాభివృద్ధి వల్లనే ధనం ఏర్పడినా, కాపిటలిస్టు సమాజంలో ధనం విపరీత ప్రాముఖ్యతను, బలాన్ని సంపాదించుకొన్నది.

"ధనం మారకంయొక్క వృద్ధిక్రమంలోనూ, సరుకుల ఉత్పత్తి విధానం లోనూ వచ్చిన చిట్టచివరిరూపం. ఇట్టి దశలో మార్కెట్టుద్వారా లక్షలకొలదిగా వున్న ఉత్పత్తిదార్లమధ్య ఏర్పడిన సామాజిక బంధాల్ని వ్యక్తిగత శ్రమకు కల్గిన సామాజిక స్వభావాన్ని ఈ ధనం మరుగు పరుస్తున్నది." *

---

* "మార్క్సు - ఎంగెల్సు - మార్క్సిజం" అన్న లెనిన్ గ్రంథం నుండి.

స్వీయోపయోగం ఉత్పత్తి విధానం నుండి కాపిటలిజానికి మారేటందుకై ధనం ఎంతో ఉపయోగపడింది. ఏదో ఒకవిధంగా బాగా సంపదలను కూడబెట్టి భాగ్యవంతులైన యజమానులు తమ సంపద నంతటినీ ధనరూపంలో ఉంచేవారు. ధనరూపంలోనే మొట్టమొదటగా కాపిటల్ (పెట్టుబడి) ప్రభవించుతుంది.

## ధనం యొక్క విధులు

సరుకుల ఉత్పత్తివిధానంలో ధనం చేయవలసిన పనులు చాలా వున్నవి. ప్రతి సరుకూ నిర్ణీతమగు కొంత డబ్బుకు అమ్మబడుతూంది. ఈ డబ్బు మొత్తాన్నే "సరుకు యొక్క వెల" అంటాము. కాబట్టి డబ్బురూపంలో చెప్పబడిన విలువయే ఖరీదు. సరుకు యొక్క విలువ డబ్బురూపంలో కొలవబడుతూంది.

ఏ సరుకు అయినా మారాలి అంటే, అది అమ్మబడనీయండి, కొనబడనీయండి. దాని విలువ డబ్బురూపంలో కొలవబడాలి. ఈ విధంగా లెక్కకట్టడమే సరుకులు మారటానికి ఆధారం. ఒక సరుకు అమ్మబడటానికీ, కొనబడటానికి పూర్వం దాని వెల తెలిసివుండాలి. కాబట్టి "విలువయొక్క కొలతగా" డబ్బు ఉపయోగ పడుతుంది.

ఒక సరుకుయొక్క విలువ ఆ సరుకును వుత్పత్తిచేయుటకై ఖర్చుపడిన శ్రమకాలంపై ఆధారపడి వుంటుందని లోగడ చూశాము. అయితే ఒక సరుకు విలువ శ్రమకాలం ద్వారా వ్యక్తం కాజాలదు. ఉదాహరణకు, ఒక జత చొక్కాలు తయారుచేయుటకు 20 గంటల కాలం పట్టింది అనుకుందాము. (కాలం చెప్పటంలో సామాజికంగా అవసరమైన కాలం అని గుర్తించాలి). ఆ జత చొక్కాల విలువ 20 గంటల కాలం అని చెప్పము వాటి వెల 10 రూపాయలు అని చెప్పతాము. ఈ విషయంగూడా లోగడనే స్పష్టపర్చబడింది. ఒక సరుకు విలువ మరొక సరుకు మధ్యవర్తిత్వంద్వారానే వెల్లడిఅవుతుందనికూడా చూశాము. అయితే యీమారకంలో ఒకటి జరుగుతుంది. బజారులోకి చొక్కాలు యెక్కువ వచ్చినవి. అట్టి సందర్భంలో జత చొక్కాలు రు. 10 లకు అమ్మబడవు. రు. 5 లకే అమ్మబడుతవి. అంటే 20 శ్రమ గంటలకాలం పట్టిన చొక్కాలు 10 శ్రమ గంటలకాలంలో ఉత్పత్తికాబడిన సరుకులకే మారుతవన్నమాట. ఈవిధంగా ఖరీదు యెప్పుడూ విలువకు అటూయిటూ ఊగుతూ వుంటుంది. ఒకపుడు విలువకన్న వెల కొద్దిగా ఎక్కువ ఉండవచ్చును. ఒకపుడు తక్కువ ఉండవచ్చును.

విలువను కొలిచే సాధనమైనపుడు ధనముకూడా ఒకసరుకు అయివుండాలి. దానికి విలువకూడావుండి వుండాలి. ఒక బరువుగల పదార్థంయొక్క బరువు యెంత వుందో తూచాలంటే బరువుగల మరొక పదార్థాన్నే వుపయోగించాలిగదా : అట్లే ఒకసరుకు విలువను ధనంద్వారా తెలుసుకోవాలంటే ధనానికికూడా విలువవుండి వుండాలి. అయితే, ఈ కొలతలో ధనం ప్రత్యేకంగా హాజరై వుండాలా ? అక్కర

లేదు. చిల్లిదమ్మిడీ జేబులో లేకపోయినా, ఎంత మొత్తం సరుకుల విలువనైనా, మనకు గా తెలుసుకొనవచ్చును. 10 చెప్పుల జతల ఖరీదు 40 రూపాయలు అని చెప్పవచ్చును. ఇందుకు వానికి 40 రూపాయలు ప్రత్యక్షంగా కనిపించనక్కరలేదు. కాబట్టి సరుకుల విలువలను కొలుచుటకై ధనం, సిద్ధాంతరీత్యా కొలపాత్ర మాత్రమే. అందుచే దానిని "అదర్శప్రాయమగు ధనం" అంటాము. కాబట్టి విలువలను కొలుచుటకై ధనంయొక్క మొత్తముతో అవసరంలేదని తేలుతోంది.

సరుకుకు ధనరూపంలో ఖరీదు కట్టబడినతర్వాత అది అమ్మబడాలి. అంటే ధనంతో మార్చబడాలి. ఈ విధంగా ధనసాధనంతో జరిగే సరుకుల చలామణీ అంటాము సరుకుల చలామణీ డబ్బు చలామణీతో జోడించబడివున్నదని స్పష్టంగా తెలుస్తూనే వున్నది. అమ్మేవాని చేతులలో నుండి సరుకు కొనేవాని చేతుల్లోకి పోతూనే, కొనేవాని చేతుల్లోనుండి డబ్బు సరుకును అమ్మేవాని చేతులలోనికి పోతుంది. అంటే యిక్కడ డబ్బు చలామణీ సాధనంగా, సరుకుల మధ్య మారకానికి సాధనంగా వుపయోగపడుచున్నది.

చలామణీ సాధనంగా తన పాత్రను నిర్వహించుటకై ధనం ప్రత్యక్షంగా హాజరుకావాలి. ఇక్కడ యిది "అదర్శప్రాయమగు ధనం"గా వుండటానికి వీలులేదు. నిజమగు ధనంగానే వుండాలి. "అదర్శప్రాయమగు" ధనంతో ఒక్క చిటికెడు వక్కముక్కకూడా కొనలేమన్న విషయం స్పష్టమే. లక్షరూపాయలంటే యెంతో ఏమేమి కొనవచ్చునో నీవు ఊహించవచ్చును. కాని ఒక్క కంపాస్ కొనాలంటే నీ ఊహాజనితమగు లక్షరూపాయలు యెందుకూ కొరగావు. కాని నీ దగ్గర నిజంగా ఒక్కరూపాయివుంటే, దానితో సరిసమానపు విలువకలిగిన యే ఒక్క వస్తువునైనా 20 పాళీలుగాని, 4 పళ్ళుగాని, 10 శేర్ల ఉప్పుగాని కొనవచ్చును.

అయితే, మారకం ఈ దశకువచ్చిన పిమ్మట మరొకమార్పు వస్తుంది ధనం సరకుల చలామణీ సాధనంగాను, విలువలకొలత పాత్రగానూ వుపయోగిస్తుందని చూశాము. కాని ధనంకున్న ఈ రెండు వుపయోగాలూ రెండూ రెండు రకాలు; చలామణీ సాధనంగా వుపయోగంవేరు: విలువయొక్క కొలపాత్రగా ఉపయోగంవేరు: చలామణీ సాధనంగా వుండటంలో ధనానికి తప్పనిసరిగా విలువ వుండనవసరంలేదు. చెప్పులు అమ్ముకొనేవాడు రూపాయలు తీసుకుంటున్నాడు. రూపాయిలలోవున్న విలువకొరకుకాదు, అతడు వాటిని తీసుకోవటం: చొక్కాలు కొనుక్కుంటానికి వాటిని సాధనంగా వుపయోగించుకొనుటకే. చొక్కాలు వస్తూ వున్నంతవరకూ రూపాయలలో విలువవున్నదా, లేదా అనేది వానికి అవసరంలేదు. చలామణీ సాధనంగా ధనం ఒకరి జేబులోనే వుండదు. లక్షలకొలది మనుష్యుల జేబులలో అటూ ఇటూ తిరుగుతూ వుంటుంది. సరుకుల ప్రవాహం ఒక దిక్కు పోతూవుంటే, వానికి ఎదురు దిక్కుగా ధనం పోతూవుంటుంది. కొనేవానికి

సరుకులు పోతే అమ్మేవానికి ధనం పోతూంది. ఇందుచే ధనం క్షణభంగురంగా చలామణిలో మాత్రమే వుంటుంది. ఇందుచేతనే చలామణి సాధనంగా ధనం వుపయోగపడేటప్పుడు బంగారం బదులు ఇతర వేటినైనా, అవి బాంకు నోట్లు కానీయండి, కరెన్సీ నోట్లు గానీయండి, రాగి, వెండి, నికెలు నాణెములు గానీయండి (వాటి తూకానికి సరిపోయిన రాగి, వెండి, నికెలు వాటిలో లేకపోయినా) సులభంగా వుపయోగించవచ్చు. బంగారం బదులు వాడేవాటిని విలువ చిహ్నములు అంటాము. వీటికి విలువ అనేదేలేదు. ఉన్నా, అవి ఎంత విలువ ప్రమాణాలను కొనగల్గు చున్నవో అంతకు చాలా తక్కువ విలువమాత్రమే కల్గివున్నది. 10 రూపాయల కాగితం నోటులో 1 జత చెప్పులు, 2 చొక్కాలు, 3 సబ్బులు, 5 శేర్ల వుప్పు కొన వచ్చును. కాని కొన్న చెప్పులు సబ్బులు, చొక్కాలు, వుప్పులలో వున్నంతవిలువ (మానవ శ్రమకాలం) 10 రూపాయల నోటులో వున్నదా? అందుచే సూర్యరశ్మి ప్రతిఫలించి కళాకాంతులనీనే చంద్రునివలెనే, నిజమగు బంగారంయొక్క విలువను ప్రతిఫలిస్తూ ఈ నాణెములు వగైరా చలామణి సాధనాలుగా వుపయోగపడుచున్నవి.

చలామణి సాధనంగా వుపయోగపడుటకు ధనం వ్యయంగా ప్రత్యక్షమై వుండాలి. ఒక వేయిరూపాయలను పెట్టి యిల్లు కొంటూంటే వేయిరూపాయలు ప్రత్యక్షంగా ఇవ్వబడవలసిందే. ఏదో కొంత వుంటే చాలదు. అయితే ఈ వేయి రూపాయలే 10 పుట్ల ధాన్యాన్నిగాని, 50 ఫౌంటెన్ పెన్‌లనుగాని, 10 గడియారము లను గాని, 5 సైకిళ్ళనుగాని కొనుటకు వినియోగపడగలవు. ఈ విధంగా వేయి రూపాయలు విలువగల్గిన సరుకులమధ్య చలామణి సాధనంగా వుపయోగపడగలవు. అయితే, ప్రజలెప్పుడూ ఒకరి తర్వాత ఒకరు కొనరు. అనేక లక్షలమంది లక్షల కొలది రకాల సరుకులను ఒకేకాలంలో కొంటూవుంటారు. కాబట్టి ఒకే కాలంలో, చలామణిలో ఎంత సరుకైతే వుందో, వాటి ఖరీదుకు సరిపోయినంత ధనం హాజరుగా వుండాలి.

అయితే, ఒక ఏడాదిలో అమ్మబడే సరుకుల మొత్తం ఖరీదు ఎంత వుంటుందో అంత మొత్తం ధనం వుండనక్కరలేదు. ధనం చలామణి వేగాన్నిబట్టి ఈ మొత్తం ఎంత వుండాలో నిర్ణయింప బడుతుంది. చలామణి అతివేగంగా జరుగుతూవుంటే తక్కువ మొత్తమే సరిపోతుంది: లేదా, ఇందుకు వ్యతిరేకంగా చలామణి మందకొడిగా వుంటే ఎక్కువ మొత్తం ధనంకావాలి. ఉదాహరణకు 10 మంది 1 గంటలో 10 సరుకులను అమ్మటం కొనటం సాగించారు. ఇందుకు వేయి రూపాయలు అవసరమైనాయి. ఈ వేయి రూపాయలే 10 సరుకుల చలామణీకి సరిపోయింది. కాని యిందులో 3 గ్గురు తమ దగ్గరకు డబ్బురాగానే పెట్టెలోపెట్టి దాచేసుకున్నారు. వీరి దగ్గర 300 రూపాయలు వుండిపోయినవి. కాని తక్కినవారికి సరుకులు కావాలి. అందుకై డబ్బు కావాలి. కాబట్టి అప్పుడు ఎక్కువ డబ్బు చలామణిలో వుండవలసి వస్తుంది.

సరకుయొక్క ద్వివిధ స్వభావంవల్ల అది ఒక వస్తువుగాను, ధనంగాను ఉండే స్వభావాలవల్ల సరకుల ఉత్పత్తి విధానంలో పరస్పర వైరుధ్యాలు ఇంకా పెరుగుతవి. సరకులు ఒకదానికొకటి సూటిగా మారేటప్పుడు అమ్మటం, కొనటం, రెండూ ఒకేసారి జరిగేవి. కాని మారకంలో ధనం ప్రవేశించిన పిమ్మట అమ్మకానికీ, కొనుగోలుకి ఎడబాటు వచ్చింది. రెండూ ఒకేసారి జరగనక్కరలేదు. సరకుల వుత్పత్తిదారుడు తన సరకులను అమ్మేసుకొన వచ్చును. కాని వెంటనే ఇతర సరుకులను కొనకుండా, వచ్చిన డబ్బును దాచేసుకోవచ్చును. అనేకమంది వుత్పత్తి దారులు ఒకేకాలంలో అమ్మేసుకు-దామని బయలుదేరితే, అదే సమయంలో వారు మళ్ళీ ఏ యితర సరుకులను కొనకుండా డబ్బును దాచుకొందామనుకుంటే, బజారులో పెద్ద సంక్షోభానికి బీజాలు పడ్డవన్నమాట. ఉత్పత్తిదారులు ఇంకా సరకుల నెక్కువ వుత్పత్తిజేసి, వాటిని అమ్ముకుందామనీ, డబ్బును దాచుకుందామనీ ప్రయత్నిస్తే సంక్షోభం తప్పకుండా వస్తుంది. అటువంటి సందర్భంలో అమ్మకానికి సరకులు ఎక్కువ ఉంటాయి. కొనేవారు వుండరు. సరకులు అమ్ముడుపోవు, ఆర్థిక సంక్షోభం వస్తుంది.

ధనాన్ని దాచటం ఎందుకు ? ఉత్పత్తిదారుడు సరకును అమ్మేసుకొని, వచ్చిన డబ్బును పెట్టెలో పెట్టి వుంచుతున్నాడు. అందుచేతనే "భౌతిక సంపదలకు విశ్వవ్యాప్తమగు ప్రతినిధిధనం" అని మార్క్స్ అన్నాడు. కాపిటలిస్టు ప్రపంచంలో డబ్బుంటే, ఏ క్షణాన అయినా ఏ సరకులోనికైనా దానిని మార్చుకో వచ్చును. సరకును అమ్ముకొని ధనంగా మార్చుకోవటం కష్టంగాని: ధనంవెచ్చించి సరకులుగా మార్చుకోవటం క్షణం. కాబట్టి సంపదలను కూడబెట్టటానికి ధనం చాలా వీలు. కాపిటలిస్టు వ్యవస్థలో లాభాల దాహం విపరీతం. కాబట్టి వీలైనంత ఎక్కువ ధనమును కూడబెట్టుటకు లాభాపేక్షయనేది ప్రోత్సహిస్తూ వుంటుంది.

కాపిటలిస్టు సమాజంలో, ధనాన్ని చూస్తూ మురిసిపోతూ వుండటానికై ధనం కూడబెట్టబడదు. కాపిటలిజం ప్రారంభదినాలలో అట్లాకూడా చెప్పకొని, దాన్ని చూచి మురుస్తూఉండటం ఉండేది. కాని నేడట్లుకాదు. ధనంయొక్క మెరుగుపూతలను చూచి, కాపిటలిస్టు భ్రమపడేది లేదు. తన సంపదలను వృద్ధిచేయాలంటే, ఉత్పత్తి నధికం చేయాలి; సరకుల నెక్కువగా త్వరగా సృష్టించాలి. కూలీలకు తక్కువ కూలీయిచ్చి ఎక్కువ పని చేయించుకోవాలి. ఇందుకై ధనాన్ని వెచ్చించాలిగాని, పెట్టెలో పెట్టుకు కులుకుతూఉంటే ఎట్లా ? అయినా, అధునాతన కాపిటలిస్టు పద్ధతులలోకూడా, ఒక్కొక్కప్పుడు ధనాన్ని కూడబెట్టటం అవసరమౌతూ వుంటుంది. వుత్పత్తిని విస్తరింపజేయాలంటే, ఒకేసారి చాలా ధనాన్ని వెచ్చించాలి; కాని ఈ ధనం మొత్తం, ఎంతోకాలంనుండి కూడబెడుతూ వుండగా పోగుపడేదేగదా!

ఇంతేగాదు. ధనం మరొకందుకు కూడా వుపయోగపడుతుంది. బాకీలు తీర్చటానికి ధనం సాధనమౌతుంది. అమ్మటం, కొనటం సాధారణంగా అరువుగా

జరుగుతూ వుంటాయి. ఒకరు ఒక సరుకునుకొని, దాని వెలను కొంతకాలానికి యిస్తాడు. ఈ విధంగా మారకంలో ధనంయొక్క విధులు ఎక్కువౌతాయి వ్యక్తిగత వుత్పత్తిదారుల మధ్య సంబంధాలు ఇంకా దృఢపడుతాయి. ఒకరిపై ఒకరు ఆధార పడటం ఇంకా ఎక్కువౌతుంది. ఇందులో, కొనేవారు ఋణగ్రస్థులౌతారు; అమ్మేవారు ఋణదాత అవుతారు. బాకీ తీర్చవలసిన సమయం సమీపించేసరికి, ఋణగ్రస్థుడు డబ్బును సంపాదించాలి. అందుకై ఏదోవిధంగా తన సరుకును అమ్మేసుకోవాలి. దురదృష్టంకొద్దీ అతని సరుకు అమ్ముడుపోదు; అతడు తన బాకీని తీర్చలేకపోతాడు. అప్పుడు ఈ ఋణగ్రస్థుడి వ్యాపారం, వుత్పత్తి దెబ్బతినటమేకాదు; ఈతనికి అరువు పెట్టిన ఋణదాత వుత్పత్తికూడా దెబ్బతింటుంది. ధనం చలామణీ సాధనంగా రాగానే సంక్షోభానికి బీజాలు పడినవి. అరువు యివ్వటం ప్రారంభమవటంతో ఈ సంక్షోభానికి మరింత తావు ఏర్పడింది.

బాకీలు చెల్లించ బడటానికి ధనం ఒక సాధనంగా తయారుకాగానే, చలామణీలో డబ్బు ఏమాత్రం వుండాలి అనే విషయంలో ఒక మౌతనపరిస్థితి ఏర్పడు చున్నది. ఇంతవరకూ చలామణీకి ధనం ఒక ఆశ్రయంగా వుండేది. ఇప్పుడు బాకీలు తీర్చటానికి కూడా ధనం ఉపయోగ పడుచున్నది. చలామణీకి మాత్రమే ఉపయోగ పడేటప్పుడు, చలామణీలో ఉన్న మొత్తం సరుకుల వెలకు సరిసమానమైన ధనం మొత్తంకూడా చలామణీలో ఉండవలసి వచ్చేది. కాని యిపుడు పరిస్థితులు మారినవి. చలామణీలోవున్న సరుకుల ఖరీదులో కొంతభాగం వెంటనే చెల్లింపబడదు. సరుకులు అరువుగా యివ్వబడుతవి. కాబట్టి చలామణీలో వున్న సరుకుల మొత్తం ఖరీదుకు సమానమైన ధనం ఉండవక్కరలేదు. అయితే, లోగడ అరువు యివ్వబడి, ఇప్పుడు బాకీ తీర్చవలసివుంటే, ఆ చెల్లింపుకు సమానమైన ధనం ఉండవలసి వుంటుంది. ఒక్కొక్కప్పుడు అమ్మేవారు, కొనేవారు పరస్పరం బాకీలు ఉన్నప్పుడు లెక్కలు సరిజూచుకొని, బాకీ శేషమునే చెల్లిస్తారు. అట్టి సందర్భాలలో బాకీ శేషమునకు అవసరమైన ధనం మాత్రమే కావాలిగాని ఉభయుల మధ్య జరిగిన మారకము కంతటికీ తగిన ధనం అక్కరలేదు. ఈ విధంగా అనేక సంగతి సందర్భాలనుబట్టి చలామణీలో ఉండవలసిన ధనం మొత్తం నిర్ణయింపబడుతుంది.

ఇంతేగాదు; ధనం విశ్వవ్యాప్తమయినది. వివిధ దేశాల మధ్య అనేక సరుకుల మధ్య వ్యాపారం జరుగుతూ వుంటే, ఒక్క బంగారాన్నే ఏ దేశమయినా అభ్యంతరం చెప్పకుండా తీసుకునేది. ఉదాహరణకు : ఇంగ్లాండునుండి అమెరికాకు సరుకులు ఎగుమతియైనవి. అమెరికాకూడా ఇంగ్లాండుకు కొంత సరుకును పంపింది. ఇంగ్లాండు పంపిన సరుకుల ఖరీదు ఎక్కువైతే, ఆ తేడాసొమ్ముకు అమెరికా బంగారం రూపంలో ఇంగ్లాండుకు యివ్వాలి.

బంగారం నాణెములు బదులు కాగితం నోట్లు యివ్వటం ఈనాడు మామూలైనది. ఒకదేశంలో సరుకుల చలామణీ ఎంత వుందో అంతకు సరిపడు కాగితపు

నోట్లు వేస్తారు. ఆ నోట్లకు ఎప్పుడుబడితే అప్పుడు బంగారం క్రింద మార్చుకుంటా
నికి పీలువుంటే, అప్పుడు ఆ నోట్ల కొనుగోలుశక్తి స్థిరంగా వుంటుంది. కాని
కాపిటలిస్టు దేశాలు ఒక్కొక్కప్పుడు, ముఖ్యంగా యుద్ధకాలములలోనూ, ఇతర
ఒడుదుడుకు సమయాలలోనూ తమ అవసరాలకు సరిపడేటట్లుగా నోట్లను ముమ్మ
రంగా వేస్తారు. ఈ విధంగా ధనం విలువ తగ్గించబడుతోంది. ఉదాహరణకు : ఒక
దేశంలో సరుకుల చలామణీకై 10 కోట్ల రూపాయలు కావలసి వుంటుంది. కాని
యుద్ధావసరాలలో ప్రభుత్వం 30 కోట్ల రూపాయల నోట్లను చలామణీలో పెట్టింది.
అంటే సరుకులను కొంటానికి 10 కోట్ల రూపాయలకు బదులు 30 కోట్ల రూపా
యలు వుంటాయి. 1 రూపాయికి ఇచ్చే సరుకు ఇప్పుడు నోట్ల ముమ్మరంవల్ల
3 రూపాయలు అవుతుంది. ఈ విధంగా ధనం విలువ పడిపోతుంది. ఆర్థిక సంక్షోభ
దినాలలో ఈ విధంగా ధనం విలువ తగ్గింపును బూర్జువా ప్రభుత్వాలు అవలంబిస్తు
న్నవి. 1930 - 34 ఆర్థిక సంక్షోభ దినాలలో చిన్నచిన్న దేశాలు ముందుగా నోట్ల
ముమ్మరాన్ని ప్రారంభించినవి. త్వరలో ఇంగ్లండు, అమెరికాల వంటి మిక్కిలి
పెద్ద కాపిటలిస్టు దేశాలు కూడా అనుసరించినవి.

## విలువయొక్క సూత్రం - కాపిటలిస్టు సరుకు ఉత్పత్తి విధానం యొక్క చలన సూత్రం

కాపిటలిస్టు ఉత్పత్తి విధానంలో వేర్వేరు ఉత్పత్తిదారుల మధ్య ఏర్పడిన సామాజిక బంధం మరుగుపడి వుంటుంది. ఈ వ్యక్తుల మధ్య వుండే సామాజిక సంబంధం సరుకుల మధ్య మారకంగా కన్పిస్తుంది. మానవ శ్రమ యీ ఉత్పత్తి విధానంలో విలువ రూపం ధరిస్తోంది. సరుకులు వాటి వాటి విలువలనుబట్టి అనగా వాటిలో దాగివుండే సామాజికంగా అవసరమైన సగటు సర్వసామాన్య శ్రమ (social necessary abstract labour) ను బట్టి ఒకదానితో ఒకటి మారుతవి. కాపిటలిస్టు సరుకుల ఉత్పత్తి విధానంలో వున్న పరస్పర వైరుధ్యాలన్నీ సరుకుల లోనూ, వాటి విలువలోనూ, వాటి మారకంలోను బీజరూపంలో కనిపిస్తవి.

కాపిటలిస్టుల ఉత్పత్తి విధానము యొక్క చలన మంతటికీ ప్రధాన సూత్రం విలువ. సరుకుల చలనంద్వారా ఈ విలువ కన్పిస్తుంది. విలువలో బీజ రూపంలోవుండే పరస్పర వైరుధ్యాలన్నీ ఈ సరుకుల చలనంలో ఇంకా బాగా ప్రస్ఫుటమౌతాయి. ఆర్థిక సంక్షోభ సమయంలో ఈ పరస్పర వైరుధ్యాలు బైట పడుతాయి. కాపిటలిజంవల్ల తప్పనిసరిగా ఈ వుత్పత్తిలో ఏర్పడే అరాజకం, దాని నగ్నరూపంలో ఈ సంక్షోభ కాలంలో కన్పిస్తుంది. కాపిటలిజం యొక్క నాశనానికి తప్పనిసరిగా దారితీసేటటువంటి పరస్పర వైరుధ్యాలు - స్పష్టంగా బైటపడతవి.
ఈ విధంగా సరుకుల వుత్పత్తి క్రమంలో కాపిటలిస్టు విధానం వచ్చిన పిమ్మట కాపిటలిజం వృద్ధిపొందినకొలదీ, సరుకులలోవున్న పరస్పర వైరుధ్యాలు, వాటి

విలువలోవున్న పరస్పర వైరుధ్యాలు బైటపడి, అంతకంతకూ పెరుగుతాయి. కాపిట లిజం ప్రదిహ్మాండమగు అడుగులు వేసుకుంటూ వచ్చిన అభివృద్ధి క్రమంలో ఈ పరస్పర వైరుధ్యాల క్రమాభివృద్ధిగూడా గోచరిస్తుంది.

ఏ విధంగా సరుకుల ఉత్పత్తిలోవుండే పరస్పర వైరుధ్యాలు పుట్టి, పెరిగినవో, వీటి చారిత్రకాభివృద్ధి మార్క్సు స్పష్టం జేశాడు. వీటిని తెలియజేస్తూ లెనిన్ ఇట్లా వ్రాశాడు :

"బూర్జువా అర్థిక శాస్త్రవేత్తలు, సరుకుల మారకాన్ని వస్తువుల మధ్య సంబంధంగా మాత్రమే చూశారు. కాని మార్క్సదీనిని "మనుష్యుల మధ్యసంబంధం" అని చూపించాడు. మనుష్యుల మధ్య ఏర్పడే సంబంధాలను మార్కెటు ద్వారాజరిగే సరుకుల అమ్మకం తెలియజేస్తుంది. ఈసంబంధం అంతకంతకూ దృఢమౌతున్నదనీ, అర్థిక జీవనంలో ఒక్కొక్క ఉత్పత్తిదారుడూ కలిసి, సంఘం మొత్తంలో ఐక్యమై పోరాడుతున్నాడనీ "ధనం" నిరూపిస్తున్నది. ఈ సంబంధం యొక్క వృద్ధి ఫలితమే "కాపిటల్ (పెట్టుబడి)." ఈ దశ వచ్చేసరికి "మానవ శ్రమశక్తి కూడా" ఒక సరుకే అయింది....

"కార్మిక శ్రమవల్ల సృష్టింపబడే కాపిటల్, కార్మికుల నంతకంతకూ నొక్కివేస్తుంది. అల్ప యజమానులను నాశనం జేస్తుంది. నిరుద్యోగుల పటాలాలను సృష్టిస్తుంది....

అల్ప ఉత్పత్తిని కాపిటల్ దెబ్బకొట్టటం ద్వారా శ్రమ యొక్క ఉత్పత్తి శక్తిని అధికం జేస్తోంది. మరీ పెద్ద కాపిటలిస్టుల ముఠాలు గుత్తాధికారాన్ని సంపాదించుటకు వీలును కల్గజేస్తుంది ఉత్పత్తి అంతకంతకూ సామాజికమౌతుంది. లక్షల కొలదీ కార్మికులు ఒక నిర్దిష్టమగు అర్థిక నిర్మాణంద్వారా జతగూర్చబడతారు. కాని వీరి సమిష్టి శ్రమ ద్వారా ఉత్పత్తియైన వస్తుసముదాయం కొలదిమంది కాపిటలిస్టుల హస్తగతమౌతుంది. ఉత్పత్తిలో అరాజకం, అర్థిక సంక్షోభములు, బజారుల కొరకై పిచ్చివేట, అశేష ప్రజాసామాన్యం యొక్క జీవితాలు అస్థిరమగుట - ఇవన్నీ వృద్ధియౌతాయి." *

కాపిటలిజంలోని: అంతర్విభేదాల వృద్ధితోబాటుగానే, శ్రామికవర్గ విజయమునకు బీజాలు కూడా నాటబడుతవి.

"కాపిటలిజం ప్రపంచమంతటా విజయం పొందింది. కాని ఈ విజయం శ్రామికవర్గ విజయానికి నాంది మాత్రమే" అని లెనిన్ వ్రాశాడు. †



* "మార్క్సిజం యొక్క మూడు మూలస్థానాలు మూడు అంతర్విభాగాలు" అన్న లెనిన్ గ్రంథం నుండి.

† పై గ్రంథంలోనే.

# అధ్యాయం 4

# కాపిటలిస్టు దోపిడి యొక్క సారం

## కాపిటల్‌వల్ల ఏ విధంగా కార్మికులు దోచుకోబడుతున్నారు; ఒక సరుకుగా శ్రమశక్తి

ప్రతి కాపిటలిస్టు దేశంలోనూ బూర్జువావర్గం కార్మికవర్గాన్ని దోచుకుంటూ వుంటుంది. ప్రతి కాపిటలిస్టు దేశంలోనూ ఒకదాని కొకటి ఎదురు బొదురుగా నిలబడే ప్రప్రధాన వర్గాలు రెండే. అవి బూర్జువా, కార్మికవర్గాలు. కార్మికులు శ్రమ జేసి వుత్పత్తి చేసిన ఫలితాల్ని బూర్జువాలీ దోచుకుపోడానికి ఏమి పరిస్థితు లేర్పడినవో మనం గమనించాలి. కాపిటలిస్టు దోపిడి యొక్క రహస్యం ఎందులో యిమిడి వున్నదో మనం చూడాలి. దీనినే శ్రామికవర్గ విజ్ఞాన అధినేయగు మార్క్సు మనకు తేటతెల్లంగా చూపించాడు.

కాపిటలిస్టు దోపిడి యొక్క మూల రహస్యం ఏమిటి? అది యేవిధంగా ఏర్పడింది? కాపిటలిస్టులు ధనవంతులగుటకు కారణంఏమిటి? ఏ అదృశ్య రూపాలగు శాళ్ళతోనో కార్మికుడు తన దోపిడీగానిచే బంధింపబడి వున్నాడు. ఒకవర్గం నానాటికీ దరిద్రమౌతుంటే మరొక వర్గం ఎలా సంపన్నమౌతుంది?

ఈ ప్రతి ప్రశ్నకూ మార్క్సిజం స్పష్టమైన, సూటియైన జవాబునిస్తుంది. కాపిటలిస్టు ప్రపంచం యొక్క లోగిలి యెట్లా కట్టబడిందో, దాని అభివృద్ధికి కారణములైన స్ప్రింగులు కాపిటలిస్టు కట్టడంలోనే ఎక్కడ ఎట్లా వున్నవో, అవి విధిగా ఎలా నాశనమౌతుందో వీటినన్నింటినీ మార్క్సు సిద్ధాంతాలు బోధించుతాయి.

గత అధ్యాయంలో స్వీయోపయోగ ఉత్పత్తి విధానాన్ని గూర్చి దాని ప్రప్రధాన సూత్రమైన "విలువ సూత్రము"ను గూర్చి అభ్యసించాము. స్వీయోపయోగ ఉత్పత్తి విధానం నుండే కాపిటలిజం యొక్క పిండోత్పత్తి జరుగుతుంది. స్వీయోపయోగ ఉత్పత్తి విధానం పెరిగి పెద్దదై క్రమంగా కాపిటలిజం క్రిందకు మారుతుంది. ఈ సరుకుల వుత్పత్తి విధానం యొక్క అభివృద్ధికి సంబంధించిన సూత్రమే "విలువ సూత్రం". ఈ అభివృద్ధియే కాపిటలిజమునకు దారితీస్తుంది.

ఉత్పత్తి విధానం అభివృద్ధి అవుతున్నకొలదీ ప్రాథమికమైన విలువ సూత్రంయొక్క బలంకూడా పెరుగుతుంది.

కాపిటలిజం అంటే ఏమిటి? అనే ప్రశ్నకు లెనిన్ ఈ క్రింది జవాబు ఇచ్చాడు.

"సరుకు వుత్పత్తి విధానం దాని ఉన్నతదశకుపోయి, శ్రమశక్తియే ఒక సరుకుగా తయారుకావటాన్ని కాపిటలిజం అంటాము." *

సరుకుల వుత్పత్తి విధానంలో వస్తువులు వుత్పత్తిదారుల స్వంత వుపయోగమునకుగాక అమ్మకానికై తయారుచేయబడుతవి. ఇట్టి సరుకుల వుత్పత్తినీ, మారకాన్నీ విలువసూత్రం శాసిస్తుంది. సరుకులు వాటి విలువనుబట్టి, అనగా వాటి నుత్పత్తిజేయుటకు వినియోగమైన సామాజికంగా అవసరమగు శ్రమనుబట్టి మారుతూ వుంటాయి.

కాపిటలిజం క్రింద సరుకుల వుత్పత్తి విధానమూ, దాని కనువర్తించే సూత్రాలు రద్దుకావు. పైగా, కాపిటలిజంలోనే సరుకుల వుత్పత్తివిధానం ఉచ్ఛదశకు చేరుకుంటుంది. దాని సూత్రాలు మరింత దృఢపడుతవి. అందుచే సరుకుల వుత్పత్తి విధానంయొక్క సూత్రములపైనా, మరీ ముఖ్యంగా విలువ సూత్రంపైనా కాపిటలిస్టు వుత్పత్తి విధానంయొక్క సూత్రాలు ఆధారపడివున్నవి.

"కాపిటలిస్టు ఉత్పత్తి విధానంలో మొదటినుండీ రెండు ప్రత్యేక లక్షణాలు గోచరిస్తవి. ఒకటి: ఆ విధానంలో వస్తువులు సరుకులుగా అనగా అమ్మకానికే వుద్దేశింపబడినవిగా తయారు చేయబడుతవి. అయితే ఇందులో ప్రత్యేకత ఏమీలేదు. ఇతర ఉత్పత్తి పద్ధతుల నుండి ఇంతమాత్రం చేతనే ఇది వేరుగాదు దీనిలో వున్న ప్రత్యేక లక్షణం ఏమిటంటే, ఇది పూర్తిగా ప్రప్రథానంగా సరుకులనే తయారు చేస్తుంది. ఇట్టిస్థితి వచ్చిందిఅంటే, కార్మికుడు కూడా సరుకులను అమ్మేవాని వేషాన్ని ధరిస్తాడు. అతడు తన శ్రమశక్తిని అమ్ముకుంటానికి స్వేచ్ఛను కలిగి వుంటాడు. కూలినవిగా శ్రమ విశిష్టత పొందుతుంది....."

"రెండు: కాపిటలిస్టు ఉత్పత్తివిధానం యొక్క ఇంకో ప్రత్యేక లక్షణం ఏమిటంటే, ఉత్పత్తి యొక్క ప్రధాన లక్ష్యం, ఉత్పత్తిని సాగించుటకుండే నిపరీత ప్రోత్సాహం, అదనపు విలువను సృష్టించాలనే. కాపిటల్, ప్రధానంగా కాపిటల్‌నే సృష్టింస్తుంది. కాని అదనపువిలువ సృష్టించ బడునంతవరకే ఈ విధంగా కాపిటల్ పునరుత్పత్తి జరుగుతుంది". †

కాపిటలిజంలో సరుకుల ఉత్పత్తి పద్ధతియొక్క నిర్మాణం ఇంకా పెరుగుతుంది. ఇంతకు పూర్వం అపురూపమైనవీ, స్వోపయోగ ఉత్పత్తి

---

* "కాపిటలిజం యొక్క ఉచ్ఛదశ, సామ్రాజ్యవాదం" అన్న గ్రంథం నుండి.

† మార్క్సు "కాపిటల్" నుండి.

విధానంలో లేవట్టిదీఅగు ఒక "కొత్తసరుకు" అవతరించుతుంది. ఇదే "శ్రమశక్తి." ఇది ఎటువంటి సరుకు ?

మార్క్సు ఈ ప్రశ్న కిట్లా జవాబిచ్చాడు :

"ఏదైనా ఒక ఉపయోగపు విలువను తయారు చేయాలంటే, మానవుడు కొంత శ్రమపడుచున్నాడు. ఇట్టి శ్రమ శారీరకమైనదిగాను, మానసికమైనదిగాను వుంటుంది. కాబట్టి ఒక ఉపయోగకరమైన వస్తువు ఉత్పత్తి చేయుటకెంత శారీరక, మానసిక శ్రమను వెచ్చిస్తున్నాడో యిదంతా కలపిన మొత్తమునే శ్రమశక్తి అని అంటున్నాము." •

ఇంకాసూక్ష్మంగా చెప్పాలంటే, మానవుడు శ్రమచేయగల సామర్థ్యమును, ఉత్పత్తి కార్యములను సాగించు సామర్ధ్యమును శ్రమశక్తి అంటాము.

మార్క్సు యిలా అంటాడు :

"తాను ఉపయోగించుకొనుటకై కాపిటలిస్టు, శ్రమశక్తిని కొంటున్నాడు. ఉపయోగంలో వున్న శ్రమశక్తియే శ్రమ. ●

కాపిటలిజం క్రింద శ్రమశక్తి గూడా ఒక సరుకుగా తయారౌతుంది. కాని శ్రమశక్తి ఎల్లప్పుడూ సరుకుగానే వున్నదా ? లేదు. ఉదాహరణకు : ఒక చిన్న ఉత్పత్తి దారుని తీసుకోండి. అతడు తన స్వల్పసాటి భూమిలోనో, తన చిన్న కార్ఖానాలోనో స్వయంగా కష్టించుచుంటాడు. తన ఉత్పత్తి వస్తువులను అమ్ము కుంటాడేగాని, తన శ్రమశక్తిని ఇంకొకరికి అమ్ముకోడు. తన శ్రమశక్తిని తానే ఉపయోగిస్తున్నాడు. ఇది ఎందువల్ల సాధ్యమవుతోంది ? అతడికి స్వయంగా పని జేసుకుంటానికి కొద్దిగానైనా భూమియో, పరికరాలో వుంటున్నవి. వాటి కాతడే యజమాని. వాటితో అతడు పనిచేస్తున్నాడు. అతని భూమిగాని, పనిముట్లను గాని తీసెయ్యండి. ఏమి చేస్తాడు ? తన శ్రమశక్తిని స్వంత పరిశ్రమలలో వినియోగించ గలడా ? స్వంత పరిశ్రమలే, స్వంత కార్ఖానాలే లేనప్పుడు వాటిలో స్వయంగా ఎట్లా కష్టించ గలడు ?

అయితే ఇంకా వారేమి కావాలి ? ఏమిచేయాలి : కడుపులు మాడ్చుకొని చావకుండా వుండాలంటే వారు పనిజేయాలి. ఇందుకై ఫ్యాక్టరీలు, భూఖండాలు, గనులు, రైల్వేలు మున్నగు వాటి కధిపధులయిన కాపిటలిస్టుల దగ్గర పనివ్వమని ప్రాధేయపడాలి. కాపిటలిస్టు దగ్గర పనికి కుదురుతున్నాడంటే అర్థమేమిటి ? ఒకడు తన శ్రమశక్తిని అమ్ముకొంటున్నాడన్నమాట.

ఈ విధంగా కాపిటలిజం జనించుటకు ముందుగా కొన్ని "పరిస్థితులు" ఏర్పడి వుండాలి. సమాజంలో కొందరు మాత్రమే వుత్పత్తి సాధనా లన్నింటిపైన

• "కాపిటల్" నుండి.

● "కాపిటల్" నుండి.

పెత్తనాన్ని కలిగియుండాలి రెండో ప్రక్కన తమ శ్రమశక్తిని అమ్ముకొనక తప్పని ఒక వర్గం ప్రజలు ఏర్పడి వుండాలి.

కాపిటల్ వుత్పత్తికి చారిత్రకంగా ఏర్పడిన పూర్వ పరిస్థితులివి. ఒకటి : సరుకుల ఉత్పత్తి విధానం బాగా అభివృద్ధి జెంది వుంటుంది. సామాన్యంగా ఇట్టి విధానంలో కొలదిమంది చేతులలో ధనం ఎక్కువగా పోగుపడి వుంటుంది. రెండు : స్వతంత్రులయిన కార్మికులు వుండాలి. ఈ 'స్వతంత్రత'కు రెండు అర్థాలు ఉంటాయి. వారు తమ శ్రమశక్తిని అమ్ముకుంటానికి ఎట్టి అభ్యంతరాలు నిర్బంధాలు లేకుండా స్వతంత్రులుగా ఉండాలి. వారు భూమిలేక ఇతర ఉత్పత్తి సాధనాలు పేటిసుండి గూడా స్వతంత్రులుగా, అంటే ఎట్టి ఆస్థి లేనివారుగా, అనగా తమ శ్రమశక్తిని అమ్ముకొనుటద్వారా తప్ప వేరే ఏ విధంగానూ పొట్టలను పోషించుకో లేని శ్రామికులుగా ఉండాలి." *

## పురాతనపు సంవత్పంచయము

అంతకు పూర్వమున్న సాంఘిక వ్యవస్థ-అనగా ఫ్యూడల్ (జమిందారీ) ఆర్థిక వ్యవస్థయొక్క శిథిలాలమీదనే కాపిటలిజం నిర్మింపబడింది. సరుకుల అల్ప ఉత్పత్తి విధానం అనే భూమి మీదనే కాపిటలిజం పెరుగుతుంది. అంతకు పూర్వం వున్న సామాజిక సంబంధాలలో కాపిటలిజం చాలా తీవ్రమగు మార్పు కొనివస్తుంది.

కాని నిజానికి కాపిటలిస్టులు ఎట్లా భాగ్యవంతులయినారు ? కాపిటలిస్టు శకం ప్రారంభ దినాలలో, అనగా సుమారు 300, 400 ఏండ్ల క్రితం, ఆ నాడు యూరపులో అగ్రగణ్యంగా ఉన్న పోర్చుగల్, స్పెయిన్, హాలెండు, ఇంగ్లాండు దేశాలు విదేశాలతో సముద్రాల మీదుగా పెద్ద వ్యాపారాన్ని సాగిస్తూ ఉండేవి. సాహసులగు అన్వేషకులు తూర్పున వున్న సంపన్న దేశమగు భారతదేశం, చైనా లకు మాతనంగా అమెరికాకు సముద్ర మార్గాలను కనిపెట్టారు. తుపాకి మందు కనిపెట్టుటచే, దాని సహాయంతో ఈ ఐరోపాదేశీయులు ఆసియా, అమెరికా దేశాల ప్రజలను సులభంగా ఓడించి, వాటిని స్వాధీనం జేసుకొన్నారు. అమెరికా ఖండ మంతా పెద్ద వలసదేశంగా చేయబడింది. తాము స్వాధీనం జేసుకొన్న విదేశాలను వివరీతంగా దోపిడీచేయు, ఈ ఐరోపాఖండ దేశాలు, అందులోనూ ముఖ్యంగా ఇంగ్లాండు ప్రారంభించినవి. ఈ విధంగా ఐరోపా ఖండంలోని కొన్ని దేశాలలో పూర్వమే ధనం కూర్చబడివున్నది. ఈ విధంగా కాపిటలును (పెట్టుబడిని) బాగా పోగుకూర్చి వుంటానికి మరోమార్గం యుద్ధాలు. ఐరోపా ఖండంలోనే ఒక దేశానికి మరో దేశానికి యుద్ధం జరిగినప్పుడల్లా, విజయులు ఓడిపోయిన దేశాన్ని పూర్తిగా కొల్లగొట్టేవారు. ఇంకా ఇతర మార్గాలకూడా ఈ కాపిటల్ పోగుచేయబడింది. వడ్డీ వ్యాపారంద్వారా, దేశంలోనేవున్న ప్రజాసామాన్యాన్ని దోచుకోవటం, దోపిడీ

* మార్క్సు 'కాపిటల్' నుండి.

ధరల కమ్మటంద్వారా విదేశాలను కొల్లగొట్టటం, ఒక్కొక్కప్పుడు ప్రత్యక్షంగా దోచుకోవటంద్వారాను (సముద్రాలపై ఓడలను కొల్లగొట్టటంద్వారా) కాపిటల్ పోగుజేయబడింది. ఈ విధంగా కాపిటలిజం ప్రారంభదినాలలోనే విశేషంగా సంపదలను కూడబెట్టటాన్ని పురాతనపు సంపత్సంచయ మంటాము

కాని కాపిటలిస్టు ఉత్పత్తి పద్ధతి పూర్తిగా నెలకొల్పబడాలంటే సంపదలను కూడబెట్టడం ఒక్కటే చాలదు. సన్నాహాలలో సగం మాత్రమే పూర్తి అయిన వన్నమాట. పూర్తికావాలంటే తగినంతమంది "స్వతంత్రులగు కూలీలు" కావాలి.

తాము స్వతంత్రంగా కృషిజేసుకొని బ్రతకడానికి వీలుంటే యెవ్వరూ కాపిటలిస్టుల క్రింద పనిజేస్తానికి ఒప్పుకోరు. కాబట్టి చిన్న చిన్న ఉత్పత్తిదార్లందరూ కాపిటలిస్టులకు పనిజేయాలంటే వారి ఉత్పత్తి సాధనాలను వారికి లేకుండాజేయాలి. బజారులో అమ్ముకోవాలంటే వారికి శ్రమశక్తి మినహా మరే స్వంతఆస్థి లేనట్లుగా జేయాలి. ఇంతేగాదు, వారు వ్యక్తిగతంగా స్వతంత్రులుగా ఎక్కడికిబడితే అక్కడికి పనిని వెతుక్కుంటూ వెళ్ళటానికై అనువుగా వెనుక ఏమీ బాదర బందీ లేకుండా స్వేచ్ఛాజీవులుగా వుండాలి. స్వేచ్ఛగా తమ శ్రమశక్తిని అమ్ముకుంటానికి వీలుగా వుండాలి.

ఈ విధంగా శ్రమశక్తి స్వేచ్ఛగా అమ్ముకుంటానికి, కాపిటలిజానికి పూర్వం వున్న వ్యావసాయిక బానిసత్వం పద్ధతిలో వీలుండేదికాదు. కాపిటలిజానికి పూర్వం ఐరోపాలో వ్యావసాయిక బానిసత్వం వుండేది. దాని క్రింద రైతులు దాదాపు బానిసలవలె భూమికి కట్టబడి వుండేవారు. వ్యవసాయాన్ని వదలి, తమ ప్రభువులను వదలి వెళ్ళటకు వారికి వీలుండేదికాదు. అందుచేతనే కాపిటలిజం అంతకు పూర్వంవున్న వ్యావసాయిక బానిసత్వాన్ని నాశనం జేసింది.

వ్యావసాయిక బానిసత్వం నుండి రైతులను ఉద్ధరించుటతో కాపిటల్ యొక్క ప్రయోజనాలు పూర్తియగుటలేదు. ఆ విముక్తి పొందిన రైతు "కాపిటలిస్టు" యొక్క కర్మాగారంలో "పనిచేయునట్టి పరిస్థితులను" తనకు కల్పించాలి. కుటీర పరిశ్రమలను నాశనం చేయడం ద్వారా వృత్తులు పోగొట్టుకున్న వృత్తి నిపుణులు కొంతమంది కూలీలుగా తయారౌతారు. నిజమే; కాని వారి సంఖ్య చాలదు. పెద్ద పెద్ద పరిశ్రమలలో వేలకొలది కార్మికులు పనిజేస్తూ వుండవలసియుంది. అంతేగాక ఎల్లప్పుడూ కొంతమంది కార్మికులు పనిలేక నిలవ (రిజర్వు)లో ఉంటూ వుండాలి. దీని ఉపయోగం ముందు ముందు చూస్తాము.

అందుచే వ్యావసాయిక బానిసత్వంనుండి "విముక్తి"ని పొందటంతో బాటు అంత ముఖ్యమూ అయిన "విముక్తి"ని మరొకదానిని కూడా పొందుతాడు. అతడు పనిజేసే భూమినుండి అతడు "విముక్తి" నొందించబడుతాడు. మామూలుగా రైతుకు వుండేది జానెడు భూమి; దానినైనా సామాన్యంగా అతడు కొనుక్కొన

వలసినదే. అందరినీ పోషించగల్గినంత భూమి లేకపోవుటచే రైతులు తప్పనిసరిగా కాపిటలిస్టుల చేతులలో పడవలసినదే. పేద్యార్హమైన భూమికి భారమైన "అదనపు" జనం గ్రామాలనుండి తరలివెళ్ళి పట్టణాలలోవుండే కార్మికుల రిజర్వుమ వృద్ధి చేస్తారు.

ఈ విధంగా పురాతనపు సంపత్సంచయము కాపిటలిజం యొక్క అవతరణకు అవసరమగు సాధన సంపత్తి నంతటినీ ముందుగానే సమకూర్చివుంటుంది. ఇప్పటి పరిస్థితులు లేకుండా కాపిటలిజం ప్రభవించనే లేదు. ఈ పరిస్థితులేమిటో ఇప్పుడే మనం చూశాము. ఒకటి : సమాజంలోని కొలదిమంది చేతులలో విశేషముగా సంపదలు పోగుపడి వుండటము. రెండు : అధిక సంఖ్యాకులు ఉత్పత్తి సాధనాలపై పెత్తనాన్ని కోల్పోయి, వేరు జీవనోపాధిలేక తమ శ్రమశక్తినే అమ్ముకొనవలసి యుండటం. ఈ రెండు పరిస్థితులు ఏర్పడినప్పుడే కాపిటలిజం ప్రభవించ గలదు. పురాతనపు సంపత్సంచయము గావించిన మహత్కార్యమల్లా "ఉత్పత్తిదారుని అతడి ఉత్పత్తి సాధనములనుండి దూరం చేయటమే." ఎంతో దౌర్జన్యంతోనూ, క్రూర పైశాచిక పద్ధతులతోనూ ఇట్టి ఎడబాటు తేబడింది. ఇట్టి పరిస్థితులవల్ల కాపిటలిజం ప్రభవించిన పిమ్మట అంతర్గత శక్తులవల్లనే కాపిటలిజం వేళ్ళూనుకొని మరింత బలపడి, పెరిగి పెద్దదైనది. కార్మికులు ఒక ఫ్యాక్టరీలో పనుంచుని కష్టపడుతున్నారంటే కాపిటలిస్టు యొక్క సంపదను వృద్ధి చేస్తున్నారన్నమాట. అదే సమయంలో వీరి భాగ్యం మాత్రం "ఎంత పెరిగినా గొర్రెకు బెత్తెడుతోక" అన్నట్లుగా వుంటుంది. వారికి కూలిపని చేసుకొనే గీతమాత్రం చెరగదు.

## ధనం కాపిటల్ (పెట్టుబడి)గా మారిన విధం

మొట్టమొదటగా కాపిటల్ ధనరూపంలో ప్రభవించుతుంది. అందుచే కుటీర పరిశ్రమలనుండి కాపిటలిజమునకు మారుటలో ధనం చాలా ప్రముఖ పాత్రను నిర్వహిస్తుంది. కాని సరకుల ఉత్పత్తి క్రమంలో, ఒకదశలో ధనం కాపిటల్‌గా మారుతుంది. సరుకుల వుత్పత్తి విధానంయొక్క క్రమం స (సరుకు)-ధ (ధనం)-స (సరుకు)గా వుండేది. అంటే, ఒక సరుకును మరొక సరుకును కొనుటకై అమ్ముటగా వుండేది. తర్వాత ఈ క్రమం తల్లక్రిందులైనది. ధనం కాపిటల్‌గా మారిన సందర్భంలో ఇట్లావుంటుంది : ధ (ధనం)- స (సరుకు)- ధ (ధనం) అంటే (లాభానికై) అమ్ముటకై కొనటం.

ఈ రెండు పద్ధతులలోనూ వున్న తేడా ఏమిటి ? స-ధ-స అన్న పద్ధతి కుటీర పరిశ్రమ కాలంలో వుండేది. అప్పుడు ఒకసరుకు మరొక సరుకుకై మార్పబడేది. అప్పుడు ధనం సరుకుల మారకానికి ఒకసాధనం మాత్రమే. మారకము యొక్క అవసరం స్పష్టమేగదా ? చెప్పులుకుట్టే ముచ్చివాని దగ్గర 2 జతల చెప్పులున్నవి. అతడికి ధాన్యం కావాలి. కాబట్టి తనదగ్గరవున్న చెప్పులను రైతుకిచ్చి,

రైతుదగ్గరవున్న ధాన్యాన్ని తానుపొందాలి. అంటే ఒకఉపయోగపు విలువను మరొక ఉపయోగపు విలువతో మార్చుకొనుటయన్నమాట. ఇందుకు దళారీగా మాత్రమే ధనం ఉపయోగపడుచున్నది. సరుకుల మత్పత్తిజేసినవాడు తనకవసరంలేని సరుకులను యితరులకిచ్చి వాటికి బదులు యితర సరుకులను పొందుతాడు. ఈ విధంగా స-ధ-స క్రమం ఉండేది.

కాని కాపిటల్ చలామణీయొక్క క్రమం ఇందుకు పూర్తిగాభిన్నమైనది. కాపిటలిస్టు కొంతధనాన్ని చేతిలో పెట్టుకొని బజారు వెళ్ళుతాడు. ఇక్కడ కన్పించే తేడా ఏమిటి? అతడు సరుకునుకాదు, ధనమును చేతిలో పెట్టుకొని వెళ్ళుచున్నాడు. ఈ ధనంతో కాపిటలిస్టు కొన్ని సరుకులను కొంటున్నాడు. అయితే ఇంతటితో ధనంయొక్క నడక ఆగిపోవడంలేదు. ఈ సరుకులు మళ్ళీ అమ్మబడి ధనంగా మార్చబడుచున్నవి. అందుచే కాపిటల్‌యొక్క నడకలో ప్రారంభ స్థానమూ, గమ్య స్థానమూ రెండూ ధనమే. కాపిటలిస్టు బజారుకు బయలుదేరేటప్పుడూ చేతిలో ధనమునే పెట్టుకువెళ్ళాడు. ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడూ ధనమునే తీసుకువెళ్ళు చున్నాడు. అయితే ఒక్క భేదాన్నిచూడాలి. ధనం ఎప్పుడూ ధనమే. దాని మొత్తం పరిమాణం పెరుగుతుందిగాని గుణం ఎన్నడూ మారదు. సరుకు అట్లాకాదు; ఒక్కొక్క సరుకు ఒక్కొక్క రకంగా వుంటుంది; కాని ధనం ఎంతవున్నా గుణం మాత్రం ఒకటే. అందుచేత, కాపిటలిస్టుచేతిలో బజారు ప్రవేశించేటప్పుడూ, బజారును విడిచేటప్పుడూ కూడా ఒకే మొత్తం ధనం వున్నదంటే, కాపిటల్‌యొక్క నడకకు అనగా అతడి వ్యాపారానికి అర్థమే లేదన్నమాట. కాపిటల్‌వున్నదంటే అనగా ఒకడు కొంత ధనమును పెట్టుబడిపెట్టి సరుకులను కొని అమ్ముతున్నాడంటే, ఈ విధంగా కాపిటల్ యెల్లప్పుడూ నడుస్తూవున్నదంటే దాని అవసరం ఒక్కటే. ప్రారంభంలో యెంత వున్నదో అంతలో దాని పరిమాణం పెరగాలనే. ప్రారంభంలో 10 రూపాయ లున్నది. అంతలో 20 రూపాయలుగా పెరగాలనే. ఈ విధంగా చలామణీలో వున్న ధనాన్ని గుంజాలనే. కాపిటల్‌యొక్క లక్ష్యమంతా లాభాన్ని గుంజటమే. దాని క్రమం యింకొక సరుకును కొనుటకై ఒక సరుకును అమ్మడం కాదు. లాభాలను పిండాలనే వుద్దేశ్యంతో సరుకులను కొని, అమ్మటం.

అయితే లాభం ఎట్లా సంపాదించబడు చున్నది? ఒక కాపిటలిస్టు తన దగ్గరవున్న ధనంతో కొన్ని సరుకులను కొని, తనకు గిట్టింపు అయిన వెలకంటె ఎక్కువ వెలకు ఆ సరుకును అమ్మడం ద్వారా లాభం సంపాదించవచ్చు. కాని ఈ సందర్భంలో యింకొక కాపిటలిస్టును కొల్లగొట్టడం ద్వారానే ఈ లాభాన్ని సంపాదించగలుగు చున్నాడు. ఇంకొక కాపిటలిస్టు దగ్గర సినలైన వెలను చెల్లించకుండా దగాచేసి తక్కువకైనా సరుకును కొనాలి. లేదా అమ్మేటప్పుడు అసలు వెల కంటే ఎక్కువ వెలకైనా అమ్మాలి; లేదా రెండువిధాలా చేయవచ్చు. కాని ఈ పద్ధతిలో ఒక కాపిటలిస్టు లాభాన్ని సంపాదిస్తుంటే ఇతర కాపిటలిస్టు నష్టపడుతున్నాడు.

కాని తమలో తామే ఒకరి కొకరు మోసం జేసుకోవటం ద్వారా కాపిటలిస్టు వర్గం బాగుపడదు. అయితే మరి లాభాలు యెట్లావస్తాయి? ఇది స్పష్టమే. ఒక నూతన సరుకును కాపిటలిస్టు పట్టుకుంటాడు. అట్టి సరుకు వుపయోగించేటప్పుడు విలువను సృష్టించేదిగా వుండాలి. కాపిటలిస్టు విధానంలో అట్టి సరుకు ఒకటి వుంది. అదే శ్రమశక్తి.

## శ్రమశక్తి కొనుగోలు అమ్మకములు_దాని విలువ

సరుకుల వుత్పత్తి విధానాలలో ప్రతి సరుకు దాని విలువను బట్టి అమ్మబడుతుంది. కార్మికునివద్ద వున్న ఒకే ఒక సరుకు అతని శ్రమశక్తి. కాపిటలిస్టు వుత్పత్తికి అత్యవసరమైన ఈ శ్రమశక్తిని ఈ కార్మికుడు అమ్ముతాడు ప్రతి సరుకుకూ విలువ వుంటుందని, ఆ సరుకును వుత్పత్తి చేయుటకై అవసరమైన శ్రమ కాలమును బట్టి ఆ విలువ నిర్ణయింపబడుతుందని మనం లోగడ చూశాము కార్మికుడు అమ్ముకునే సరుకుకు, అతని శ్రమశక్తికి వున్న "విలువ" ఏమిటి?

ఒక వ్యక్తి తన జీవనాన్ని పోషించుకోగల స్థితిలో వుంటేనే_అంటే తింటానికి తిండి, కట్టుకుంటానికి బట్ట, తలదాచుకోవటానికి ఇల్లు కలిగివుంటేనే_పని చేయగల్గుతాడనేది మనం అందరం ఎరిగినదే, తన అవసరాలను కనీసం ప్రాథమిక అవసరాలను అయినా సంతృప్తి పర్చుకోగలిగితేనే ఏ మానవుడైనా పనిచేయగలడు. ఒక కార్మికుడు ఆకలితో బాధపడుతూ వుంటే, కట్ట గుడ్డలేక కుమిలిపోతూంటే ఏమి పని చేయగలుగుతాడు? త్వరలోనే తన శ్రమశక్తిని కోల్పోతాడు కాబట్టి కార్మికుడు తన ప్రాథమికావసరాలను తీర్చుకొనుట ద్వారానే శ్రమశక్తిని కలిగివుంటున్నాడు.

ఇదే సమయంలో, ఈతని అవసరాలను తీర్చే వస్తువులన్నీ అనగా తిండి, బట్టలు, ఇల్లు మున్నగునవన్నీ బజారులో అమ్ముడుకాబడే సరుకులు. అవి ఉచితంగా వచ్చేవి కావు. ఆ సరుకులను ఉత్పత్తిజేస్తానికై కొంత శ్రమ వెచ్చింపబడింది. అందువల్ల అవి విలువను కలిగివుంటున్నవి. అందుచేత కార్మికుడు తన జీవనాన్ని నిలబెట్టుకొనేందుకూ, తన కుటుంబాన్ని పోషించుకొనేందుకూ, తాను వెచ్చించిన శ్రమశక్తిని కోల్పోకుండా, కాపిటలిస్టులకు తిరిగి శ్రమశక్తి లభ్యమయ్యేటట్లు చేయుటకు ఎన్ని సరుకులనైతే ఉపయోగిస్తున్నాడో వాటి విలువ మొత్తమూ, అతడు వెచ్చించే శ్రమశక్తియనే సరుకుయొక్క విలువ మొత్తమూ సరిసమానంగా వుంటాయి.

"తన జీవనాన్ని నిలబెట్టుకొనేందుకై సామాన్య కార్మికుడు వెచ్చించే సరుకుల మొత్తము విలువ వల్లనే కార్మికుని శ్రమశక్తివిలువ నిర్ణయించబడుచున్న" దని మార్క్సు "కాపిటల్" అనే గ్రంథంలో వ్రాశాడు.

కాని సరుకుల విలువ వాటి నుత్పత్తి చేయుటకైన శ్రమపై ఆధారపడి వుంటుంది.

ఇంకో విధంగా శ్రమ విలువను చెప్పవచ్చును. శ్రమ విలువ అంటే శ్రమశక్తి. ఈ శ్రమశక్తి పరిమాణం ఎట్లా తెలుసుకోబడుచున్నది ? దానికి మార్గం ఒకటి వున్నది. శ్రమశక్తిని పొందాలంటే మనుష్యుడు తిండి, బట్టలు వగైరాలను కోరుచున్నాడు. వాటిని ఉత్పత్తిచేయుటకై ఎంత శ్రమ కావాలో మనకు తెలుసు. కాబట్టి ఈ వస్తువులలో ఇమిడివున్న శ్రమవల్లనే శ్రమశక్తి నిర్ణయింపబడుచున్నది. ఈ శ్రమశక్తి విలువకు జీతాల రూపంలో కాపిటలిస్టు కార్మికునికి ఇస్తున్నాడు.

కాపిటలిస్టుకు ఫ్యాక్టరీ వుంది. పెద్దపెద్ద భవనాలు, గిడ్డంగులు వున్నవి. ఆగిడ్డంగులనిండా ముడిసరుకు వున్నది. ఇతర ఉపకరణాలన్నీ వున్నవి. అయినా ఉత్పత్తి ప్రారంభంకాలేదు. కారణం: ఇవన్నీ నిర్జీవములు. వీటిని సచేతనములుగా చేయాలంటే మానవ శ్రమ అవసరం. అందుచే కాపిటలిస్టు కార్మికులను కుదుర్చు చున్నాడు: అంటే తన వుత్పత్తికి కావలసిన ఆఖరు సరుకును కూడా కొన్నాడన్న మాట. ఇప్పుడన్నీ సరిపోయినవి. ఉత్పత్తి ప్రారంభమౌతుంది.

కార్మికుణ్ణి పనికి కుదుర్చుకొన్న తర్వాత, ఇన్ని ప్రమాణ గంటలు నీవు పనిచేయాలి అని నిర్ణయించుకొన్న పిమ్మట వానిచే కాపిటలిస్టు పనిచేయిస్తాడు. ఈ విధంగా పనిచేయిస్తానికే కాపిటలిస్టు శ్రమశక్తిని కొంటున్నాడు.

ఇక్కడ మనం శ్రమను, శ్రమశక్తిని తారుమారు చేయరాదు. శ్రమ, శ్రమశక్తి ఒకటికావు: రెండూవేరు. శ్రమశక్తి యనగా మానవుడు పనిచేయగల సామర్థ్యము. శ్రమఅంటే విలువను సృష్టించునది; కార్యరూపందాల్చినది శ్రమశక్తి. కాబట్టి శ్రమశక్తియే సరుకు: అనగా అమ్మబడేది లేక కొనబడేది.

దీని అర్థం తెలుసుకోవాలంటే ఒక ఉదాహరణను చూద్దాము. రైలు యింజను వుంది. అది పరుగెత్తగలదు. అంటే దానికి చలనము అనే శక్తివుంది. రైల్వే ఇంజనువచ్చి స్టేషనుముందు ఆగింది. దాని చలనము ఆగిపోయింది. అయితే, అది చలించగలశక్తి, అనగా మరల పరుగెత్తగల సామర్థ్యమును కోల్పోలేదు. ఆ ఇంజను పరుగెత్తకపోయినా, దానిలో చలనశక్తి ఇమిడివుంది. అవుసరమైనపుడు అది తిరిగి కదలటం; పరుగెత్తటం ప్రారంభిస్తుంది. ఇదేవిధంగా కార్మికునికి పని పాటలు దొరక్కపోతే, అతని శ్రమశక్తి ఉపయోగం లేనిదిగా వుంటుంది. అయినా ఆబ్బు పడకుండా ఉంచేను, తిండిలేక పడివుంచేను తప్ప, ఈ నిరుద్యోగి శ్రమశక్తి కల్గేవుంటాడు. సిగ్నల్ యివ్వబడగానే రైలుయింజను మళ్ళీ పరుగెత్తినట్లు ఈతడు తగు సమయంరాగానే పనిచేయటం అనగా శ్రమశక్తిని వెచ్చించటం ప్రారంభిస్తాడు.

ఒక సరుకుయొక్క వెల ఆ సరుకుయొక్క విలువకు కాస్త హెచ్చు గానో, తగ్గుగానో ఉంటుందని మనం చూశాము. కాని శ్రమశక్తియొక్క వెల మాత్రం ఇతర సరుకుల వెలవలెగాక, సర్వసాధారణంగా దాని విలువకు తగ్గియే ఉంటూవుంటుంది. అంటే కార్మికుడు తన శ్రమశక్తిని అమ్ముకొన్నా తన జీవితా

వుసరాలను పూర్తిగా పొందలేక పోవుచున్నాడన్నమాట. జీవితాన్ని పోషించుకుంటానికి ఎన్నిసరుకుల నైతే కార్మికుడు కోరుచున్నాడో వాటివిలువయే శ్రమశక్తి విలువయని లోగడ చెప్పాము. దీనివల్ల వెంటనే శ్రమశక్తి విలువకు పూర్తియగు ప్రతిఫలాన్ని పొందుచున్నాడని మాత్రం అనుకోరాదు. సర్వసాధారణంగా కార్మికుడు తన శ్రమశక్తిని, దానివిలువకు "తగ్గించియే" అమ్మవలసి వస్తూవుంటుంది. ఒకవేళ పూర్తివిలువను పొందినా, ఈతని శ్రమ ఫలితములైన సరుకులద్వారా కాపిటలిస్టుకు అదనపు విలువ వస్తుంది. ఆ విధంగా అతడు సంపన్నుడౌతాడు.

## కాపిటలిస్టుల లాభాలకు మూలం ఏమిటి ?

సరుకులు వాటి విలువనుబట్టి మారుతున్నవని లోగడ చూశాము. అయితే కొందరు శ్రమపడి విలువను సృష్టించుతూవుంటే, అది మరొకరి జేబులలోకి పోతూవుంది. ఇది ఎట్లాగో మనం చూడాలి. కాపిటలిస్టు ఫ్యాక్టరీని నిర్మించాడు. యంత్రాలను అమర్చాడు. ముడిసరుకులను పేకరించాడు. కావలసిన బొగ్గు వగైరాను కూడా సమకూర్చాడు : కూలీలను నియమించాడు. ఉత్పత్తి క్రమం ప్రారంభమౌతుంది. బొగ్గు కాలుతుంది. యంత్రాలు తిరుగుతాయి. కార్మికులు పనిజేస్తారు. ముడిసరుకులు తయారు సరుకులుగా బైటకువస్తాయి. ఈ విధంగా సరుకులు తయారుకాగానే అవి బజారుకు పంపబడి అమ్మబడతాయి. ధనం చేకూరుతుంది. తిరిగి ముడిసరుకులను కొనటం, కూలీలను పెట్టటం, ఉత్పత్తి ప్రారంభించబడటం ప్రారంభమౌతుంది. ఈ విధంగా ఉత్పత్తి క్రమము తిరుగుతూ వుంటుంది.

అయితే, ఇట్లా ఉత్పత్తిఅయిన సరుకుల విలువ ఎంత ? మొట్టమొదటి సారిగా, ఈ ఉత్పత్తిచేయటంలో ఖర్చుపడిన సరుకుల విలువ : వాటి అరుగు, తరుగులు; బొగ్గు మున్నగునవి, ముడిసరుకులు వగైరాల విలువ, వీటి యన్నిటివిలువ 3000 శ్రమగంట లనుకుందాము. వీటికి కార్మికులు జేర్చిన విలువ నూతనంగా జేరుతుంది. ఉదాహరణకు 20 మంది కార్మికులు రోజుకు 10 గంటల చొప్పున 5 రోజులు పనిచేసి ఈ సరుకులను సృష్టించారు అనుకుందాము. అంటే మొత్తం 1000 శ్రమగంటలు వెచ్చించారు. కాబట్టి కొత్త సరుకుల మొత్తం విలువ 3000 + 1000 = 4000 శ్రమ గంటలు.

ఇంత మొత్తం విలువ వున్నదినరే. ఇందుకు కాపిటలిస్టు ఎంతమూల్యం చెల్లిస్తున్నాడు ? అనేది చూడాలి. యంత్రాల అరుగు తరుగులు, బొగ్గు, ముడిసరుకులు మున్నగువాటికి పూర్తి విలువను చెల్లించక తప్పదు. అంటే 3000 శ్రమ గంటల కాలానికి సరిపడు డబ్బును చెల్లించాలి. ఈ 3000 శ్రమ గంటలకుతోడు కార్మికులు జేర్చిన 1000 శ్రమ గంటలు వున్నవి. ఈ 1000 శ్రమగంటల కాలానికి సరితూగు డబ్బును కాపిటలిస్టు కార్మికుల కిస్తున్నాడా ? ఇందులోనే వున్నది కిటుకు. కాపిటలిస్టు దోపిడీ రహస్యం అంతా యిందులో యిమిడి వున్నది.

20 మంది కార్మికులు 5 రోజులు వెచ్చించిన శ్రమశక్తి యొక్క విలువను కాపిటలిస్టు కార్మికులకు చెల్లిస్తున్నాడు. అంటే కార్మికులు 5 దినాలు తమశ్రమ శక్తిని ఉత్పత్తిచేయుటకు తగినంత ధనాన్ని చెల్లిస్తున్నాడు. కాని 1000 గంటలకన్న ఈ మొత్తం చాలా తక్కువగా వుంటుందని మనం ఎరుగుదుము. కార్మికుడు ఫాక్టరీలో ఖర్చుపెట్టే శ్రమ మొత్తం వేరు. అతడు పనిచేయుట కవసరమగు శక్తిని ప్రసాదించుటకై అతనికి కావలసిన అవసర సరుకుల విలువ వేరు, అని మనం చూస్తాము.

...."శ్రమశక్తి విలువ మొత్తం వేరు. ఆ శ్రమశక్తి వెచ్చింపబడటం ద్వారా ఉత్పత్తి కాబడే విలువ యొక్క ప్రమాణం వేరు" అని మార్క్సు 'కాపిటల్'లో వ్రాశారు.

మళ్ళీ మన ఉదాహరణకు వద్దాము. ఫ్యాక్టరీలో పనిచేసిన కార్మికుడు వెచ్చించిన శ్రమశక్తి యొక్క విలువ 5 శ్రమగంట లనుకుందాము. అంటే 5 రోజులకు 20 మంది కార్మికులకు 500 శ్రమగంటలకు సమానమగు ధనమును కార్మికులకు కాపిటలిస్టు చెల్లించాడు.

ఇప్పుడు మనం లెక్క తేల్చుకుందాము. కాపిటలిస్టుకైన ఖర్చు 3000 + 500 = 3500 శ్రమగంటలు. అతనికి వచ్చిన సరుకుల విలువ 3000 + 1000 = 4000 శ్రమగంటలు.

## అదనపు శ్రమ : అదనపు విలువ

కాపిటలిస్టుకు లాభం ఎక్కడనుండి వస్తుంది? అన్న ప్రశ్నకు ఇప్పుడు మంచిగా జవాబు చెప్పగలం. కార్మికుడు వుచితంగాచేసే శ్రమఫలితమే పెట్టుబడి దారు లాభం. కార్మికుడు రోజుకు తనకువచ్చే జీతానికి 5 గంటలు శ్రమ జేస్తే సరి పోతుంది, కాని 10 గంటలు పనిజేస్తున్నాడు. కాబట్టి 5 గంటలు జీతం లేకుండా, ఉచితంగా పనిజేస్తున్నాడన్నమాట. ఇది అతని "అదనపు శ్రమ". ఈ అదనపు శ్రమవల్ల "అదనపు విలువ" సృష్టింపబడుచున్నది. ఈ అదనపు విలువ కాపిటలిస్టుల జేబులలో పడుచున్నది. కాబట్టి జీతం పొందని, వుచితశ్రమ మూలకంగా అదనపు విలువ, లాభం – కష్టఫలితంగాని ఆదాయం – వస్తోంది.

జీతానికి పనిచేసే కార్మికుడు భూస్వామికో, ఫ్యాక్టరీ యజమానికో, తన శ్రమశక్తిని అమ్ముతాడు అంటే పనిజేస్తాడు. రోజులో కొంతభాగం తన జీవిత పోషణకై తన కుటుంబ పోషణకై సరిపడు మొత్తాన్ని, అనగా, జీతం రూపంగా వచ్చే విలువను సృష్టిస్తానికి శ్రమపడతాడు. రోజులో తక్కిన భాగం అంతా ఉచితంగా కాపిటలిస్టుకు శ్రమజేసి పెడుతాడు. ఆ విధంగా అదనపు విలువను సృష్టించి దానిని కాపిటలిస్టు హస్తగతం చేస్తున్నాడు. ఇదే లాభంయొక్క సంపద యొక్క, కాపిటలిస్టు వర్గం యొక్క మూలం.

"మార్క్సుయొక్క ఆర్థిక సిద్ధాంతాలకు కీలకం అంతా అదనపు విలువ సిద్ధాంతంలో ఉన్నది." అని లెనిన్ వ్రాశాడు. *

కాపిటలిస్టు దోపిడియొక్క రహస్యాన్ని మార్క్సు చూపించిన అదనపు విలువ సిద్ధాంతం బట్టబయలు చేస్తోంది. అందుచేతనే కాపిటలిజము తోటి పోరాటంలో కార్మికవర్గానికి మార్క్సు ఉపదేశాలు పెద్ద ఆయుధంగా ఉపయోగపడటం. ఇందుచేతనే, బూర్జువాజీ బంటులగు "విజ్ఞానఘనులు" మార్క్సు ప్రతిపాదించిన అదనపు విలువ సిద్ధాంతాన్ని పదేపదే విమర్శించుతూ ఉంటారు. పదేపదే "ఈ సిద్ధాంతం తప్పు" అని రుజువుచేస్తానికి తాపత్రయపడుతూ ఉంటారు.

మార్క్సు యొక్క అదనపువిలువ సిద్ధాంతం ఆయన విలువ సిద్ధాంతంపై ఆధారపడివుంది. "దోపిడి సిద్ధాంతం" అంతా విలువ సిద్ధాంతంపై ఆధారపడివుంది. కాబట్టి విలువ సిద్ధాంతాన్ని ఏవిధంగానూ వికృతం గానీయరాదు.

కాపిటలిస్టులు సంపన్నులు కావటానికి మూలం ఎక్కడవున్నదో ఇపుడు మనం సూక్ష్మంగా చెప్పవచ్చును. లెనిన్ దీనిని చాలా స్పష్టంగా, సూటిగా, క్లుప్తంగా చెప్పాడు.

"సరుకుల చలామణిలో అదనపు విలువ సృష్టించబడనేరదు. ఎందుచేత ననగా, సరిసమానమైన సరుకులే మారుతున్నవి. కాబట్టి ఈ యిచ్చి పుచ్చుకోవటంలో ఒకరికి ఎక్కువ మిగిలేది ఏమీలేదు. ధరల వ్యత్యాసంవల్ల కూడా ఇది ఏర్పడదు. కారణం ఏమిటంటే, ఒకరి నష్టం ఇంకొకరి లాభం కాబట్టి మొత్తం సమాజంలో లాభ నష్టాలు సరిపుచ్చుకుంటాయి. కాబట్టి అదనపు విలువ అనేదానికి తావులేదు. మనం యిక్కడ చూసేది సమాజాన్నిగాని, ఒక్కొక్క వ్యక్తినిగాదు. కాబట్టి తన ఉపయోగంలో విలువను సృష్టించే ఒక సరుకు కావాలి. ఇటువంటిది ఒకటి వున్నది. అదే మానవ శ్రమశక్తి. మానవ శ్రమశక్తి ఉపయోగమే శ్రమ; శ్రమయే విలువను సృష్టిస్తున్నది. శ్రమశక్తిని దాని విలువకు, కాపిటలిస్టు కొంటాడు. శ్రమశక్తి విలువ ఏమిటి? దాని నుత్పత్తి జేయుటకు పట్టిన సామాజికావసర శ్రమ; ఈ శ్రమ రూపురేఖలను కల్గినదిగానే బహిర్గత మౌతోంది. కాబట్టి, కుటుంబపోషణ కవసరమైన తిండి, బట్టలు వగైరా లన్నమాట. వీటిని కాపిటలిస్టు వస్తువుల రూపంలో యివ్వడు; జీతాల రూపంలో యిస్తాడు. ఈ విధంగా శ్రమశక్తిని కొన్నతర్వాత దాన్ని ఉపయోగంలో పెడుతాడు: అంటే పనిచేయిస్తాడు. ఉదాహరణకు కార్మికుని చేత 12 గంటలు పనిచేయించాడు. ఈ 12 గ.టలలోనూ కార్మికుడు తన జీవిత పోషణ కవసరమైన విలువను (స్థూలంగా చెప్పాలంటే వస్తువులను) 6 గంటలలో సృష్టిస్తున్నాడు. అనగా అతనికి జీతంక్రింద యిచ్చేదానిని 6 గంటలలోనే సృష్టిస్తున్నాడు. తక్కువ 6 గంటలూ అదనంగా పనిచేస్తున్నాడు. దీనినే అదనపు శ్రమ

* మార్క్సిజం యొక్క మూడు మూల స్థానాలు, మూడు అంతర్విభాగాలు అన్న గ్రంథం నుండి.

కాలం అంటున్నాము. ఈ కాలంలో ఉత్పత్తి అయినదంతా అదనపు విలువ, అనగా సరుకుల రూపంలోవున్న శ్రమ. ఇట్టి అదనపు విలువకు కాపిటలిస్టు ఏమీ చెల్లించటంలేదు." *

చాలా పురాతనమైన కాలంలో, ప్రజలింకా నాగరికత నేర్చవలసి వున్నపుడు, కేవలం జీవనాన్ని నిలబెట్టుకొనేందుకే, కావలసిన అవసరాలను సమకూర్చుంటానికి మానవుడు ఎంతో శ్రమపడవలసి వచ్చేది. శ్రమపడటం మూలకంగా వచ్చిన వస్తువుల మూలంగా ఆకలితో మాడి చావకుండా మాత్రం ఎట్లాగో కాలక్షేపం చేసేవాడు.

పురాతన మానవులు ఈ విధంగా ప్రకృతితో పోరాడి చాలా కష్టంతో జీవనాధారాన్ని సంపాదించుకుంటున్నపుడు, వారిమధ్య వర్గవిభేదాలు ఏర్పడుటకు అవకాశం వుండేదికాదు. మృగములలో వర్గవిభేదం వుందా? అట్లే పురాతన మానవులలోనూ వుండేదికాదు. అదనపు విలువ ఏర్పడిన పిమ్మటనే మానవుడు మానవుని దోచుకుంటానికి అసమానత్వం ఏర్పడటానికి అవకాశం కలిగింది. కొంతమంది అదనపు శ్రమ ఇతరుల హస్తగతమౌతుంది. తమకన్న తక్కువైన వర్గాలను దోచుకొనే ఉన్నతవర్గాల చేతులలో ఈ అదనపు శ్రమ ఫలితం పడుతుంది.

ఈ విధంగా ఒకరి అదనపు శ్రమ ఫలితం ఇంకొకరి హస్తగతం కావటం కాపిటలిస్టు విధానం ఏర్పడినంతవరకూ, కాపిటలిస్టు శకంలోకూడా వుంది. దోపిడి రూపాలు మారుతూమాత్రం వుంటాయి. బానిసత్వం, ఫ్యూడలిజం, కాపిటలిజంలలో దోపిడి వివిధ స్వరూపాలను కల్గివుంది. కాని సారం ఒకటే. దోపిడియే, సమాజం మొత్తం యొక్క అదనపు శ్రమను పరిపాలకవర్గం దోచుకోవటం జరుగుతుంది.

కాపిటల్ (పెట్టుబడి) మాత్రమే అదనపు శ్రమను నూతనంగా సృష్టించలేదు. ఈ విషయాన్ని మార్క్సు చారిత్రకంగా రుజువుచేశాడు. ఏ సమాజంలోనైనా సరే, దోచుకొనేవారు, దోచుకోబడేవారుగా చీలివుంటే, పరిపాలక వర్గం కష్టపడే-దోచుకోబడే ప్రజా సామాన్యం యొక్క - అదనపు శ్రమను దోచుకుంటుంది. కాపిటలిజంలో వచ్చిన మార్పు ఏమిటంటే, పరిపాలక వర్గానికి అదనపు శ్రమకై వుండే దాహానికి అంతూపొంతూ వుండదు.

బానిస విధానం క్రింద, సామాన్య ఉత్పత్తి పద్ధతులు వుండేవి. అట్టి పరిస్థితులలో అదనపు విలువను దోచుకుంటానికి ఒకపరిమితి వుండేది. బానిస యజమాని గాని, ఫ్యూడల్ ప్రభువుగాని తన క్రింది బానిసలనేకాక రైతులచే పనిచేయించేవాడంటే తన కోర్కెలన్నింటినీ సఫలపర్చగలుగు పంతవరకూ చేయించేవాడు. కాని కాపిటలిజంలో అదనపు శ్రమకైన దాహమునకు మితిలేదు. కార్మికుని నుండి కాపిటలిస్టులు పిండే అదనపుశ్రమ చెవులకింపుగా టింగుటింగుమనే డబ్బు క్రిందకు

* మార్క్సు - ఎంగెల్సు, మార్క్సిజం "కారల్‌మార్క్సు" అన్న గ్రంథం నుండి.

మారుతుంది. ఇది తిరిగి కాపిటల్‌గా వుపయోగపడుతుంది. మళ్ళీ వుత్పత్తి సాగుతుంది. మళ్ళీ అదనపు విలువ సృష్టింపబడుతుంది. ఈ విధంగా కాపిటలిస్టు యొక్క దాహానికి గాని, కార్మికుని పీల్చి పిప్పిచేసే పద్ధతికిగాని అంతువుండదు.

కాపిటలిస్టు విధానం నాశనం కావటంతో, కాపిటలిస్టుల ప్రయోజనం కొరకై కార్మికుల నుండి అదనపు శ్రమను పిండటం ఆగిపోతుంది. కార్మికుడు పని చేసే దినాలలో కొంతభాగం తన జీవిత పోషణకు అవసరమగు శ్రమ అనీ, తక్కిన భాగం అదనపుశ్రమ అనీ కాపిటలిజంలో ఇప్పుడున్న రూపం అంతరించిపోతుంది. దీనిని గూర్చి మార్క్సు యీ విధంగా తెలియజేశాడు :

"కాపిటలిస్టు వుత్పత్తి పద్ధతిని నాశనం చేయడంతో, కార్మికుడు పని చేయవలసిన కాలం అవసరమైనంత మేరకే తగ్గించబడుతుంది. ఇటువంటి పరిస్థితులలోకూడా అవసరశ్రమకాలం, దాని హద్దులకన్న కొంచెం ఎక్కువగానే వుంటుంది. కారణం ఏమిటంటే 'జీవనపద్ధతు'లయెడవుండే అభిప్రాయాలు మారటం, కార్మికుడు ఇంకా ఎక్కువ సౌఖ్యప్రదమైన జీవనాన్ని కోరటం, ఒకటి. ఇప్పుడు అదనపు శ్రమ అనే దానిలో కొంతభాగం, అప్పుడు అవసర శ్రమగా మారటం అనగా రిజర్వుగా, అనగా పరిశ్రమలను పెంపొందించటానికీ, అమగు, తరుగులను, ప్రమాదవశాత్తు జరిగిన నష్టాలను భర్తీచేస్తానికి, ముద్నగువాటికై వుత్పత్తి పరికరాలను సంపాదించుట కొరకు నిల్వగా కొంతనిధిని వుంచటం రెండు." *

కార్మికులను దోచుకొనే పద్ధతి సోవియటు యూనియనులో ఎంతోకాలం క్రిందటనే ఎందుకు అంతరించిపోయిందో మార్క్సుయొక్క పైమాటలను చదివితే స్పష్టం కాగలదు.

సోవియట్ యూనియన్‌లో, చరిత్రలో మొట్టమొదటసారిగా వర్గ దోపిడీ కూకటివేళ్ళతో పెల్లగింప బడినది. అచ్చటవున్నది సోషలిస్టు పరిశ్రమలు. కాపిటలిస్టు పరిశ్రమలలో వున్నట్లుగా సోవియట్ పరిశ్రమలలో పరస్పర వ్యతిరేకములయిన వర్గములు వుండవు. పరిశ్రమలూ, సంపదా అంతా సోవియట్ ప్రభుత్వం యొక్క శ్రామికవర్గ నియంతృత్వంయొక్క ఆస్తి. ఫ్యాక్టరీలను, యంత్రాగారాలను, గనులను, రైల్వేలను, ఇతర ఉత్పత్తిపరికరాలను కల్గివుండేవర్గమూ వీటిలో పనిచేసే వర్గమూ ఒకటే. ఇచ్చట కార్మికుడు యజమానికి తన శ్రమశక్తిని అమ్ముకోవట మనేది వుండదు. ఇటువంటి సోషలిస్టు విధానంలో అదనపు విలువను సృష్టించటం అనేది వుండదు. ఉండటం అసాధ్యం. కార్మికుడు తన అవసరాలకుమించి ఉత్పత్తిగావించే వస్తుసముదాయమంతా కార్మికవర్గం యొక్క సమిష్టి ఉపయోగానికే, సోషలిస్టు పరిశ్రమల రిజర్వుకే, శ్రామికవర్గ ప్రభుత్వపు రక్షణకే వినియోగపడుతుంది.

---

* "కాపిటల్" నుండి.

సోవియట్ యూనియన్‌లో వున్నది స్టేటు కాపిటలిజం (వ్యక్తులు గాక పెట్టుబడిదారు లందరియొక్క ప్రతినిధియైన ప్రభుత్వం సాగించే కాపిటలిజం) కాని సోషలిజం కాదని ట్రాట్స్కీయిస్టులు అంటారు. ఇది కేవలం దుష్ప్రచారం, విప్లవ వ్యతిరేకము కాక మరేమీ కాదని పై వివరణ తెలియజేస్తుంది. ఈ విధంగా నీచ ప్రచారాన్ని చేయటంద్వారా సోవియటు యూనియన్‌లో నిర్మింపబడే సోషలిస్టు వ్యవస్థను కూలద్రోయుటకై సాగించే తమ విద్రోహచర్యలను కప్పిపుచ్చుకొనుటకు ఈ ట్రాట్స్కీయిస్టులు చూస్తున్నారు.

## కాపిటల్ (పెట్టుబడి) అంటే ఏమిటి?

ఏ విధంగా అదనపు విలువ సృష్టించ బడుచున్నదో మనం ఇంతవరకూ చూశాము. కాపిటలిస్టులు కార్మికులను దోచుకుంటూ ఏవిధంగా అనాయాసంగా సంపద లను చేకూర్చుకుంటున్నారో, దాని వెనుకగల తీక్ష్ణ శక్తి ఏమిటోకూడా చూశాము. కార్మికుల శ్రమయే కాపిటలిస్టులకు అనాయాసపు రాబడి అని కూడా చూశాము. అయితే, లక్షలకొలదీ ప్రజలు ఎందుచేత ఈ విధంగా శ్రమజేసి తమ శ్రమ ఫలి తాన్ని ఇతరులకు కట్టబెట్టవలసి వస్తున్నదో, అందులకు గల బలవత్తర కారణా లేమిటో మనం ఇంకా స్పష్టంగా చూడాలి. యిందుకై కాపిటల్ యొక్క శక్తి యేమిటి. అసలు కాపిటల్ నిజస్వరూపం ఏమిటి అనేది చూడాలి.

కాపిటలిస్టులు కార్మికులను ఎందుకు దోచుకో కలుగుతున్నారు? కాపిట లిస్టు సమాజంలో సంపద అంతా, ఉత్పత్తి సాధనాలు, జీవనాధారాలు అన్నీ కాపిట లిస్టుల చేతులలో కేంద్రీకరింపబడి వున్నవి. కార్మికులకు ఈ రెండింటిలో ఏదీలేదు. సమాజ సంపద అంతటిపై కాపిటలిస్టుల గుత్తాధికారాన్ని సంపాదించారు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ * యొక్క ప్రోగ్రాములో కాపిటలిస్టువద్ధతి ఈ క్రింది విధంగా వర్ణించబడింది :

"సరుకుల ఉత్పత్తివిధానం అనే పునాదిపై నిర్మించబడిన కాపిటలిస్టు సమాజంలోని ముఖ్య లక్షణాలు ఏమిటంటే ఒకటి : ఉత్పత్తి సాధనాలలో ముఖ్యమూ, కీలకమూ అయినవన్నీ, కాపిటలిస్టువర్గం, పెద్ద భూస్వాముల చేతులలో కేంద్రీకరించబడి వుండటం. రెండు : ఉత్పత్తి సాధనాలపై ఎలాంటి హక్కు లేకుండా జేయబడిన కార్మికవర్గం తప్పనిసరిగా తమ శ్రమశక్తిని అమ్ముకోవలసి రావటం. మూడు : సరుకులు లాభాపేక్షతోనే ఉత్పత్తిచేయబడడం. నాలుగు : వీటికి తోడుగా, ఒక ప్లాను, క్రమం లేకుండా, అల్లకల్లోలంగా, అరాజక పద్ధతులలో ఉత్పత్తి సాగించబడటం అనేవి."

* వివిధ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు కలసి అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీగా ఏర్పడినవి. దీనినే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అనీ, కొమింటర్న్ అనీ అంటారు. 1943లో ఇది రద్దు గావించబడింది. (అనువాదకుడు)

కాపిటలిజంలో కార్మికులు ఉత్పత్తి సాధనాలపై ఎలాంటి పెత్తనం లేకుండా వుంటారు. ఉత్పత్తి సాధనాలంటే ఏమిటి? ఒకటి: ఉత్పత్తిని సాగించుటకు అవసరమైన పరికరాలు. చెప్పులకుట్టే ముచ్చివాని కంతాణి మొదలుకొని బ్రహ్మాండమగు ఎలెక్ట్రిక్ మోటార్ల వరకూ అన్నీ ఉత్పత్తి పరికరాలే. రెండు: ముడి వస్తువు, చెప్పులను తయారుచేయుటకు తోలు ముడివస్తువు ఉక్కును తయారుచేయుటకు ముడి ఇనుము, రాక్షసబొగ్గు ముడివస్తువులు; మగ్గిను గుడ్డకు ప్రత్తి ముడివస్తువు. మూడు: చమురు సున్నం, ఇనుము మున్నగు సహాయకములు ఉపకరణాలు.

ఉత్పత్తి సాధనాల యొక్క వివిధ ఉపాంగములగతి ఉత్పత్తి క్రమంలో వివిధములుగా వుంటుంది. ఉత్పత్తి పరికరాలు చాలాకాలం వుంటాయి. బట్టలమిల్లులో వుండే మరమగ్గులు చాలాకాలం వుండి చాలా నూలును నేస్తాయి. కాని ముడివస్తువుల జీవితం ఉత్పత్తి క్రమంలో అంతరించిపోతుంది. ప్రత్తి అంతరించి గుడ్డ అవతారాన్ని ధరిస్తుంది. తోలుపోయి చెప్పులు వస్తాయి. ముడి ఇనుము, బొగ్గు పోయి ఉక్కు వస్తుంది. ఇట్లే సహాయకములు, ఉపకరణాలు అయిన మాసె మున్నగునవి కూడా ఉత్పత్తి క్రమంలో అంతరించి పోతాయి. బొగ్గు బాయిలర్ల వేడిలోనూ, చమురు యంత్రభాగాల చలనంలోను అంతర్హితములౌతాయి.

ఏమీలేకుండా ఎట్టి పనీ సాధ్యంకాదు. అట్టి ఉత్పత్తి సాధనాలన్నీ కాపిటలిస్టు వ్యవస్థలో బూర్జువావర్గం చేతులలో వుంటాయి. ఇందువల్ల సమాజం అంతటిపైనా బూర్జువావర్గం యొక్క బలం అత్యధికంగా వుంటుంది. సమాజంలో అత్యధిక సంఖ్యాకులకు తప్పనిసరిగా శ్రమశక్తిని అమ్ముకొనే ప్రారబ్దకవలసి వున్నది గనుక బూర్జువావర్గం చేతులలో ఉత్పత్తి సాధనాలు దోపిడి సాధనాలుగా తయారౌతాయి.

కాపిటల్ అనేది ఒక వస్తువుకాదు. ఇది ఒక నిర్ణీతమైన "సామాజిక సంబంధము" అని మార్క్సు చెప్పాడు ఉత్పత్తి సాధనాలు, వివిధ రకాల సరుకులు మున్నగు వస్తువులన్నీ కూడా కాపిటల్ కాదు. ఒక ప్రత్యేకమైన సామాజిక వ్యవస్థలోనే ఇవి దోపిడీ సాధనాలుగా మారుతున్నవి. ఇట్లు మారుటకు వీలు నేర్పరచిన సామాజిక సంబంధాన్నే కాపిటల్ అంటున్నాము. కాపిటల్ అన్నది ఒక ప్రత్యేకమైన, చారిత్రాత్మకమైన నిర్ణీతమైన, సామాజిక ఉత్పత్తి సంబంధము" అని లెనిన్ వ్రాశాడు. ఉత్పత్తి సాధనాలన్నింటికీ యాజమాన్యం కల్గిన వర్గానికి, ఈ సాధనాలపై ఎలాంటి యాజమాన్యం లేనందున తప్పనిసరిగా శ్రమశక్తిని అమ్ముకోవలసిన వర్గానికి మధ్యవుండే సామాజిక సంబంధమే కాపిటల్.

కాపిటలిస్టు సమాజంలో ఉత్పత్తి సాధనాలన్నీ అమ్మకానికి, కొనబడటానికి వీలైనవి. అందుచే అవి సరుకులు. సరుకులుగా వాటికి విలువ ఉన్నది. అందుచే అవి ధనంలోనికి మార్చబడగలవు (అనగా అమ్మబడగలవు). లేదా ధనంచే ఎప్పుడైనా సరుకులను పొందవచ్చును. (అనగా సరుకులు కొనబడగలవు). కాబట్టి కాపిటల్‌నుగూర్చి ఇంకొకవిధంగా చెప్పాలంటే, శ్రమశక్తిని పిండటంద్వారా అదనపు

విలువను తెచ్చే విలువయే కాపిటల్. విలువ అంటే ఏమిటి? కరడు గట్టిన శ్రమయే, శ్రమఫలితమే విలువ. కాబట్టి విలువ అంటే ఖర్చుఅయిన, నిర్జీవమైన శ్రమ. అందుచేతనే మార్క్స్ యీ విధంగా వ్యాఖ్యానించాడు: "కాపిటల్ అన్నది నిర్జీవ శ్రమ. రక్తం త్రాగుతూ బ్రతికే గండభేరుండ పక్షివలె ఈ నిర్జీవశ్రమ (కాపిటల్) సజీవ శ్రమను పీల్చి పిప్పిజేస్తూ బ్రతుకుతుంది."

## స్థిరమైన కాపిటల్, తరచు మార్పుజెందు కాపిటల్

మనం కాపిటలిస్టు దోపిడీని పూర్తిగా అర్థం చేసుకోవాలంటే "స్థిరమైన కాపిటల్"కూ, "తరచు మార్పుజెందుతూవుండే కాపిటల్"కూ మధ్య తేడాను చూడాలి. ఒక సరుకుయొక్క పూర్తి విలువలో ఆ సరుకు ఉత్పత్తి చేయుటకు వినియోగపడిన ఉత్పత్తి సాధనాల భాగంకూడా కలిసి వుంటుంది. యంత్రాలు, ముడి సరుకులు, చమురు వగైరాలు పూర్తిగానో, కొంతగానో ఖర్చు అవుతున్నవి. ఈ విధంగా అరుగు తరుగులవల్ల పోయే వీటి విలువ క్రొత్తగా తయారయ్యే సరుకులలో జేరుచున్నది. కాబట్టి కాపిటల్ యొక్క ఈ భాగాన్ని, అనగా యంత్రాలు, ముడిసరుకులు, చమురు వగైరాలను మనం "స్థిరమైన కాపిటల్" అంటాము. కారణం, ఇవి అరిగిపోయినా, ఖర్చుపడినా వీటి విలువ మాత్రం పెరుగుటలేదు. నూతనంగా తయారైన సరుకులలో ఇమిడివుండి, వాటి అమ్మకంద్వారా తిరిగి కాపిటలిస్టుకు జేరుతూనేవుంది.

కాని నూతనంగా తయారైన సరుకు విలువలో మరొక మిక్కిలి ముఖ్యమగు వస్తువు జేరుతోందని చూశాము. ఇదే కార్మికులు ఫ్యాక్టరీలలో కష్టపడి, సరుకు జేర్చిన విలువ. ఉదాహరణకు, ఒక ఫ్యాక్టరీలో 100 మంది కార్మికులు రోజు 1 కి 10 గంటల చొప్పున పనిజేస్తున్నారనుకొందాము. గంటయొక్క విలువ రు. 5-00 ల క్రింద జమకట్టితే, రోజుకు 100 మంది కార్మికులు రు. 5000 ల నూతన విలువను సృష్టిస్తున్నారు. ఈ విలువ, సరుకులలో విలువ రూపంలోవున్న 'స్థిరమైన పెట్టుబడి'కి జోడింపబడి సరుకుయొక్క పూర్తి విలువ ఏర్పడుచున్నది.

అయితే కార్మికులు సృష్టించే విలువకన్న వారిజీతాలు ఎప్పుడూ తక్కువగానే వుంటాయని మనం చూశాము. ఈ నూతన విలువలో కొంతభాగం కార్మికుల జీతాలక్రింద పోతుంది. అదనపు విలువ కాపిటలిస్టుల ఇనుపపెట్టెలలోకి పోతుంది.

100 మంది కార్మికులు రోజుకు 10 గంటల చొప్పున ఫ్యాక్టరీలో పని జేశారు. ఇందులో వారి జీవన పోషణకై కావలసిన 'అవసర శ్రమ' 5 గంటలు ఈ 'అవసర శ్రమ' విలువ రు. 2500-00 లను కాపిటలిస్టు కూలిరూపంలో చెల్లిస్తున్నాడు. కాని మొత్తం సృష్టించబడిన నూతన విలువ రు. 5000 లు, కాబట్టి కార్మికులు శ్రమచేయటంద్వారా, కాపిటల్ రెట్టింపు అవుచున్నదని చూశాము. రు. 2500లు రు. 5000 లు అయింది. అయితే ఈ విధంగా కాపిటల్ రెట్టింపు కావటం కార్మికుల

యొక్క 'అదనపు శ్రమ' ద్వారానే. కాబట్టి కార్మికుల శ్రమశక్తిని కొంటానికి వెచ్చించే సొమ్మును, అనగా కూలిని, అస్థిరమైన కాపిటల్‌కు అంటాము.

కాపిటలిస్టుకు సంబంధించినంతవరకూ కాపిటల్‌లో మరి రెండు భేదాలు వున్నవి. కాపిటల్‌లో కొంతభాగం తరచు రకం మారుతూ వుంటుంది. కొంత చాలా నెమ్మదిగా రకం మారుతూ వుంటుంది. ఫాక్టరీ భవనాలు, యంత్రాలు మున్నగునవి చాలాకాలం నిల్చిపుంటాయి. కాబట్టి వీటిని "నిశ్చలమైన కాపిటల్" అంటారు. ముడి సరుకులు, చమురు మున్నగునవి. కూలి, త్వరత్వరగా వెచ్చింపబడుతూ వుంటాయి. కాబట్టి కాపిటల్‌లో ఈ భాగాన్ని "చలామణీ అయ్యే కాపిటల్" అంటారు

ఉత్పత్తి క్రమంలోనూ, అదేవిధంగా చలామణి క్రమంలోనూ కాపిటల్ లోని ఈ భాగాలు వేరు వేరు పాత్రలను వహించుతాయి. భవనాలు. యంత్రాలు మున్నగునవి చాలాకాలం వుంటాయి. కాని చివరకు శిథిలమైపోతాయి. ఉదాహరణకు: భవనం 50 ఏండ్లు వుంటుంది. కాబట్టి ఈతడు ఉత్పత్తిగావించే సరుకులలోనూ భవనం విలువలో 1/50 వంతు ఇమిడివుంటుంది. అందుచే భవనంకై వెచ్చించిన కాపిటల్ ఈతడికి 50 ఏండ్లలో తిరిగి వస్తుంది. యంత్రము సుమారు 15 ఏండ్లు వుంటుందనుకుందాము. కాబట్టి సరుకులలో ప్రతిఏడాది యంత్రం విలువలో 1/15 వంతు జేరుచున్నది. 15 ఏండ్లలో యంత్రంపై పెట్టిన కాపిటల్ యజమానికి తిరిగి వచ్చుచున్నది. కాని ముడిసరుకులు చమురు మున్నగువాటి విషయంలో అట్లాలేదు. అవన్నీ ఉత్పత్తిలో పూర్తిగా, వెంటనే ఖర్చుబడిపోతున్నవి. కాబట్టి వాటి విలువ సరుకులలో జేరి, సరుకుల విలువద్వారా మరల వెంటనే కాపిటలిస్టుకు జేరుకొంది. అదేవిధంగా కూలి యిచ్చుటకు పెట్టిన కాపిటల్‌కూడా త్వరగా తిరిగి వస్తున్నది.

కాబట్టి స్థిరమైన కాపిటల్ - అస్థిరమైన కాపిటలున్ను: నిశ్చలమైన కాపిటల్ - చలామణి అయ్యే కాపిటలున్నూ ఒకటిగావు.

స్థిరమైన పెట్టుబడిలో నిశ్చలమైన కాపిటల్ యీ చలామణి అయ్యే కాపిటల్‌లో ముడిసరుకులు, చమురు, ఇతర సహాయక వస్తువులు కొనుటకయ్యే భాగమున్ను జేరివుంటుంది. అంటే, ఉత్పత్తి కవుసరమైన 'నిర్జీవశ్రమ' (యంత్రాలు, ముడిసరుకులు వగైరా యిదివరకే వెచ్చింపబడిన శ్రమ గనుక నిర్జీవ శ్రమగా అవుతున్నది.) కొనుటకు స్థిరమైన కాపిటల్ ఉపయోగింపబడుచున్నది. కాని, త్వరగా మార్పుజెందు కాపిటల్ మాత్రం కేవలం కార్మికుల జీతాలనిచ్చుటకే ఉపయోగపడు చున్నది. దీనిని 'సజీవశ్రమ' అంటాము.

కాపిటల్‌ను ఈ రెండు విధాలుగా విభజించడం ఈ క్రింది టేబిల్ ద్వారా సులభంగా తెలుస్తుంది.

| రకం మారటం ప్రకారం విభజన | కాపిటల్ భాగం | దోపిడీ క్రమాన్నిబట్టి విభజన |
|---|---|---|
| విశ్చలమైన కాపిటల్ | ఫాక్టరీ భవనాలు, యంత్రాలు. | స్థిరమైన కాపిటల్ |
| చలామణీ అయ్యే కాపిటల్ | ముడిసరుకులు, చమురు బొగ్గు, ఇతర సహాయక వస్తువులు | అస్థిరమైన కాపిటల్ |

కాపిటల్‌ను ఈ రెండు రకాలుగా విభజించి చూడటం అత్యవసరం. స్థిరమైన కాపిటల్ త్వరగా మార్పుచెందు కాపిటల్‌గా విభజించటంద్వారా అదనపు విలువ జన్మస్థానం ఏమిటో త్వరగా తెలిసిపోతుంది. కాని కాపిటలిస్టులు కాపిటల్‌ను నిశ్చలమైన కాపిటల్ అనీ, చలామణీ అయ్యే కాపిటల్ అనీ విభజిస్తారు. ఇందువల్ల అసలు విషయం మరుగునపడిపోతుంది. కాపిటలుయొక్క విజస్వరూపం, గతి, సరిగా తప్పించదు. దోపిడి ఏవిధంగా సంభవమౌతుందో తెలియదు.

## అదనపు విలువ రేటు

పైన ఇచ్చిన ఉదాహరణలో కార్మికులు దినానికి రు. 5000/లు మారక విలువను సృష్టిస్తున్నారు. కాని వీరికి కూలి రూపంలో వచ్చేది రు. 2500/లు మాత్రమే. కాబట్టి అదనపు విలువయైన మిగిలిన రు. 2500/లను కాపిటలిస్టు స్వాహా జేస్తున్నాడు.

అయితే కాపిటలిస్టు ఎంత కాజేస్తున్నాడో స్పష్టంగా తెలుసు కోవాలంటే కార్మికులు శ్రమలో వారికివచ్చే భాగం ఎంత, కాపిటలిస్టుకు పోయేది - అనగా, అదనపు శ్రమ ఎంత అనేది చూడాలి

అదనపు విలువ రేటును చూస్తే ఇది తేలికగా తెలిసిపోతుంది. అదనపు విలువ రేటు అంటే-అదనపు విలువకూ, అస్థిరమైన కాపిటల్‌కూ, లేదా ప్రతిఫలం పొందబడని శ్రమకూ, అవసర శ్రమకూ మధ్యగల నిష్పత్తి మనం ఇంతకుముందు చూచిన ఉదాహరణ ప్రకారం అదనపు విలువ రేటు ఈవిధంగా వుంటుంది :

రు. 2500 అదనపు విలువ: రు. 2500 అస్థిరమైన కాపిటల్ 100%

అదనపు విలువ రేటు 100% వుందనుకుంటే కార్మికుల శ్రమ సరి సమానంగా అవసర శ్రమ క్రిందా, అదనపు శ్రమ క్రిందా విభాగించబడిందన్నమాట. కూలి రూపంలోవుండే మార్పుచెందు కాపిటల్ ఎంతవుందో, అదనపు విలువ అంత వున్నదన్నమాట. కార్మికుడు తన శ్రమలో సగభాగానికి మాత్రమే ప్రతిఫలం పొందుతున్నాడన్నమాట. ఇతర సగం కాపిటలిస్టుకు పోయిందన్నమాట.

# అదనపు విలువను హెచ్చు చేస్తానికి రెండు మార్గాలు

కాపిటలిస్టు సాధ్యమైనన్ని విధాల అదనపు విలువను హెచ్చించాలని చూస్తాడు. ఇందుకై ఏమి చేయాలి? కాపిటల్‌ను పెంచాలి 100 మంది కార్మికులచే పనిచేయిస్తూ వుంటే రు 25 0/0 అదనపు విలువ వస్తోంది. 200 మందిని పెట్టి పని చేయిస్తే రు 50 0/0 అదనపు విలువ వస్తోంది కాని ఇందుకు మరొక ఫ్యాక్టరీని నిర్మించాలి. ఇందుకై అదనంగా కాపిటల్‌ను తెచ్చిపెట్టాలి కాపిటలిస్టు దగ్గర అంత ధనం వుంటే లేక ఉత్పత్తి సాధనాలన్నీ వుంటే ఇది చేస్తాడు. కాని ఇంతకన్న మరోమార్గం వుంది. కాపిటల్‌ను వృద్ధిచేయనవసరం లేకుండానే, అదనపు విలువను ఎక్కువగా సంపాదిస్తానికి మార్గం చూస్తాడు. ఇందుకు రెండు మార్గాలు వున్నవి.

కార్మికుడు పనిచేసే రోజు రెండు భాగాలుగా విభాగింపబడి వుందని చూశాము. ఒక భాగము అవసర శ్రమ – అనగా ఈతని జీవన పోషణకు వెచ్చించవలసిన శ్రమ. ఇందుల కీతనికి కూలి ముట్టుతుంది. రెండో భాగం అదనపు శ్రమ. ఇందుకీతనికి ఏ జీతమూ, ఏమి ప్రతిఫలమూ ముట్టదు. ఉదాహరణకు: రోజులో పనిచేసే గంటలు 12 అనుకుందాము. ఈ 12 గంటలకు గంటకొక అడ్డగీత చొప్పున గుర్తు పెట్టుకొని ఒక లెక్కగా వేస్తే ఇది బాగా తెలుస్తుంది.

12 గంటలు




ఇట్టి సందర్భంలో 12 గంటలు చెరిసమానంగా అదనపు శ్రమ, అవసర శ్రమల క్రింద విభజింపబడి వుంది. కాని పనిచేసే గంటలను మరో 2 గంటలకు పెంచితే?

14 గంటలు



కాబట్టి పనిచేసే గంటలు హెచ్చిస్తే కార్మికుడు తన జీవన పోషణకై వెచ్చింపవలసిన శ్రమ ఎన్నడూ 8 గంటలే గనుక, అదనపు శ్రమ ఎక్కువైన దన్నమాట, అదనపు శ్రమ ఫలితమే అదనపు విలువ గనుక, ఈ విలువను 'అఖండపు విలువ' అని అంటాము.

ఇంకో విధంగా అదనపు విలువను పెంచవచ్చును. కాపిటలిస్టు అవసర శ్రమ భాగాన్ని తగ్గించవచ్చును. అనగా కార్మికులకు పూర్తి జీతాలీయడు. ఉదాహరణకు : అవసర శ్రమ 4 గంటలకే తగ్గింప బడినది.




దీనివల్ల తేలేదేమిటి? పని చేసేదేమో 12 గంటలే. కాని కార్మికునికి ప్రతిఫలంగా పోయేది 4 గంటల శ్రమయే. మిగిలిన 8 గంటల శ్రమఫలితం కాపిటలిస్టుకు పోతోంది. కాబట్టి అవసర శ్రమకు అదనపుశ్రమకు పూర్వం 8 : 8 నిష్పత్తి వుంటే. ఇప్పుడు 4 : 8గా మారింది. ఈ విధంగా 'తారతమ్యపు' అదనపు విలువ వృద్ధి అవుతోంది.

అయితే, అవసర శ్రమను తగ్గించడం ఎట్లా సాధ్యం అయింది?

ఉత్పత్తి విధానంలో అంతకంతకూ టెక్నిక్ అభివృద్ధి జరుగుతూ వున్నది. పూర్వం కార్మికుల జీవనభృతికై 8 గంటలవసరమైతే ఇప్పుడు 4 గంటలే అవసరం అగుచున్నది. కార్మికుని జీవన సాధనాల నుత్పత్తి చేయుటకై తక్కువ శ్రమ అవసరం అవుతోంది. కాబట్టి వీటివిలువ తగ్గుతోంది. ఇందువల్లనే 12 గంటల లోనూ 4 గంటలు మాత్రమే అవసర శ్రమ అగుచున్నది. మిగతాని అదనపు శ్రమ అగుచున్నది. ఆ విధంగా అదనపు విలువ భాగం నిష్పత్తి పెరుగుచున్నది.

కార్మికుని వుత్పత్తి శక్తి వృద్ధి కాకపోయినా, మరో విధంగా కూడా అవసర శ్రమను తగ్గించవచ్చు. కార్మికుని కుటుంబ పోషణకై అతిదొక్కడే 8 గంటలు శ్రమపడి సంపాదించవలసి వస్తోంది. ఇపుడు కాపిటలిస్టు కార్మికుని భార్యా బిడ్డలచేత కూడా పనిచేయించి జీతం మాత్రం లోగడ కార్మికుడు ఒక్కనికి ఇచ్చేదే అందరకూ కలిపి యిస్తాడు. అంటే ఒక్కొక్కరి జీతం తగ్గించబడి, మొత్తం కుటుంబ పోషణ కవసరమైన జీతం మొత్తం అందరకూ కలిపి యిన్వ

బదులున్నదన్నమాట. టెక్నిక్ అభివృద్ధి అయి, కార్మికుడు కేవలంయంత్రాలవద్ద నిలబడి స్వల్పంగా మాత్రం పనిచేస్తూ వుండటం వచ్చిన పిమ్మట స్త్రీలను, బిడ్డలను కూడా ఫాక్టరీలలో పనిచేయించటం సాధ్యమైనది. సాధారణంగా స్త్రీలకు తక్కువ కూలి, బిడ్డలకుకూడా తక్కువకూలి వుండటం జరుగుతుంది.

## మరీ హెచ్చు అదనపు విలువ

అదనపు విలువను పెంచాలని కాపిటలిస్టు చూస్తాడు అందుకై అన్ని ప్రయత్నాలు గావిస్తాడు. ఉత్పత్తి ఖర్చులు తగ్గేటందుకై అభివృద్ధి మార్గాలను కనిపెట్టుతాడు. కొత్త యంత్రాలను అమర్చుతాడు. టెక్నిక్ అభివృద్ధిని గావిస్తాడు. ఈతడు తెచ్చిన టెక్నిక్ అభివృద్ధి ఇతర కాపిటలిస్టులకు తెలియకపోతే, వీరికన్నా ఈతడు చౌకగా సరుకులను తయారుచేసి, వారు అమ్మే ధరలకే తామూ అమ్ముతాడు. ఇందువల్ల అతడికి విశేషలాభాలు వస్తాయి. వీటినే 'మరీ హెచ్చు అదనపు విలువ' అంటాము.

ఇదే సందర్భంలో ఇంకొకటి జరుగుతుంది. టెక్నిక్ అభివృద్ధియైనకొలదీ కార్మికుని జీవన విధానాల ఉత్పత్తి కవసరమైన శ్రమ (అవసరశ్రమ) తగ్గుతుంది. అంటే 8 గంటల బదులు 4 గంటలే అవసరమౌతాయి. ఇందువల్ల 'తారతమ్యపు' అదనపు విలువ పెరుగుతుంది అంటే 8 గంటలు అవసరశ్రమ, 8 గంటలు అదనపు శ్రమ బదులు 4 గంటలు అవసరశ్రమ, 8 గంటలు అదనపుశ్రమగా విభ్రత్తి ఏర్పడు తోంది. అవసర శ్రమ తగ్గుతున్నది అంటే కార్మికుల కూలి మొత్తం తగ్గుతోంది అన్నమాట. ఈ విధంగా అదనపు విలువ కొరకు అయిన పోటీలో టెక్నిక్ అభివృద్ధి జరిగి, అవసరశ్రమ తగ్గటం, అదనపు విలువ పెరిగి మరీ హెచ్చు అదనపు విలువ ఏర్పడటం జరుగుతుంది.

## పనిదినం గూర్చిన పోరాటం

తన లాభాలను ఇంకా వృద్ధిచేసుకోవాలంటే కాపిటలిస్టుకు మలభ మార్గం పని గంటలను హెచ్చు జేయుటమే. ఇందుకొరకై ఏ టెక్నిక్ అభివృద్ధి అవుసరం లేదు. వాస్తవంగా ఈ విధంగా పనిగంటలను హెచ్చు చేయుటం సర్వసాధారణం. ఇందువల్ల అదనపు విలువ మొత్తం ఎక్కువౌతుంది. సాధ్యమే గనుక అయితే కాపిటలిస్టు రోజుకు 24 గంటలకన్న ఎక్కువ పనిని కార్మికులచే చేయించేవాడే. కాని అదృష్టవశాత్తు అది అసంభవమగు విషయం. పైగా పనికాలం పొడిగించట మంటే చాలా సాధకబాధకాలున్నవి. కార్మికులు తీవ్రంగా వ్యతిరేకిస్తారు. అందుచే, పనికాలాన్ని హెచ్చించటానికి తోడుగా, టెక్నిక్ అభివృద్ధి ద్వారా శ్రమయొక్క ఉత్పత్తి శక్తిని పెంపొందించటంకూడా కాపిటలిస్టు చేస్తాడు.

కాపిటలిస్టు శకం ప్రారంభమైన కొత్తలో పనికాలం బహుదీర్ఘంగా వుండేది. కార్మికుడు రోజుకు 16, 18 గంటలు కూడా పని జేసేవాడు. ఆ కాలంలో

టెక్నికల్ అభివృద్ధి అంత ఎక్కువకాలేదు. కార్మికులలో సంఘీభావం ఏర్పడలేదు. వారు పోరాటానికి తయారుకాలేదు. అందుచే ఆ దినాలలో పనికాలం చాలాదీర్ఘంగా వుండేది. ఒక్కొక్కప్పుడు నిద్రాకాలం మినహా మిగిలిన రోజంతా కార్మికుడు పని జేస్తూనే వుండేవాడు.

ఈనాటికి కూడా చాలాదేశాలలో దినంలో పనిచేసేకాలం చాలాదీర్ఘంగానే వుంటున్నది. ఉదాహరణకు చైనాలో ఈరోజున కూడా రోజుకు 18 18 గంటలు పనిచేయటంవుంది. అభరుకు గనులలో కూడా చాలా దీర్ఘకాలం పనిచేయవలసి వుటోంది. పురుషులేగాక, స్త్రీలు, బాలురు కూడా ఈ విధంగా దీర్ఘకాలం పనిచేయ వలసి వుంటోంది.

మార్క్సు చెప్పినట్లు ప్రజాసామాన్యం రోజంతా కష్టపడి పనిచేయటం ద్వారానే కాపిటలిస్టువర్గానికి ఎక్కువ విశ్రాంతి దొరుకుచున్నది.

శ్రామికవర్గం తన పోరాటంలో మొట్టమొదటగా తీసుకొనే వివాదాలలో ఒకటి పనిగంటలు తగ్గించాలనేది. స్త్రీలు, బాలురుచేసే పని గంటలను ఒకహద్దును మీరకుండా ఉండునట్లు ఇగ్లాండు, ఫ్రాన్సు మున్నగు పెద్దకాపిటలిస్టు దేశాలలో 1840 ప్రాంతాలలో మాత్రం గావించారు. కార్మికులు ఎంతో తీవ్రపోరాటాలను సాగిస్తేగాని కార్మికచట్టాలు ప్యాసుకాలేదు. ఈ ఆందోళనకు లొంగటంవల్లనూ, కార్మికులు తిరిగి పనిచేయాలంటే వారిస్థితి మరీ దివాళాగానే వుండవలసి వుండటం వల్లనూ, కాపిటలిస్టులు ఈ చట్టాలను ప్యాసు జేయవలసి వచ్చినది. ఎందుచేతనంటే; కార్మికులు లేకపోతే కాపిటలిస్టులకు లాభాలెక్కడివి?

మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం చాలా దేశాలలో 10 గంటల పని కాలం వుండేది. రాక్షసబొగ్గు, లోహముల గనులలో మాత్రం ఇంకా కొంచెం తక్కువగా వుండేది. స్త్రీలు, బాలుర పనినిగూర్చి కూడా కొన్ని హద్దులుండేవి.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం లేబరు వుద్యమం మహాజోరుగా వుంది. కాపిటలిజమే నాశనమౌతుందా యన్నంత భయం వుండేది. అట్టి రోజులలో కాపిట లిస్టులు లొంగి కార్మికులకు కొన్ని సౌకర్యాలను కలిగించారు. అందుకు, రోజుకు 8 గంటలకన్న ఎక్కువ పనిచేయించ కూడదని కూడా 1919 లో వాషింగ్టన్‌లో నిర్ణయించబడింది. కాని అది తీర్మాన రూపంలోనే వుందిగాని ఆచరణలో పెట్టేవాడుడే లేకపోయాడు. తర్వాత కాపిటలిస్టులు బలాన్ని సమకూర్చుకొని తిరుగు దాడిని ప్రారంభించారు. లోగడ ఇచ్చిన వసుపాయలన్నిటినీ ఒక్కొక్కటిగా వూడదీకారు. 8 గంటల పనికాలం సర్వసామాన్యంగా ఎగిరిపోయింది. కార్మికులు యమయాతన లకు గురికాబడుచున్నారు.

## శ్రమ తీవ్రత

కార్మికులచే పనిచేయించి ఇంకా ఎక్కువ అదనపు విలువను పొందుటకు

కాపిటలిస్టు ఇంకో మార్గం వెతుకుతాడు. కార్మికుల పని తీవ్రతను హెచ్చించుతాడు. ఒక కాలపరిమితిలో పూర్వంచేసే శ్రమకన్న ఇంకా ఎక్కువ శ్రమను వెచ్చించే టట్లుగా చేస్తాడు. ఇందువల్ల, పూర్వం శ్రమజేసే కాలంలోనే ఇప్పుడు ఎక్కువ అదనపు విలువను సృష్టిస్తున్నాడు. ఇదీ కాపిటలిస్టు జేబులోకే పోతుంది.

యంత్రాగారాలలో పనిజేసే కార్మికులచే ఎక్కువ తీవ్రంగా పనిచేయించు టకు యంత్రాన్ని వేగంగా నడపటం ఒకపద్ధతి. కార్మికుడు యంత్రవేగాన్ని అందు కొని పనిచేయాలి. లేదా వెనుకబడిపోతాడు. పని పోగొట్టుకుంటాడు లేదా కాపిటలిస్టు మరోమార్గం వెతుకుతాడు. బహుమానాలనీ, బోనసులనీ పేరుపెట్టి కార్మికులచే ఎక్కువ పనిచేయిస్తాడు. లేదా ఇతర విధాల - కాంట్రాక్టు పద్ధతి, ఉత్పత్తినిబట్టి జీతం(price rate) - పనితీవ్రత హెచ్చేటట్లు చూస్తాడు.

పని గంటలు పెంచటం కార్మికుని ఆరోగ్యానికి ఎంత హానికరమో, పని తీవ్రత కూడా అంతే హానికరం. పని గంటలు చట్టప్రకారం నిర్ణయమైనప్పుడు, కాపిటలిస్టులు పని తీవ్రత మార్గాన్ని అవలంబిస్తారు. అనేక కాపిటలిస్టు దేశాలలో యీ పని తీవ్రత ఎంత హెచ్చుగా, దారుణంగా అవలంబించ బడుతున్నదంటే, ఆదేశాలలో కార్మికులు చాలా త్వరలోనే వృద్ధాప్యమును పొందుతున్నారు. పనిజేసేం దుకు శక్తిని కోల్పోవుచున్నారు. అనేక వ్యాధులకు గురియౌతున్నారు.

కాపిటలిస్టులు కార్మికులను ఇంకా ఎక్కువగా దోచుకుంటానికే, వారి దానిసత్వాన్ని ఇంకా దృఢం చేస్తానికే ఒక మార్గం ఈ పని తీవ్రత.

## కాపిటలిజం, టెక్నికల్ (సాంకేతిక విద్య) అభివృద్ధి

ఈనాడు కాపిటలిజం తరచు తీవ్ర ఆర్థిక సంక్షోభాలకు గురియౌతూ శిధి లమైపోతూవుంది. ఇట్టి శిథిలావస్థలో ఇది టెక్నిక్ అభివృద్ధికి శత్రువౌతున్నది. కాపిటలిస్టులు, వారి తత్వబోధకులు యంత్రాలవల్లనే అన్నికష్టాలు వస్తున్నవి కాబట్టి వెనుకకు మరలి మళ్ళీ గృహపరిశ్రమలను చేపట్టాలంటారు. ఎక్కువ యంత్రాలున్న కొలదీ, సరుకు లెక్కువై అమ్ముడుపోవనీ, నిరుద్యోగం ప్రబలు తుందనీ, మానవుడు యంత్రానికి దాసుడైపోతాడనీ రకరకాల సిద్ధాంతాలు లేవదీస్తారు.* కాని నిజానికి యంత్రాలవల్ల ఆర్థిక సంక్షోభం రాదన్న సంగతి కార్మికవర్గానికి తెలుసు. ఆర్థిక సంక్షోభానికి కారణం కాపిటలిస్టు వ్యవస్థలోనూ, అందలి పరస్పర వైరుధ్యాల లోనూ మాత్రమేవుంది. కార్మికుని నోటిముందు ముద్దలాగేసేది యంత్రంకాదు, కాపిటలిస్టు. ఇందుకు కాపిటలిస్టు యంత్రాన్ని సాధనంగా మాత్రం వుపయోగిస్తున్నాడు.

ఆర్థిక సంక్షోభ కాలాలలో కాపిటలిస్టులు యంత్రాలను వదలి పూర్వపు కుటీర పరిశ్రమలను చేపట్టటం సంభవిస్తుంది. ఇటువంటి పిచ్చి పిచ్చి వూహలు

---

* మన దేశంలో గాంధీజీ ప్రారంభించిన నిర్మాణ కార్యక్రమం ఇట్టిదే (అనువాదకుడు).

నిజంగా జరిగినవే. 1929–34 సంక్షోభంలో అమెరికాలో ఆవిరివల్ల పనిజేసే పారలు, డ్రెడ్జర్లు (నదులలో ఊబిని త్రవ్వివేసే యంత్రాలు) మూలపడి, తిరిగి మామూలు పారలూ, పలుగులూ బయటకు వచ్చినవి. ఒక్క సోవియటు యూనియనులోనే ఇట్టి అభివృద్ధి విరోధక పనులు జరగలేదు. టెక్నిక్ అభివృద్ధి బ్రహ్మాండంగా జరిగిపోతూవుంది. సోషలిస్టు వ్యవస్థ ఆ దేశంలో వుండటమే ఇందుకు కారణం.

నవీన టెక్నికల్ ఇంజనీరింగు ద్వారా, ఇదివరకు ఒక్కమనిషి చేసే పనికి ఇప్పుడు అదేకాలంలో వందలు, వేల రెట్లు పనిచేయటం సాధ్యమౌతుంది.

మామూలుగా చేతులతో పనిచేసే కార్మికుడు రోజుకు 400 ఇటుకలు చేయగలడు. కాని ఇప్పటి ఇటుకలు నిర్మించే యంత్రం అందు పనిచేసే ఒక్కొక్క కార్మికునికి, రోజుకు 4,00,000 ఇటుకలను – అంటే స్వయంగా మానవుడు చేసే దానికిసుమారు 1000 రెట్లు ఎక్కువ – తయారు చేస్తున్నది.

గోధుమలను కర్ర గానుగతో విసిరితే రోజుకు 750–850 పౌనులు విసర వచ్చును. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని మినియాపొలిస్ రాష్ట్రం పిండిమరలతో ఉత్తమమైన పిండి ప్రతి కార్మికునికి 1,30 00,000 పౌనులు తయారవుతుంది. అంటే కర్రగానుగకు 20000 రెట్లు ఎక్కువ.

ఒకమనిషి 1 జత బూట్లను 6 రోజులలో కుట్టితే, అదేకాలంలో ఈనాటి ఫ్యాక్టరీలలో 83 జతలు తయారు చేయబడుచున్నవి.

అయినప్పటికీ చరమదశలోవున్న కాపిటలిజం నష్టాంతానికి పూర్వమే ఈ టెక్నిక్ అభివృద్ధిని ఉపయోగించుకోలేకుండావుంది. ఉదాహరణకు: అమెరికా సంయుక్త రాష్ట్రాలలో బ్రహ్మాండమైన ఇటుక ఫాక్టరీలు వున్నవి. ఒక్కొక్కటి 100 మంది కార్మికులను పెట్టుకొని అటువంటి ఫ్యాక్టరీలు 6, 7 పనిచేస్తే ఆ దేశానికి కావలసిన ఇటుకలన్నింటినీ తయారుచేయగలవు. కాని ఆ దేశంలో ఈ టెక్నిక్ను ఉపయోగపర్చుకొనటంలేదు. 1929 లో చిన్నవి 2730 ఇటుక ఫ్యాక్టరీలు వున్నవి. వాటిలో 39000 మంది కార్మికులు పనిచేస్తున్నారు. 800 కోట్ల ఇటుకలను తయారు చేస్తున్నారు.

అట్లే పిండిమరలు, పైనచెప్పిన మినియాపొలిస్ మిల్లు ఒక్కటేవుండి 17 మంది కార్మికులు పనిచేస్తే, అమెరికా సంయుక్త రాష్ట్రాలకంతటికీ కావలసిన 650 కోట్ల పౌనుల పిండిని ఉత్తమమైన దానిని, తయారు చేయవచ్చును. కాని ఈనాడు పిండిమరలలో 27,028 మంది కార్మికులు నియోగింపబడి వున్నారు. ఎంత శ్రమ వృధా!

1929 లో బూట్ల పరిశ్రమ (Shoe Industry) బాగా అభివృద్ధి చెందినదని అనుకొనేవారు. కాని ఆ కాలంలోకూడా 205840 మంది కార్మికులు

పనిచేస్తూ, 39,50,00 000 జతల బూట్లను తయారుచేశారు. ఈ లెక్కన కార్మికునకు 833 జతలుకాక 35 జతలు మాత్రమే తయారు చేయబడుచున్నవి.

ఇటువంటి ఉదాహరణలు ఎన్నైని యివ్వవచ్చు.

కాపిటలిజం తన బాల్యదశలో టెక్నిక్ అభివృద్ధికి, నూతన పరిశోధనలకూ ఎంతో ప్రోత్సాహం యిచ్చి తోడ్పడింది. అంతకు పూర్వం కనివిని యెరుగని బ్రహ్మాండములగు యంత్రములు, వివిధ రకాలవి నిర్మింపబడినవి. కాపిటలిజంలోనే యంత్ర పరిశ్రమ వచ్చింది. రహదార్లు వృద్ధియైనవి. భూగర్భంలో దాగియుండే అగణితమైన సంపదఅంతా బైటపడింది. మానవుని శ్రమను సులభతరం గావించు నట్లుగా, ప్రకృతిపై మానవుడు పెత్తనం సంపాదించునట్లుగా, కాపిటలిజం టెక్నిక్ అభివృద్ధిని గావించింది.

కాని కాపిటలిజం ఈ టెక్నిక్ అభివృద్ధినంతటినీ కార్మికులను దోచు కుంటానికే ఉపయోగించింది. యంత్రముల పరిపూర్ణత చెందుకొలంది కార్మికులను దోచుకొనే పద్ధతులుకూడా సంపూర్ణములౌతూవచ్చినవి. లాభాపేక్షయే, లాభాలకొరకు పరుగెత్తుటయే కాపిటలిస్టు పరిశ్రమయొక్క ప్రధాన లక్షణం. లాభాలను పెంచు కొనుటకే కాపిటలిస్టు టెక్నిక్ అభివృద్ధిని గావిస్తున్నాడు.

ఇందునే కాపిటలిస్టు వ్యవస్థలో టెక్నిక్ అభివృద్ధి ఇంకా ఎక్కువైనది. అంటే, కార్మికుల దోపిడి ఇంకా పెరిగిందన్నమాట. ప్రజాసామాన్యంలో బీదరికం వృద్ధియౌతూంటే, కొలదిమంది కాపిటలిస్టులు, మరీ సంపన్నులౌతున్నా రన్నమాట. కాని ఇట్టి సమయంలో చాలా ఎక్కువ టెక్నికల్ పరిపూర్ణతను గల్గిన యంత్రాలను నిర్మించటం ద్వారా, మానవుని శ్రమను సులభతరం చేయటం ద్వారా కాపిటలిజం సోషలిజం స్థాపన కవుసరమైన భౌతిక సాధనాలన్నిటినీ ఏర్పాటు చేసిపెడుతోంది. ఈ విధంగా శ్రామికవర్గ విప్లవానికి అవసరమగు పరిస్థితులను ఏర్పర్చి వుంచటమే కాపిటలిజం యొక్క చారిత్రక ప్రాముఖ్యత.

## కులి బానిసత్వము

బూర్జువా పెద్దలు "సమానత్వము"ను గూర్చి "స్వాతంత్ర్యము"ను గూర్చి పెద్దపెద్ద కబుర్లు చెప్పుతారు. కాని ధనవంతులకు నిరుపేదలకు, కలిగినవారికీ, అర్ధాకలితో జీవించేవారికి, సోమరిపోతులకు, కలకాలం కష్టించేవారికి "సమానత్వం" అని వీరు చెప్పే కబుర్లు కల్లబొల్లి మోసపు కబుర్లు కాక ఏమిటి? వాస్తవానికి ఆకలి, కార్మికుని కాపిటలిస్టు కౌగిటిలోనికి తోలుతుంది. ఎంత కఠినమయిన చట్టమయినా దీనికి సరిగాదు. కాపిటలిజంలో అంతకంతకూ కార్మికుల స్థితి దిగజారుతుంది. దరిద్రం ఎక్కువౌతుంది. కడుపుదేవత ఎల్లప్పుడూ వీరి యిండ్లలో అతిథ్యాన్ని స్వీకరిస్తూనే వుంటుంది. మార్క్స్ ఈవిధంగా వ్రాశాడు:

"రోమన్ సామ్రాజ్యంలో యజమానులు బానిసలను సంకెళ్ళతో బంధించే వారు. కాపిటలిస్టులు అదృశ్య రూపములయిన తాళ్ళతో కార్మికులను బంధించి వేస్తున్నారు. యజమానులు మారుతూ వుండడంవల్ల కార్మికుడు "స్వతంత్రుడు"గా కన్పిస్తున్నాడేగాని ఎవరికయినా అతడు చేసేది ఉపయోగమే." - 2గ మనె

నిజమే. కార్మికునకు 'స్వాతంత్ర్యం' వుంది. ఎందుకు? యజమానులను మార్చుకుంటానికి మాత్రమే."

"చూడండి! సోవియట్ యూనియన్‌లోనే వున్నది నిర్బంధ సేవ, మాత్రమే. అంటూ వేరేయేముంది?" బానిసయజమానులువచ్చి అసంపూర్ణ స్వతంత్రతా సౌఖ్యములు వెల్లివిరిసే సోవియట్ యూనియన్‌ను వెక్కిరించటం! ఒక్క సోవియట్ యూనియన్‌లోనే కూలి బానిసత్వం (కూలియిచ్చి కాపిటలిస్టు కార్మికుని తన బానిసగా జేసుకొనే పద్ధతి) సమూలంగా నాశనం జేయబడింది. చరిత్రలో మొట్ట మొదటిసారిగా కార్మికులు స్వతంత్రంగా బ్రతుకగలుగుచున్నారు. తమకొరకు, సమాజం మొత్తం కొరకు స్వేచ్ఛగా కష్టపడుతున్నారు.

కాని కాపిటలిస్టు ప్రపంచ మంతటా కార్మికులు కనపడని తాళ్ళతో బంధించి వేయబడ్డారు ఆర్థిక దాస్యంలో పూర్తిగా మునిగిపోయి ఉన్నారు. వారు కష్టపడిన కొలదీ వారిని బంధించినవుంచే తాళ్ళు మరింత బిగుస్తున్నవి. అగణితము లగు సంపదలను సృష్టిస్తూ, వాటినన్నిటినీ సోమరిపోతులకు సమర్పిస్తూ తాము దరిద్ర జీవనములను గడుపుచున్నారు. "బానిస పెత్తందారు కొరడా బదులు మేస్త్రీల జరిమానాల పద్దు పుస్తకం" వచ్చింది అని మార్క్సు చెప్పాడు. నిజమే, పూర్వం బానిసలు పెత్తందారు కొరడాకెంత జడిసేవారో అంతగా ఈనాడు వాగాల పద్దులకు జరిమానాల పద్దులకు కూలి పోతుందనే భయానికి కార్మికులు జడుస్తున్నారు.

మేస్త్రీల కొరడాలుకూడా అపురూపం కాదు. కాపిటలిస్టు దేశాలలో, చాలా దేశాలలో, మరీ ముఖ్యంగా వలసదేశాలలో నికార్సు అయిన బానిసత్వం వుంది. "వెట్టిచాకిరి" ఏమిటి మరి? కొన్ని దేశాలలో "కార్మిక సైన్యములు" అనే పేరుతో కొన్ని ఏర్పాట్లను ప్రభుత్వాలు ఏర్పాటు జేస్తున్నవి. ముఖ్యంగా నిరుద్యోగులగు కార్మికులను వీటిలో జేరుస్తున్నారు. వీరిచే దాదాపు ఉచితసేవ చేయించుకొనటయే ప్రభుత్వంపని. జర్మనీలో ఇట్టి "లేబర్ సర్వీసు" క్యాంపులు చాలావుండేవి. వాటిలో యువకులను జేర్చి నిర్బంధంగా పని చేయించేవారు. వారికి చాలా స్వల్ప వేతనాలు మాత్రమే ఇవ్వబడేవి. సైనిక తర్ఫీదు యివ్వబడేది. ఈ విధంగా వీరిని యుద్ధంలో 'బలికి'గాను తయారుచేసేవారు.

అమెరికాలో నీగ్రోల బానిసత్వం ఈనాటికీ వుంది. ఆ దేశంలో సుమారు 1,20,00,000 మంది నీగ్రోలు — వీరిలో అత్యధిక సంఖ్యాకులు కార్మికులు, పేద రైతులు— వున్నారు. పేరుకు 1863 లో బానిసత్వం రద్దు గావింపబడినా, వీరందరూ

కాపిటలిస్టు దయాదాక్షిణ్యాల మీదనే బ్రతికేటట్లు పరిస్థితులు కల్పించబడినవి. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోని దక్షిణ ప్రాంతాలలో, భూస్వామి నీగ్రోకు కొద్దిగా భూమి విత్తనాలు, తిండి, పనిముట్లు, యిచ్చి పనిచేయిస్తున్నాడు. తన పెట్టుబడితిరిగి వచ్చేవరకూ ఆ నీగ్రోను బానిసలాగా పనిచేయించుకుంటాడు. అబాకీ ఎప్పుడూ తీరేది కాదు. ఉదాహరణకు : 800 డాలర్లు పంట పండింది అనుకుందాం. "800 డాలర్లు పెట్టుబడి పెట్టాను : ఇంకానాకు 200 డాలర్లు బాకీవున్నావు" అంటాడు భూస్వామి. ఆ నీగ్రో పండించిన పంట పంతటినీ సమర్పించినా ఇట్లే ప్రతి సంవత్సరమూ జరుగుతూ వుంటుంది. నీగ్రో బానిసగానే పడివుంటాడు. కోర్టుకుపోయినా ప్రయోజనం లేదు తెల్లవాడి మాటముందు. నల్ల నీగ్రోమాట ఏమి ఖాతరు చేస్తుంది? ఒకవేళ పారిపోయాడా, పోలీసులు వేటాడి పట్టుకొనివచ్చి వాళ్ళ భూస్వామికి వప్పగిస్తారు. ఈ వేటాడటానికి ప్రత్యేకంగా కుక్కలను కూడా తరిఫీదు చేస్తారు. పోలీసులు ఏ నీగ్రోయైనా స్వేచ్ఛగా తిరుగుతున్నాడని అనుమానంతోస్తే పోలీసులు పట్టుకొని ఏ భూస్వామికో, లేక పూర్వపు భూస్వామికో వప్పగిస్తారు.

ఇంతేగాదు. ఎప్పుడయినా భూస్వామికి కూలీలకొరత వస్తుంది. వెంటనే వారు పోలీసు కోర్టులకు తెలియజేస్తారు. పోలీసులు కనబడిన నీగ్రోలనెల్లా అరెస్టు చేసి: కేసులు సృష్టించి, బూటకపు విచారణ జరిపి, జరిమానాలువేస్తారు. జరిమానాలు చెల్లించుటకై భూస్వాములవద్ద వీరు పనిచేయాలి!

## వలస దేశాలలో బానిసత్వం

కాని ఇంతకన్న ఘోరమైన బానిసత్వం వలసదేశాలలో వున్నది. దక్షిణాఫ్రికాలో బంగారుగనులు, మలయా మున్నగుచోట్ల రబ్బరుతోటలు, ఇండియాలో టీ, కాఫీ తోటలు మున్నగు వాటిల్లో ఇట్టి దారుణమగు బానిసత్వ పద్ధతి వున్నది. దక్షిణాఫ్రికాలో "యజమానులు, భృత్యులు చట్టం అనేది ఒకటుంది. దాని ప్రకారం ఒక పనివాడు పారిపోతే, పట్టుకోబడి అతని పూర్వపు యజమానికి వప్పజెప్పబడు తాడు. స్వదేశీయులందరూ ఎక్కడకుపోయినా ప్యాస్‌పోర్టులు తీసుకువెళ్ళాలి. అవి లేకపోతే వారు అరెస్టుకూడా కాబడతారు. ఎక్కడయినా పనికి కుదరాలంటే, అంతకు పూర్వం తాను ఒక యిరోపియనువద్ద పనిజేసినట్లు రుజావు పత్రం చూపాలి. లేదా ఎక్కడా పని దొరకదు.

దక్షిణాఫ్రికా బంగారు, వజ్రపు గనులలో కార్మికులకు ప్రత్యేక నివాస స్థానాలుంటాయి. వాటిని "దొడ్లు" అంటారు. వాటిచుట్టూ ముండ్లతీగెలు వుంటాయి. సాయుధులగు పోలీసులు కాపలా కాస్తూ వుంటారు. రోజు కూలి డాలరులో సగానికి తక్కువ (1-50కు తక్కువ)గానేవుంటుంది. ఈ స్వల్పకూలికే రోజు 1కి 12-14 గంటలుపనిచేయాలి గనులలో.

కొన్నిచోట్ల బహిరంగంగానే మనుష్యులను అమ్మటం, కొనటం ఇంకా వుంది. పోర్చుగల్ సామ్రాజ్య భాగాలైన అంగోలా, మొజాంబిక్ (ఆఫ్రికాలోని)లోనూ, అమెరికన్ కోటీశ్వరుల సొత్తు, "స్వతంత్ర దేశము" అగు లైబీరియాలోనూ బానిస వ్యాపారం ఈనాడూవుంది.

ఇట్టి బానిసత్వానికి తోడు ఋణబానిసత్వము కూడా వుంది. ఒక కాపిటలిస్టు లేక భూస్వామి కొంత ఋణం ఇస్తాడు. దానికి వడ్డీమీద వడ్డీ పెరుగుతూవుంటుంది. ఋణస్థుడు దానినెన్నడూ తీర్చుకొనలేడు. అందుచే ఋణం తీరేదాకా అతడు, అతని కుటుంబం ఋణదాతక్రింద బానిసలుగా పూడిగంచేస్తూ బ్రతకవలసినదే. *

* మనదేశంలో ఇట్టి ఋణబానిసత్వం చాలాచోట్ల వుంది. దీనికి వ్యతిరేకంగానే 1946 లో ధానాజిల్లా (బొంబాయి రాష్ట్రం) లోని వర్లీలు తీవ్రపోరాటాన్ని ప్రారంభించారు. గుజరాతు, తమిళనాడు, సంయుక్త రాష్ట్రాలలో ఇది ఈనాటికి బలంగావుంది. (అనువాదకుడు)

# అధ్యాయం 5

# కూలి డబ్బులు - కాపిటలిస్టు వ్యవస్థలో కార్మికుల బీదరికపు క్రమాభివృద్ధి

## శ్రమశక్తి యొక్క విలువ; దాని వెల

కాపిటలిస్టు వ్యవస్థలో కార్మికుడు కాపిటలిస్టుకు తన శ్రమశక్తిని అమ్ముకుంటాడు. ఇందుకుగాను ఈతనికి 'కూలి' ముట్టుతుంది. ఈ విధంగా "శ్రమశక్తి" యొక్క అమ్మకం, కొనుగోలు జరుగుతుంది.

కాని ఇతర సరుకులవలెగాక శ్రమశక్తి ఒక "ప్రత్యేకరకమైన సరుకు". ఈ శ్రమశక్తి అమ్మకం కొనుగోలువల్లనే కాపిటలిజంలో ప్రప్రధాన వర్గాలైన కాపిటలిస్టు, శ్రామికవర్గాల మధ్య సంబంధాలేర్పడ బడుచున్నవి. 'శ్రమశక్తి' యొక్క విలువ ఏమిటి? శ్రమశక్తిని తిరిగి కల్గజేయుటకు, కార్మికుని కుటుంబ పోషణకు సరిపడునట్టి జీవితావసరముల విలువ-కాని కాపిటలిస్టు ఎల్లప్పుడూ కూలిని ఈ విలువకు తగ్గించి వుంచుటకే ప్రయత్నించుతూ వుంటాడు. కార్మికులు ఎట్లా జీవిస్తున్నారో ఏ కాపిటలిస్టు పట్టించుకోడు. కార్మికులు తరచు నిరుద్యోగులుగానూ, ఆకలిగొన్నవారుగానూ, వుంటూనే వుంటారు. వారికి పని దొరికినా, కూలి గూడా సరిగా యివ్వబడదు.

జీవితావసరముల విలువయే శ్రమశక్తి యొక్క విలువ అని చూశాము. అయితే ఈ జీవితావసరములను నిర్ధారణ చేసేది ఎట్లా? వీటిని, వీటి మొత్తాలను కూడా నిర్ధారణ చేయటం అనేక విషయాలపై ఆధారపడి వుంది. మార్క్సు దీనిని గూర్చి ఈ క్రిందివిధంగా చెప్పాడు.

"ప్రతి దేశంలోనూ శ్రమయొక్క విలువ, "సాంప్రదాయ సిద్ధంగా వచ్చే జీవన ప్రమాణాన్ని" బట్టి నిర్ణయింపబడుచున్నది. మానవులు కేవలం తిండి తినటం, కండలను పెంచటం వల్లనే బ్రతకటంలేదు. సామాజిక పరిస్థితులనుండి

వారికి కొన్ని వాంఛ లుదయించటం, కొన్ని నియమాలను పాటించటం జరుగుతూ వుంది. వాటిని సంతృప్తి పర్చటంకూడా జీవన ప్రమాణంలోనికే వస్తుంది." *

కాబట్టి ఇతర సరుకులవలెగాక, శ్రమశక్తి విలువ కొన్ని చారిత్రకమైన లేక సామాజికమైన పరిస్థితులనుబట్టి నిర్ధారణకాబడుతూవుంటుంది. ఒక కార్మికుని జీవన ప్రమాణం యెల్లప్పుడూ ఒకేవిధంగా వుండేదికాదు. కాలపరిస్థితులు మారుతూ వున్నకొలదీ ఇదీ మారుతూ వుంటుంది. చరిత్రమారుతూవున్న కొలదీ ఒక్కొక్క దేశం ఏవిధంగా అభివృద్ధి అవుతున్నదీ, వీటినిబట్టి కార్మికుని జీవన ప్రమాణం నిర్ణయించబడుతుంది. అయినా, కాపిటలిస్టులు ఎల్లప్పుడూ కూలిని చాలాతక్కువ ప్రమాణంలోనే వుంచుటకు ప్రయత్నిస్తుంటారు. ఒక సరుకుయొక్క విలువను ధనరూపంలో చెప్పితే దానిని వెల అంటాము అని లోగడ చూశాము. సరుకుయొక్క వెల ఎప్పుడూ ఆ సరుకు విలువచుట్టూ వూగుతూ వుంటుంది. 'శ్రమ శక్తి' అనే సరుకుయొక్క వెలయే ఒక ప్రత్యేక రూపాన్ని ధరించి కూలి అనిపించుకుంటోంది. కాబట్టి శ్రమశక్తియొక్క విలువచుట్టూ కూలి వూగిసలాడుతూ వుంటుంది. కాని ఇతర సరుకుల వెలకూ, ఈ శ్రమశక్తి వెలకూ అనగా కూలికివున్న భేదమేమిటంటే, కూలి ఎల్లప్పుడూ విలువకు తగ్గియే వుంటుంది.

## కాపిటలిస్టు దోపిడీకి కూలి ఒక ముసుగు మాత్రమే

కాపిటలిస్టు దేశాలలో కూలి ఎప్పుడూ రెండు భాగాలుగా- ఒకటి: కూలి యివ్వబడే అవసర శ్రమ; రెండు: కూలి యివ్వబడని అదనపు శ్రమ- విభజింపబడి వుంటుందని చూశాము. కాని కార్మికునికి ఈ గొడవేమీ తెలియదు. తనకు అవసర శ్రమకు మాత్రమే ప్రతిఫలం యివ్వబడుతోందనీ, అదనపుశ్రమ ఫలితం పూర్తిగా కాపిటలిస్టుకే పోతోందనీ అతనెరుగడు. పైగా, కార్మికుడు చేసిన కష్టమంతటికీ ప్రతిఫలం యివ్వబడుచున్నట్లుగా మాత్రం కన్పడుతుంది.

ఉదాహరణకు: ఒక రాక్షస బొగ్గు గనిలోని కార్మికుని తీసుకుందాము. అతడికి టన్ను బొగ్గు తవ్వినందుకు 1 డాలరు కూలి. ఎంతో కష్టపడితేనే గాని ఈతనికి ఈ ఒక్క డాలరూరాదు. ఈ డాలరుతో అతడు తిండితినటమే కష్టం. ఇక యితర సౌకర్యాల విషయం యెందుకు? బహుశ ఈ విషయాన్ని కార్మికులు తన యజమానియైన కాపిటలిస్టుకు చెప్పుకుంటాడు అనుకుందాము. ఆ కాపిటలిస్టుకు దయకల్గినంటే, అతని జవాబు యిట్లా వుంటుంది?

"ఏమిటోయ్! ప్రతి టన్ను బొగ్గుకూ నీకు ఒక డాలరు ఇస్తున్నానే, ఇంకా ఎందుకు ఫిర్యాదు చేస్తావు? చూడు ప్రక్కనున్న మరే గనిలోనైనా ఎక్కువ ఇస్తున్నారా? నీకు న్యాయంగానే కూలి ఇస్తున్నానే. నీవు చేసిన పని డాలరుకన్న

---

* "విలువ, వెల, లాభం" అన్న గ్రంథం చూడండి.

ఎక్కువ విలువ చేస్తుందేమిటి ? నీకు యింకా ఎక్కువ కూలి కావాలంటే ఇంకా ఎక్కువ కష్టపడు, ఎక్కువ మొగ్గును తవ్వు "

నిజమే ననుకుంటాడు పాపం పిచ్చి కార్మికుడు. అతనికేమి తెలుసు, కాపిటలిస్టులందరూ దోపిడిగాండ్రేనని !

నిజానికి తాను ఎంత విలువను సృష్టిస్తున్నాడో కార్మికునికేమితెలుసు. తనచేసే శ్రమలో కొంత అవసర శ్రమఅనీ కొంత అదనపు శ్రమ అనీ తెలుసు కొనటకు అతడేమి అర్థశాస్త్రమంతా బట్టీ పట్టాడా ఏమిటి ? అతడనుకొనేదల్లా నిజమే; అవం ఎక్కువ పనిచేస్తే ఎక్కువ కూలివస్తుంది అని. కాని ఎక్కువ పనిజేసేకొలది ఎక్కువ అదనపుశ్రమ చేస్తున్నాడనీ, ఆ అదనపు శ్రమ ఫలితమైన అదనపు విలువను కాపిటలిస్టుకు కట్టపెట్టుచున్నాడని అతడేమి ఎరుగును ?

కాపిటలిస్టుల దోపిడికి ముసుగు వేయబడివుంది. శాస్త్రాలన్నీ ఈ దోపిడీని మరుగుపరుస్తానికే కాపిటలిస్టుకు సాయపడతాయి. ఈ భూలోకంలోవుండే పరిస్థితులన్నీటినీ భగవంతుడు ఏర్పర్చాడు. వాటిని మార్చటం పాపం అని మతం, పీఠాధిపతులు చెప్తాయి. • బూర్జువావర్గంయొక్క పత్రికలు, రంగస్థలము, సినిమా, సైన్సు, సాహిత్యం, కళలు, అన్నీ దోపిడీని మరుగు పరుస్తానికే వుపయోగిస్తాయి. రోజూ సూర్యుడెట్లా ప్రకాశిస్తున్నాడో, చెట్లు ఎట్లా చిగురుస్తున్నాయో, వసంత కాలములో కోయిలలెట్లా మధురగానాలు చేస్తాయో అట్లాగే కాపిటలిస్టు సంపన్నులు కావటం కూడా ప్రకృతి సహజమేనని ఇవి బోధింపజూస్తాయి.

"ఈ విధంగా కూలిడబ్బులు, పనిగంటలను అవసర శ్రమ క్రిందా, అదనపు శ్రమక్రిందా కనపడనీయకుండా కప్పు గప్పుతాయి. శ్రమ అంతా ప్రతిఫలం పొందినదిగానే కనిపిస్తుంది. పూర్వం బానిసలు పనిజేసేటపుడు కూడా వారి శ్రమ కూడా అవసరశ్రమ (వాని జీవిత పోషణకు అవసరమగు శ్రమ) అదనపు శ్రమ క్రింద విభజింపబడే వుండేది. కాని బానిసకు ఏమి తెలుసు ఈ విషయం ? అయితే అప్పుడు తన యిష్టం వచ్చినట్లు పనిచేయించుకొని యజమాని బానిసకు తిండిపెట్టి పోషించేవాడు ఎక్కువ అదనపు శ్రమ చేసేవాడు. కాని అనాడు బానిసచేసే శ్రమ అంతా అదనపు శ్రమయేననీ, వుచితంగానే చేస్తున్నాడనీ అనుకొనేటట్లు కన్పించేది. అనగా అవసర శ్రమకు ఏమీ ప్రతిఫలం యివ్వబడనట్లు కన్పించేది. ఇప్పుడో, కాపిటలిస్టు కార్మికునకు యిచ్చేది పూర్తి శ్రమకు, అనగా అదనపు శ్రమకు కూడా ప్రతిఫలం యిస్తున్నట్లు కన్పిస్తుంది" అని మార్క్సు 'కాపిటల్'లో వ్రాశాడు.

---

• మనవాళ్ళు "నీవు పూర్వజన్మలో ఏమి పాపం చేసుకున్నావో ఈనాడిట్టి స్థితి అనుభవిస్తున్నావు" అనీ "నీరాత అట్లావుంది" అనీ అనటం ఇదే. "భాగ్యవంతునికి అన్నీ బెంగలే. బీదవాళ్ళు హాయిగా నిశ్చింతగా బ్రతుకుతారు" అనీ, "పురుషార్థములు కోరటం పాపం - నిరాడంబరమైన సామాన్యమైన జీవితాన్ని గడపడమే మహత్త్వం" అని కూడా చెప్పే మెట్ట వేదాంతం కూడా కూలీలను, బీదలను కప్పు గప్పటానికే. (అనువాదకుడు)

# కూలి, కార్మికవర్గ పోరాటం

కార్మికులు చాలా త్వరలో ట్రేడ్ యూనియన్‌లను నిర్మించుకొని తమ స్థితిగతుల పరిపృద్ధి గావించుకొనుటకై పోరాట ప్రారంభించారు.

శ్రమశక్తి యొక్క విలువ మీదనే కూలి ఆధారపడి వుంటుందని మనం చూశాము. సాధారణంగా శ్రమశక్తి యొక్క విలవకు తగ్గియే కూలి వుంటుంది. మరో విషయం ఏమంటే అనేక పరిస్థితులను బట్టి శ్రమశక్తి విలువకూడా మారుతూ వుంటుంది.

ఈ కూలిరేటు విషయంలో కార్మికులకు, పెట్టుబడిదారులకు మధ్య ఎల్లప్పుడూ పోరాటం జరుగుతూనే వుంటుంది. ఈ పోరాట ఫలితం ఉభయుల సంఘ నిర్మాణాల మీద ఆధారపడి వుంటుంది.

కార్మికులు ట్రేడ్ యూనియన్‌లలో సంఘటితం కానంతకాలం, కాపిటలిస్టులు విడివిడిగా ఒక్కొక్క కార్మికునితో కాంట్రాక్టు కుదుర్చుకొనేవారు. అటువంటి సందర్భాలలో కాపిటలిస్టుకు కూలిరేటును తక్కువగా నిర్ణయించటం సులభం. కార్మికుడు అందుకు ఒప్పుకొనకపోతానా, పనికి వీళ్ళు వదులుకోవాలి.

ట్రేడ్‌యూనియన్ ఉద్యమంతో పరిస్థితులు మారినవి. కాపిటలిస్టు యిప్పుడు ఒక్కొక్క కార్మికునితో గాక మూక ఉమ్మడిగా ట్రేడ్‌యూనియన్‌తో కాంట్రాక్టు చేసుకోవలసి వుంది. కార్మికులందరికీ సమానమగు పరిస్థితులను, కోర్కెలను ట్రేడ్ యూనియన్ కోరుతుంది. కూలిరేటును గూర్చి ప్రత్యేక ఒడంబడికలు జరుగుతవి.

అయితే, కాపిటలిస్టులు కూడా ఈ ట్రేడ్ యూనియన్లతో పోరాడుటకు తమ 'ఎంప్లాయర్స్' సంఘాలను పెట్టుకుంటారు.

అయితే, అంతకంతకు పెరిగే కాపిటలిస్టు దోపిడి, శమదరిద్రం, ఆకలి బాధలకు వ్యతిరేకంగా కార్మికులు ఒక్క ఆర్థిక పోరాటాన్నే జరుపరు. పూర్తిగా దోపిడీని అంతమొందించాలంటే ఒక "విప్లవం" ద్వారానే అది సాధ్యమవుతుంది. విప్లవం ద్వారా కాపిటలిజాన్ని నాశనం జేయుటవల్లనే తమ దారిద్ర్యానికి, బాధలకు కారణమైన వర్గదోపిడీ నాశనం చేయబడగలదు.

మార్క్సు ఈ క్రింది విధంగా వ్రాశాడు:

"కూలిపద్ధతి చాలా హీనమైనదే. కాని కూలిరేటు హెచ్చింపుకై జరిగే పోరాటాలను గూర్చి, ఇవే సర్వార్థ మోక్షములని భావించకూడదు. కూలి హెచ్చింపు కొరకై పోరాటం అనేది, కాపిటలిజంవల్ల కల్గిన ఫలితాలతో పోట్లాడటమే గాని కాపిటలిజం మొత్తంతో కాదు: అసలు ఈ దారిద్ర్యానికి కారణమైన వాటితోగాదు. తమ స్థితి అంతకంతకూ దుర్భరం అవుతూ వుండటంతో పోరాడుతున్నారే గాని, అసలు యీ పరిస్థితుల గతినే, మార్గాన్నే మార్చుటకుగాదు. ఈ గెరిల్లా పోరాటాలు

చాలా అవసరమే. క్రమక్రమంగా తమజీవితాలను కబళించివేసే కాపిటల్ (పెట్టుబడి) యొక్క దురాక్రమణకు, బజారు మార్పులకు వ్యతిరేకంగా జరిపే పోరాటాలు అవసరమేకాని ఇవి తాత్కాలిక ఉపశమనములేగాని పూర్తి రోగ నివారణ కుపకరించేవికావు. తమ దారిద్ర్యానికీ, బాధలకు కారణమైన ఈ ప్రస్తుత వ్యవస్థయే, సమాజాన్ని అభ్యున్నతివైపుకు కొనిపోవటానికి "ఉత్తమ ఆర్థిక వ్యవస్థను నిర్మించటానికి" అనువైన భౌతిక పరిస్థితులన్నీ ఇప్పటి దుష్ట ఆర్థిక వ్యవస్థవల్లనే ఏర్పడి వున్నదని కార్మికులు గుర్తించాలి. కాబట్టి వారినినాదం "న్యాయమగు రోజుపనికి న్యాయమగుకూలి" అనేదికాదు. "కూలిపద్ధతి నశించుగాక" అనే విప్లవ నినాదమేవారి సరియైన నినాదం.

## కూలి యిచ్చే పద్ధతులు

కార్మికులకు కాపిటలిస్టు అనేక పద్ధతులలో కూలియిస్తాడు. అందులో ముఖ్యమైనవి రెండు: కొన్ని ప్రదేశాలలో లేక కొన్ని పరిశ్రమలలో కార్మికులకు గంటలనుబట్టి లేక రోజులు వారాలు, నెలలుబట్టి కూలి యివ్వబడుతుంది. దీనిని గంటల కూలి (Time wage) అంటాము. మరికొన్ని పరిశ్రమలలో కార్మికుడు చేసిన పనినిబట్టి కూలి యివ్వబడుతుంది. ఉదాహరణకు, ఇన్ని టన్నుల బొగ్గుతవ్వితే ఇంతకూలి; ఇన్నిగజాలు బట్ట నేస్తే ఇంతకూలి; జోళ్లు చేస్తే యింతకూలి అని నిర్ణయించబడుతుంది. దీనిని పనికూలి (Piece work wage) అంటాము. కాని ఇవి రెండు పద్ధతులైనా మొత్తం మీద ఒకటే. గంటలకూలి నిర్ణయించేటప్పుడు, గంటకెంత పనిజేస్తారు అని లెక్కజూసుకొనే కాపిటలిస్టు కూలిరేటును నిర్ణయిస్తాడు అట్లే పని కూలిని నిర్ణయించటంలో కూడా, ఈ పని జేసేటానికి ఎన్ని గంటలు పడుతుంది అని లెక్కజూసుకొనే కూలిరేటును నిర్ణయం జేస్తాడు. కాబట్టి నిజానికి రెండు పద్ధతులు కూడా ఒకటే. కాని ప్రత్యేక ప్రాంతాలలో కాపిటలిస్టుల అవకాశాన్నిబట్టి, ఆచారాలనుబట్టి ఒక్కొక్క పద్ధతి అవలంబించబడుతుంది. లేక ఈ రెండు పద్ధతులే అనేక రూపాలలో అవలంబించబడుతూ వుంటాయి.

*గంటల కూలి*: ప్రతి కార్మికుడు ఎంత ఎక్కువ సరుకు మొత్తం తయారుచేస్తున్నాడా అని చూడవల్సినఅవసరం లేనప్పుడు కాపిటలిస్టు పనికాలాన్నిబట్టి కూలియిస్తాడు. ఆ ఉత్పత్తి అయిన సరుకు నాణ్యం కాపిటలిస్టుకు గావాలిగాని సంఖ్యకాదు అదేవిధంగా, కొన్నిమిల్లులలో పనిజేస్తున్నప్పుడు కార్మికుని పనియంతా యంత్రభాగాలను కనిపెట్టుకొని వుండటమే. కార్మికుడు స్వయంగా ఎక్కువ తక్కువలను ఉత్పత్తి చేయటం వుండదు. యంత్రం వేగంగా తిరుగుతుంటే ఎక్కువ ఉత్పత్తి జరుగుతూ ఉంటుంది. అందుచే ఇట్టి సందర్భంలో కూడా పని కాలాన్నిబట్టి కూలి యివ్వటమే జరుగుతూంది.

**పని కూలి**: మరి ఇతర పరిశ్రమలలో ఉత్పత్తి చేసిన సరుకుల సంఖ్య లేక పరిమాణము లేక బరువులనుబట్టి కూలియివ్వబడుతుంది. 10వస్త్రాలకు 82 పై.

8 వస్తువులకు 50 పై. 15 వస్తువులకు 94 పై అని కూలి నిర్ణయింపబడుతుంది. కాపిటలిస్టుకు యిందులో ఒక సుఖంవుంది. తాను ఉత్పత్తిగావించే సరుకు వాణ్యం తన్న పంఖ్య ప్రధానమౌతుంది. అప్పుడు తను న్వయుగా కార్మికుడు బాగా పని జేస్తున్నడా ? లేదా, చూడనవసరం వుండదు. కాబట్టి కార్మికుని పని మొత్తమును బట్టి కూలి యిస్తానంటాడు. కార్మికులలో బాగా నేర్పరితనం గల్గిన కార్మికుడు ఎంత పనిచేయగలడో ఆ పనికి ఒకరేటు నిర్ణయిస్తాను. ఇతర కార్మికులంతా అంత పనిని జేస్తేనే పూర్తి కూలిని పొందగలరు. లేదా కూలిలో విరగకోతలు ప్రారంభమౌతాయి. కార్మికులలో ఎక్కువమంది శ్రమపడి, నేర్పుసంపాదించి నేర్పరి తయారు చేసినంత తయారు చేయడం ప్రారంభిస్తే. ఏదో ఒకవంకపై కాపిటలిస్టు కూలిరేటును తగ్గిస్తాను. అప్పుడు కార్మికులు పూర్వపు కూలిరేటును సంపాదించాలంటే పూర్వంకన్న ఎక్కువ కష్టపడాలి. ఈ విధంగా పనికూలివల్ల పని ఒత్తిడి, తీవ్రత చాలా జాస్తి అవుతాయి.

సోవియటు యూనియన్‌లో పనికూలియొక్క స్వభావంపూర్తిగా మారింది. ఇక్కడ కార్మికుడు ఏ కాపిటలిస్టుకూ కూలికిగాను పనిచేయుటలేదు. శ్రామికవర్గ ప్రభుత్వానికి జెందిన ఫాక్టరీలలో పనిచేస్తున్నాడు. ఈతడు చేసినపని మొత్తాన్నిబట్టి, కాలాన్నిబట్టి సమాజం ఈతనికి భృతి ఇస్తోంది. ఈ విధంగా ఒక సరుకుయొక్క వాణ్యం, పరిమాణముల మధ్య సమన్వయం కాగలదు. ఇందువల్ల కార్మికుల వుత్పత్తిశక్తి అధికంకాగలదు. కార్మికవర్గ శ్రేయస్సు అభివృద్ధికాగలదు. ఈవిధంగా పనినిబట్టి భృతిఇచ్చే సోషలిస్టు విధానానికి, పనినిబట్టి కూలియిచ్చే కాపిటలిస్టు విధానానికి పూర్తి తేడావున్నది.

## బోనసు, లాభాలలో భాగం

ఒక్కొక్కప్పుడు కాపిటలిస్టు 'బోనసు' యిస్తాడు. కార్మికులు యింకా ఎక్కువ కష్టపడి, ఇంకా ఎక్కువ శ్రద్ధతో వుత్పత్తి నధికం గావిస్తానికై ఎరవేసే పద్ధతి బోనసు.

అట్లే కొన్ని పరిశ్రమలలో కార్మికులకు 'లాభాలలో భాగం' పంచిపెట్ట బడుతుంది. కాని ఇంతకన్న మోసం వేరేమీ వుండబోదు. 'లాభాలలో భాగం' పేరుతో కొంతమంది కార్మికులకు కూలిరేటు తగ్గించబడుతుంది. చివరకు వచ్చిన లాభంలో కొంతభాగం వీరికి యివ్వబడుతుంది. కాని కూలిలో తగ్గించిన మొత్తం కంటే ఈ లాభాలలో భాగం సాధారణంగా తక్కువగానే వుంటుంది. తీరా చూసే సరికి, మామూలు కూలికి పనిజేస్తున్న కార్మికునికి వచ్చే ఆదాయంకంటె 'లాభాలలో భాగం' పద్ధతిపై పనిజేసే కార్మికులకు వచ్చే ఆదాయం తక్కువని తేలుతుంది.

ఈ 'లాభాలలో భాగం' పద్ధతిప్రకారం ఈ ఆశతో కార్మికులచే మరీ ఎక్కువ పనిజేయిస్తాడు కాపిటలిస్టు. ఇంతేగాదు; కార్మికులలో ఒక భాగాన్ని చీలదీస్తాడు. మీరూ పరిశ్రమ లాభాలలో భాగస్థులే; అందుచే పరిశ్రమలపై మాతోబాటు మీరూ

భాగస్వాములే అవి శ్రమలు కల్పించి వీరిని ఇతర శ్రామికవర్గం నుండి వేరు జేయుటకు చూస్తారు.

పని కూలి పద్ధతిపైననే ఆధారపడి చెమటోడ్చే పద్ధతి (Sweating System) వున్నది. ముఖ్యంగా సూదులు తయారుచేసే పరిశ్రమలలో ఇది వున్నది. దీనిప్రకారం ఫలానా సంఖ్య సూదులు ఉత్పత్తి గావిస్తే ఇంత కూలియిస్తాను అని కాపిటలిస్టు అంటాడు. కార్మికులు తమ యిండ్ల వద్దనే పనిచేసి సూదులను ఉత్పత్తి జేసారు కాని ఈ పనికి చాలా స్వల్పంగానే కూలి ముట్టుతుంది. అందుచే రాత్రిం బగళ్ళు కష్టపడితేనేగాని జీవనానికి సరిపడునంతటి కూలికూడా దొరకదు. ఈవిధంగా కండలను కరిగించే పద్ధతిగాన 'చెమటోడ్చే పద్ధతి' అని పేరుపెట్టారు.

## శాస్త్రీయ పద్ధతులపైజేయు శ్రమ: టైలర్ పద్ధతి; ఫోర్డు పద్ధతి

కాపిటలిస్టు కార్మికుల శ్రమశక్తిని కొన్నాడు. కాబట్టి ఈ శ్రమశక్తిని తాను పూర్తిగా ఉపయోగించుకోవాలని, అందుకై కొత్త పద్ధతులు కనిపెట్టారు. దీనికై 'శాస్త్రీయ పద్ధతులపై శ్రమ' జేసే పద్ధతులను కనిపెట్టారు. అది ఈ క్రింది విధంగా వుంటుంది.

యంత్రాగారాల్లో ఏయేపని ఎట్లా, ఎక్కడ చేయాలో పెద్దపెద్ద నిపుణులచే బాగా పరీక్ష చేయబడుతుంది. ఏయే పనిముట్లు అవసరం: ఏవి యెక్కడ వుండాలి? కార్మికుడు చేతులను, కాళ్ళను ఎంత నేర్పుతో, తక్కువ శ్రమతో కదల్చాలి మున్నగునవన్నీ వీరు నిర్ణయిస్తారు. ఇందువల్ల కార్మికుడు సునాయాసంగా తన పనిమీదనే పూర్తి ధ్యానవుంచి, పనిచేయుటకు వీలు ఏర్పడుతుంది. ఇట్టి సందర్భంలో కార్మికుడు వెచ్చించిన శ్రమ అంతా, ఏమీ నష్టపోకుండా పూర్తిగా ఉత్పత్తి గావించుటకే ఉపయోగపడుతుంది. ఇందువల్ల కాపిటలిస్టుకు ఎంతో అదనపు శ్రమ మిగులుతుంది. లాభాలు పెరుగుతాయి.

మానవ శ్రమను సునాయాసంగా ఉపయోగకరం చేయుటకై ఈ శాస్త్రీయ పద్ధతి ఎంతో ప్రయోజనకరం. కాని కాపిటలిస్టు విధానంలో దీని ఫలితం అంతా కాపిటలిస్టుకే పోతుంది సైన్సు అభివృద్ధి అంతా, పని నిపుణత్వం అంతా అదనపు విలువను సృష్టించుటకే వినియోగపడుతుంది. కాని సోషలిజంలో మానవ శ్రమను సునాయాసం జేయుటకూ, మానవునకు ఎక్కువ విశ్రాంతిని చేకూర్చుటకు ఈ పద్ధతి వినియోగపడగలదు.

శ్రమను శాస్త్రీయ పద్ధతులపై వినియోగించే విధానాన్ని టైలర్ అనే ఒక అమెరికన్ ఇంజనీరు ప్రారంభించాడు. అందుచే దీనిని టైలర్ పద్ధతి అంటారు. కార్మికులు కూడా యంత్ర భాగాలుగానే నిల్చి వేరే ధ్యానలేకుండా పూర్తిగా పనిలో

నిమగ్నులై పోయి ఉత్పత్తి గావిస్తూ ఉంటారు. ఈతదేక ధ్యానవల్ల, ఒకే పద్ధతిలో అంగవిన్యాసం చేస్తూ ఉండటంవల్ల వీరి మానసిక ప్రవృత్తికూడా విచిత్రంగా పరిణమిస్తుంది. క్రమంగా వీరు అచిరకాలంలోనే దుర్బలులయిపోతారు. కాబట్టి టైలర్ పద్ధతి అంటే, కార్మికులచే తక్కువ కూలికి ఎక్కువపని చేయించుకోవటమే.

1920 కి పిమ్మట అమెరికా కోటీశ్వరుడు, మోటారుకార్ల కంపెనీ యజమానుడు అగు హెన్రీఫోర్డు మరొక పద్ధతిని ప్రవేశపెట్టాడు. ఫ్యాక్టరీలో తయారయ్యే సరుకు ప్రతిభాగం ప్రత్యేకంగా తయారుచేయబడుతుంది అందుకై ప్రత్యేకపు ఏర్పాటు వుంటుంది. ఒక పెద్ద పట్టాలాంటిది. జరుగుతూ వుంటుంది. ఆపట్టాపై తయారుకావలసిన యంత్రభాగం వుంటుంది. కార్మికులు ఈపట్టాప్రక్కన నిల్చుని, అది జరుగుతూ వున్నప్పుడే ఆ యంత్రభాగాన్ని తయారుచేస్తూ వుండాలి, ఉదాహరణకు బోల్టు: పట్టాపై ఇనుపముక్కలు వుంటాయి మొదట్లో నిలుచున్న కార్మికుడు ఆ ఇనుపముక్కపై సుత్తితో కొట్టి తలను చేస్తాడు రెండో కార్మికుడు దీనికి క్రింద వలయాలు (Threads) ఏర్పరుస్తాడు. మరో కార్మికుడు దానికిమెరుగు పెడతాడు. ఇదంతా జరిగేటప్పుడు ఇనుప మేకులతో వున్న పట్టా కదులుతూనే వుంటుంది. మొదటి కార్మికుని ఎదురుగా పట్టా రాగానే, అతడు సుత్తితో మేకుపై కొడతాడు. వెంటనేపట్టా జరుగుతుంది. మేకు రెండవ కార్మికునికి ఎదు గా [illegible]సుంది. అతడు వలయాలు ఏర్పరుస్తాడు వెంటనే పట్టా కదులుతుంది. మేకుమూడవ కార్మికునికి ఎదురుగావస్తుంది, అతడు మెరుగు పెడతాడు. పట్టా కదులుతుంది, 4వ ర్మికుడు తయారయిన బోల్టులు వూడదీస్తాడు. పట్టా త్వరత్వరగా కదులుతే కార్మికుడు త్వరత్వరగా తమ పనిని పూర్తిచేయాలి. పట్టావేగాన్ని కార్మికు ఁదుకోలేకపోతే పనిచేయలేనని బర్తరపు చేయబడతాడు. ఈ విధంగా శాస్త్రీయాభివృద్ధి కార్మికులను మరింత దోచుకుంటానికై కాపిటలిస్టుల చేతులలో ఆయుధంగా వినియోగపడుచున్నది.

## వస్తురూపంలోగాని ధనరూపంలోగాని కూలి చెల్లించుట

ఇదివరకు పల్లెటూళ్ళల్లో కార్మికులను పనికి పెట్టుకుంటే వారికి ధనరూపంలో కూలి చెల్లించేవారు కాదు. ఆ కార్మికునికి తిండి, బట్ట యిచ్చి ఏదాదిఆఖరున ఏదో కొద్దిగా ధాన్యం యిచ్చేవారు. అంటే కార్మికునికి కూలి వస్తురూపంలో ముట్టుచున్నదన్నమాట. కార్మికుడు తమ శ్రమశక్తిని అమ్ముకోవటం దా రా సూటిగా తన జీవితావసరములను పొందుచున్నాడు. ఇది దాదాపు వస్తుమార్పిడి బారర్-పద్ధతి వంటిదన్నమాట. వ్యాపారం ఇంత వ్యాప్తంగా వున్నప్పుడు శ్రమశక్తి విలువ సులభంగా కార్మికుని జీవితావసరముల విలువగా కనిపిస్తుంది.

అయితే ఈనాడు కాపిటలిస్టు ప్రపంచంలో వస్తురూపమయిన కూలి చాలా అరుదు. సర్వసాధారణముగా ధనరూపంలోనే కూలి యివ్వబడుతుంది. అడబ్బుతో కార్మికుడు తమ జీవితావసరములను కొనుక్కుంటాడు. కాని ఒక్కొక్కప్పుడు

కూలిలో కొంతభాగం వస్తురూపంగా యివ్వటం కూడా వుంది. అన్నం పెట్టి రోజుకు 0-4-0 డబ్బులు యిస్తానంటాడు కాపిటలిస్టు. లేదా తానే స్టోర్సు పెట్టి ఆ స్టోర్సులో కార్మికులకు కావలసిన జీవితావసరములను సప్లయిజేసి, ఆ ధరను జీతంలో మినహాయించుకొని, మిగతా కూలినే యిస్తాడు. ఈవిధంగా చేయటంవల్ల కాపిటలిస్టుకు మరింత లాభం చేకూరుతుంది పుచ్చిపోయిన పనికిరాని చెత్తరకమంతా స్టోర్సుద్వారా అమ్మబడుతుంది. తీసుకొనే ధరలో బజారురేటుకు 2, 3 రెట్లువుంటాయి. ఈ విధంగా కార్మికుని అసలు కూలి తగ్గుతుంది. 0-2-0 బియ్యం, 0-1-0 ఉప్పు, పప్పు, చింతపండు, 0-0-3 మసాలా సరుకులు, 0-0-6 నూనె, మొత్తం 0-4-0 సప్లయిజేసిన సరుకుల క్రింద 0-4-0 ధనరూపంలోనూ మొత్తం 0-8-0 కూలిని చెల్లించినట్లున్నా, నిజమైన కూలి అంత ముట్టదు. బియ్యంలో 0-0-6, పప్పు, ఉప్పు నగయిరాలో 0-0-3, ఇతర సరుకులలో 0-0-3 కాజేస్తాడు కాపిటలిస్టు. ఈ విధంగా 0-4-0 ధరకూ 0-3-0 వెలగల సరుకులనే సప్లయిజేస్తాడు. ఇందువల్ల నిజంగా కార్మికునికి ముట్టేది. 0-7-0 మాత్రమే. మరో విధంగా కూడా కాపిటలిస్టు కార్మికులను దోచుకుంటాడు. కార్మిక నివాసాలలో, లేక మొత్తం ఆ ప్రాంతంలో ఉండే దుకాణాలన్నింటినీ తానే కొని, తానే సరుకులను అమ్ముతాడు. పోటీ లేకపోవుటచే రెట్టింపుధర కమ్ముతాడు. ఈవిధంగా 0-8-0 కూలిలో, హెచ్చుధరకు సరుకులమ్మటం మూలకంగా 0-1-0, 0-2-0 కాపిటలిస్టు కొట్టివేస్తాడు. కాబట్టి యిటువంటి అన్ని రకాల దోపిడికి వ్యతిరేకంగా కార్మికులు పోరాడాలి. ఇందుకు కొనుగోలు సంఘాలను ఏర్పర్చడం ఒక మార్గం.

## నామమాత్రమైన కూలి నిజమైన కూలి

అభివృద్ధి చెందిన కాపిటలిస్టు దేశాలలో ఎక్కడో అరుదుగాగాని, సాధారణంగా వస్తురూపంలో కూలి యివ్వబడదు. సర్వసాధారణంగా ధనరూపంలోనే కూలి యివ్వబడుతుంది కార్మికుడు తన శ్రమశక్తిని అమ్ముకుంటాడు ఇతర సరుకులవలెనే. శ్రమశక్తికూడా దాని విలువకు అమ్ముడుపోతుంది. అనగా దాని ఉత్పత్తికయ్యే జీవితావసర వస్తువుల వెలను ధనరూపంలో పొందుతుంది.

కాని కార్మికుడు డబ్బుతినడు. అతని జీవితావసరములను కొనుటకు ధనం ఒక సాధనం మాత్రమే. అతడు తనకు నిర్ణీతమైన కూలిని పొందగానే దానితో తనకవసరమైన సరుకులను కొనుక్కొంటాడు. అందుకై ఆ సరుకులకు బజారులో ఉన్నధరను చెల్లిస్తాడు.

అయితే సరుకుల ధరలు స్థిరంగా వుండవని మనం చూశాము. అనేక కారణాలవల్ల ధనంయొక్క కొనుగోలుశక్తి మారుతూ వుంటుంది. బంగారం విలువ తగ్గింది అనుకోండి. అందువల్ల ఈతని దగ్గరవున్న ధనంయొక్క విలువ తగ్గింది. అంటే పూర్వం ఈ ధనముతో తన అవసర సరుకులను ఎన్నికొనేవాడో అన్నింటినీ

ఈనాడు కొనలేదన్నమాట. ఒక్కొక్కప్పుడు ప్రభుత్వం కాగితపు నోట్లను చాలా ఎక్కువగా వేస్తుంది. అటువంటప్పుడు సరుకుల ధరలు చాలా మార్పులు చెందుతవి. ధనం యొక్క కొనుగోలు శక్తి చాలా పడిపోతుంది. అందుచేత, మనం కార్మికుని కూలిని చూడాలంటే కేవలం అతని చేతిలో ఎంతడబ్బు పడుతుంది అని చూస్తే చాలదు. ఎందుకనగా అతడు డబ్బు తినడు. అతని చేతులలో పడే కూలి డబ్బులను, 'నామమాత్రమైన కూలి' అని అంటాము. కాని దాని కొనుగోలు శక్తిని మనం చూడాలి ఆ డబ్బులతో జీవితావసర వస్తువులను ఎన్నిటిని కొనగల్గుచున్నాడు అని చూడాలి. ఒకానొక సమయంలో ఎన్ని ఉపయోగకరమగు సరుకులను కూలి డబ్బులు కొనగల్గుచున్నవో వీటినే మనం 'నిజమగు కూలి' అంటాం. అంటే కార్మికునకు లెక్కలోనికి వచ్చేది ఇదే.

ఉదాహరణకు, కార్మికునకు రోజుకు 0-8-0 కూలి, ఆ సమయములో బియ్యం సేరు ఒకటికి 0-4-0 అమ్ముతుంటే అతనికి రెండుసేర్ల బియ్యం వస్తున్నవన్నమాట. కాని రోజుకి రు. 1/- కూలియై, బియ్యం శేరు 1 కి 1-0-0 అమ్ముతూంటే, అతనికిప్పుడు రోజుకు ఒకసేరు బియ్యం మాత్రమే కూలిడబ్బులు వస్తున్నవన్నమాట. పూర్వం 2 సేర్లు వస్తుంటే, ఇప్పుడు ఒకసేరు బియ్యమే వస్తున్నవి. కాని ధనరూపంలో చూస్తుంటే పూర్వం 0-8-0, ఇప్పుడు రు. 1-0-0. కాబట్టి రు. 1-0-0 కూలి నిజంగా పెరుగుదల కాదు. కూలీలో తరుగకోతయే. ఎందుకనగా రు. 1-0-0 యొక్క కొనుగోలు శక్తి ఇప్పుడు 1 సేరు బియ్యం మాత్రమే. కాబట్టి 'నామమాత్రమైన కూలి'కి 'నిజమగు కూలి'కీ భేదాన్ని గ్రహించాలి.

## నిపుణులగు కార్మికుల వేతనాలు

వివిధ పరిశ్రమలలో కార్మికులకిచ్చుట్టే కూలిలో భేదం వుంటుందని మనం ఎరుగుదుము. నిపుణులగు కార్మికులకు ఎక్కువ జీతాలు రావటం, నిపుణులు కాని కార్మికులకు తక్కువ జీతాలు రావటం వుంటుంది. నిపుణత్వం ఎక్కువైన కొలదీ కార్మికునికి ఎక్కువకూలి వస్తుంది. ఎందుచేత ?

వివిధ పరిశ్రమలలో పనిచేసే కార్మికులకు ఒకేరకమైన నేర్పరితనం వుండనవసరంలేదు. గడియారాలుచేసే కార్మికునకు, ఇటుకరాళ్ళు తయారుచేసే కార్మికునకు ఒకే నేర్పరితనం వుంటుందా ? అందుచే వీరిమధ్య కూలి వేర్వేరుగా వుంటుంది.

ఒకే పరిశ్రమలోకూడా వేర్వేరు కార్మికులమధ్య వేర్వేరు జీతాలు వుంటాయి. అందుకు కారణం, వారి నైపుణ్యంలో వుండేభేదమే. ఎక్కువ నైపుణ్యం గల్గిన కార్మికునకు ఎక్కువ జీతం; కొంత నైపుణ్యం గల్గిన కార్మికునకు కొంత తగ్గింపు జీతం; బండపనిచేసే కార్మికునకు మరీ తక్కువజీతం వుంటుంది.

విషణులైన కార్మికవకు జీతం ఎందుకెక్కువ వుండాలి. కావి వారికి ఎందుకు తక్కువ వుండాలి? దీనికి కారణం సులభమే. విషణులగు కార్మికుడు తన పనిలో నైపుణ్యమును సంపాదిస్తానికి చాలా శ్రమమూ, కాలాన్నీ వెచ్చించాలి. బండ పని చేస్తానికి ఈ ప్రయత్నమేమీ అవసరం లేదు. అందుచేత నైపుణ్యశ్రమ విలువ హెచ్చుగా వుంటుంది. దానికి ఎక్కువ జీతం వస్తుంది. ఈవిధంగా తేడా లేకపోతే, ఎవ్వరూ శ్రమపడి నేర్పరితనాన్ని పొందుటకు కాలాన్ని, ధనాన్ని వ్యయపర్చరు. అందరూ బండగానే పనిచేయాలని చూస్తారు. ఇందువల్ల ఎవరూ మంచి వృత్తులను నేర్చుకోవరు.

కాని యంత్రాభివృద్ధి ఎక్కువైనకొలదీ కార్మికుల నైపుణ్యంతో అవసరం తగ్గిపోతున్నది. కార్మికులు చేసే చాలా సున్నితపు పనులను కూడా యంత్రమే చేస్తున్నది. కాబట్టి విషణులగు కార్మికులు తమ పనులను పోగొట్టుకొంటున్నారు. కాని జీవనం గడవాలిగదా? అందుచే సామాన్య కార్మికుల వేతనాలకే పనిచేయటం సాగిస్తారు. ఈ విధంగా వారి గతి అధ్వాన్నమవుతున్నది.

## వివిధ కాపిటలిస్టు దేశాలలో

వివిధ కాపిటలిస్టు దేశాలలోని జీతాలు ఒకే ప్రమాణంలో లేవు. కొన్ని దేశాలకన్న మరికొన్ని దేశాలలో జీతాలు హెచ్చు. ఇందుకు చాలాకారణాలు వున్నవి.

## కార్మికుల కూలి ప్రమాణం

జీతాలు హెచ్చుగావున్న దేశాలలో కాపిటలిస్టులు కార్మికుల యెడ అభిమానం గలవారనుకొనేరు. అట్టిదేమీ కాదు. నిజానికి ప్రతిదేశంలోని కాపిటలిస్టూ జీతాలను తగ్గించాలనే చూస్తూవుంటారు. కాని వివిధ కాపిటలిస్టు దేశాలలోనూ పరిస్థితులు వేర్వేరుగా వుంటాయి. దేశ చరిత్రలు కూడా భిన్నభిన్నములు. ఉదాహరణకు అమెరికా చూడండి- ఈ దేశంలో విస్తారమైన భూఖండాలలో ప్రజలు వలస వచ్చి వ్యవసాయాన్ని సాగించారు. కాని వీరికి తగినంతమంది కూలీలు దొరకలేదు. అందుచే మొదటినుండీ కార్మికులు వేతనాలు హెచ్చే కొన్ని కాపిటలిస్టు దేశాలలో కార్మికోద్యమం చాలా బలబడి, కాపిటలిస్టులకు తీవ్రమైన ప్రతిఘటన నిస్తున్నది. బాగా అభివృద్ధి చెందిన కాపిటలిస్టుదేశాలలో టెక్నికల్ అభివృద్ధి, కార్మికుల ఉత్పత్తి సామర్థ్యమూ, నైపుణ్యమూ చాలా హెచ్చు. కాబట్టి ఇట్టి దేశాలలో కార్మికుల వేతనాలు ఇతర దేశాలకన్నా హెచ్చుగానే వుంటాయి.

కొన్ని దేశాలలో ఉదాహరణకు తీసుకుందాము. ఈ దేశాలలో 1914 కు పూర్వం గంటకు ఇచ్చే కూలిరేట్ల తారతమ్యాన్ని చూద్దాము. ఇంగ్లాండు 100 ఉందనుకుందాము. దీనితో ఇతర దేశాలను పోల్చుదాము.

| | | | |
|---|---|---|---|
| ఇంగ్లాండు | 100 | ఫ్రాన్సు | 64 |
| జర్మనీ | 75 | అమెరికా సం. రాష్ట్రములు | 240 |

కొన్ని లెక్కల ప్రకారం 1900-1902 ల మధ్య ఏడాది వేతనాలు ఈ క్రింది విధంగా వుండేవి.

| | | | |
|---|---|---|---|
| అ. సం. రాష్ట్రములు | 463 డాలర్లు | ఆసియా | 167 డాలర్లు |
| ఇంగ్లాండు | 258 ,, | రష్యా | 97 ,, |
| జర్మనీ | 237 ,, | జపాను | 55 ,, |

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం కూడా ఈ తేడాలు వుంటూనే వున్నవి. కొన్ని ముఖ్యమైన దేశాలలో నిజమగు కూలిరేటు ఈ క్రింది విధంగా వుండేది.

1924-1929 లో ఇంగ్లాండు రేటు 100

| | | | |
|---|---|---|---|
| ఫిలడల్ఫియా | 208 | బెర్లిన్ | 77 |
| డబ్లిను | 106 | మాడ్రిడ్ | 57 |
| లండను | 105 | బ్రెస్సెల్సు | 52 |
| స్టాకుహోం | 93 | మిలాన్ | 50 |
| అమ్‌స్టర్‌డాం | 88 | రోం | 44 |

కాపిటలిజం మాతవంగా ప్రభవించిన దేశంలోనే కూలిరేటు తక్కువగా వుండటాన్ని చూస్తాము ఎందుచేత ? కాపిటలిజం అభివృద్ధితోపాటు అధిక సంఖ్యాకులగు రైతులు, వృత్తి నిపుణులు పనులను పోగొట్టుకొని నిరాధారులౌతారు. వారందరూ ఫ్యాక్టరీలలో కూలి కొరకై ఎగబడుతారు. అందుచే కూలిరేటు తగ్గుతుంది. వలస దేశాలలో ప్రజల జీవన పరిమాణం చాలా తక్కువ. చైనాలో మరీ తక్కువ. అక్కడ కార్మికుడు పిడికెడు బియ్యపు అన్నం తిని, చింకిగుడ్డలు కట్టుకొని రోడ్ల పక్కనో, చెట్లక్రిందనో పడుకొని నిద్రపోతూ కాలక్షేపం చేస్తూవుంటాడు. ఇట్టి దరిద్రదేవతా మూర్తియగు కార్మికునినే ఆదర్శ కార్మికునిగా కాపిటలిస్టులు చూపిస్తారు. "చైనా కార్మికుని చూడు. ఎంత పొదుపుగా సంసారాన్ని గడుపుతాడో: ఎంత ఆడంబర రహితమైన జీవితాన్ని గడుపుతాడో" అని తమ దేశాల కార్మికులకు నీతి బోధలు చేస్తారు.

## కాపిటలిస్టు దోపిడి అత్యధికమగుట

కాపిటలిజం వృద్ధి అయిన కొలదీ "కార్మికవర్గం యొక్క దరిద్రం అభివృద్ధి అవుతుంది." కూలి పెంచుకోవాలనే పోరాటం కష్టతరమౌతుంది. కాపిటలిజం పెరిగిన కొలదీ కూలి బొత్తిగా తగ్గిపోతుంది. తారతమ్యాన్ని చూసినా తగ్గిపోతుంది.

కాపిటలిస్టుల భాగం పెరుగుతుంది. కార్మికుల భాగం తగ్గుతుంది. కాపిట

లిస్టు దేశాల లెక్కలు చూస్తే ఇది స్పష్టమౌతుంది. ఇంగ్లాండు విషయమే తీసు కుందాము. దేశమంతటా ఉత్పత్తి అయిన విలువల (దీనినే జాతీయాదాయం అంటాము.) మొత్తాన్ని 100 అనుకుంటే కార్మికుల కూలిభాగం ఈ క్రింది విధంగా వుంది :

| సంవత్సరం | జాతీయాదాయం పౌండ్సు స్టెర్లింగులలో లక్షలలో | కూలి మొత్తం పౌండ్సు స్టెర్లింగులలో లక్షలలో | జాతీయాదాయంలో కూలి భాగం |
|---|---|---|---|
| 1843 | 5150 | 2350 | 45.6% |
| 1860 | 8320 | 3920 | 47.1% |
| 1884 | 12740 | 5210 | 41.4% |
| 1903 | 17000 | 6550 | 38.3% |
| 1908 | 18440 | 7030 | 38.1% |

కార్మికునికి వచ్చే భాగం క్రమంగా క్షీణించిపోతోంది. ఇదే సమయంలో జాతీయాదాయం నుండి కాపిటలిస్టుకు పోయే భాగం పెరుగుతోంది. కార్మికుల నష్టం కాపిటలిస్టుకు లాభం.

ప్రథమ ప్రపంచ యుద్ధానికి పూర్వం కార్మికుల స్థితిగతులెట్లుండేవో లెనిన్ ఈ విధంగా వ్రాశాడు : "జర్మనీలో 1880, 1912 సంవత్సరాల మధ్య కూలి మొత్తం 25% చొప్పున పెరిగింది కొన్ని దేశాలలో జీవితవ్యయం 40% చొప్పున పెరిగింది రష్యాదేశంకన్న కార్మికవర్గానికి ఎంతో ఎక్కువ సదుపాయలున్న జర్మనీ దేశంలోనే అతి భాగ్యవంతమైన, నాగరికతగల, సమ్మెలు చేయహక్కుగల, పత్రికా స్వాతంత్ర్యంగల, లక్షలకొలదీ సభ్యులుగల, కార్మికసంఘాలు బలంగాగల, కార్మిక వర్గ పత్రికలను చదివేవారు లక్షలమందిగల జర్మనీ దేశంలోనే యిట్టి పరిస్థితులుంటే ఇతర దేశాలసంగతి ఇంకా చెప్పాలా ?"

వీటినిబట్టి లెనిన్ ఈ క్రింది నిర్ణయాలకు వచ్చాడు :

"కార్మికుడు మొత్తంమీద బొత్తుగా బీదవాడైనాడు ; అంటే పూర్వంకన్న ఇప్పుడు దరిద్రంలో నివసిస్తున్నాడు. తక్కువ తింటున్నాడు. మరింత జీర్ణకుటీరాలలో కాపురముంటున్నారు. ఇదే సమయంలో ఇతరులతో "తారతమ్యాన్ని బట్టిచూసినా" బీదవాడౌతున్నాడు. కాపిటలిస్టు సమాజంలో అంతకంతకూ భాగ్యవంతమౌతూవుంటే కార్మికవర్గం బీదదౌతున్నది. కాపిటలిస్టు సమాజంలో, సంపదలు వృద్ధియౌతూ వుంటే కార్మికవర్గం దారిద్ర్యం అధికమౌతూ వుంటుంది."*

* "కాపిటలిస్టు సమాజం యొక్క" అన్న లెనిన్ గ్రంథం నుండి.

వలన దేశాలను దోచుకువచ్చి తమ స్వంత దేశాలలోని కార్మికులకు కూలిని మరికొంత పెంచగల కాపిటలిస్టు దేశాలలోని పరిస్థితే యిది. ఇక వలనదేశాలను దోచుకుంటానికే కాపిటలిస్టులు బయలుదేరినప్పుడు ఆ వలనదేశాల కార్మికుల సంగతి చెప్పాలా? అక్కడ "దోపిడీ మరింత అత్యధికంగా పెరుగుతూ వుంటుంది.

ఈ విధంగా కాపిటలిస్టు, కార్మికవర్గాల మధ్య అఘాతం పెరుగుతూ వుంటుంది. కాని కొందరు బూర్జువా పెద్దలు సమాజంలోవున్న పరస్పర వైరుధ్యాలు తగ్గుచున్నవనీ, మెల్లిగా సర్దుకొంటున్నవనీ వర్గముల మధ్య శాంతి ఏర్పరచాలనీ, కాపిటలిజం వున్నప్పటికీ కార్మికవర్గ స్థితిగతులు బాగుపడవచ్చునని ధర్మపన్నాలు వల్లించారంభించారు. కాని వీరు ఎన్ని చెప్పుచున్నా, కాపిటలిస్టులు మితిమీరిన లాభాలతో పోల్చిచూస్తే, కార్మికవర్గం అంతకంతకూ బీదదౌతున్నది. దీనిపాలిటి భాగం కూడా అంతకంతకూ తగ్గుచున్నది. అతి భాగ్యవంతమగు కాపిటలిస్టు దేశాలలోకూడా కార్మికుల దరిద్రం అంతకంతకూ అతిశయిస్తున్నది. వారికి తగినంత కూడు వుండటం లేదు. మరీ ఇరుకు సందుల్లో, మురికి కూపాలలో నివసిస్తూ వుంటున్నారు. తాను ఇదివరకు సంపాదించినకూలిని సంపాదిస్తానికే నేడు కార్మికుడు మరింత కష్టపడవలసి వస్తున్నది. శ్రమ ఉత్పత్తిశక్తి తీవ్రమైన కొలదీ కార్మికుని శ్రమశక్తి ఉడిగిపోతున్నది. ఈ విధంగా వర్గభేదాలు సర్దుబాటు కావటంలేదు సరిగదా అవి "మరింత తీక్ష్ణరూపం దాలుస్తున్నవి."

## నిరుద్యోగం, కార్మికుల రిజర్వు సైన్యం

కాపిటలిజం పెరిగిన కొలదీ నిరుద్యోగం పెరుగుతుంది. ఈ నిరుద్యోగుల కార్మికులనే "కార్మికుల రిజర్వు (నిలవ) సైన్యం" అంటాము. పరిశ్రమలను పెంచుకో దలచినప్పుడూ లేక పనిజేసే కార్మికులు పని చేయ నిరాకరించినప్పుడూ కాపిటలిస్టులు ఈ కార్మికుల రిజర్వు సేవలోనుండి తమ పరిశ్రమలో పనిజేయుటకు కొంతమందిని తీసుకుంటారు. ఇది ఎందుకు జరుగుతుందో చూద్దాము.

కాపిటలిజం ప్రభవించినప్పుడు కార్మికులుగా పనికివచ్చేవారు తయారుగా వున్నారు. భూములు పోగొట్టుకొన్న రైతులు, వృత్తులు పోగొట్టుకొన్న గృహ పరిశ్రమదారులు, యీ కార్మికులుగా తయారౌతారు తమ జీవనాన్ని గడుపుకోడానికి కాపిటలిస్టు కృతియిస్తే, తాము వారికి పనిచేస్తానికి సిద్ధం. ఈ విధంగా తమకు పని జేస్తానికి అవసరమైనవారు ఎల్లప్పుడూ కొంతమంది ఉంటూవుండాలి. ఈ విధంగా కార్మికులను దోచుకోవటంద్వారానే కాపిటలిజం వృద్ధియౌతున్నది.

కాపిటలిజం పెరిగిన కొలదీ ఏమి జరుగుతుంది?

కాపిటలిజం వృద్ధి అగునప్పుడు గృహ పరిశ్రమలను నాశనం గావించి, ఈ వృత్తుల వారిని నిరాధారులను గావిస్తుందని చూశాము. క్రమ గా బీద రైతులు కూడా పెలిగిపోతారు. వీరందరూ తమ యిళ్ళు, వాకిళ్ళు వదిలిపెట్టి కాపిటలిస్టుకు

దాన్యం చేయుటకై బయలుదేరుతారు. కాపిటలిజం ఇంకా వృద్ధియౌతుంది. కొత్త కొత్త పరిశ్రమలు, ఫాక్టరీలు వెలుస్తాయి. స్వల్ప పరిశ్రమలు పూర్తిగా నాశన మౌతాయి. కార్మికుల సంఖ్య పెరుగుతుంది.

## కార్మికుల పని యంత్రాలే చేస్తాయి

మరొక ప్రకృతి వైచిత్రం గోచరిస్తుంది. ఉత్పత్తివిధానంతో ఎల్లప్పుడూ క్రమంగా టెక్నిక్ అభివృద్ధి జరుగుతూ వుంటుంది. టెక్నిక్ అభివృద్ధి అనీ నూతన నిర్మాణమనీ అంటే అర్థమేమిటి? అవి మానవశ్రమకు బదులు యంత్రశక్తిని తెచ్చిపెట్టుచున్నవి ఇందువల్ల ఉత్పత్తి తేలిక. చవుక అవుచున్నది. ఈ విధంగా టెక్నిక్ అభివృద్ధి జరగటం ద్వారా ఉత్పత్తి గావిస్తానికి కార్మికులు తక్కువమందే కావలసివస్తున్నారు. యంత్రములు కార్మికులను త్రోసివేస్తున్నవి. పైగా ఉన్న కార్మికులైనా ఎక్కువ తీవ్రంగా పనిచేయునట్లు యంత్రములు నిర్బంధిస్తాయి. వాటి యన్నిటివల్ల చాలామంది కార్మికులు నిరుద్యోగులు అవుతారు. ఇందువల్లనే యంత్ర యుగం ప్రారంభమైన మొదటిరోజుల్లో, తమ దరిద్రానికి, నిరుద్యోగానికి కారణ మెవరో తెలుసుకొనలేక, యంత్రములే వీటిని తెచ్చిపెడుతున్నవని, జీవనాధారము లను పోగొట్టుకున్న వృత్తిపనులవారు వగైరాలు యంత్రములను కూల్చివేయడానికి ప్రారంభించారు వీరినే "యంత్ర విధ్వంసకులు" అని అనేవారు.

ఈ విధంగా నూతన యంత్రాలను నెలకొల్పటంవల్ల, దీనిమూలకంగా కార్మికులను వెళ్ళగొట్టటంవల్ల : నిరుద్యోగులకు కార్మికుల సంఖ్యను కాపిటలిస్టులు పెంచుచున్నారు.

శ్రమ తీవ్రతవల్లగూడా నిరుద్యోగం పెరుగుచున్నది. 10 మంది చేసే పనిని ఇపుడు 6గురే చేయుటవల్ల 4 గురు అనవసరమౌచున్నారు. వీరు నిరుద్యోగు లౌతారు. వీరే కార్మికుల రిజర్వు (నిలవ) సేనగా తయారౌతారు. ఈ రిజర్వు సేన కాపిటలిస్టులకు ఒక పెద్ద ఆయుధం. ఈ నిరుద్యోగులు ఏ షరతులమీదనైనాసరే పనిచేస్తానికి సిద్ధం. మరి ఏదో విధంగా పని సంపాదించుకొనకపోతే, భుక్తి గడిచే దెట్లా? ఈ విధంగా పనిలోవున్న కార్మికుల వేతనాల ప్రమాణాన్ని తగ్గించటానికి ఈ కార్మిక రిజర్వు కాపిటలిస్టులకు ఉపయోగపడుతోంది. మరో ప్రయోజనం కూడా కాపిటలిస్టుకు ఉన్నది. ఎప్పుడైనా పరిశ్రమను విస్తరింప జేయదలచినా, కొత్త ఫ్యాక్టరీలను పెట్టదలచినా అందుకు కావలసిన కార్మికులు తయారుగానే ఉంటారు. ఈవిధంగా పరిశ్రమలు పెరగడంతో తాత్కాలికంగా నిరుద్యోగం తగ్గుతుంది. కాని కొత్త టెక్నిక్ రాగానే, మరల అనేక వేలమంది కార్మికులు పనిమండి బర్తరపు చేయబడుతారు.

ఈ విధంగా కాపిటలిజం, వృత్తులు పోగొట్టుకున్న చేతిపనుల వారికి ఒక

మూల పని కల్పిస్తుంది. మరో మూల టెక్నిక్ అభివృద్ధి గావించటం మూలంగా వేల, లక్షల కార్మికులను నిరుద్యోగుల గావించి వారి కూడును పడగొట్టుతుంది.

## కాపిటలిస్టు సంపత్సంచయం యొక్క సర్వసాధారణ సూత్రం

యంత్రాలు అభివృద్ధిజెంది, కార్మికులుచేసే పనిని అవే జేస్తున్న కొలదీ "తారతమ్యపు అదనపు జనాభా" పెరుగుతుంది. "తారతమ్యపు అదనపు జనాభా" అంటే పనిలోవున్న కార్మికుల సంఖ్యకూ, నిరుద్యోగ కార్మికుల సంఖ్యకూ వుండే నిష్పత్తి పెరుగుతుంది. ఇందువల్ల వేలకొలది కార్మికులు ఎక్కడ పనిదొరుకుతుందా అని వెతుక్కుంటూ ఇతర దేశాలు వలసపోతారు. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం ఈ పరిస్థితి మరీ విషమించింది. అన్నిదేశాల పరిస్థితులు ఒకేవిధంగా వున్నవి. కాబట్టి ఒకదేశంనుండి మరొక దేశానికి వలస పోవటం క్రమంగా విశేషించ బడింది.

నిరుద్యోగులకు కార్మిక రిజర్వు వుండటం మొత్తం కార్మికవర్గం యొక్క బాగోగులపై ఎంతో ప్రభావాన్ని కల్గజేయుచున్నది; దరిద్రం వృద్ధియౌతుంది: కూలి తగ్గుతుంది: రేపటి రోజుగతి ఏమిటా అన్న చింత వృద్ధియౌతుంది. కార్మికులు అదనపు విలువను సృష్టిస్తుంటారు. కాపిటలిస్టులు దీనిని జేబుల్లో వేసుకుంటూ వుంటారు. కాపిటలిస్టులు ఈ అదనపు విలువలో కొంతభాగాన్ని స్వంతానికి ఖర్చు చేసేస్తారు: మిగిలిన దానిని తమ అసలు కాపిటల్‌కు జేరుస్తారు. ఉదాహరణకు ఒకడు 1,00 000 డాలర్లను పెట్టుబడిగా పెట్టి వుత్పత్తి గావించి 1,20 000 డాలర్లను తెచ్చాడు. ఇందులో 20000 డాలర్ల అదనపు విలువ. ఇందులో స్వంతానికి 10000 డాలర్లు ఉపయోగించివేశాడు. ఇంకా 10000 డాలర్లు మిగిలినవి. దీనిని అసలు మొత్తానికి జేరుస్తాడు. కాబట్టి రెండో ఏడాదికి యీతని కాపిటల్ 1,10,000 డాలర్లు అవుతుంది. ఈవిధంగా కాపిటల్ మొత్తం పోగుబడుతూ వృద్ధియౌతుంది. అదనపు విలువ పోగుబడుతూ వుండటం మూలకంగా కాపిటల్ విపరీతంగా వృద్ధియౌతుంది. కాపిటలిజం వృద్ధి అయ్యేకొలదీ అదనపు విలువ, అనగా కాపిటలిస్టుల దోపిడి వృద్ధియౌతూవుంటుంది.

ఈ సంపత్సంచయము కొలదిమంది కాపిటలిస్టుల చేతులలో విపరీత బలాన్ని, అధికారాన్ని చేకూర్చుతుంది. కార్మికుడు సృష్టించే అదనపు విలువయే కాపిటలిస్టుల ప్రాబల్యానికి, కార్మికుల దరిద్రానికి కారణమౌతుంది.

కాపిటలిస్టు సంపత్సంచయములో ఇది తప్పదు. కాపిటల్ పోగుబడుతూ వున్న కొలదీ, పరిశ్రమలు వృద్ధియౌతవి; కొత్త యంత్రాలు వస్తాయి: కార్మికులను దోచుకోవటం వృద్ధియౌతుంది. నిరుద్యోగం ప్రబలుతుంది.

కాపిటలిజంలో సంపత్సంచయానికి మూలసూత్రం ఇదేనని మార్క్సు వెల్లడిచేశాడు. కాపిటలిజాన్ని అర్థం చేసుకోవాలంటేనూ, కాపిటలిజం ఎటువైపుగా పరిణామం జెందుతూవున్నదీ తెలుసుకోవాలంటేనూ ఈ మూలసూత్రాన్ని పూర్తిగా అవగాహన జేసుకోవాలి.

మార్క్సు కాపిటలిస్టు సంపత్సంచయముగూర్చి ఇట్లా వ్రాశాడు :

"సమాజ సంపద వృద్ధియైనకొలదీ, పెట్టుబడి రూపంలోవున్న ధనం వృద్ధిఅయేకొలదీ, కాపిటల్ వృద్ధి వేగంగా జరుగుతున్నకొలదీ, కాపిటలిజం పర్యవసానంగావచ్చే కార్మికవర్గం సంఖ్య పెరిగినకొలదీ, కార్మికుల ఉత్పత్తిశక్తి అతిశయించేకొలదీ నిరుద్యోగులగు కార్మికుల సంఖ్య. కార్మిక రిజర్వు సంఖ్యకూడా పెరుగుతుంది. కాపిటల్ విస్తరణశక్తి వభివృద్ధిజేసే శక్తులే శ్రమశక్తినికూడా అభివృద్ధి చేస్తాయి. కాబట్టి సంపద ఎంత పెరుగుతున్నది అన్నదానికొట్టి నిరుద్యోగ కార్మికుల సంఖ్య కూడా పెరుగుతూవుంటుంది. పనిలో నియుక్తులైన కార్మికుల సంఖ్యను నిరుద్యోగులగు కార్మికుల సంఖ్యతో పోల్చినప్పుడు నిరుద్యోగుల సంఖ్య పెరిగిన కొలదీ కార్మికుల దరిద్రం, బాధలూ హెచ్చుతవి. కార్మిక వర్గంలో యీ విభాగాలు ఎక్కువయినకొలదీ దరిద్రం మరింత పెరుగుతూ వుంటుంది. కాపిటలిస్టు సంపత్సంచయము యొక్క పరమ సత్యం ఇదే."

ఇంకా ఇట్లా చెప్పుతారు:

".... కాపిటలిస్టు వ్యవస్థలో సామాజిక ఉత్పత్తిశక్తి పెరిగే కొలదీ ఆ ఉత్పత్తిని గావించే కార్మికుని దరిద్రం వృద్ధియౌతుంటుంది. ఉత్పత్తి అభివృద్ధి కవసరమగు సాధనములన్నీ కార్మికులను కాపిటలిస్టులు దోచుకుంటానికి, వారిపై పెత్తనం వహించడానికి మాత్రమే వుపయోగపడుతవి. ఈ అభివృద్ధినియ్యే ఉత్పత్తి సాధనాలు మనుష్యుని యంత్రంలో ఒక భాగంగా చేస్తాయి. అందు ఉత్సాహంతో పనిజేసేటందుకు బదులు మొక్కుబడి తీర్చుకుంటానికిగాను పనిజేసేటట్లుగా చేస్తాయి. సైన్సు అభివృద్ధి ఎంత యంత్రంలో ఎంత వున్నదో, అదే ఎత్తును కార్మికుని చౌరవను, నిర్మాణ కుశలతను వృద్ధిగాపీయువు, అతని కాలమంతా కష్టకాలంగానే గావిస్తాయి.... కాని అదనపు విలువను వృద్ధిజేసే మార్గాలన్నీ సంపత్సంచయమును వృద్ధి గావించే మార్గాలే. ఈ సంపత్సంచయం వృద్ధియౌతూ, తిరిగి సంపత్సంచయం వృద్ధియౌటకు బాటను వేస్తూనే వుంటుంది. ఇందుచేత సంపత్సంచయము వృద్ధియౌతూ వున్న కార్మికునకు జీతం హెచ్చు కానీయండి, తక్కువ కానీయండి దరిద్రం అతిశయిస్తూనే వుంటుంది. సంపత్సంచయం వృద్ధియయ్యేకొలదీ, నిరుద్యోగం కూడా ప్రబలుతూ, కార్మికుని కాపిటలిస్టు బానిసగా బంధించివేస్తాయి.... సంపత్సంచయం వృద్ధితో బాటు దరిద్రం కూడా వృద్ధియౌతూ వుంటుంది. ఒకవైపున సంపత్సంచయం *పెరుగుతూ వుంటే మరోవైపున దరిద్రం పెరుగుతూ వుంటుంది."

## కార్మికవర్గం దరిద్రం పెరుగుట

ఈ విధంగా ఒకవైపున సంపద పెరుగుతూవుంటే మరోవైపున దరిద్రం

* 'కాపిటల్' నుండి.

పెరగటం చూస్తూన్నాము. కార్మికుల వేతనాలు తగ్గించటంవల్లనే దరిద్రం పెరుగదు. అంతకంతకూ అధిక సంఖ్యాకులు నిరుద్యోగులౌతారు. శ్రమ తీవ్రత ఎక్కువైన కొలదీ కార్మికులు త్వరగా బలహీనపడిపోయి అశక్తులైపోతారు. సాధారణంగా వృద్ధాప్యంలో కార్మికులను కాపిటలిస్టులు పనిలోనుంచి తరిమివేస్తారు. వయస్సులో వృద్ధులు కాకపోయినా దుర్బలత్వం హెచ్చటంవల్ల కొద్ది వయస్సులోనే కార్మికులు పనిలోనుండి తొలగించబడతారు.

కార్మికులలో చిన్న గ్రూపులను కాపిటలిస్టులు స్వాధీనపర్చుకుంటారు. వీరిని కార్మికవర్గంలో పై తరగతి అనీ, కార్మిక ప్రభువర్గం అనీ అంటారు. కార్మికులలో నైపుణ్యపు శ్రమను గావించేవారికి సాధారణంగా హెచ్చుజీతాలిస్తారు. వలస దేశాలను కొల్లగొట్టుకురావటం, వీరి కివిధంగా హెచ్చుజీతాలు వీయటం గావిస్తారు. ఇందువల్ల ఈ హెచ్చుజీతాలు గల్గిన కార్మికులు—కార్మిక ప్రభువర్గం కాపిటలిస్టుల బంట్లుగా తయారౌతారు. కాని వీరి జీవితం బహు ఒడుదుడుకుగా వుంటుంది. మరుసటి రోజున ఈ హెచ్చుజీతాలు ఉండునా, ఉండవా అనే భయం వీరినెప్పుడూ వేధిస్తూనే ఉంటుంది. కాపిటలిజం క్షీణించేకొలదీ వీరి స్థితి కూడా మట్టమౌతుంది.

## ఆర్థిక సంక్షోభ సమయంలో కార్మికవర్గ దరిద్రం మరీ పెరుగుట, నిరుద్యోగం పెరుగుట

ఆర్థిక సంక్షోభకాలంలో ఈ కార్మిక దుస్థితి మిన్నుముట్టుతుంది. కాపిటలిజంలో వున్న పరస్పర వైరుధ్యాలన్నీ "తీవ్రమౌతాయి :" బైటపడుతాయి. సంక్షోభం వచ్చిందంటే లక్షలాది కార్మికులు నిరుద్యోగులౌతారు. పనిలో వున్న కార్మికుల జీతాలు అడుగంటుతాయి.

1929–34 ఆర్థిక సంక్షోభం ఈ దుర్భర పరిస్థితుల నన్నిటినీ తెచ్చింది. ప్రతి ఒక్క కాపిటలిస్టు దేశం చావుదెబ్బ తిన్నది. కాపిటలిస్టులేమో తమ దివాళాను కార్మికులపైకి నెట్టారు. ఇందులో ఒక దేశం కాపిటలిస్టులు మరొక దేశం వారితో పోటీచేశారు. కార్మికుల వేతనాలు విపరీతంగా తగ్గింపబడ్డవి. ఈ కార్మికులు దివాళా స్థితికి తేబడ్డారు. తమ అత్యంతావసరములను కూడా తెచ్చుకోలేని స్థితికి కార్మికులు ఈడ్చబడ్డారు. బాగా ధన సంపన్నమైన కాపిటలిస్టు దేశాలలో సహితం, మనం ఊహించలేనంతగా దరిద్రం, నిరుద్యోగం, ఆకలి వ్యాపించినవి.

అనేక విషయాలు దీనిని రుజువు చేస్తాయి. ఇంగ్లండులోని గనుల కార్మికుల స్థితిగతులను చూచిన ఒక పత్రికా రచయిత ఇట్లా వ్రాశాడు.

"నీవు దక్షిణ వేల్సులోగాని, దర్హాంలోగాని గనుల కార్మికులలో ఒకని ఇంటికి వెళ్ళు : భరింపరాని దారుణదృశ్యం నీకు కన్పిస్తుంది. మంచిరోజుల్లో కొనుక్కున్న మంచాలు, బల్లలు, వగైరా అన్నీ అంతర్థానమైనాయి. ఇంటిఅద్దెను

చెల్లించలేక కూలి చేసుకుంటూనే పూటకూళ్ళు పెట్టడం సాగించారు. కాని భోజనం చేసేవారుకూడా నిరుద్యోగులు కావటంవల్ల సాధారణంగా బాకీలుపడి ఎగవేస్తూ ఉంటున్నారు. కుటుంబంలో తండ్రికి పనివుంటే కొడుకు నిరుద్యోగి: కొడుకుకు పనివుంటే తండ్రి నిరుద్యోగి. తాకట్టు పెట్టదగిన వస్తువల్లా అప్పుడే షాహుకార్ల వద్దకు జేరిపోయింది. మంచిబట్టలు వేసుకునే భాగ్యంలేదు. ఒకరికి మంచి బట్టలు వుంటే వాటిని అమ్మివేసి, చిరిగిపోయిన పాతబట్టలను కొనుక్కొని, వాటికిమాసికలు వేసి అందరూ ఉపయోగిస్తున్నారు."

సంక్షోభానికి పూర్వం కార్మికులు స్వయంగా చందాలు వేసుకొని లైబ్రరీలు పెట్టారు; రంగస్థలములు నిర్మించారు. సంక్షోభం వచ్చిన పిమ్మట లైబ్రరీకి ఒక్క పుస్తకం కొనలేదు. రంగస్థలాలు మూతబడినవి.

కొన్ని ఇతర పరిశ్రమలలో పరిస్థితులు మరీ ఘోరంగా వున్నవి. లాంక్ షైరు బట్టలమిల్లుల కార్మికులస్థితి హీనాతి హీనం.

బాగా శక్తికొలది పనిజేస్తే ఒక కార్మికుడు 4 మరమగ్గాలవద్ద పనిజేయగలడు. ఇందుకు వారానికి 31 షిల్లింగుల 6 పెన్నీలు * వేతనం. కాని సాధారణంగా కార్మికుడు 2 మగ్గాలవద్దనే పనిజేస్తాడు. బీవర్లీ టౌనులో కార్మికునికి వారానికి 15 నుండి 20 షిల్లింగుల వేతనం మాత్రమే వుండేది. ఈ కూలియైనా మునిసరుకు మంచిదైతేనే కార్మికునకు లభ్యమౌతుంది. కాని సంక్షోభ కాలంలో కాపిటలిస్టు చెడ్డ ముడిసరుకును అనగా చెడ్డ పత్తిని ఉపయోగించేవారు. కాబట్టి కార్మికుని వేతనం తగ్గిపోయేది. ప్రభుత్వం సంపాదించిన లెక్కలే లాంగ్ షైరు కార్మికులు దుర్భర పరిస్థితిని గూర్చి తెలియజేస్తున్నవి. 1931లో వైగన్ సంపాదించిన లెక్కలప్రకారం మున్సిపాలిటీయే 'మనుష్యుని నివాసానికి అనర్హమైనవి' అని ఖండింపబడిన శిధిల గృహంలోనూ, మురికి కూపాలలోనూ కార్మికులు నివసిస్తూ వుండేవారు. బోలన్‌లో, మున్సిపాలిటీ చెత్తపక్కన, మురికిగుంటల పక్కన, పెంటపోగులపక్కన, పశుశాలల పక్కన వున్న గుడిసెలలో కార్మికులు కాపురముండేవారని మున్సిపాలిటీ కమీషన్ తెలియజేసింది.

సంక్షోభ దినాలలో అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వారంకూలి ఈక్రింది విధంగా తగ్గించబడింది.

| సంవత్సరం | వారానికి కూలి (డాలర్లలో) |
|---|---|
| 1929 | 28.5 |
| 1930 | 25,8 |

* పెన్నీలు షిల్లింగులు, పౌండ్లు ఇంగ్లీషు నాణెములు. షిల్లింగు అనగా 0-10-8 లు కాబట్టి కార్మికునికి వేతనం వారానికి 21-0-0 రూపాయలు. ఇంగ్లాండులో ఇది చాలా తక్కువకూలి. (అనువాదకుడు)

| సంవత్సరం | వారానికి కూలి (డాలర్లలో) |
|---|---|
| 1931 | 22 6 |
| 1932 | 17.1 |
| 1933 | 17.7 |

1932 లో కన్న 1933 లో కొద్దిగా కూలి పెరిగినట్లు కన్పిస్తూంది. కాని ఇది వట్టిది. 1932 కన్న 1933 లో జీవిత వ్యయం 7 పాయింట్లు పెరిగింది. కాన ఈ లెక్కలు సరియైనవిగావు. లేబర్ రిసెర్చి బ్యూరో లెక్కల ప్రకారం భోజన సామగ్రి ధరలు 18% చొప్పున పెరిగినవి. అందుచే నిజమగు కూలి 1932లో కన్న 1933 లో తక్కువగానే ఉన్నది.

ఫాసిస్టు జర్మనీలో కార్మికుల స్థితి మరింత అధ్వాన్నమైనది. జర్మను కార్మికుల ఉత్తరాలవల్ల ఈ విషయం తెలుస్తుంది. అంతర్జాతీయ ప్రఖ్యాతి పొందిన 'సీమెన్సు' కంపెనీలో పనిజేసే ఒక కార్మిక యువతి, విదేశాలలో ప్రకటించబడే ఒక జర్మను పత్రికకు లేఖ వ్రాస్తూ ఈ విషయాన్ని తెలియ జేసింది.

"సీమెన్సు కంపెనీయొక్క చిన్న ఫ్యాక్టరీలలోని ప్రెస్సు, షాపులలో స్థితిగతులు చాలా దారుణంగా వున్నవి. ఇక్కడ కూలి పనినిబట్టి వుంటుంది. ఎంత ఉత్పత్తిజేస్తే అంత కూలి (పీస్‌వర్కు). వారానికి 5 రోజులే పని వుంటుంది. వారానికి 25 మార్కులు ● కూలిగా వస్తే ఘనమే. అప్పుడప్పుడూ స్త్రీలకు వారానికి 3 రోజులే పని వుంటుంది. అప్పుడు వారానికి 9 మార్కుల కూలియే వస్తుంది. ఈ 9 మార్కులలో 5 మార్కులు ఇంటి అద్దెక్రింద, 2 మార్కులు ప్రయాణఖర్చుల క్రింద పోతే మిగిలిన 2 మార్కులతోనూ తింటి తినేదేమిటి? బ్రతికేదేమిటి? ఈ 'పని కూలీ'తో స్త్రీలు వేగలేకుండా వున్నారు. పైగా అతితీవ్రంగా పనిచేయాలి. పనిచేసిన వస్తువులను ఒకచోటనుండి ఇంకొకచోటికి తెచ్చేందుకు పట్టిన కాలాన్నీ, మధ్యాహ్న భోజనానికి పట్టిన కాలాన్నీ మినహాయించి దానికి కూలి యిస్తారు."

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఆర్థిక సంక్షోభ దినాలలో కార్మికుల స్థితి ఎంత దిగజారిపోయిందో ఈ క్రింది అంకెలు తెలియజేస్తాయి. 1923-25 కాలం నాటి కార్మికుల సంఖ్యను, మొత్తం కూలిని ప్రమాణంగా తీసుకుంటే, 1929-34 మధ్య ఎంతగా ఇవి తగ్గిపోయినవో తెలుస్తుంది. *

---

● మార్కు = జర్మను నాణెం (అనువాదకుడు)

* ఈలెక్కలను 'ఇండెక్సు నంబర్లు' అంటారు. 'ఇండెక్సు' అనగా విషయసూచిక. (అనువాదకుడు)

| నెల, సంవత్సరం | పనిలోవున్న కార్మికుల సంఖ్య | కూలిగా యిచ్చిన ధనం మొత్తం |
|---|---|---|
| మే 1929 | 105 3 | 1[illegible]2 9 |
| మే 1930 | 94 8 | 85.4 |
| మే 1931 | 80.1 | 73 4 |
| మే 1932 | 63.4 | 48.8 |

ఈ లెక్కలవల్ల ఏమి తెలుస్తున్నది? 1929 మే నెలలో, అనగా సంక్షోభం ప్రారంభం కాకముందు 1923-25 కన్నా పనిలోవున్న కార్మికుల సంఖ్య చాలా కొద్ది ఎక్కువగాను, కూలి మొత్తంగా మరీ కొంచెము ఎక్కువగాను వున్నది. కాని ఆటుపిమ్మట పెద్ద జారుడు ప్రారంభించింది. 1932 మే నెల నాటికి కార్మికుల సంఖ్య తగ్గేదానికన్నా కూలి మొత్తం చాలా ఎక్కువగా తగ్గటాన్ని చూస్తాము. అందుకు కారణాలు రెండు. (1) నిరుద్యోగుల సంఖ్య చాలా ఎక్కువగా వుండటం. (2) నియోగింపబడిన కార్మికుల జీతాలు బాగా తగ్గింపబడటం. సంక్షోభ కాలం 3 ఏండ్లలోను కార్మికుల సంఖ్య 30% చొ॥న తగ్గితే, మొత్తంకూలి [illegible]% చొప్పున తగ్గింది. అంటే కూలి సగానికి సగం తగ్గించబడిందని తెలుస్తోంది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో నిరుద్యోగులకు కార్మికులకు నిరుద్యోగ భృతి ఇవ్వబడదు. అందుచే వారిస్థితి ఎంత అధ్వాన్నంగా వుంటుందో వూహించవచ్చును. అద్దె చెల్లించలేని నిరుద్యోగులు ఇండ్లనుండి, హోటళ్ళనుండి వెళ్ళగొట్టబడుతారు. వారు దండుగా బయలుదేరి, పెద్దపెద్ద పట్టణాల వెలుపల నివాసాల నేర్పర్చుకుంటారు. ఇట్టి నిరుద్యోగుల క్యాంపులను 'అరణ్యాలు' అంటారు అమెరికన్లు. కాలిఫోర్నియా రాష్ట్రములోని స్టాక్టన్ బానవభూములలో నెలకొల్పబడిన ఒక నిరుద్యోగుల క్యాంపును చూచిన బూర్జువా పత్రికా ప్రతినిధి ఈ క్రింది విధంగా దానిని వర్ణించారు.

"మేము ఆ క్యాంపును చూచునరికి, దేరాలనుండి పొగపైకి లేస్తున్నది. ప్రతి చిన్నముఠా తమ తిండిని వండుకొంటున్నది. ఈ దృశ్యమంతా కల్పితగాథవలె వుంది. ఒక వైపుకు చూచాము. పట్టణం, పట్టణాలలో ధాన్యంతో నిండివున్న బ్రహ్మాండమైన కొట్లు కనిపించాయి. మరోవైపున పెద్ద పంచదారమిల్లు కన్పించింది. దాని కొసను డాక్స (ఓడలు నిల్పు పెద్దకాల్వలు) డాక్సు ఒడ్డునవే వివిధవస్తు సంచయంతో నిండి ఆకాశాన్నంటుకున్న వేర్‌హౌస్‌లు కన్పించాయి. మా ఎదటివైపున పనిచేద్దామన్నా పనిదొరకక, వీధిలో ఏది దొరుకుతే అది తీసుకుంటూ వేర్‌హౌసులలో సగం కుళ్ళిపోయిన వుల్లిపాయలను, చిక్కుళ్లను, క్యారట్ దుంపలను పారవేస్తే వాటిని ఏరుకొనివచ్చి, చెత్తడబ్బాలలో దొరికిన టిమ్ములలో వాటిని వండుకొంటూవున్న కార్మికులు, వారి నివాసాలు కన్పించాయి."

ఈ విషాద దృశ్యాన్ని అంతటినీ వర్ణించి చివరలో ఈ రచయిత ఇట్లా వ్రాశాడు :

"మనది స్వతంత్రదేశం అని మన పెద్దలు గొప్పలు చెప్పారు. నిజమే, మనదేశం స్వతంత్రమైనదే. ప్రజలు తమ ముందున్నమూడు మార్గాలలో ఏదో ఒక దానివెంట వెళ్ళుటకు స్వతంత్రమును కలిగివున్నారు. ఈ మార్గాలు: ఒకటి దొంగ తనాలు చేయటం, రెండు: ఆకలితో చావటం; మూడు: చెత్త చెదారాలలో ఏరుకొని తినే పశువులలాగా బ్రతుకటం."

ఈ బూర్జువా రచయితకు నాల్గోమార్గం తోచలేదు. అది ఇది: శ్రామిక వర్గం విప్లవ మార్గాన అధిగమించి కాపిటలిజాన్ని కూలద్రోసి దారిద్ర్యానికి, ఆకలికి, దోపిడికి స్వస్థిచెప్పుతుంది.

ఆత్మహత్యలు విపరీతంగా జరగటం, అన్నిరకాల రోగాలు వృద్ధిగావటం ఆకలివల్ల చావులు పెరగటం- లక్షలకొలది సామాన్య ప్రజలకు కాపిటలిజం ప్రసాదించే వరాలు ఇవి. చావులు, రోగాలు పిల్లలలో మరీత్వరగా వ్యాపిస్తాయి.

బాగా భాగ్యవంతమైన కాపిటలిస్టు దేశాలలోనే కార్మికుల స్థితి ఇట్లాఉంటే, వెనుకబడిన కాపిటలిస్టు దేశాల సంగతి ఇక చెప్పనవసరంలేదు. వాటిలో స్థితిగతులు మరీఘోరం. వీలెందు విషయం చూద్దాము. ఇటీవలనే (ఈ పుస్తకం 1924—34 ఆర్థిక సంక్షోభంనుండి ప్రపంచం ఇంకా కోల్కొనని రోజుల్లో వ్రాయబడింది. అనువాదకుడు) ఈ దేశంలో 204 కుటుంబాల ఆర్థిక స్థితినిగూర్చి పరిశోధన జేయబడింది. కమ్యూనిజం అంటే ఎలాటి సానుభూతిలేని ఒక బూర్జువా సంస్థచేత ఈ పరిశోధన గావింపబడినది. ఈ కుటుంబాలు నిపుణులగు కార్మికుల కుటుంబాలు. రిపోర్టులో ఈ విధంగా వ్రాయబడింది.

"మేము పరిశోధన చేసిన కేసులలో అనేకమంది కడుపు నిండికన్నా తక్కువే తింటున్నారు. ఇవిగో ఉదాహరణలు : ఒక కుటుంబాన్ని చూశాము. అందులో 4 గురు మెంబర్లు. వారు వారానికి తిండికి ఖర్చుపెట్టేది 15 స్లోటి (అంటే సుమారు రు. 6-0-0) వారు రోజుకు రెండుమార్లు తింటారు. తినేది బంగాళాదుంపలు కాబేజి, రొట్టె. మాంసంగాని పాలుగాని వారు రుచియైనా చూచుటలేదు. ఒక దర్జీవాని కుటుంబంలో 6 గురు మెంబర్లు. మేము వెళ్ళిన నాటికి మూడురోజులు ముందునుండి వారు అహారాన్నే తినిఎరుగరు. వారికి వంటకట్టెలులేవు: కిరోసిన్‌లేదు. మరొక కుటుంబం 4 గురు మెంబర్లుగలది. 3 వారాలు వంటకాలంటే ఏమిటో ఎరుగరు. వారి తిండిఅంతా రొట్టె. టీ. మరొక కుటుంబంలో యజమానియైన కార్మికుడు నిరుద్యోగి, అతనిభార్య బజారులో ఆపిలుపీ అమ్ముకొనివస్తే దానితో కుటుంబపోషణ జరుగుతుంది. ఆమె తెచ్చేదల్లా రోజుకు 1 లేక 1½ స్లోటి (అనగా 0-8-0 లేక 0-12-0): మరి ఆ కుటుంబంలో మెంబర్లు మొత్తం 10 మంది"

ఉపసంహారంలో ఇట్లా వ్రాశారు:

"నిరుద్యోగుల ప్రధానాహారం బంగాళాదుంపలు, కావేజీ: చాలా అరుదుగా రొట్టె, టీ; అప్పుడప్పుడూ ద్రావ్యం, చాలాఅరుదుగా కూరగాయలు. మేము పరిశోధన జేసిన 204 కుటుంబాలలోనూ, 20 కుటుంబాలు మాత్రం మాంసం తింటున్నవి, అదైనా వారానికి ఒక్కసారిమాత్రమే."

బట్టల విషయం మరీఘోరం. రిపోర్టులో ఇట్లా వ్రాశారు:

"వస్త్రాలు, చెప్పులు విషయంలో మరోకొరత కన్పిస్తున్నది. ఉదాహరణకు : 6 గురుగల ఒక నిరుద్యోగియైన రొట్టెలవాని కుటుంబంలో చెప్పులే లేవు- తండ్రిగనుక బైటకి వెళ్ళవలసివస్తే, కాలు అట్టలను తాళ్ళతో పాదాలకు కట్టుకొని వెళ్ళేవాడు. పిల్లలు ఇల్లువిడిచి బైటకి వెళ్ళేవారుకాదు. ఇంకోసందర్భంలో, ఒక కుటుంబంలో ఇద్దరు బాలురకు ఒకే కోటు వుంది. వారి తల్లి చిన్నపిల్లవానికి కోటు తొడిగి బడికి తీసుకువెళ్ళేది. బళ్ళోకి పోగానే, కోటువూడదీసి, పరిగెత్తుకొని వచ్చి పెద్దవానికి తొడిగి బడికి పంపేది. మళ్ళీ పిల్లలు ఇంటికి వచ్చేటప్పుడు ఇదే పద్ధతి."

ఇండ్ల కొరతను గూర్చి రిపోర్టుల్లో ఇట్లా వుంది :

"గృహం ఒకసొరంగం. గోడలవెంట నీళ్ళుకారుచున్నవి. గదికి పోషటకు సందులో 3 అంగుళాల నీరు ఎప్పుడూ నిల్చివుంటుంది. ముగ్గురు పెద్దవారు, నల్గురు బాలురు ఈ గదిలో నివసిస్తున్నారు. చాలా సందర్భాలలో 10 మంది ఒకేగదిలో నివసిస్తూవుంటారు. మేము విచారించిన 929 మందిలోనూ 193 మందికే ప్రత్యేకంగా పడకగదులున్నవి. ఈ 193 మందిలో 11 మంది నేలమీద పడుకొంటారు. 14 గురు బల్లలమీద, 9 మంది పిల్లలు పెట్టెలు, కుర్చీలు మున్నగువాటిమీద పడుకొంటారు. అధిక సంఖ్యాకులు 2, 3, 4 గురు కలసి ఒకే పడకమీద పడుకొనేవారు. ఐదుగురు కలసి ఒకే పక్కమీద పడుకొనేవి 9 కేసులు. ఒకే పక్కమీద ఆరుగురు పడుకొనే సందర్భాలు 3 వున్నవి."

ఉత్పత్తి కొంచెం పెరిగినా, 1933 కన్నా 1934 లో పోలెండులో నిరుద్యోగం పెరిగింది. 1934 జనవరిలో లేబర్ ఎక్స్ఛేంజిలో రిజిస్టరయిన నిరుద్యోగుల సంఖ్య 4,10,000. 1934 వసంతకాలంలో రిజిస్టరయిన వారిసంఖ్య 3,50,000. కాని బూర్జువా పత్రికల లెక్కల ప్రకారమే నిరుద్యోగుల సంఖ్య నిజంగా 15,00,000లకు మించియేయున్నది. పెద్ద పరిశ్రమలలో కార్మికులకిచ్చే జీతాల మొత్తం 1929 లో 164,59,37,000 స్లోటి అయితే 1932 లో 73,78,30,000 స్లోటి మాత్రమే. అంటే 55% తగ్గిందన్నమాట. రోజుకు 8 గంటలే పనిచేయాలన్న నిబంధన ఎగిరిపోయింది.

నిరుద్యోగ భీమా, ఆరోగ్య భీమా మున్నగువాటి విషయంలో కార్మికులు సంపాదించిన కొలది సదుపాయాలను రద్దుగావిస్తూ ఫాసిస్టు చట్టాలు గావింపబడినవి.

కాపిటలిస్టు 'రేషనలైజేషన్' ను అంటే కార్మికులచే విపరీతంగా పని చేయించే యంత్రాభివృద్ధిని ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది. కాపిటలిస్టులు ఫాక్టరీలలోనూ, గనులలోనూ దీనిని ప్రవేశపెట్టుచున్నారు. ఇందువల్ల ప్రమాదాలు హెచ్చవుతున్నవి. ఈ ప్రమాదాల సంఖ్య ఎంత విపరీతంగా పెరిగిపోయిందో రాక్షసి బొగ్గు గనులను గూర్చి ప్రభుత్వం యిచ్చిన లెక్కలే తెల్పుచున్నవి. 1927_32 మధ్య 1 00,000 కార్మికులు ఈగనులలో పనిజేస్తున్నారు. ఈ సంవత్సరములలో ప్రమాదాల వల్ల 1039 మంది కార్మికులు మరణించారు. 87331 మందికి గాయాలు తగిలినవి. వీరిలో ప్రమాదకరమైన గాయాలు తిన్నవారు 7471 మంది.

జపానులో రాక్షసిబొగ్గు గనులలో పనిచేసే కార్మికునకు 1930 లో రోజు కూలి 1 72 ఎన్నులు; 1933 లో 1.11 ఎన్నులు. స్త్రీకి 1930 లో 1.52 ఎన్నులు; 1933 లో 0.73 ఎన్నులు. పెద్దవారికి అవీ ఇవీ అందించే పిల్లవాండ్రకు నెకు 5 మండి 10 ఎన్నులు. బట్టల పరిశ్రమలో యువతులు రోజుకు 15 గంటలు కూడా పనిజేస్తుంటారు. అయినా వీరికి వారానికి కూలి 3 నుండి 6 షిల్లింగులు; ఫ్యాక్టరీ కొట్లలో నివాసం.

1933 డిసెంబరులో ఒక జపాను పత్రికలో ఈ క్రింది వర్ణన వున్నది :

"పోలీసులు 10 మంది యువతులను స్టేషనులో నిర్బంధించారు. అది చలికాలమైనా, వేసంగిదుస్తులే అనగా వ్వల్పదుస్తులనే వారు ధరించివున్నారు. వారిని ప్రశ్నించగా తాము బట్టలమిల్లులో పనిజేసే వారమని చెప్పారు. అక్కడ రోజుకు 15 గంటలు పనిజేస్తూ వుండవలసివచ్చేదనీ, ఏమీ విశ్రాంతి వుండేదికాదనీ, చాలా నికృష్ట పరిస్థితులలో పనిచేయవలసి వచ్చేదనీ వాపోయారు. మళ్ళీ తిరిగి మిల్లులోకి వెళ్ళండని పోలీసులు సలహానీయగా, చావనైనా చస్తాముగాని మళ్ళీ మిల్లులో అడుగు పెట్టం అని వారు ఖచ్చితంగా చెప్పారు."

జపాను పత్రికలలో ఇటువంటి వార్తలు ప్రకటింపబడటం తరచుగా కానవచ్చే విషయమే.

## అధ్యాయం 6

# కాపిటలిస్టుల మధ్య అదనపు విలువ పంపకం

### లాభం రేటు సమానం కావటం

కార్మికుల శ్రమవల్లనే అదనపు విలువ ఉత్పత్తి కాబడుతున్నదని మనం చూశాము. అయితే వివిధ పరిశ్రమలలో ఒకే సంఖ్యగల కార్మికులు వుండరు. ఇంకా ఒకే సంఖ్యగల కార్మికులను కలిగివున్న పరిశ్రమలలో కూడా పెట్టుబడి మొత్తాలు వేర్వేరుగా వుంటాయి. ఉదాహరణకు ఇద్దరు కాపిటలిస్టులను తీసుకుందాము. ఉభయులూ చెరివొక లక్ష డాలర్లు పెట్టుబడి పెట్టారు. ఒకరు క్వారీల (రాళ్ళు తవ్వటం)లోనూ, మరొకరు ఎలక్ట్రిక్ పవర్ హౌస్‌లోనూ ఈ పెట్టుబడిని పెట్టారు. అయితే ఇద్దరూ వినియోగించిన కార్మికుల సంఖ్య వేరువేరుగా వుంటుంది. క్వారీలో 500 మంది కార్మికులుంటే పవర్ హౌసులో 50 మంది కార్మికులే పనిచేస్తున్నారు. ఇప్పుడొక ప్రశ్న వస్తుంది. 50 మంది కార్మికులను పెట్టుకొన్న కాపిటలిస్టుయొక్క లాభానికి 10 రెట్లు 500 మంది కార్మికులను పెట్టుకున్న కాపిటలిస్టుకు వస్తుందా ?

కాపిటలిస్టు యొక్క ఆశయమంతా లాభం సంపాదించటమేనని మనం ఎరుగుదుము. ఎలక్ట్రిక్ పవర్‌హౌస్‌లను నడపటం కంటె క్వారీలలో లాభం ఎక్కువ వస్తుంటే, అందరూ క్వారీలకే పరిగెత్తుతారు. చాలా కొద్ది మంది మాత్రమే పవర్ హౌసులను నిర్మిస్తారు. ఇది దేనికి దారి తీస్తుంది ? క్వారీలలో లాభం తగ్గుతుంది; పవర్ హౌసులపై లాభం హెచ్చుతుంది. అంటే క్వారీ రాళ్ళధర తగ్గుతుంది. ఎలక్ట్రిసిటీ ధర పెరుగుతుంది. అయితే ఈధరల పెరుగుదలకు హద్దులేమిటి?

పై రెండు పరిశ్రమ లున్నాయనుకొందాము. ఈ రెండు పరిశ్రమలలోనూ, లాభం రేటునబట్టి ధరలు మారినవనుకుందాము. మరి ధరలు మారుతాయా ? మారవు. కారణం ఏమిటంటే, లాభం రేటు ఒకటే గనుక ఏ పరిశ్రమలో పెట్టుబడి పెట్టినా ఒకటే గనుక రెండింటిలోనూ ఉత్పత్తి మామూలుగానే సాగిపోతూ వుంటుంది.

అయితే కాపిటలిస్టు వ్యవస్థలో రెండుమూడు రకాలపరిశ్రమలేగాదు; లక్షోప లక్షల రకాల పరిశ్రమలున్నవి. వాటిలో పెట్టబడే కాపిటల్ మొత్తంకూడా భేదిస్తుంది కాని పరిశ్రమలోని స్థిరమైనకాపిటల్, మార్పుజెందు కాపిటల్ మధ్య భేదంవుంటుంది. మార్పుజెందు కాపిటల్ కన్న స్థిరమైన కాపిటల్ ఎక్కువగా వుంటే, అట్టి పరిశ్రమ లోని కాపిటల్‌యొక్క అంగ నిర్మాణ పద్ధతి ఘనంగా వున్నదంటాము ఎలక్ట్రిక్ పవర్ స్టేషనులో భవనాలు, యంత్రములు మున్నగువాటి కింద చాలాకాపిటల్ వుండి వుంటుంది. కాబట్టి ఈ కాపిటల్ ఘనమైన అంగ నిర్మాణ పద్ధతి ( high organic composition) కల్గివుంటుంది. కొన్ని పరిశ్రమలలో వున్న కాపిటల్ హ్రస్వ అంగ నిర్మాణ పద్ధతి (low organic composition)ని కల్గివుంటుంది. అనగా స్థిరమైన కాపిటల్‌కన్న మార్పుజెందు కాపిటల్ ఎక్కువ వుంటుంది. క్వారీలలో పెట్టుబడి హ్రస్వ అంగ నిర్మాణ పద్ధతిని కల్గివుంటుంది. క్వారీలకు మెషినరీ, భవనాలు మున్నగునవి అవసరంలేదు. రోజుకూలి మీద ఎక్కువ మంది కార్మికులు కావాలి. వీరికిచ్చే కూలి త్వరగా ఖర్చు అయిపోతుంది. కాబట్టి మార్పుచెందు కాపిటల్ చాలా ఎక్కువగా వుంటుంది.

కార్మికుల శ్రమవల్లనే అదనపు విలువ ఉత్పత్తి అగుచున్నది. కాబట్టి హ్రస్వ అంగ నిర్మాణ పద్ధతిని కల్గివుండే కాపిటల్ వున్న పరిశ్రమలలో లాభం ఎక్కువ వస్తుంది. అంటే కార్మికు లెక్కువగా నియోగింపబడుతారు. కాబట్టి అద నపు విలువ ఎక్కువ ఉత్పత్తి అవుతుంది. కాని కాపిటలిస్టుల మధ్యవున్న పోటీ వల్ల లాభం రేటు త్వరలో సమానమౌతుంది.. కాపిటల్ మొత్తాన్నిబట్టి లాభం మొత్తం ఉన్నా, వివిధ పరిశ్రమల కాపిటల్‌మీద వచ్చే లాభాల రేటు మాత్రం సమానంగానే ఉంటుంది. ఉదాహరణకు రు. 10,00,000/-ల కాపిటల్‌ను గల్గిన బట్టల మిల్లులో రు. 1,00,000/-లు లాభం; రు. 10,000/-ల కాపిటల్ గల్గిన అచ్చు ప్రెస్‌లో రు. 1000/-ల లాభం, మొత్తంలో తేడా కల్గినా, రేటు మాత్రం 10%యే. కాబట్టి కాపిటలిస్టుల మధ్య పోటీ వల్ల లాభం యొక్క సర్వసాధారణపు రేటు లేక లాభం యొక్క సగటురేటు ఏర్పడుచున్నది. కాపిటలిజంలో అన్నింటి వలెనే ఈ లాభం సగటురేటు కూడా ఊగిస లాడుతూ ఉంటుంది.

లాభాల రేటు ఏ విధంగా సమానమౌతూ వుంటుందో ఒక ఉదాహరణను చూద్దాము. తేలికగా అర్థమౌటకై, దేశంలో మూడు పరిశ్రమలే ఉన్నవను కొందాము, ఒకటి బట్టల ఉత్పత్తి : రెండు చెప్పుల ఉత్పత్తి : మూడు ఇటుకల ఉత్పత్తి. వీటిలో కాపిటల్‌కూడా సమానంగా, అనగా అన్నింటిలోనూ రు. 1000/-చొ॥

పెట్టుబడి పెట్టబడి ఉంటుందనుకొందాము. కాపీ వీటి అంగనిర్మాణ పద్ధతి ఈ క్రింది విధంగా వేర్వేరుగా ఉన్నది.

| పరిశ్రమ | కాపిటల్ రూపాయలలో | ఇందులో స్థిరమైన కాపిటల్ రూపాయలలో | మార్పుజెందు కాపిటల్ రూపాయలలో |
|---|---|---|---|
| ఇటుకలు | రు. 1000 | రు. 700 | రు. 300 |
| చెప్పులు | 1000 | 800 | 200 |
| బట్టలు | 1000 | 900 | 100 |

ఈ విధంగా మూడు పరిశ్రమలలోని కాపిటల్ వివిధ అంగ నిర్మాణ పద్ధతులను కల్గియున్నది. వీటిలో కార్మికుడు ఉత్పత్తిచేయు అదనపు విలువ రేటు కూడా, అనగా జీవన పోషణకు సరిపడగా ఇంకా అదనంగా వుత్పత్తి గావించు సరుకుల విలువ, రేటు కూడా సమానంగా వున్నదనుకొందాము. అనగా, మూడు పరిశ్రమలలోనూ కార్మికుని అవసరశ్రమ 5 గంటలూ, అదనపుశ్రమ 5 గంటలూ అనుకుందాము. ఇందువల్ల ఇటుకల పరిశ్రమలో రు. 300/-అదనపు విలువ, చెప్పుల పరిశ్రమలో రు. 200 ల అదనపువిలువ, బట్టల పరిశ్రమలో రు. 100/-ల అదనపు విలువ ఉత్పత్తి అగుచున్నది: ఇందువల్ల ఇటుకలవారికి లాభం చాలా ఎక్కువ వుంటుంది. కాబట్టి బట్టల పరిశ్రమ యజమాని బట్టల వుత్పత్తిని వదలి ఇటుకలకు పరుగెత్తుతాడు. బట్టల వుత్పత్తి తగ్గి దానిధరలు మళ్లీ పెరుగుతవి. ఇటుకల వుత్పత్తి ఎక్కువై దాని ధరలు తగ్గుతవి. ఇందువల్ల కాపిటలిస్టులలో పోటీలు పెరిగి, హెచ్చు లాభాలు వచ్చే పరిశ్రమలలో ధరలు తగ్గింపబడుట, బాగా తక్కువ లాభాలు వచ్చే పరిశ్రమలలో ధరలు హెచ్చింపబడుట జరుగుతుంది. ఈ విధంగా అందరకూ ఒకే మొత్తం లాభం వస్తుంది.

ఈ క్రింది గ్రాపువల్ల ఇది తెలియగలదు.

| పరిశ్రమ | కాపిటల్ రు | స్థిరమైన కాపిటల్ రు | మార్పు జెందు కాపిటల్ రు | అదనపు విలువ రు | వుత్పత్తి గావింపబడిన సరుకుల విలువ రు | సరుకుల అమ్మకం రు | లాభం రేటు |
|---|---|---|---|---|---|---|---|
| ఇటుకలు | 1000 | 700 | 300 | 300 | 1300 | 1200 | 20% |
| చెప్పులు | 1000 | 800 | 200 | 200 | 1200 | 1200 | 20% |
| బట్టలు | 1000 | 900 | 100 | 100 | 1100 | 1200 | 20% |
| మొత్తం | 3000 | 2400 | 600 | 600 | 3600 | 3600 | 20% |

ఈ విధంగా కాపిటల్ యొక్క అంగనిర్మాణ పద్ధతి పైననే గాక, కాపిటల్ యొక్క వుత్పత్తి వేగాన్నిబట్టికూడా అదనపు విలువ మొత్తం వుంటుంది. ఉదాహరణకు రెండు పరిశ్రమలలోనూ కాపిటల్ యొక్క అంగనిర్మాణ పద్ధతి సమానంగా వుందనుకొందాము. కాని ఒక పరిశ్రమ ఉత్పత్తిక్రమం పూర్తిగా ఒక ఏడాదిపడితే, ఈ ఏడాదిలో రెండవ పరిశ్రమలో మూడుసార్లు సరుకులు ఉత్పత్తి కావటం, అమ్ముడుపోవటం జరిగింది. బట్టలు, చెప్పుల పరిశ్రమను తీసుకొని ఈ ఉదాహరణను చూద్దాము. బట్టల మిల్లులోనూ, చెప్పుల ఫ్యాక్టరీలోనూ రు. 700/-లు స్థిరమైన కాపిటల్ ; రు. 300/-లు మార్పుచెందు కాపిటల్ సమానంగావుంది. అయితే ఏడాది అంతమగునటికి చెప్పుల పరిశ్రమలో రు. 1300/-ల సరకు తయారై, అమ్ముడైతే, ఈ రు. 1300/-ల సరకు బట్టల మిల్లులో తయారై అమ్ముడుకావటం మూడుసార్లు జరిగింది. కాబట్టి చెప్పుల ఫ్యాక్టరీలో రు. 1300/-ల చెప్పులకు బట్టల మిల్లులో రు. 3900/-ల బట్టలు వుత్పత్తి అయి, అమ్ముడుపోయినవి. కాబట్టి చెప్పుల పరిశ్రమలో రు. 300/-లు, బట్టల పరిశ్రమలో రు. 900/-లు ఒకే సంవత్సరంలో లాభం వచ్చింది. కాని ఈ తేడా కూడా కాపిటలిస్టులలో వున్న పోటీవల్ల సమసిపోయి, లాభం సగటురేటు ఏర్పడుతుంది. చెప్పులు అధిక ధరకమ్ముడై, బట్టలు తక్కువ ధరకు అమ్ముడై, మొత్తంమీద ఇద్దరి లాభాలు సమానమౌతాయి.

ఇందువల్ల మనకు తేలేదేమిటంటే, సరుకులు వాటి అసలు విలువకు అమ్మబడక, అందుకు కొంచెం అటూ యిటుగావుండే వెలకు అమ్మబడుచున్నవి. నిజానికి, కాపిటలిస్టు ఆర్థిక విధానంలో సరుకులు దాని వుత్పత్తి ధరకు అమ్ముడు కాక, కొంచెం ఎక్కువకో, తక్కువకో అమ్ముడు అవుతూ వుంటాయి. ఉత్పత్తికైన ఖర్చు, సగటున లాభం కలసి ఉత్పత్తి ధర అవుతుంది.

"ఒక పరిశ్రమలో పెట్టబడిన కాపిటల్‌కూ, వచ్చే అదనపు విలువకూ ఉండే నిష్పత్తే లాభం. సగటున వుండే తేడాకన్న స్థిరమైన కాపిటల్‌కూ, మార్పు చెందు కాపిటల్‌కూ మధ్య వుండే తేడా ఎక్కువై, స్థిరమైన కాపిటల్ ఎక్కువైతే అంటే కాపిటల్ యొక్క ఘన అంగనిర్మాణ పద్ధతి వుంటే ఆ పరిశ్రమలో వచ్చే లాభం సగటు లాభంకన్న తక్కువ వుంటుంది. ఇదేవిధంగా హ్రస్వ అంగనిర్మాణ పద్ధతికల కాపిటల్ గనక అయితే సగటు లాభంకన్న ఎక్కువ లాభం వస్తుంది. కాని కాపిటలిస్టులలో వున్న పోటీవల్ల ఈ వుభయ పరిశ్రమలలోని లాభాల రేటు సగటు రేటుకే చేరుతుంది. ఒక సమాజంలో ఉత్పత్తి అయ్యే సరుకు లన్నిటియొక్క మొత్తం విలువ, ఆ సరుకుల వెల మొత్తంతో సమానం. కాని కొన్నికొన్ని పరిశ్రమలలోను, కొందరు కాపిటలిస్టుల సందర్భంలో నూ విడివిడిగా చూస్తే వారి సరుకులు, వాటి విలువ ప్రమాణమునకు గాక "ఉత్పత్తి ధరలకు" అనగా

ఉత్పత్తి చేయటంలో ఖర్చుఅయిన కాపిటల్, సగటులాభం కలిసిన మొత్తమునకు అమ్మబడుతవి." *

కాబట్టి కాపిటలిస్టు వ్యవస్థలో, సరుకు దాని విలువకుగాక దాని ఉత్పత్తి ధరకు అమ్మబడుతుంది. దీనివల్ల సరుకుల విలువ సిద్ధాంతం ఎగిరిపోయిందా ? లేదు. ఉత్పత్తిధర అంటే "సరుకుల విలువయొక్క మరొక" రూపమే.

కాపిటలిస్టులలో కొందరు తమ సరుకులను విలువకన్నా ఎక్కువ వెలకు, కొందరు తక్కువ వెలకు అమ్ముతారు. కాని మొత్తం సరుకుల అన్నిటి వెలలనూ కూడితే మొత్తం ఆ సరుకుల విలువతో సరిపోయింది. మొత్తం లాభాలు మొత్తం అదనపు విలువకు, అనగా మొత్తం అదనపు శ్రమకు, కూలి ఇవ్వబడని కార్మికుల శ్రమకు సరిపోతాయి. సరుకు విలువ తగ్గితే, దాని ఉత్పత్తి ధర తగ్గుతుంది. విలువ పెరిగితే ఉత్పత్తిధర పెరుగుతుంది. ఈవిధంగా ఉత్పత్తిధర ద్వారా సరుకుల విలువ సిద్ధాంతం ఆచరణలోకి వస్తుంది.

## ధోరణి అంతా లాభం యొక్క రేటు తగ్గటంవైపే వుంది

కాపిటలిస్టు లాభంకోసమే ఉత్పత్తిని గావిస్తున్నారు. కాని కాపిటలిస్టు ఆర్థిక విధానం యొక్క గతిలోనే ఈ లాభం రేటు ఎప్పుడూ తగ్గుతూవుండే ధోరణి వుంది.

లాభం అంటే, కాపిటల్ మీద వచ్చే అదనపు విలువ. కాని కాపిటల్ యొక్క అంగనిర్మాణ పద్ధతినిబట్టి ఈ అదనపు విలువ వుంటుందని మనంచూశాము. స్థిరమైన కాపిటల్ ఎక్కువైతే అదనపు విలువ తగ్గుతుందనీ, మార్పుచెందు కాపిటల్ ఎక్కువైతే అదనపు విలువ ఎక్కువౌతుందనీ చూశాము.

కాపిటలిజం అభివృద్ధి అవుతువున్నకొలదీ కాపిటల్ యొక్క అంగనిర్మాణ పద్ధతి తరుచు మారుతూవుంటుంది. ప్రతి కాపిటలిస్టు కొత్త యంత్రాలను తెచ్చి కార్మికులను తగ్గించాలనీ, వుత్పత్తి ఖర్చులు తగ్గించాలనీ, సరుకుల నెక్కువగఅమ్మాలనీ, తనవంతు లాభాన్ని పెంచుకోవాలనీ చూస్తాడు. ఇందుకై టెక్నికల్ అభివృద్ధిని గావిస్తాడు. కొత్తయంత్రాలను అమర్చుతాడు. అంటే స్థిరమైన కాపిటల్ నిష్పత్తి పెరుగుచున్నదన్నమాట, ఇందువల్ల "కాపిటలిస్టు యొక్క ఇచ్ఛకు, శక్తికి అతీతమైన ఫలితాలు కల్గుచున్నవి స్థిరమైన కాపిటల్ నిష్పత్తి పెరిగిన కొలది సగటు లాభం రేటు తగ్గుతూ వుంటుంది."

అయితే, లాభాలరేటు పడిపోడానికి ఈ విధమైన పరిస్థితులు ఏర్పడితే, మరోదిక్కుమంచి లాభాలరేటును పెంచేపద్ధతులు అవలంబించబడుతాయి. "కార్మికు

---

* "మార్క్సు-ఎంగెల్సు-మార్క్సిజం కారల్‌మార్క్సు" అన్న లెనిన్ గ్రంథంనుండి.

లను దోచుకునే పద్ధతిని ఇంకా తీవ్రం జేయుటంద్వారా లాభాలరేటును పెంచవచ్చును. మరోవిశేషం ఏమిటంటే ఉత్పత్తి సామర్థ్యం పెరిగినకొలదీ యంత్రములు వగైరాల విలువ పడిపోతుంది. ఉదాహరణకు పూర్వం రెండు మరమగ్గాలవద్ద ఒక్కకార్మికుడు పని జేస్తే, ఇప్పుడు 16 మగ్గాలవద్ద పనిచేస్తున్నట్లయితే, మరమగ్గాల విలువ తగ్గింది అనిఅంటాము. ఎందుచేత ?

పూర్వం 2 మరమగ్గాలు ఇపుడు 16 మరమగ్గాలు. కాని ఈ 16 మర మగ్గాల ధర 2మరమగ్గాలధరకు సరిగ్గా 8రెట్లు ఉండనక్కరలేదు. వాటివిలువ తగ్గడం మూలకంగా 16 మరమగ్గాల విలువ పూర్వపు 2 మరమగ్గాల విలువకు ఏ 4 లేక 5 రెట్లు మాత్రమే వుంటుంది. ఇందువల్ల లాభాలరేటు తగ్గటంలో కొంత తగ్గుతుంది.

లాభంరేటు తగ్గుచున్నదంటే మొత్తం లాభం తగ్గిందని అనుకోకూడదు. కాపిటల్ పెరుగుతూవున్నకొలదీ, పరిశ్రమలు విస్తరించుచున్నకొలదీ, కార్మికుల సంఖ్య పెరుగుచున్నకొలదీ, వారిని దోచుకోవటం వృద్ధియౌతున్నకొలదీ, మొత్తం లాభం పెరుగుతూ వుంటుంది. అయినా లాభంరేటు మాత్రం క్రమంగా తగ్గటంవైపే మొగ్గుతూ వుంటుంది. దీనివల్ల అసలు కాపిటలిస్టు విధానానికే ముప్పుకల్గుతుంది. కాపిటలిజంలోని అంతర్విభేదాలు మరింత తీవ్రమౌతాయి. లాభాలు తగ్గుతూవుంటే, దానిని పూడ్చుకొని లాభాలను పెంచుకుంటానికై కార్మికులను దోచుకోవడం మరింత వృద్ధియౌతుంది. ఇందువల్ల వర్గ పోరాటం మరింత తీవ్రమౌతుంది. ఇంతేగాక, కాపిటలిస్టుల మధ్యకూడా తీవ్ర ఘర్షణ ప్రారంభమౌతుంది. వెనుకబడ్డ దేశాలలో పరిశ్రమలను నెలకొల్పి, అక్కడ అట్టే ఎక్కువ పెట్టుబడి పెట్టనవసరంలేదు. కాబట్టి, కూలి చవుకగాబట్టి, ముడివస్తువులు చవుకగా దొరుకుతవి కాబట్టి, ఎక్కువ లాభాలను సంపాదిస్తానికి కాపిటలిస్టులు ప్రయత్నిస్తారు. అంతేగాక, తమలో పోటీని తగ్గించుకొని, లాభాలను హెచ్చుగానే వుంచుకుంటానికై, కాపిటలిస్టులు తమలోతాము ముఠాలుగా ఏర్పడి కార్టెల్సు, ట్రస్టులు, కంబైన్సు ఏర్పర్చుకుంటారు.

## వ్యాపార పెట్టుబడి దాని ఆదాయం

[illegible] మనం లోగడనే చూసినట్లుగాక కాపిటలిస్టు తనస్వంత ఉపయోగానికిగాక అమ్మకంకొరకై సరకులను వుత్పత్తి గావిస్తున్నాడు. అయితే ఆ సరకులనమ్మాలి. అప్పుడుగాని కాపిటలిస్టుకు లాభంగాని, డబ్బుగానిరాదు.

సామాన్యంగా, కాపిటలిజం వృద్ధిబొందిన ఈ రోజుల్లో ఉత్పత్తిదారులైన కాపిటలిస్టులే సరుకులను సూటిగా అమ్మటలేదు. అదికూడా చేయాలంటే ఇంకా కొంత కాపిటల్ తెచ్చి, గోడౌన్లుకట్టి గుమాస్తాలను పెట్టి సరుగుల నమ్మించాలి. ఈపనిని తాను చేయకుండా తన సరుకుల నన్నిటినీ మరొక వ్యాపారస్థునికి, అంటే ఉత్పత్తి దారునకు, కొనుగోలు దారునకు మధ్యనుండే ఒక దళారీకి అమ్మివేస్తున్నాడు.

ఈ దళారీయైన వ్యాపారస్థుడు ఈ సరుకులను పారిశ్రామికాధిపతినుండి కొనాలంటే అందుకు కొంత కాపిటల్‌గావాలి, గోదాముల్లు కట్టాలి. గుమాస్తాలను పెట్టాలి. కాబట్టి తన కాపిటల్ మీదకూడా సగటు లాభంరావాలని చూస్తాడు. కాబట్టి అమ్మకం తాను గావిస్తున్నందులకై మొత్తంలాభంలో కొంత భాగాన్ని తాను తీసుకుంటాడు. సగటు లాభం రేటు ప్రకారం ఇతనికి కూడా లాభంరావాలి, లేదా ఇతడుకూడా వ్యాపారంలో గాక, పరిశ్రమలోనే తన పెట్టుబడిని పెడతాడు.

వ్యాపారస్థుడు యంత్రోత్పత్తియగు సరుకులను కొని అమ్మటమే గాదు, గ్రామాలలో వుండే చిన్న పరిశ్రమదారులు, వృత్తిపనులవారు, రైతులు మున్నగు వారిదగ్గరకూడా సరుకులు కొని అమ్ముతూవుంటాడు. రైతులు ధాన్యాన్ని పండించి, తమకవుసరమైనది మిగుల్చుకొని తక్కినది అమ్ముతారు. అయితే, ఈ ధాన్యం అవుసరమున్న ప్రదేశానికిపోయి అమ్మరు. తమమిగులు ధాన్యాన్ని ధాన్యపు వ్యాపారి కమ్ముతాడు. ఈ వ్యాపారి తను కొన్న ధరకన్న చాలా హెచ్చుధరకు ఇతర ప్రదేశాలలో అమ్ముతాడు. ఇందుకై తాను కొంత కాపిటల్ పెట్టుచున్నాడు. రవాణా ఖర్చులు, కొలగారం ఖర్చులు మున్నగునవి భరిస్తున్నాడు. కాబట్టి ఈ ఖర్చులన్నీ పోను లాభం రావాలి. అందుచే తాను కొన్నధరకు, ఖర్చులన్నీ కలిపి సగటు లాభం రేటు చొప్పున లాభం కల్పుకొని అమ్ముతాడు. ఈ విధంగా వ్యాపార పెట్టుబడి చిన్న పరిశ్రమదారులను, వృత్తిపనులవారిని, రైతులను అందరినీ దోచుకుంటూ వుంటుంది.

## వ్యాపారంలో పద్ధతులు, స్పెక్యులేషన్

ఈనాడు కేవలం ఆహార పదార్థాలలోనే వ్యాపారం జరగడంలేదు. కేవలం అవే ఉత్పత్తి కావటంలేదు. ఉత్పత్తిని గావిస్తానికై కావలసిన యంత్రసామాగ్రి రవాణా కవసరమైన వాహన సామాగ్రి వగైరాలు కూడా ఉత్పత్తి గావించబడు చున్నవి. వాటిలో కూడా వ్యాపారం జరుగుచున్నది.

బట్టల వ్యాపారం వుంది. ఇందుకు యంత్రాలు, పత్తి, కదుళ్ళు, మగ్గాలు, చమురు, బొగ్గు వగైరా కావాలి. రైల్వేలలో ఇంజన్లు, వ్యాగెన్లు, చమురు, బొగ్గు, స్లీపర్లు కలప వగైరా కావాలి. ఇవన్నీ మానవుని ఆహారపదార్థాలు కావు. కాని వాటి ఉత్పత్తికో, రవాణాకో అవసరమగువట్టివి.

మామూలుగా వ్యాపారం ఒక్కని ద్వారానే సాగదు. అనేకమంది దళారు లుంటారు. ఉదాహరణకు: బట్టల మిల్లులో బట్టలు తయారైనవి, వాటిని మిల్లు యజమాని టోకు వ్యాపారికి అమ్ముతాడు. టోకు వ్యాపారి జిల్లాలోని టోకు వ్యాపారి కమ్ముతాడు, లేదా కోటా హోల్డరు కమ్ముతాడు. అతడు చిల్లర వ్యాపారి కమ్ముతాడు. ఈ చిల్లరవ్యాపారి ప్రజల కమ్ముతాడు. ఈ విధంగా వ్యాపారంలో అనేక మంది దళారులు ఏర్పడుతారు.

కాపిటలిస్టు దేశాలలో ఈ వ్యాపార పద్ధతులు చాలా విషమంగా వుంటాయి. వ్యాపారం పెద్ద యెత్తున జరిగినప్పుడు వాటికి ప్రత్యేక మార్కెట్లు వుంటాయి. వివిధ పారిశ్రామికాధిపతులు, టోకు వ్యాపారులు ఇక్కడ జేరతారు. సరుకుల అమ్మకం, కొనుగోలులు వీరి మధ్య ఇక్కడనే జరుగుతాయి. సరుకు ప్రత్యక్షంగా అక్కడ వుండదు. పారిశ్రామికాధిపతి వచ్చినా గోదాములో రు 1,00,000/- విలువగల గుడ్డ వున్నదంటాడు అందుకు దాఖలా చీటీ చూపిస్తాడు. అది ప్రమాణంగా తీసుకొని టోకు వ్యాపారులు కొంటారు. టోకు వ్యాపారులు ఇతరుల కమ్ముతారు. ఈ విధంగా సరుకులు ఒకరినుండి మరొక వ్యాపారికి మార్చబడే మార్కెటును 'సరుకుల ఎక్స్ఛేంజి' (Produce exchange) అంటాము.

అయితే ఇటువంటప్పుడు ఒక జాగ్రత్త తీసుకోబడుతుంది. సరకు హాజరుగాలేదు కాబట్టి అమ్మబడే సరుకు మంచిదో, కాదో కొనే వ్యాపారికి తెలియదు. కాబట్టి అమ్మబడే సరుకు మంచి నాణ్యతగల్గి, ఒకేరకముదై వుండాలి. అందుకై ట్రేడ్‌మార్కులు, గ్రేడింగులు వగైరాలు కావలసివచ్చాయి. అప్పుడే కొనే వ్యాపారికి తాను సరుకును జూడకపోయినా, దాని నాణ్యతను గూర్చి హామీ ఏర్పడుతుంది.

ఒక్కొక్కప్పుడు వ్యాపారులు సరుకును వెంటనే అమ్మటానికి కాక విక్రయించటానికి కొంటారు. ధరలు హెచ్చుతగ్గులవుతూ వుంటాయని మనం చూశాము. ధరలు తక్కువగా వున్నప్పుడు కొని, ధరలు పెరిగినప్పుడు అమ్ముదామని సరుకును విక్రయిస్తారు. అయితే ధరలు పెరుగుతాయో, తగ్గుతాయో కొనే వ్యాపారికి తెలియదు కాని పెరుగుతాయనే ధైర్యంతో కొంటాడు. ఉదాహరణకు: కాలమాన పరిస్థితులు బాగా అనుకూలించి మంచిపంట పండింది. అందుచే ధాన్యం ధర తగ్గుతుంది. మళ్ళీ వచ్చే సంవత్సరం పంటలుపోయి, ధరలు పెరగవచ్చుననే వూహతోనే, ధరలు తక్కువగా వున్న సమయంలో ధాన్యాన్ని కొని వ్యాపారి నిల్వచేస్తాడు, ఇట్టి వ్యాపారాన్ని 'స్పెక్యులేషన్ వ్యాపారం' అంటాము. ఇట్టి స్పెక్యులేషన్ వ్యాపారంలో ఒకరికి లాభం వచ్చిందంటే, కొంతమంది ఇతర కాపిటలిస్టులకు నష్టం వచ్చిందన్నమాట.

## ఎరువు : పెట్టుబడీ వరవతి

లాభాలు వచ్చేది పరిశ్రమలోనో, వ్యాపారంలోనో పెట్టుబడి పెట్టిన కాపిటలిస్టులకే కాదు. కాపిటలిజం వున్నంతకాలం క్రొత్తక్రొత్త పరాశ్రయ జీవులు బయలుదేరుతూ వుంటారు. వీరు ఏ పనినీ చేయకపోయినా, విపరీత లాభాలను మాత్రం సంపాదిస్తూ వుంటారు. కారణమేమీ కాదు. వీరివద్ద ధనం మూలుగుతూ వుండటమే.

ఈ కాపిటలిస్టులకు లాభాలు ఎట్లావస్తున్నవి? వీరు తమ ధనాన్ని తీసుకుపోయి ఇనుపపెట్టిలోపెట్టి తాళంవేస్తే, అది పిల్లలను పెట్టదు. రు. 1000/-లూ 10 ఏండ్లు తర్వాత కూడా రు. 1000/-లు గానే వుంటాయి. అందుచే ధనవంతులు

తమ ధనాన్ని బ్యాంకులో దాచుకుంటారు. బ్యాంకులు వీరికి ఒక నిర్ణీతమగురేటున వడ్డీని చెల్లిస్తూ వుంటాయి.

అయితే వడ్డీని చెల్లించుటకు డబ్బు ఎక్కడనుండి వస్తున్నదో చూడాలి. అనేకమంది చిన్నవుద్యోగులు, వ్యాపారులు, కాపిటలిస్టులు, అనేక రకాలవారు తమ ధనాన్ని బ్యాంకులలో దాచుకుంటారు. తిరిగి డబ్బు తీసుకొనటకై అందరకూ ఒకేసారి అవసరంరాదు. ఉదాహరణకు ఈ నెలలో 1000 మంది బ్యాంకులో రు.1 00 000 లను వేశారు. వచ్చేనెలలో ఈ 1000 మంది డబ్బును తిరిగి తీసుకోరు. అందుకు సాధారణంగా వారికి అవసరమూ ఉండదు ఏ 500 మంది మాత్రమో వాపసు తీసుకొంటారనుకొందాము. ఇంకా 500 మంది ధనం బ్యాంకువద్ద వుంది. ఇదికాక మరల, రెండోనెలలో బ్యాంకులో దాచుకొనేవారి ధనం కూడా వచ్చి కలుస్తుంది. ఈ విధంగా బ్యాంకులో డబ్బు ఎప్పుడూ నిల్వ ఉంటూ ఉంటుంది. అయితే, దీనిని బంగారు రూపంలోగాని, బ్యాంకు డ్రాఫ్టుల రూపంలోగాని, ఇనప పెట్టెలలో దాస్తే ప్రయోజనంలేదు; కాబట్టి బ్యాంకులు ధనాన్ని- ప్రజలు దాచుకొన్న ధనాన్ని- ఇతరులకు ఎక్కువగా, ఋణంగా ఇవ్వగలవు. ఈవిధంగా తనవద్ద వుండే ధనాన్ని అంతటినీ సామాన్యంగా ఇతరులకు ఋణాలక్రింద బ్యాంకులు యిస్తూ ఉంటాయి. ఏదో అవాంతరం వచ్చి, ధనాన్ని దాచుకొన్న వారందరూ (డిపాజిటర్లు) వచ్చి మా డబ్బు మాకు వాపసు చేయాలి. అని అడిగితే, బాంకులు ఇవ్వలేక పోతాయి అప్పుడు బాంకులు దివాలాతీసినవంటాము. బాంకులు దివాలా తీయటంవల్ల అనేక వేలమంది డిపాజిటర్లు నష్టపోతారు. ఒక్కొక్కప్పుడు స్వల్ప ఆదాయంగల డిపాజిటర్లు పూర్తిగా దివాలాతీసి, తమ జీవనాధారమునే పూర్తిగా పోగొట్టు కొంటారు.

అయితే డిపాజిటర్లందరూ ఒక్కసారిగా వచ్చి తమ డిపాజిట్లను (బాంకులో వేసిన ధనాన్ని) వాపసు తీసుకోవటం సాధారణంగా జరుగదు. ఏ కొద్ది మంది మాత్రమోతీసుకుంటూఉంటారు. కాబట్టిబాంకులు, ఈవాపసు(విత్ డ్రాయల్స్)కు అవసరమైన మొత్తాన్ని మాత్రం ఉంచుకొని, తక్కిన ధనాన్ని ఇతరులకు అప్పుగా ఇస్తవి. కాపిటలిస్టు ఈ ధనాన్ని తీసుకొనిపోయి పరిశ్రమలను స్థాపించి, సరుకుల ఉత్పత్తిగావించి, వాటినమ్ముకొని లాభాలు గడించుతాడు. ఈ వచ్చిన మొత్తం నుండి బాంకు అప్పును అసలు ఫాయిదాలతో తీర్చివేస్తాడు. బాంకుకు వడ్డీరూపంలో వచ్చేది కాపిటలిస్టుకు వచ్చిన లాభంలో భాగమే. బ్యాంకులు కూడా దోపిడీవిధానంలో భాగస్వాములౌతాయి. ఒక్కొక్కప్పుడు బ్యాంకులే స్వయంగా పెద్దపెద్ద పరిశ్రమలను స్థాపించి, అవే కాపిటలిస్టులలాగా వ్యవహరించుతవి :

బ్యాంకులో డబ్బు దాచుకొన్నది ఒకడు: ఆ డబ్బుతో పరిశ్రమలను స్థాపించి సరుకుల నుత్పత్తిజేసి అదనపు విలువను సృష్టించేది ఒకడు. కాని డబ్బును

దాచుకొన్నవాడు, దాచిన బ్యాంకు, ఉపయోగించిన పారిశ్రామికాధిపతి ముగ్గురు- ఈ అదనపు విలువను- అనగా లాభాన్ని పంచుకుంటున్నారు.

పారిశ్రామికాధిపతి రు. 1000/- లను బ్యాంకునుండి అప్పుతెచ్చారు. దీనిమీద ఈతనికి 10% లాభం, అనగా రు. 100/-లు లాభం వచ్చింది. ఇందులో బ్యాంకుకు రు. 70/-లు వడ్డీక్రిందఇవ్వాలి. కాబట్టి తన రు. 1100/-లలో రు. 1070/- బాంకుకు చెల్లిస్తాడు. అంటే బాంకు 7% చొప్పున వడ్డీని తీసుకుంది. ఈ బాంకు తన డిపాజిటర్లకు వడ్డీని చెల్లించాలి. రు. 50/- చెల్లించిన దనుకొందాము అంటే 5% చొ॥ బాంకు తన డిపాజిటర్లకు చెల్లించింది. దీనినే బాంకురేటు అంటాము. ఈ విధంగా, రు 1000/- కాపిటల్‌తో వచ్చిన రు 100/-లు అదనపు విలువను రు 30/-లు పారిశ్రామికాధిపతి, రు 20/-లు బాంకు, రు 50/-లు డిపాజిటర్లు పంచుకొంటున్నారు.

ఈ బ్యాంకు వ్యాపారంకూడా ఇతర వ్యాపారాల లాంటిదే ఒక వర్తకుడు ఒక గుర్రాన్ని రు 50/-లకు కొని రు 70/-లకు అమ్మి రు 20/-లు లాభం సంపాదించాడు. బాంకు రు 50/-లకు డిపాజిటర్లవద్ద ధనమును తీసుకొని, దాని ఇతరుల కిచ్చి పుచ్చుకొనడంద్వారా రు 20/-లు లాభం వస్తున్నది. వ్యాపారి గుర్రాన్ని కొని అమ్మాడు; బాంకు డబ్బును తీసుకొని ఇచ్చిందికాని, లావాదేవీ మాత్రం ఒకటే. అక్కడ గుర్రం ఒక సరుకు; బాంకు విషయంలో ధనమే ఒక సరుకు. "బాంకు కాపిటల్‌ను అమ్మి, కొనేటటువంటి ఒక వ్యాపారి."

కాపిటల్‌కూడా ఇతర సరుకులవలెనే ఒక సరుకుగా కావటాన్ని చూశాము. కాబట్టి ఇతర సరుకుల వలెనే "కాపిటల్‌కు కూడా ఒక వెల నిర్ణయింపబడుతుంది. బాంకునుండి రు 1000/-లను తీసుకొన్న పారిశ్రామికాధిపతి రు 70/-లను ఒక్క ఏడాది వెలక్రింద చెల్లించాడు. బాంకు రు 1000/-లను ఒక్క సంవత్సరం వుపయోగించుకొన్నందుకు డిపాజిటర్లకు రు 50/-లను వెలగా చెల్లిస్తుంది.

అయితే ఈ "వడ్డీ రేటును" ఎవరు నిర్ణయిస్తున్నారు? ఎట్లు నిర్ణయింప బడుచున్నది?

వడ్డీ రేటు తరచు మారుతూ వుంటుంది. ఒకప్పుడు డబ్బు చవుకగాను, ఒకప్పుడు ప్రియంగానూ వున్నదని మనం అంటాము. డబ్బు చవుక, ప్రియం అనటం ఏమిటి? ధనం వెలకూడా ఇతర సరుకులవలెనే సప్లైడిమాండులమీద ఆధారపడి వుంటుంది. ఒక నెలలో కాపిటలిస్టులకు ఎక్కువ డబ్బు కావలసి వుంటుంది. ఎంతకైనా దానిని వారు అప్పుగా తీసుకోదలచారు. అప్పుడు ధనం 'ప్రియము' అవుతుంది. అంటే-బాంకువద్ద రు. 1000/-లు వున్నవి. గాని ఇది ఒక్క పారిశ్రామికాధిపతికే సరిపోతుంది. గాని ఇద్దరికి చాలవు. అందుచే వారిలో పోటీ వచ్చి బాంకుకు ఎక్కువ వడ్డీని ఇస్తామంటారు. ఎంత ఎక్కువ ఇవ్వగలరు? వారికి

రు. 1000/- ల పెట్టుబడిమీద రు. 100/- లు లాభం వస్తున్నది. కాబట్టి లోగడ ఇచ్చిన రు. 70/- ల బదులు రు. 80/- లు గాని, రు. 90/- లు గాని ఇస్తామంటారు. అంటే బాంకుకు యిచ్చే వడ్డీ 7% నుండి 8%కు గాని 9%కు గాని పెరిగిపదన్నమాట. బాంకుకు కాపిటిస్టు రు. 90/-లు చెల్లించినా, ఇంకా రు. 10/-లు మిగుల్చుకున్నాడు.

అదేవిధంగా డిపాజిటర్లు ఎక్కువమంది వుండి బ్యాంకులో ధనం మూలు గుతూ వుంటుంది. పారిశ్రామికాధిపతులు ఎక్కువగా అప్పు తీసుకోరు. మామూలు గానే తీసుకుంటూ వుంటారు. అట్టి సందర్భంలో బాంకు రేటు తగ్గుతుంది. అనగా డిపాజిటర్ల కిచ్చే వడ్డీరేటును తగ్గిస్తుంది. పారిశ్రామికాధిపతులకు అప్పు యిస్తావికే వడ్డీ రేటు తగ్గిస్తుంది. 7%కు బదులు 6% వడ్డీకే తీసుకుంటావని, ఆ విధంగా పారి శ్రామికాధిపతులకు ఎరవేస్తుంది. తనకు వచ్చిన రు. 60/-ల లోనూ డిపాజిటర్లకు రు. 40/-లనే అనగా 4%నే ఇస్తుంది. ఇప్పుడు బాంకు రేటు తగ్గిందనీ, ధనం 'చవుక' అయిందనీ అంటాము.

బాంకు 7%, 8%, 9% మాత్రమే తన ఋణస్థుల నుండి తీసుకోగలదు. 10% కోరితే పారిశ్రామికాధిపతి తనకు వచ్చిన లాభాన్నంతటినీ బాంకుకే ముట్ట జెప్పవలసి వస్తుంది. అందుచే తనకేమీ లాభంలేక, ప్రోత్సాహంలేక పారిశ్రామి కాధిపతి ఋణంచేసి పరిశ్రమలను నడిపే అవసరము మానుకుంటాడు. కాబట్టి బాంకు వడ్డీ పెరుగుటకు ఎప్పుడూ ఒక హద్దు ఉంటుంది. ఇది సామాన్యంగా సగటు లాభం రేటుకన్న కొంచెం తక్కువగా ఉంటుంది. అదేవిధంగా బాంకు రేటు కూడా నిర్ణ యింపబడుతూ వుంటుంది.

# అధ్యాయం 7

# వ్యవసాయంలో కాపిటలిజం

## పట్టణాలకు గ్రామసీమలకు మధ్య ప్రతియోగము

కాపిటలిజం బాగా విస్తరించిన పిమ్మటనే యంత్ర పరిశ్రమ బాగా అభివృద్ధి చెందినది. ఒక్క 150 ఏండ్ల క్రితం చూస్తే వేలకొలదీ కార్మికులను వినియోగించే పెద్ద పెద్ద మిల్లులుగాని, మానెగములుగాని, రైల్వేలుగాని ఉండేవిగావు. కాపిటలిజమునకు పూర్వం గృహపరిశ్రమలు, చేతిపనులు మాత్రమే ఉండేవి. వాటి ద్వారానే సరకుల ఉత్పత్తి జరుగుతూ వుండేది.

వ్యవసాయం వేరువిధంగా ఉండేది. చాలా పురాతన కాలంనుండి ప్రజలు భూమినిదున్ని పంటలు పండించటం, పశుపాలనం, కోళ్ళు, మేకలు మున్నగు వాటిని పెంచడం, తోటలు పెంచటం చేస్తూ ఉండేవారు. కాపిటలిజం దశ వచ్చునరికి భూమి ఫ్యూడల్ ప్రభువుల చేతులలో ఉండేది. వ్యవసాయంలో ఫ్యూడలిజం (జమీందారీ వ్యవస్థ) ఉండేది. కాపిటలిజం అభివృద్ధి కావటంతో ఫ్యూడలిజం చావుదెబ్బ తిన్నది. కాని ఇంకా చాలా కాపిటలిస్టు దేశాలలో కూడా ఫ్యూడలిజం యొక్క హతశేషం నేటికీ కానవస్తూనే వుంటుంది. సామాన్యంగా భూమి పెద్ద భూస్వాముల చేతుల్లోనూ, జమీందార్ల చేతులలోనూ ఉండటాన్ని చూస్తాము.

కాపిటలిజం వృద్ధియైన పిమ్మట "పరిశ్రమలు వ్యవసాయం నుండి వేరౌతాయి." కాపిటలిజానికి పూర్వంఉన్న ఆర్థిక విధానంలో సామాన్యంగా రైతులే తమకు కావలసిన బట్టలను, చెప్పులను, పాత్రలను తయారు చేసుకొనేవారు; లేదా వ్యవసాయానికి సన్నిహితంగా వుండే చేతిపనులవారు తయారు చేసేవారు. కాని కాపిటలిజం వృద్ధియైన పిమ్మట బట్టలు, చెప్పులు వగైరాలన్నీ పెద్ద పెద్ద ఫ్యాక్టరీలలో యంత్రసహాయంతో ఉత్పత్తిగావింపబడుచున్నవి. ఈ సరుకు నాణ్యం కూడా హెచ్చుగా వుంటుంది. చౌకగా కూడా తయారౌతుంది. కాబట్టి వ్యవసాయదారుల ఉత్పత్తి క్షీణించిపోతుంది.

పరిశ్రమలు వ్యవసాయంనుండి వేరౌటతోనే పూర్తికాలేదు. పట్టణాలకు, గ్రామసీమలకు మధ్య పెద్ద అఖాతం ఏర్పడి, అంతకంతకూ ఇది విశాలమౌతుంది. పరిశ్రమలొకవైపు అభివృద్ధి యౌతూవుంటే వ్యవసాయం ఇంకొకవైపుకు క్షీణిస్తూ వుంటుంది. దీనినే పరిశ్రమలకూ, వ్యవసాయానికి మధ్య పెరిగే "ప్రతియోగం

(anti Thesis) అంటాము. పరిశ్రమలలో ఎల్లప్పుడూ నూతన పరిశోధనలు, యంత్రాభివృద్ధి, శ్రమ సులభంకావటం, ఉత్పత్తిశక్తి హెచ్చుగావటం జరుగుతూవుంటుంది. ఇందుకు వ్యతిరేకంగా వ్యవసాయం ఎప్పుడూ వెనకబడే వుంటుంది. ఫ్యూడల్ దోపిడీ తగ్గినా, పరోక్షమైన దోపిడీ వస్తుంది. రైతాంగముయొక్క దీనత్వము, అజ్ఞానము, అతిశయిస్తవి. పట్టణాలలో నాగరికత అభివృద్ధియౌతూవుంటే, గ్రామసీమలలో అజ్ఞానాంధకారం, మౌఢ్యము ఇంకా గాఢంగా ప్రబలతవి. ఈ విధంగా కాపిటలిజం వృద్ధియౌతూవుంటే వ్యవసాయం క్షీణిస్తూవుండటాన్ని చూస్తాము. కాపిటలిజంలో "తీరని గాఢమైన అంతర్విభేదాలు ఈ విధంగా ఏర్పడుతాయి. ఇందువల్ల అనేకవిధాల సంక్షోభాలు బయలుదేరుతాయి. "కాపిటలిజంయొక్క నాశనాన్ని అనివార్యం జేస్తాయి ఈ అంతర్విభేదాలే."

"కాపిటలిజం ఫ్యూడలిజం నుండి వ్యవసాయాన్ని బయటకీడుస్తుంది. దానిని వ్యాపార పద్ధతులలోకి దింపుతుంది. యీ విధంగా వ్యవసాయికార్థిక విధానంలో మార్పును తెచ్చినా, మధ్యయుగాల పరిస్థితులమంటి పెత్తందారీ సంకెళ్ళనుండీ తప్పించినా, దోపిడిమాత్రం అట్లాగే ఉంటుంది. ఈ దోపిడీ మాత్రం నూతన రూపాన్ని ధరిస్తుంది. ఒక కొత్తదైన 'నవీనమైన' పద్ధతులలో దోపిడి సాగుతుంది. కాపిటలిజం పరిశ్రమలకు వ్యవసాయానికి మధ్యగల వైరుధ్యాలను తొలగొట్టదు సరికదా, వాటిని మరింత తీక్షణం చేస్తుంది. పరిశ్రమలు, వ్యాపారాలలో కాపిటల్ ప్రభావం, ఉత్పత్తి పెరిగిన కొలది వ్యవసాయం మరింత దోచుకోబడుతుంది." *

వ్యవసాయోత్పత్తికి మూలాధారం భూమి. కాపిటలిస్టు దేశాలలో భూమి కొంతమంది భూకామందుల స్వంత ఆస్తి. దాదాపు అన్ని దేశాలలోను పెద్ద పెద్ద భూఖండాలు, స్వయంగా సాగుచేయని భూస్వాముల చేతులలో వుంటాయి. వీరు తమ భూమిని ఇతరులకు 'కౌలు'కు యిస్తారు. సాగుజేసేవారినుండి 'కౌలుశిస్తు' లేక 'రెంటు' (రెంటు అనగా భూస్వామికి చెల్లించే భూమిసన్ను)ను వసూలు చేస్తారు. పూర్వం వ్యావసాయిక బానిసలను ప్రభువర్గం దోచుకునేది. నేడు భూస్వాములు స్వతంత్రులగు రైతులను దోచుకుంటున్నారు. దోపిడీరూపం మారింది. అంతే. ఒక్క సోవియటు యూనియనులోనే భూమిని 'కౌలు'కిచ్చి రైతులను దోచుకునే పద్ధతి లేదు. అక్కడ భూమియంతా జాతీయపరం చేయబడింది: అనగా భూమి శ్రామికవర్గ ప్రభుత్వానిది, భూమిలో కొంత భాగాన్ని రైతులు సమిష్టిగా వ్యవసాయంచేసి, ఫలితాన్ని పూర్తిగా తామే అనుభవిస్తారు. ఇతర భాగాన్ని ప్రభుత్వమే 'ప్రభుత్వకృషి క్షేత్రాల' క్రింద వుంచి స్వయంగా వ్యవసాయం జేయిస్తుంది. ఇందులోని ఫలసాయం కార్మికులకూ, దేశ రక్షణకు వినియోగ పర్చబడుతుంది.

* "వ్యవసాయంలో కాపిటలిజం అభివృద్ధిని గూర్చిన సూత్రాలను బలపరుస్తూ మరికొన్ని లెక్కలు" అన్న లెనిన్ వ్యాసం నుండి.

కాపిటలిస్టు దేశాలలో రైతునుండి భూస్వామి వసూలుచేసే కప్పమును 'భూమి కౌలుశిస్తు' అని అంటాము. భూమి భూస్వామిది ; సాగుజేసేది రైతులు. పంట పాయాన్ని కౌలుశిస్తుగా పట్టుకుపోయేది. తిరిగి భూస్వామియే.

కౌలుశిస్తు రెండు భాగాలుగా వుంటుంది. ఒక భాగం 'నిరంకుశమగు కౌలుశిస్తు' రెండవది "తారతమ్యపు కౌలుశిస్తు". ముందు 'తారతమ్యపు కౌలుశిస్తు' ను గూర్చి చూద్దాము. భూములలో కొన్ని సారవంతమైనవి, కొన్ని సర్రనేలలు. వీటి పంటలలో చాలాభేదం వుంటుంది. పైగా కొన్ని భూములకు ఇతర వ్యవసాయాలు హెచ్చు కొన్ని కాల్వలు మొగలలోవుంటాయి. కొన్నిరోడ్లకు, బస్తీలకు దగ్గరలో వుంటాయి. కాబట్టి ఇతర భూములలోని పంటలకన్న ఈ భూముల పంటలు చవుకగా బజారుకు జేరగలవు. అందుచేత, భూములలో తారతమ్యం వుండటంవల్ల యీ భూములపై చెల్లే 'కౌలు శిస్తు'లో కూడా తారతమ్యం వుంటుంది. అయితే, విస్తారమగు భూములు కూడా సాగుజేయబడుచున్నవి. వాటిపైన కూడా 'కౌలు శిస్తు' ను చెల్లించబడుచున్నది. కాబట్టి విస్తారమగు భూములపై చెల్లింపబడే 'కౌలు శిస్తు' ను ప్రమాణంగా తీసుకొని అంతకన్న సారవంతమగు భూముల 'కౌలుశిస్తు' నిర్ణయింపబడుతుంది. కాబట్టి 'కౌలు శిస్తు' లో ఈ భాగాన్ని 'తారతమ్యపు కౌలు శిస్తు' (Differential Rent) అని అంటాము.

భూమి అంతా భూస్వాములది. దీనిపై వీరికి గుత్తాధికారము వున్నది. ఇందువల్ల కాపిటలిస్టులు స్వేచ్ఛగా భూమిపై పెట్టుబడి పెట్టుటకు వీలుకల్గదు. పరిశ్రమలలో అట్లాగాదు. ఏ పరిశ్రమలలో లాభాలు వస్తుంటే ఆ పరిశ్రమలో పెట్టుబడి పెట్టుటకు కాపిటలిస్టుకు స్వేచ్ఛ వున్నది. కాని భూమిఅంతా భూస్వాముల చేతులలో చిక్కుపడి వుండటంవల్ల భూమిపై పెట్టుబడి పెట్టుటకు కాపిటలిస్టుకు పూర్తి స్వాతంత్ర్యం లేదు. భూమిని కొనాలన్నా, సేద్యం చేయాలన్నా కవులుకు తీసుకొని మరొకరికి కవులుకు యివ్వాలన్నా భూస్వామి కోరినంత హెచ్చు 'కౌలుశిస్తు' ను చెల్లించాలి. పైగా భూమిపై విశేషమగు 'స్థిరమైన కాపిటల్' ను పెట్టనక్కరలేదు. అందుచే స్వల్పమైన కాపిటల్‌తో ఎక్కువ అదనపు విలువను గుంజవచ్చును. ఇందువల్ల పరిశ్రమలలో వచ్చే అదనపు విలువకన్నా వ్యవసాయంలో ఎక్కువ వస్తుంది. వ్యవసాయం నుండి పరిశ్రమలకు, పరిశ్రమలనుండి వ్యవసాయానికి కాపిటల్ మార్చబడుటకు పూర్తి స్వేచ్ఛగనుక వుంటే, కాపిటలిస్టులలో పోటీ హెచ్చి, లాభం రేటు పరిశ్రమలలోనూ, వ్యవసాయంలోనూ, సరి సమానంగా వుండేది. కాని ఇట్టి స్వేచ్ఛ లేక, భూమిపై గుత్తాధికారం వుండడంవల్ల, వ్యవసాయ పంటలు ఉత్పత్తి ధరకన్నా హెచ్చుధరకు అమ్మబడుతాయి. ఈ హెచ్చుధర భూస్వామి జేబులలోకి పోతుంది. దీనినే మనం 'నిరంకుశపు భూమి కౌలు శిస్తు' అని అంటాము. భూస్వామికి చెల్లించబడే కప్పమే 'నిరంకుశపు భూమి కౌలు శిస్తు' అని మార్క్సు వర్ణించాడు.

ఏ విధంగా 'తారతమ్యపు కౌలుశిస్తు', నిరంకుశపు కౌలుశిస్తు' ఏర్పడుచున్నవో లెనిన్ సూక్ష్మంగా ఇలా తెలియజేశాడు:

“...మొట్టమొదటిగా భూమిని ఉపయోగించుట విషయమై గుత్తాధికారమున్నది. భూమి పరిమితంగా ఉండుటవల్ల ఈ గుత్తాధికారం ఏర్పడుచున్నది. ఏ కాపిటలిస్టు సమాజంలోనైనా ఇది తప్పదు. ఈ విధమైన గుత్తాధికారం వుండటం వల్ల విస్తారమైన భూములలో కనిష్టమైన దానిలో, పండే పంటనుబట్టి ధాన్యం ధర నిర్ణయించబడుతుంది. ఇంతకుమించి సారవంతమైన భూములలో పండే పంటవల్ల గాని, నూతన పద్ధతుల నవలంబించుట ద్వారా పండే పంటవల్ల గాని వచ్చే అదనపు లాభమే తారతమ్యపు కౌలుశిస్తు. భూముల సారంలో వుండే తారతమ్యం వల్లనే ఈ 'తారతమ్యపు కౌలుశిస్తు' ఏర్పడుచున్నది. ఇదిగాక, భూస్వామికి భూమి స్వంత ఆస్తిగా అగుచున్నది. అందువల్ల ఈతడు ఈ భూమిని రైతుకు సాగు జేసుకొనుట కిచ్చి, దానివల్ల ప్రతిఫలమును పొందుచున్నాడు. కేవలం భూమిపై-గుత్తాధికారాన్ని కల్గివుండటం వల్లనే రైతునుండి కొంత లబ్ధి నొందగల్గుచున్నాడు. కాబట్టి దానిలోని ఈ భాగాన్ని 'నిరంకుశపు కౌలుశిస్తు' అని అంటున్నాము.

“నిజానికి, కాపిటలిస్టు వ్యవస్థలో భూమిపై గుత్తాధికారం తప్పని సరిగా వుండాలనే నిర్ణయంలేదు. భూమి స్వంత ఆస్తి కాకపోయినా కాపిటలిస్టు పద్ధతులపై వ్యవసాయం జరగటాన్ని ఊహించగలము. ఇందువల్లనే అనేకమంది బూర్జువా ఆర్థిక శాస్త్రవేత్తలు భూమిని జాతీయపరం చేయాలనికోరారు. వాస్తవికంగా భూమిపై స్వంత ఆస్తిహక్కులు లేకపోయినా, వ్యవసాయం నేడు కాపిటలిస్టు పద్ధతులపై జరుగుతూ వుండటాన్ని చూస్తున్నాము ప్రభుత్వ కృషిక్షేత్రాలుగాని, సాముదాయిక భూములుగాని ఇట్టివే. కాబట్టి భూమిపై స్వంత ఆస్తిహక్కులు వున్నపుడు వుండే గుత్తాధికారమునకు, ప్రభుత్వం క్రిందనుండి జాతిపరం చేయబడ్డప్పుడు వుండే గుత్తాధికారమునకు వుండే భేదాన్ని గుర్తించాలి. స్వంత ఆస్తి హక్కులున్న గుత్తాధికారం వల్లనే 'నిరంకుశపు కౌలుశిస్తు' ఏర్పడుచున్నదనీ, భూమిపై తారతమ్యముల వల్ల 'తారతమ్యపు కౌలుశిస్తు' ఏర్పడుచున్నదనీ, భూమిపై స్వంత అస్తిహక్కులున్నంత కాలం ఈ రెండు రకాలుగానూ కౌలుశిస్తు వుంటుందనీ మనం గుర్తించగలం.”

## భూమి కౌలుశిస్తు యొక్క మూలం

పైన వివరించిన మార్క్సు సిద్ధాంతం ప్రకారం రెంటు ఈ విధంగా వస్తున్నది: భూమి భూస్వామిది. అతడు భూమిని కౌలుకిస్తున్నాడు. కాపిటలిస్టు అనగా కొంతధనాన్ని పెట్టుబడి పెట్టేవాడు. కౌలుకు తీసుకొని కొంతమంది కార్మికులకు కూలియిచ్చి వ్యవసాయం జేయిస్తున్నాడు. కార్మికులు అదనపు విలువను సృష్టిస్తున్నారు. ఈ అదనపు విలువ ప్రథమంలో కాపిటలిస్టు కౌలుదారునకు వెళ్ళుతుంది. అతడు దానిని రెండుభాగాలు చేస్తాడు. తాను పెట్టుబడి పెట్టినందుకు ప్రతిఫలంగా అంటే

తన లాభంగా ఒకభాగాన్ని జేబులో వేసుకుంటున్నాడు. రెండో భాగాన్ని భూకామందుకు చెల్లిస్తున్నాడు. అదనపు విలువలో భూకామందుకు వెళ్ళే భాగాన్నే 'కౌలుశిస్తు' అంటున్నాము. కాబట్టి పరిశ్రమలలోవలెనే వ్యవసాయంలో కూడా వచ్చే 'నిరంకుశపు కౌలుశిస్తు'కు గాని 'తారతమ్యపు కౌలుశిస్తు'కు గాని మూలం కార్మికుల సృష్టిచే అదనపు విలువయేనని తెలుస్తున్నది.

"అదనపు శ్రమ సృష్టియైన అదనపు విలువయే భూమి కౌలుశిస్తు" అని మార్క్స్ వివరించాడు.

"కౌలుశిస్తు సిద్ధాంతం ప్రకారం వ్యవసాయదారులందరూ భూస్వాములు, కాపిటలిస్టు, కార్మికులు అనే మూడు తరగతుల క్రింద విభజింపబడి వుండాలి. కాపిటలిజం దీనినే ఆశిస్తుంది. కాని వాస్తవంగా ఇట్లే పరిస్థితులు వుండటంలేదు అని లెనిన్ తెలియజేశాడు.

నిజానికి పరిస్థితులు ఇంత సులభంగాను, సూటిగాను, వుండటంలేదు: ఎంతో చిక్కులతో, అడ్డదిడ్డంగా వుంటున్నవి. ఒక్కొక్కప్పుడు భూస్వామి, తన భూమిని కౌలుకీయక, తానే స్వయంగా సాగుచేస్తాడు. ఇందుకై కార్మికులను పెట్టుకుంటాడు. ఇటువంటి సందర్భంలో భూస్వామే కాపిటలిస్టు సాహసికుడుగా కూడా అవుతున్నాడు, [లాభం సంపాదించు ఉద్దేశంతో ధనమును అప్పుదెచ్చి పెట్టుబడి పెట్టే వారిని కాపిటలిస్టు సాహసికులు (Capitalist entrepreneur) అని అంటాము.] భూస్వామిగా కౌలుశిస్తును, కాపిటలిస్టుగా తన కాపిటల్‌పై లాభాన్ని సంపాదిస్తాడు. రెంటు, లాభం ఒకరి జేబులోనికేపోతుంది.

కాని సాధారణంగా, భూమి కాపిటలిస్టు సాహసికునిచేగాక, రైతుచే కవులుకు తీసుకోబడుతుంది. రైతు, కూలీలను వినియోగించక, స్వయంగానే సాగుజేస్తాడు. ఇటువంటి విషయంలో ఒకటి జరుగుతుంది. రైతుకు స్వంతభూమిలేదు: తనజీవిత పోషణకై వ్యవసాయంచేసి తీరాలి. అందుచే తప్పనిసరిగా ఏ షరతులకైనా ఒప్పుకొని భూస్వామి దగ్గర భూమిని కవులుకు తీసుకుంటాడు. భూస్వామి ధాన్యంరూపంలోనూ, వెట్టిచాకిరి రూపంలోనూ, ధనరూపంలోను అనేకవిధాల 'కౌలుశిస్తును గుంజుతాడు. ఇటువంటప్పుడు, 'రెంటు ఎక్కడనుండి వస్తుంది? కార్మికులు వినియోగింపబడి, వారు అదనపు విలువను సృష్టించనప్పుడుగూడా 'కౌలుశిస్తు ఎక్కడనుండి పుట్టుకు వస్తున్నది?

ఇటువంటి సందర్భంలో "రైతును దోపిడీచేయటం ద్వారా" 'కౌలు శిస్తు' వస్తున్నది. రైతు పంటలను పండిస్తున్నాడు. కాని తన జీవితావసరములకు కూడా మిగుల్చుకొనకుండా పంటలో చాలా హెచ్చుభాగాన్ని భూస్వామికి చెల్లిస్తున్నాడు. ఇదే 'కౌలుశిస్తు' అగుచున్నది. ఇందుకనే "పరిశ్రమలలో పనిజేసే కార్మికులను దోచుకునే పద్ధతి, రైతులను దోచుకొనే పద్ధతి రూపంలో మాత్రమే భేదించుచున్నది," అని మార్క్స్ వ్రాశాడు.

## భూమి యొక్క క్రయ విక్రయములు

చాలా కాపిటలిష్టు దేశాలలో రైతులకే స్వంతభూములుండి వాటిని వారు స్వయంగా సాగుచేసుకుంటున్నారు. ఇటువంటి సందర్భంలో కౌలుశిస్తు అనేది ఎట్లా వుంటుంది ? అనేది చూడాలి.

కాపిటలిష్టు వ్యవస్థలో భూమి క్రయ విక్రయములకు అనువైనది. భూమి స్వంత ఆస్తిగనుక ఈవిధంగా క్రయ విక్రయములు సాధ్యమౌతున్నవి. కాపిటలిష్టు దేశాలలో రైతులు భూస్వాములనుండి భూములను కొనుక్కోవాలి. అట్టి సందర్భాలలో భూమి వెల ఎట్లా నిర్ణయించబడుచున్నది ?

భూస్వామికి భూమివుంది. దానినతడు కౌలుకిస్తే సాలీనా రు 5000/-లు 'కౌలుశిస్తు' వస్తున్నది. కౌలుదారు అభూమిని కొనదలుస్తాడు. ఎంతధరకు భూస్వామి అమ్ముతాడు ? అతడిట్లా ఆలోచిస్తాడు: "నాకు ప్రస్తుతం రు 5000/-లు కౌలుశిస్తు వస్తున్నది నేను అమ్మగా వచ్చిన డబ్బును బాంకులోవేసుకొన్నా నాకు రు 5000/-లు రావాలి. కాబట్టి రు 5000/-ల వడ్డీని తెచ్చే మొత్తానికి భూమిని అమ్ముతాను" అను కుంటాడు. బ్యాంకు రేటు 4% అనుకుందాము. కాబట్టి అ భూమిని రు 1 25,000 లకు అమ్మితేనే అతనికి సాలీనా రు 5000/-లు ఆదాయం వడ్డీరూపంలో వస్తుంది. కాబట్టి భూమి వెల రు 125000/-లు.

కొన్ని సమయాలలో కొందరు భూమి విలువనుగూర్చి మాట్లాడుతారు. ఇది తప్పు. భూమికి విలువ అనేది లేదు. ఇది మానవ శ్రమవల్ల సృష్టింపబడినది కాదు. భూమిపై కాల్వలు త్రవ్వబడినప్పుడు, కట్టడాలు నిర్మింపబడినప్పుడు, వాటి విలువమాత్రం భూమికి చెందుతుంది. అందుచే భూమికివిలువలేదు. కానిఅది కొందరి స్వంత ఆస్తి అగుటవల్ల కాపిటలిష్టు వ్యవస్థలో వెలను కల్గివుంటున్నది.

భూమియొక్క వెల అభూమి సాలీనా తెచ్చే ఆదాయాన్నిబట్టి వుంటుందని చూశాము. ఎంత ధనాన్ని బాంకులో వేస్తే, వచ్చేవడ్డీ "భూమి కౌలుశిస్తు"కు సరిస మానమౌతుందో అమొత్తమే భూమివెల. "దీనినే కిమ్మతు నిర్ణయించటం" అంటాము. ఇందువల్లనే మార్క్స్ "కౌలుశిస్తును హెచ్చించి ఒకే మొత్తంగా జేయటమే భూమి యొక్క వెల" అని అన్నాడు. కాబట్టి రైతు కొంత ధనాన్ని యిచ్చి భూమిని కొన్నాడంటే, కొన్ని సంవత్సరాల రెంటును ముందుగానే ఒకే మొత్తంగా చెల్లించి కొన్నాడన్నమాట.

## భూమి కౌలుశిస్తు, ఇందువల్లవ్యవసాయం మరింత క్షీణించుట

కాపిటలిజం అభివృద్ధియైనకొలదీ, భూమి కౌలుశిస్తు మొత్తం కూడాచాలా ఎక్కువ అవుతుంది. ఇది స్పష్టమేగదా. ఎక్కువ భూమి సాగుకోనికి వచ్చినకొలదీ

భూస్వామికి వుండే గుత్తాధికారంవల్ల అతనికి పోయే 'విరంతరపు కౌలుశిస్తు' మొత్తం హెచ్చుతుంది. ఇదే సమయంలో 'తారతమ్యపు కౌలుశిస్తు' మొత్తం కూడా చాలా విపరీతవేగంతో వృద్ధియౌతుంది. దీనికి కూడా కారణం స్పష్టమే. కొత్తగా సాగులోనికి వచ్చిన భూములలో తారతమ్యములు వుంటాయి; వాటి స్థానాలలో భేదం వుంటుంది; కొన్ని భూములలో వ్యవసాయాభివృద్ధి కనుపైన పనులు — కాల్వలు తవ్వటం, మోళ్ళు మొదళ్ళు పీకివేయబడటం, కట్టడాలు కట్టబడటం, రోడ్లు వేయబడటం, ఎరువులు ఉపయోగింపబడటం, స్వల్ప యంత్ర సహాయం పొందబడటం వగైరా - జరుగుట మూలకంగా వాటి ఫలసాయం అభివృద్ధి జెంద వచ్చును. ఈ అన్ని కారణాలవల్ల 'తారతమ్యపు కౌలుశిస్తు' మొత్తం కూడా హెచ్చు అవుతుంది. కాని ఇదంతా 'కౌలుశిస్తు' రూపంలో చివరకు భూస్వామి జేబులోనికే పోతుంది.

కౌలుశిస్తు పెరిగినకొలదీ భూమి వెలకూడా పెరుగుతూ వుంటుంది. పట్టణాల, పంటల వక్కనున్న భూముల వెలనేగాక, గ్రామసీమలలో వున్న భూముల వెలలుకూడా పెరుగగలవు. ఉదాహరణకు : 1900 నుండి 1910 నాటికి, అనగా 10 ఏండ్లలో అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వున్న భూమివెల రెండు వేలకోట్ల డాలర్లు (8 వేలకోట్ల రూపాయలు) పెరిగింది. ఇందులో 600 కోట్ల డాలర్లు మాత్రం కట్టడాలు, యంత్రాలు మున్నగువాటి నిర్మాణంవల్ల పెరిగినవి. మిగిలిన 16000 కోట్ల డాలర్లు భూమివెల పెరుగుట మూలకంగా వచ్చినదే.

కౌలుశిస్తు పెరిగిందంటే సమాజం, పరాశ్రయజీవులు, సోమరులు అగు భూస్వాములకు చెల్లించే కప్పం పెరిగిందన్నమాట. కౌలుశిస్తు పెరగటంవల్ల వ్యవసాయాభివృద్ధికి మరింత ఆటంకం ఏర్పడుతుంది. అది మరింత క్షీణిస్తుంది. వ్యవసాయానికి, పరిశ్రమలకు మధ్య అఖాతం మరింత పెరుగుతుంది.

కౌలుశిస్తు హెచ్చుకావటం వల్లనే వ్యవసాయాభివృద్ధి అరికట్టబడుట లేదు. ఒక ప్లాను క్రమంలేని ఉత్పత్తి వ్యవసాయంలో కూడా జరుగుతూ వుంటుంది, ఏయే పంటల నేయే కాలంలో వేయటంవల్ల ఎక్కువలాభం వస్తుందో ఎవ్వరికీ తెలియదు. ఇంతేగాక, ఏమీ పెట్టుబడి పెట్టకనే మరింత లాభాన్ని పొందాలని ప్రయత్నించటంవల్ల భూమి త్వరలోనే నిస్సారమైపోతుంది. వీటివల్ల వ్యవసాయంలో కూడా సంక్షోభం బయలుదేరుతుంది. ఆర్థిక సంక్షోభంవస్తే మరీ ఎక్కువగా నాశనమయ్యేది వ్యవసాయ వృత్తియే. ఈ విధంగా కాపిటలిజంలోని పరస్పర విభేదాలు పరిశ్రమలనూ, వ్యవసాయాన్ని రెండింటినీ నాశనవంస్థితులకు ఈడ్చుకుపోగలవు.

## వ్యవసాయంలో భారీ ఉత్పత్తి, కొద్ది ఉత్పత్తి

కాపిటలిజం వృద్ధి పొందినప్పుడు స్వల్పఉత్పత్తి త్రోసిరాజనబడి భారీ ఉత్పత్తి విజయం పొందుతుంది. భారీ ఉత్పత్తిలో అనేక సదవకాశాలు వున్నవి.

పెద్దయెత్తున యంత్రసాధనములు ఉపయోగించ వచ్చును. శ్రమ ఉత్పత్తిశక్తి చాలా అధికం కాగలదు. ఇందువల్ల గృహపరిశ్రమలు క్రమంగానష్టగిలిపోయి భారీయెత్తున ఉత్పత్తిప్రవేశించగలదు. కాపిటలిస్టు పరిశ్రమలలోకూడా పోటీవుంటే క్రమంగా చిన్న పరిశ్రమలు అణచబడి, ప్రతిరంగంలోనూ బాగా పెద్దపరిశ్రమలు మాత్రమే నిలబడి వుంటాయి.

ఈ విధంగా కొద్దియెత్తు వుత్పత్తిపై భారీ వ్యవసాయ వుత్పత్తి విజయం పొందడం తథ్యం. ఇందువల్ల చాలా కొద్దిమంది కాపిటలిస్టుల చేతులలో విపరీత మగు పెట్టుబడి కేంద్రీకరింప బడుతుంది. "ఇందువల్ల వర్గ విభేదాలు మరీ తీవ్ర రూపం దాల్చగలవు" శ్రామిక వర్గానికీ, కాపిటలిస్టు వర్గానికీ మధ్య వుండే మధ్య తరగతి (పెటీ బూర్జువా తరగతి)- వీరిలో చిన్న దుకాణాదారులు, చేతిపనులవారు, చిన్న వుత్పత్తిదారులు మున్నగువారు వుంటారు — క్రమంగా శిథిలమై పోతుంది. వీరిలో ఏ ఒకరో, ఇద్దరో మాత్రం భాగ్యవంతులై, కాపిటలిస్టు వర్గంలో జేరతారు. మిగతా అత్యధిక సంఖ్యాకులు సర్వస్వాన్ని పోగొట్టుకొని శ్రామిక వర్గంగా తయా రౌతారు. ఈ విధంగా కాపిటలిస్టు విధానంలో బూర్జువావర్గం, శ్రామికవర్గం ఒకదాని కొకటి ఎదురుగా నిటారుగా నిలబడి వుంటాయి.

చిన్న పరిశ్రమలు నాశనం గావటానికి కాపిటలిజమే కారణం. కాని దీనిని కాపిటలిస్టు పెద్దలు ఒప్పుకోరు. దీనిని మరుగుపర్చాలని "అదుగో చూడండి వ్యవసాయంలో మధ్యతరగతి రైతులే ఎంత ఎక్కువమంది వున్నారో, వ్యవ సాయంలో స్వల్పవుత్పత్తి జరగటంలేదా ?" అని అంటారు. ఈ విధంగా వీరు పదే పదే వాదిస్తూ వుంటారు. వ్యవసాయంలో మాత్రం, స్వల్పవుత్పత్తియే లాభదాయక మని కూడా వీరు వాదిస్తారు.

కాని ఇదిపూర్తిగా అసత్యం. సరియైనదిగాదు. సోవియటు యూనియన్‌ను చూస్తే ఈ వాదనలోని పస బైటపడుతుంది. సోవియటు యూనియన్‌లో 'సోవ్ ఖోజులను' (ప్రభుత్వ కృషి క్షేత్రాలను) కోల్ఖోజులను (సమిష్టి కృషి క్షేత్రాలను) చూస్తే భారీఉత్పత్తి స్వల్పఉత్పత్తికన్నా ఎన్నోరెట్లు ఫలదాయకమని రుజువౌతుంది. ఇంతెందుకు? కాపిటలిస్టు దేశాలలోనే క్రమంగా భారీఉత్పత్తి వ్యవసాయంలోనికి కూడా ప్రవేశించటంవల్ల ఈ సత్యం రుజువౌతోంది.

అయితే భారీ ఉత్పత్తివల్లకల్గే ప్రయోజనాలు సోవియటు యూనియన్‌లో వేరు: కాపిటలిస్టు దేశాలలో వేరు. సోవియటు యూనియన్‌లో బ్రహ్మాండమైన ప్రభుత్వకృషి క్షేత్రాలలోగాని, సమిష్టికృషి క్షేత్రాలలోగాని వ్యవసాయం సాగుతున్న దంటే, దాని ఫలసాయమంతా సమాజానికే, సమిష్టి ప్రయోజనాలకే చెందుతుంది. భారీఉత్పత్తి సోషలిస్టుపద్ధతులపై సాగుతుంది. ప్రజలంతా సోషలిజం వైపుకు తీసుకు పోతుంది. కాని కాపిటలిస్టు దేశాలలో వ్యవసాయంలో భారీఉత్పత్తి అంటే చిన్న

రైతులను అణగద్రొక్కటానికి, అసంఖ్యాకులైన కార్మికప్రజలను మరింత దోచుకుంటానికి మాత్రమే ఉపయోగపడుతుంది.

భారీ ఉత్పత్తి వ్యవసాయంలో ఏ విధంగా లాభదాయకమో ఈ క్రింది విషయాలను బట్టి స్పష్టం కాగలదు. భారీ వ్యవసాయంలోనే ట్రాక్టర్లు, కంబైన్లు మున్నగు యంత్రాలను ఉపయోగించగలము. వీటి సహాయం వల్ల మానవ శ్రమ తగ్గటమేగాక, శ్రమ వుత్పత్తిశక్తి అధికమౌతుంది. పెద్దపెద్ద వ్యవసాయదారులే చిన్న రైతులకంటె సులభంగా, బ్యాంకుల నుండి అప్పులను తెచ్చుకోగల్గుతారు. భారీ వ్యవసాయం సాగించేవారే తమ పంటలను మార్కెటులో సులభంగా ఎక్కువ ధరలకు అమ్ముకోగల్గుతారు. భారీ వ్యవసాయం ఉంటేనే నవీనశాస్త్ర పరిశోధన లన్నిటినీ వ్యవసాయాభివృద్ధికి వినియోగించగలము

వ్యవసాయవృత్తి పరిశ్రమలకన్న వెనుకబడివున్నా క్రమంగాయంత్రముల ఉపయోగం, కృత్రిమ ఎరువుల ఉపయోగం వ్యవసాయంలో అభివృద్ధియౌచున్నవి. భారీక్షేత్రాలలోనే పెద్ద యంత్రాలను ఉపయోగించటం సాధ్యమౌతుంది. ఉదాహరణలు ఎన్నోవి చూడవచ్చును. అమెరికా సంయుక్తరాష్ట్రములలో 1918లో 80000 ట్రాక్టర్లు (మరనాగళ్ళు) ఉంటే 1930 నాటికి ఇవి 10,00,000 అయినవి. 1920లో 3500 ఉన్న కంబైన్లు (కోత, మార్పిడి ఒకేకాలంలో జరిపే యంత్రాలు) 1930 కి 60000 కు వృద్ధియైనవి. జర్మనీలో 1913—1929 కాలంలో నైట్రోజనన్ ఎరువుల వ్యాప్తి 2½ రెట్లు పెరిగింది. పొటాషు ఉపయోగం 1½ రెట్లు పెరిగింది. ఫ్రాన్సులో నైట్రోజనన్ ఎరువుల వాడకం 2 రెట్లు, పొటాష్ వాడకం 5 రెట్లు, సూపర్-ఫాస్ఫేట్ల వాడకం 2 రెట్లు పెరిగింది. జర్మనీలోని పెద్దక్షేత్రాలలో అధికసంఖ్యాకం యంత్రములను ఉపయోగిస్తున్నవి: చిన్నక్షేత్రాలు వుపయోగించలేవని వేరే చెప్ప నక్కరలేదు. ఇవిన్వయంగా ట్రాక్టర్లనుగాని, మోటారు లారీలనుగాని, ఎలక్ట్రిక్ మోటార్లనుగాని పోషించుకోలేవు. పెద్ద క్షేత్రాలలో ఎక్కువ వాటికి ఇవి వున్నవి. 1925 లో జర్మనీలోని 200 హెక్టారులకు పైబడిన పెద్ద క్షేత్రాలలో 70% క్షేత్రాలు ఎలక్ట్రిక్ మోటార్లను. 14 5% ట్రాక్టర్లను, 60% స్టీంఇంజన్లను, 8% ట్రక్కులను వుపయోగిస్తున్నవి. ఇంత వుపయోగించినా, కాపిటలిస్టు వ్యవస్థలో, నవీనశాస్త్ర పరిశోధనల యొక్క యంత్రాభివృద్ధి యొక్క పూర్తి వినియోగాన్ని పొందగల్గిన సైజుకు పెద్ద క్షేత్రాల పరిమాణం పెరగటంలేదు. పెరగలేదుకూడను. ఈ పెద్ద క్షేత్రాలలోకూడా పనిచేసే ట్రాక్టర్లువగైరా యంత్రసాధనములు, వాటి పూర్తిశక్తితో ఉపయోగించబడటలేదు. ఒక్క పోషలిస్టు ఆర్థిక వ్యవస్థలోనే, వ్యక్తిఆస్తి అనేది ఏమీ వుండదు గనుక నవీనశాస్త్ర పరిశోధనలు, యంత్రసాధనాలు పూర్తిగా వాటి పూర్తి శక్తితో వ్యవసాయానికి ఉపయోగపడటం సాధ్యంకాగలదు,

కాపిటలిజం అభివృద్ధియైనకొలదీ వ్యవసాయంలోకూడా భారీ వ్యవసాయం స్వల్ప వ్యవసాయాన్ని వెనక్కు నెట్టివేస్తుంది. కాని ఇట్టి వ్యవసాయంలో మాత్రం

కాపిటలిస్టు అభివృద్ధికిమూలమైన సూత్రాలలో కొన్నిప్రత్యేక లక్షణాలు గోచరిస్తవి. "వ్యవసాయం వెనుకబడి వుండటం" వలన యంత్రముల వుపయోగం చాలామెల్లగా జరుగుతుంది. ఇందువల్ల చాలా అభివృద్ధిజెందిన కాపిటలిస్టు దేశాలలోకూడా చిన్న చిన్న కృషిక్షేత్రాలు చాలావుంటాయి. వీటిలో పోలెడంత శ్రమ వృధాజేయబడుతూ వుంటుంది. భూమి కూడా పాడుచేయబడుతుంది. ఈ చిన్నరైతు తాను పూర్తి స్వతంత్రుడననుకొంటాడు. తన 'స్వతంత్రత'ను కాపాడుకొంటానికై ఈ జానెడంత భూమి తునకను పట్టుకొని వేలాడుతూ వుంటాడు; విపరీతమైన శ్రమను జేస్తాడు తన కుటుంబమంతటిచేతకూడా పనిచేయిస్తాడు. ఈ విధంగా స్వల్పకాలంలో భూమి సత్తువకాస్తా పోతుంది. తిరిగి దానికి ఎరువులు సరైగా వేసి సత్తువ చేకూర్చటానికి రైతుకు ఓపికలేదు. పశువులను పోషిస్తాడుగాని వాటిని సరిగా మేపడానికి సామర్థ్యముండదు రేపటి గతిఏమిటా అనేభయం సర్వదా ఇతనిని వేధిస్తూవుంటుంది. పన్నులు ఏమాత్రం పెరిగినా, పారిశ్రామిక వస్తువుల ధర ఏమాత్రం పెరిగినా, పంటలధర ఏమాత్రం తగ్గినా ఇతని స్వతంత్ర జీవనంకాస్తా గుటుక్కుమంటుంది. ఋణాలపాలు కావటం, మిగిలివున్న జానెడు భూమిని అమ్ముకొని వ్యవసాయ కూలీ కావడమో, అలోలక్ష్మణా అని తిరిపె మెత్తుకోవడమో మాత్రమే ఇతనిపరాత. ఎంత ప్రయత్నించినా, ప్రతిఏడాదీ వేలకొలంది చిన్నరైతులు దివాలాతీసి కూలీలుగా మారుతూవుంటారు.

తరచు, పెద్ద భూస్వాములు తమ పొలాలమధ్య చిన్నరైతుల పొలాలుండటం లాభమని ఎంచుతారు. ఇందుకు కారణముంది. తన స్వల్పభూమితో ఈ చిన్న రైతు తన సంసారాన్ని యీడ్వలేడు. కాబట్టి పక్కనున్న భూస్వామికి కూలిచేస్తానికి వెళ్ళతాడు. ఈతని అవసరాన్ని కనిపెట్టి భూస్వామి తక్కువకూలి యిస్తాడు. ఈ చిన్నరైతుకేగనుక ఈ కాస్తభూమీ లేకపోతే, ఊరువిడిచి, పట్టణంపోయి ఏ ఫ్యాక్టరీలోనో కార్మికుడుగా ప్రవేశిస్తాడు. కాబట్టి ఈ భూమితునక వుండడంవల్ల అతడు గ్రామానికి కట్టివేయబడుచున్నాడు: భూస్వామికి "చవుకగా శ్రమశక్తి" దొరకుచున్నది. అందుచేతనే లెనిన్ ఈ పేదరైతులను "జానెడు భూమిగల కార్మికుడు" అని వర్ణించాడు.

కాపిటలిస్టు పెద్దలు ఈ నగ్నసత్యాన్ని మరుగు పర్చుటకై అనేక ధర్మ సిద్ధాంతాలను లేవదీశారు. భారీ వ్యవసాయంకన్న స్వల్ప వ్యవసాయం లాభదాయకమన్నారు. చిన్నరైతు తన సంసార పోషణకై పడే అష్టకష్టాలను 'శ్రద్ధ' అనీ, 'ఓర్పు' అనీ, వివిధరీతుల పొగడుతారు. కాని, ఈ చిన్నరైతుపడే కష్టాలను, ఆతని బాధలను మాత్రం మహా తెలివితేటలతో దాచేస్తారు. వాటినిగూర్చి మాత్రం తలవనైనా తలవరు.

## కాపిటలిస్టు దేశాలలో భూమి ఎవరి చేతులలో ఎంత వున్నది – రైతుల స్థితిగతులు

కాపిటలిస్టు దేశాలలో భూమి కొలదిమంది పెద్దభూస్వాముల చేతులలో

కేంద్రీకరించబడి వుందని పైన చెప్పబడింది. వాస్తవానికి, అత్యధికులైన పేద రైతుల చేతులలో వున్న మొత్తం భూమికంటె కొలదిమందియైన భూస్వాముల చేతులలోనే ఎక్కువ భూమి వున్నది. అందులోనూ కొలదిమంది మరీ పెద్ద భూస్వాముల చేతులలోనే ఎక్కువభూమి కేంద్రీకరింపబడి వున్నది. ఏ కాపిటలిస్టు దేశాన్నిచూసినా ఈ సత్యం బయటపడుతుంది.

1925 జర్మనీ జనాభాలెక్కలు ఈ క్రింది విషయాలను తెలియజేస్తున్నవి. మొత్తం క్షేత్రాలలో • 60% పొలాలు 2 హెక్టారులకంటె తక్కువ పరిమాణం గలవి. ఇట్టి క్షేత్రాలన్నీ కలిపినా, వీటి విస్తీర్ణంమొత్తం భూమిలో 6 5% మాత్రమే. 10 హెక్టారుల పైనవున్న క్షేత్రాలు 11 5 % వున్నవి. వీటి మొత్తం విస్తీర్ణం మొత్తం భూమి విస్తీర్ణంలో 67%. దీనివల్ల తెలిసేదేమిటి? 10% సంఖ్య గల క్షేత్రాల విస్తీర్ణం మొత్తం భూమిలో 2/3 వంతులు ఉన్నవి. ఇదే సమయంలో అత్యధిక సంఖ్యగల క్షేత్రాల మొత్తం విస్తీర్ణం మొత్తం భూమి విస్తీర్ణంలో 1/18 వంతు మాత్రమే. 1908 లో ఫ్రాన్సులో, మొత్తం క్షేత్రాలలో 38% క్షేత్రాలు ఒక్కొక్కటి 1 హెక్టారుకన్న తక్కువ విస్తీర్ణం గలవి. వీటి మొత్తం విస్తీర్ణం చూస్తే మొత్తం భూమి విస్తీర్ణంలో 2.5% మాత్రమే. కాబట్టి రైతులలో 40% మందికి వున్నభూమి మొత్తం భూమిలో 1/40 వంతు మాత్రమే. కాని ఇదే సమయంలో 10 హెక్టార్లకు పైబడిన విస్తీర్ణంగలక్షేత్రాలు మొత్తం క్షేత్రాలసంఖ్యలో 16% మాత్రమే అయినా, వాటిమొత్తం విస్తీర్ణం మొత్తం భూమి విస్తీర్ణంలోని 74 6% అనగా సుమారు 3/4 వంతులు వున్నది. 1921 లో పోలెండులో 2 హెక్టారులకు పైబడిన విస్తీర్ణంగల క్షేత్రాలు మొత్తం క్షేత్రాల సంఖ్యలో 34% వున్నవి. కాని వీటి మొత్తం విస్తీర్ణం మొత్తం భూమి విస్తీర్ణంలో 3.6% మాత్రమే. హంగరీలో చిన్న, మధ్యస్తంకల్సి 99% క్షేత్రాల విస్తీర్ణం మొత్తం భూమిలో 50% అంటే మిగిలిన 1% క్షేత్రాల విస్తీర్ణం 50% అన్నమాట, 1% క్షేత్రం విస్తీర్ణం 99% చిన్న మధ్యస్తక్షేత్రాల విస్తీర్ణానికి సమానమన్నమాట. సంఖ్యలోచూస్తే 10000 మంది పెద్దభూస్వాములకు 10,00,000 చిన్న రైతులకు వున్నంత భూమివున్నది.

విప్లవానికి పూర్వం రష్యాలో కూడా భూమిలో అత్యధికభాగం కొలది మందియైన రాజకుటుంబీకులు, భూస్వాములు, మఠాలు, ప్రభువుల చేతులలో వుండేది. 30000 మంది పెద్ద భూకామందులకు మొత్తం 7 కోట్ల దెస్సియాటిన్ల * భూమి వుండేది. ఇదే సమయంలో 1 కోటి మంది బీద రైతులందరికీ కలిసి 7 కోట్ల 70 లక్షల దెస్సియాటిన్ల భూమి వుండేది. అంటే 331 గురు బీదరైతులకు ఎంత

• ఒక్కొక్క భూకామందుకు వుండే భూమి క్షేత్రం (Form) అని వ్యవహరింప బడినది. (అనువాదకుడు).

* దెస్సియాటిన్ అంటే 2 ఎకరాల 70 సెంట్లు.

భూమి వుందో ఒక్క పెద్దభూస్వామికి అంత భూమి వున్నదన్నమాట. ఒక్కొక్క రైతుకు సగటున 7 దెస్సియాటిన్ల భూమివుంటే ఒక్కొక్క భూస్వామికి సగటున 2300 దెస్సియాటిన్ల భూమివుండేంది. చాలామంది గ్రామస్థులకు భూమి వుండేదే కాదు. ఉన్నా, కానెడు తునక మాత్రమే. అక్టోబరు విప్లవానంతరమే భూమిపై బ్రతికే పరాశ్రయ జీవులందరూ తరిమివేయబడి భూమియంతా స్వయంగా సాగుచేసుకొనే రైతులకు ఈయబడింది.

ఈ విధంగా భూమి కొలదిమంది చేతులలో కేంద్రీకరించబడి వుండుట వల్ల అసంఖ్యాకులగు రైతుల దివాలాస్థితికి, ఆర్థిక బానిసత్వానికి పరిస్థితులు దారి తీస్తాయి. తనకున్న చారెడు నేల సరిపోదు. కనుక రైతు భూస్వామి దగ్గర భూమిని కవులుకు తీసుకోవాలి. కవులుకు తీసుకొన్న పిమ్మట దాదాపు భూస్వామికి బానిసగానే బ్రతకాలి. స్వల్ప వ్యవసాయంవల్ల టెక్నికల్ అభివృద్ధికి ఆటంకం కలుగటయే గాక ఇంకా అనేక యిబ్బందులు కల్గుతాయి. రైతు పండిన పంటలో అధిక భాగాన్ని భూస్వామికి 'కవులు శిస్తు' క్రింద చెల్లించాలి. ఉదాహరణకు, రైతు ఆదాయంలో 2/3 వంతులు ప్రభుత్వానికి పన్నులరూపంలో పోతున్నది. 'అమెరికాలో' దురదృష్టం కొద్ది పంటలు దెబ్బతిన్నా. కుటుంబంలో చిక్కులువచ్చినా ఆ రైతు బ్యాంకుల దగ్గరకు అప్పుకై పరుగెత్తవలసినదే. ఒకసారి అప్పుజేసిన పిమ్మట మరల తీర్చటం కష్టం, వడ్డీ రూపంలోనే పెద్ద మొత్తాన్ని ఏటేటా చెల్లించాలి. వీటికితోడు దళారీలకు ధాన్యం వ్యాపారులు, ఇతర వ్యాపారులు మున్నగువారు విపరీతంగా దోచుకుంటారు. ఇన్ని కారణాలవల్ల రైతు నికృష్టపు దాసిన్యబతుకు బ్రతకవలసి వస్తున్నది.

1930 జనాభా లెక్కలను చూస్తే అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని రైతుల దీనరికం గోచరిస్తుంది. 1920—30 మధ్య 10 ఏండ్లలోనూ మొత్తం క్షేత్రాల విలువ 6500 కోట్ల డాలర్లనుండి 3500 డాలర్లకు పడిపోయింది. ఒక్కొక్క క్షేత్రములో అందులోనున్న కట్టడాలు కలిపి సగటు విలువ చూస్తే, 10000 డాలర్ల నుండి 7500 డాలర్లకు పడిపోయింది. క్షేత్రాల సంఖ్య గూడా 64 లక్షల నుండి 63 లక్షలకు తగ్గిపోయింది. కవులుదార్ల సంఖ్య 24,55,000 నుండి 26,64,000 కు పెరిగింది. స్వంతభూములసాగు 63 70 00 000 ఎకరాల నుండి 6[illegible],80,00,000 ఎకరాలకు తగ్గింది. కవులు భూముల విస్తీర్ణం 22 50,00 000 ఎకరాలనుండి 20 60,00,000 ఎకరాలకు పెరిగింది. ఆమెరికన్ రైతులలో అధిక సంఖ్యాకులు ఏవిధంగా బీదవారౌతున్నారో, రైతుల స్వంతభూమి ఏవిధంగా తగ్గిపోతూవుందో, కవులు భూముల పరిమాణం, సంఖ్య ఎలా పెరుగుతూవుందో ఈ లెక్కలు తెలియజేస్తున్నవి.

1932 నాటి జపానును చూద్దాం. ఈ లెక్కలు వ్యవసాయ మంత్రి తయారు చేయించినవి. ఆ ఏనాడి జపానులో 55,78,000 వ్యవసాయదారుల కుటుంబాలు వున్నవి. వీటిలో 14,7[illegible],000 కుటుంబాలకు చారెడు భూమికూడా లేదు. వారు

కవులకు జేసుకొని బ్రతుకుతున్నారు. 25,00,000 కుటుంబాలకు 1/2 హెక్టారు, 12,40,000 కుటుంబాలకు 1/2 హెక్టారునుండి 1 హెక్టారు చొప్పున భూమివుంది ఈ రెండు అంతస్తులవారిలోను 13,60,000 కుటుంబాలు తమ భూమితోబాటు భూస్వాములవద్ద కవులుకు కొంత భూమిని తీసుకొని సాగుజేస్తున్నారు. భూస్వాములకు చవుకగా కూలీలు దొరికినా స్వంత పేద్యం చేయటంకన్నా కవులు కియటం ద్వారానే ఎక్కువ లాభం వస్తుంది. పండిన మొత్తం పంటలో సగానికి పైగానే వీరు 'కవులుశిస్తు'ను వసూలు చేస్తున్నారు. ఇట్టి హెచ్చు 'కవులుశిస్తు'ను చెల్లిస్తూ బ్రతికే కుటుంబాలు మొత్తం కుటుంబాలలో 70%గా వున్నవి. వీరి స్వంతభూమి, కవులు భూమి కలిపినా, సగటు 1 హెక్టారు కంటె ఎక్కువలేదు.

## కాపిటలిస్టు వ్యవస్థలో రైతాంగములో వివిధ తరగతులు

కాపిటలిస్టు వ్యవస్థలో రైతు తన కుటుంబ పోషణకై ఎంతో యిబ్బంది పడాలి. తన 'స్వంత' భూమిని నిల్పుకొనేందుకై నానా అవస్థలూ పడతాడు. ఆయాసంతో రాలిపోయేటంత వరకూ కష్టపడుతూ వుంటాడు. కాని ఎంత కష్టపడినా చివరకు చితికిపోతాడు. భూమి నిస్సారమవుతుంది. పశువులు క్షీణిస్తవి. పన్నులు పెరుగుతవి. కవులుశిస్తు పెరుగుతుంది. త్వరలోనే ఈతడు వడ్డీ వ్యాపారి కోరలలో చిక్కుతాడు. ఇక క్రమంగా ఈతడు పీల్చిపిప్పిజేయబడుతాడు. వీరికితోడు గ్రామాంలోని ధాన్యం దళారీ ఒకడు. రైతు సామాన్యంగా తన ధాన్యాన్ని ఈ దళారీకే అమ్ముతాడు. ఈ విధంగా ధాన్యంపై దళారి, అర్థికంపై వడ్డీవ్యాపారి పెత్తనం వహించి, ఉభయులూ రైతు మూలుగులను పీల్చేస్తారు.

కాపిటలిజం వృద్ధి అయినకొలదీ ఏ ఒకరో, ఇద్దరో రైతులు భాగ్యవంతులౌతారు. వారివ్యాపారాన్ని ప్రారంభించో, భూమినికొనో వడ్డీవ్యాపారాన్ని సాగించో భాగ్యవంతులై భూస్వామ్య తరగతిలో జేరతారు. కాని అత్యధిక సంఖ్యాకులు నిరుపేదలౌతారు. మొదట్లో పాడిపశువులను, చివరకు దుక్కిటెద్లను సహితం అమ్మేసుకుంటారు. చివరకు వడ్డీవ్యాపారి కోరలలో చిక్కుకొని హతమైపోతారు. భూమిని పోగొట్టుకొని వ్యవసాయ కూలీలుగానో, పట్టణంలో కూలీలుగానో తయారౌతారు.

ఈ విధంగా రైతాంగంలో ఒక చిన్నభాగం భాగ్యవంతులై బూర్జువా వర్గంలో కలుస్తుంది. వీరినే ధనిక రైతులు (కులక్కులు) అంటాము. పెద్దభాగం కూలీలుగా తయారౌతారు. ఈ విధంగా కాపిటలిజం "గ్రామసీమలలో రైతాంగమును విచ్ఛిన్నం చేస్తుంది. రైతాంగంలో కూడా వర్గ విభేదాలను తీసుకువస్తుంది."

రైతాంగంలో ఒకవైపు ధనిక రైతు, మరోవైపు వ్యవసాయ కూలీ వుంటారు. ఈ యిరువురిమధ్య "మధ్యతరగతి రైతులు" పెద్దభాగంలో వుంటారు. లెనిన్ వీరిని ఈ క్రింది విధంగా వర్ణించాడు :

"వీరి ముఖ్యలక్షణ మేమిటంటే, వీరిలో ఇంకా "సరుకుల ఉత్పత్తి" విధానం రాలేదు. కాలమాన పరిస్థితులు బాగావున్న ఏడాది మాత్రం తన కుటుంబ పోషణకు సరిపడునంత పంటను పండించుకోగల్గుతారు. ఇందువల్ల ఈతని స్థితి అతి చంచలమైనది. సాధారణంగా ఈతడు చేబాకీలు చేయకుండా వెళ్ళబుచ్చలేడు. ఈ చేబాకీలను తీర్చలేక ఋణదాతలకు వెట్టిచాకిరి చేస్తూవుంటాడు. ఎప్పుడైనా కాలమాన పరిస్థితులు సరిగా వుండకపోతాయా. ఈతడు సర్వభ్రష్టత్వం పొంది శ్రామిక వర్గంలో కలిసిపోతాడు."

ఇటువంటి మధ్యతరగతి రైతులు చాలామంది అనేక దేశాలలో వుంటున్నారు. వీరిలో అధికసంఖ్యాకులున్న గతిఒక్కటే: వీరిలో అత్యధిక సంఖ్యాకులు వ్యవసాయ కూలీలుగా తయారౌతారు. ఏ ఒకరిద్దరో మాత్రం ఒకమెట్టు పైకియెక్కి భూస్వాములుగా: దోపిడీదారులుగా తయారౌతారు. అమెరికా సంయుక్త రాష్ట్రాల 1930 జాబితా లెక్కలుచూస్తే ఈ మధ్యతరగతి రైతులు ఏ విధంగా దివాలా తీస్తున్నారో తెలియగలదు. 20 ఎకరాలలోపు క్షేత్రాలు, 500 ఎకరాల పైబడ్డ క్షేత్రాలు, వృద్ధియౌతూవుంటే, 20—500 ఎకరాల మధ్యవున్న మధ్యతరగతి క్షేత్రాలసంఖ్య తగ్గినది. *

## కాపిటలిస్టు దేశాలలో రైతాంగం నిరుపేద లౌతున్నారు

కాపిటలిజంవల్ల గ్రామసీమలలోని కష్టజీవులందరిబ్రతుకు నానాటికి తీసికట్టు అవుతుంది. వ్యవసాయానికి పరిశ్రమలకు మధ్య అఖాతం ఏర్పడుతుంది. గ్రామసీమలు అజ్ఞానాంధకారంలో మునిగి వుంటాయి. రైతులు బహునికృష్ట జీవనాన్ని గడుపుతూ వుంటారు. పన్నులబాధ పెరుగుతుంది. పంటల ధరలు విపరీతంగా పడిపోతాయి. ఉన్న భూమియూ అతిస్వల్పం. క్రమంగా భూమి ధనికరైతుల చేతులలో జేరుకొని, అక్కడ కేంద్రీకరింపబడుతుంది. ధనిక రైతులు భారీ వ్యవసాయాన్ని సాగించి, అధికలాభాలు సంపాదిస్తుంటే, తనవారెదుట తనను ఏదోవిధంగా నిలబెట్టుకుందామనే ఉద్దేశంతో బీదరైతు విపరీతంగా కష్టపడుతాడు. కాని చివరకు నిలబడలేడు. ఈ విధంగా గ్రామసీమలలో ఒకవైపున భూమిలో హెచ్చుభాగం గల్గిన ధనిక రైతులు, మరోవైపున భూమిని పోగొట్టుకొన్న అధిక సంఖ్యాకులగు వ్యవసాయ కూలీలు వుంటారు.

ఆర్థిక సంక్షోభంలో కాపిటలిజంలో వున్న అంతర్విభేదాలు బహుతీవ్రతరమౌతాయి. 1929-34 సంక్షోభం దానిని వ్యక్తపర్చింది. ఈ సంక్షోభంవల్ల సామాన్య రైతుల జీవితం మరింత అడుగంటింది. గ్రామాలకు, పట్టణాలకు మధ్యవుండే

* అమెరికాలో 20 ఎకరాలున్న రైతు బీదరైతు. 20—500 ఎకరాల మధ్యగలవారు మధ్యతరగతి రైతులు (అనువాదకుడు).

ప్రతియోగం (వైరుధ్యం) మరీ హెచ్చింది. పంటల ధరలు మరీ పడిపోవటంవల్ల లక్షలకొలది మధ్యతరగతి రైతులు దివాళాతీశారు. ఇదే సమయంలో వారు, వ్యవసాయ కూలీలు తమ జీవితావసర వస్తువులకొరకు హెచ్చుధరలనే చెల్లించవలసి వచ్చింది.

## విప్లవంలో కార్మికులకు రైతులు మిత్రులు

పై కారణాలవల్ల, కాపిటలిజాన్ని నాశనం జేయుటకై జరిపే విప్లవంలో శ్రామిక వర్గానికి గ్రామాలలో గాఢ మిత్రులు దొరుకుతారు. వ్యవసాయ కూలీ కూడా ఒక కార్మికుడే. పట్టణ కార్మికుడు యంత్రాన్ని నడుపుతూ కాపిటలిస్టుకు దాస్యంజేస్తే, వ్యవసాయకూలీ నాగలిని పుచ్చుకొని, భూస్వామికి దాస్యం జేస్తాడు. ఇందుచే "గ్రామ పేదలు" శ్రామికవర్గానికి గట్టి అండ. ఈ గ్రామ పేదలకు విప్లవంవల్ల పోయేదీలేదు; కాపిటలిజం సాగుతూ వుండటంవల్ల ప్రయోజనమూ లేదు. శ్రామిక వర్గంయొక్క పాలసీగనక సరియైనదైతే "మధ్యతరగతి రైతాంగం" కూడా కలసి రాగలదు. ఈ మధ్యతరగతి రైతాంగం చాలావరకు బలిసి, ప్రభావాన్ని కల్గివుండటం సామాన్యం. కాబట్టి విప్లవంలో వారిని తటస్తులుగా వుంచటం, అంటే శ్రామిక వర్గంయొక్క శత్రుపక్షంలో చేరకుండా చూడటం అత్యంతావసరం. విప్లవం జయంపొందిన పిమ్మట శ్రామికవర్గం మధ్యతరగతి రైతాంగంలో "శాశ్వతంగా కలుస్తుంది". మధ్యతరగతి రైతులు ఒక మానవ జీవితాన్ని గడుపుటకై శ్రామికవర్గం వారిని నడుపుతుంది.

గ్రామ బూర్జువా వర్గమైన భూస్వాములతో ఎడతెగని పోరాటం జరుపుట ద్వారానే శ్రామిక వర్గానికీ, మధ్యతరగతి రైతాంగానికి గాఢమైన ఐక్యత చేకూరగలదు. కాపిటలిస్టు వ్యవస్థలో మధ్యతరగతి రైతుజీవితం అస్థిరమైనది, ఎండమావుల వంటి తన 'స్వంత' భూములను నిలబెట్టుకొనుటకై మధ్యతరగతి రైతులు నానా యాతనలు పడతారు. కాని చివరకి ఏ ఒకరిద్దరో పై మెట్టు యెక్కి భూస్వాములయితే అత్యధిక సంఖ్యాకులు దిగజారి నాశనమౌతారు. శ్రామికవర్గ విప్లవం వీరి గతినుండి తప్పించి, సౌఖ్యప్రదమైన మానవజీవితానికి కొనిపోతుంది.

శ్రామికవర్గ విప్లవం, గ్రామసీమలను, పట్టణాలను ఏకంగా దోచుకొనే కాపిటలిస్టు దోపిడీకిగల మూలాధారములను విచ్ఛేదంచేస్తుంది. బ్యాంకర్ల, భూస్వాముల పారిశ్రామికాధిపతుల దోపిడీకి మూలకందమగు ప్రొప్రయిటరీ హక్కులు నాశనం గావింపబడటంతో, తరతరాలుగా బీద, మధ్యతరగతి రైతులను బంధించివేస్తున్న బంధనాలు విడిపోతాయి. బాంకులకు, వడ్డీవ్యాపారులకు దాస్యం, కవులుదారు నికృష్ట స్థితి నశించిపోతాయి. కాపిటలిజం క్రింద తరచు సంభవించే సంక్షోభాలు, వాటివల్ల వచ్చే వినాశనం అంతం చేయబడుతుంది. రైతాంగం సోషలిస్టు పద్ధతిపై నిర్మింపబడే భారీ వ్యవసాయాన్ని సాగించుటకు సాగిపోతారు. 

# అధ్యాయము 8

# కాపిటలిస్టు వ్యవస్థలోనున్న ఉత్పత్తిక్రమం
# ఆర్థిక సంక్షోభాలు

## ఉత్పత్తి సాధనములు, ఆహారసాధనములు

ఈనాడు అనేక వస్తువులు వివిధరూపాలు, వివిధగుణాలు కలిగినవి తయారు కాబడుచున్నవి. రైల్వేయింజను, బట్టలు, ధాన్యం, ఇండ్లు, బొగ్గు, నాగళ్ళు పంచదార, రబ్బరు, సూదులు ఇటువంటి లక్షోపలక్షల రకాల సరుకులు ఉత్పత్తి అవుచున్నవి. ఇవన్నీ మానవునికి వుపయోగకరమైనవే. అయితే వీటిలో కొన్ని సూటిగాను, కొన్ని పరోక్షంగానూ ఉపయోగపడుతవి. ధాన్యం, పంచదార భోజనానికి కావాలి. బట్టలు కట్టుకొనుటకు కావాలి. ఇండ్లు నివసించటానికి కావాలి. సూదులు బట్టలు కుట్టుకొనుటకు కావాలి. నూనె తలకు రాసుకొనుటకో, వంటలకో కావాలి. ఈ విధంగా సరుకులు వెనువెంటనే, సూటిగా మానవునకు వుపయోగపడితే వాటిని "ఆహార సాధనములు" అని అంటాము నాగళ్ళు భూమిని దున్ని పంటలు పండించుటకు కావాలి. యంత్రాలు సరకుల వుత్పత్తికి కావాలి. ఇవి సూటిగా మానవునకు వుపయోగపడక, మానవునికి సూటిగావుపయోగపడే వస్తువులను ఉత్పత్తిజేయుటకు ఉపకరించుచున్నవి. ఇట్టివాటిని "ఉత్పత్తి సాధనములు" అని అంటాము మొత్తంమీద రెండురకాలూ మానవునికి వుపయోగపడేవే. కాని ఒక గ్రూపు వెంటనే వుపయోగపడతాయి, రెండో గ్రూపు ఈ మొదటి గ్రూపును ఉత్పత్తిచేస్తానికి ఉపయోగపడతాయి. కాని కొన్నివస్తువులు రెండురకాలకూ చెందుతాయి. రాక్షసిబొగ్గు పొయ్యిలోనికి ఉపయోగపడుతుంది; యంత్రములను నడుపుటకూ ఉపయోగపడుతుంది. కాబట్టి ఇది ఉత్పత్తి సాధనంగానూ, ఆహార సాధనంగానూ కూడా వుంటుంది.

కాపిటలిస్టు వ్యవస్థలో ఉత్పత్తిఅంతా కాపిటలిస్టుల చేతులలోనే వున్నది. అతడు ఎందుకు ఉత్పత్తి చేస్తున్నాడు? మనం లోగడనే చూశాము. కేవలం లాభాపేక్షతోడనే అతడు వస్తువులను ఉత్పత్తి జేస్తున్నాడు. మోటారు కార్లను ఉత్పత్తి చేయాలా, అగ్గిపెట్టెలనా, బట్టలను తయారుచేయాలా, శవపేటికలనా, చెప్పులను ఉత్పత్తి గావించాలా, సుగంధద్రవ్యాలనా అనేది అతనికక్కరలేదు. లాభం వస్తుం

దనుకుంటే బట్టల నుత్పత్తి గావిస్తారు: అంతకన్న ఎక్కువలాభం వస్తుందనుకుంటే శవపేటికలనే తయారుచేస్తారు.

## పునరుత్పత్తి అంటే ఏమిటి?

ఏ దేశంలో ఏ వస్తువులను వుత్పత్తి గావించినా అవి ఎల్లప్పుడూ కదులుతూనే వుంటాయి. ఆహారపు వస్తువులు ఉత్పత్తిదారుని నుండి ప్రజలకు జేరుతవి. అక్కడ అవి ఖర్చుపడిపోతవి. ఈ విధంగా ఖర్చుపడటంలో కొన్ని కొంతకాలాన్ని తీసుకుంటవి. కొన్ని వెనువెంటనే ఖర్చుపడిపోతవి. రొట్టెలు వెంటనే ఖర్చయిపోగలవు. కాని బట్టలు, పుస్తకాలు వగైరా కొంతకాలం మనగలవు. ఉత్పత్తి సాధనాలు కూడా ఇదేవిధంగా. రాక్షసిబొగ్గు, చమురు వెంటనే ఖర్చయిపోతవి. యంత్రసామగ్రి చాలా ఏండ్లు వుండగలదు.

ఏది ఎట్లుజరిగినా, ఒకటిమాత్రం నిజం. సమాజం జీవించి వుండాలంటే ఏ వస్తువులైనా ఒకసారి ఉత్పత్తిగావటం చాలదు. ఇవి "పదే పదే, తిరిగి, తిరిగి" ఉత్పత్తి అవుతూ వుండాలి.

చొక్కాలు చిరిగిపోయినవి. తిరిగి కొత్తవి కుట్టించాలి. రొట్టెలు అయిపోయినవి, తిరిగి రొట్టెలను తయారుచేయాలి. రాక్షసిబొగ్గు కాలిపోయింది. తిరిగి గనులను తవ్వి పైకి తీయాలి. ఇంజన్లు అరిగిపోయినవి, కొత్త ఇంజన్లను తయారు చేయాలి. ఈ విధంగా కొత్త వస్తువులను సృష్టించటంలో మానవుడు ఎప్పుడూ శ్రమపడుతూ వుండవలసినదే.

వివిధ వస్తు సంచయమూ సృష్టించబడుతూ వున్నా, వీటి యన్నింటిలో "సమానమైనగుణం ఒకటి" వున్నది. అనేకరకాల సరుకులు ఉత్పత్తి అవుచున్నవి. ఉపయోగింపబడుచున్నవి: ఖర్చు పడిపోతున్నవి: తిరిగి ఉత్పత్తిగావింపబడుచున్నవి. దీనినే వస్తువుల "పునరుత్పత్తి" అని అంటాము.

"సమాజంలో ఏ ఉత్పత్తి విధానం వున్నా వుత్పత్తి తిరిగి తిరిగి జరుగుతూ వుండవలసిందే. సమాజం ఏవిధంగా ఆహారాన్ని తినకుండా మనలేదో అదే విధంగా ఉత్పత్తి గావించకుండా వుండలేదు. ఈ విధంగా సమాజ ఉత్పత్తి ఎడతెగని పునరుత్పత్తి" *

## సాధారణ పునరుత్పత్తి, విస్తృత పునరుత్పత్తి

ఒకానొక సమాజంలో ఏడాదికి కావలసిన వస్తువులన్నీ ఉత్పత్తియై, ఆ ఏడాదిలోనే ఖర్చు అయిపోవచ్చును. తిరిగి మరుసటి సంవత్సరంకూడా అదే వస్తువులు అదేవిధంగా ఉత్పత్తి గావింపబడి ఖర్చు కాగలవు. ఈఉత్పత్తి విధానాన్ని

---

* "కాపిటల్" నుండి.

'సాధారణ పునరుత్పత్తి' (Simple reproduction) అంటాము. కాని కాపిటలిజంతో పాటు ఉత్పత్తి అతివేగంగా అభివృద్ధి యౌతుంది. ప్రతి ఏడాది, ఆ ఏడాదికి కావలసిన సరుకుల మొత్తంకన్న ఎక్కువ ఉత్పత్తి అవుతూ వుంటుంది. దానిని 'విస్తృత పునరుత్పత్తి' అని అంటాము. పూర్వపు సమాజంలో ఎదుగుబొదుగులేని ఉత్పత్తి క్రమంలో ప్రచండమైన మార్పును కాపిటలిజం తెస్తుంది. కాబట్టి కాపిటలిజంయొక్క ఒక లక్షణం "విస్తృత పునరుత్పత్తి."

ఏలాటి సమాజ వ్యవస్థ ఉన్నా, పునరుత్పత్తి జరుగుతూనే వుంటుంది. కాని వివిధ సమాజ వ్యవస్థలలో పునరుత్పత్తి వివిధ రీతులలో వుంటుంది. సోషలిజంలో పునరుత్పత్తి జరిగే రీతి వేరు; కాపిటలిజంలో పునరుత్పత్తి జరిగేరీతి వేరు. ఉత్పత్తి కాపిటలిస్టు పద్ధతిలో జరుగుతే, పునరుత్పత్తికూడా కాపిటలిస్టు పద్ధతిలోనే జరుగుతుంది, అని మార్క్సు "కాపిటల్" లో వ్రాశాడు.

పునరుత్పత్తి క్రమంలో కేవలం వస్తువులు తిరిగి తిరిగి వుత్పత్తి కావటమే లేదు. సామాజిక వుత్పత్తి సంబంధాలుకూడా, మనుషుల మధ్య యేర్పడే ఉత్పత్తి సంబంధాలు గూడా పునరుత్పత్తి అవుతూ వుంటాయి. వాస్తవంగా చూస్తే, కాపిటలిస్టు పునరుత్పత్తి క్రమంలో ధాన్యం, బట్టలు, చెప్పులు, యంత్రాలు, గడియారాలు మున్నగునవేనా తిరిగి తిరిగి వుత్పత్తి అయ్యేవి? అవేకాదు. ఈ వుత్పత్తికి సంబంధించిన కాపిటలిస్టు వుత్పత్తి సంబంధాలుకూడా తిరిగితిరిగి ఏర్పడుతూనే వుంటాయి. ఏడాదికేడాది కార్మికుడు యంత్రాలలో నలిగిపోతూనే వుంటాడు; ఏడాదికేడాది ఫాక్టరీలు కాపిటలిస్టుల చేతులలోనే వరుసగా వుంటూ వుంటాయి. ఏడాదికేడాది అదనపు విలువ సృష్టించబడుతూనే వుంటుంది. కాబట్టి రొట్టెలు, మాంసము రాక్షసిబొగ్గు, యంత్రాలు గడియారాలు మున్నగునవే కాదు; పునరుత్పత్తి అయ్యేది; వాటి "ఉత్పత్తి"లో ఏర్పడే సంబంధాలుకూడా తిరిగి తిరిగి ఏర్పడుతూ వుంటాయి. అంటే కాపిటలిస్టులు, కార్మికుల మధ్యనుండే సంబంధాలు పునరుత్పత్తి అవుతాయి. ఇదే విధంగా కాపిటలిస్టులలోని వివిధ సెక్షన్ల మధ్య సంబంధంకూడా పునరుత్పత్తి అవుతాయి.

కాపిటలిస్టు వుత్పత్తి సంబంధాలు పునరుత్పత్తి కావడమంటే "కాపిటలిజంలో వుండే అంతర్విభేదాలకూడా పునరుత్పత్తి యౌతున్నవన్నమాట. కాపిటలిస్టు వ్యవస్థలో సరుకుల విస్తృత పునరుత్పత్తి జరుగుచున్నదంటే, వివిధరకాల సరుకులు ప్రతిఏడాది వుత్పత్తి అవుచున్నవని మాత్రమేకాదు. కాపిటలిజంలో విస్తృత పునరుత్పత్తి అంటే యంత్రాలు, పరిశ్రమలు, గనులు వగైరా వృద్ధియౌతున్నవన్నమాట. "కార్మికులను దోచుకోవటం మరింత విస్తారమౌచున్నదన్నమాట." కార్మికులను దోచుకోవటంపై ఆధారపడ్డ కాపిటలిస్టు ఆర్థికవిధానం విస్తరించుచున్నదన్నమాట; ఒక్కొక్క క్షేత్రానికే కాపిటలిజం వ్యాపించుచున్నదన్నమాట; ఒక్కొక్క పరిశ్రమయే కాపిటలిస్టు ఆర్థిక వ్యవస్థలోనికి యీడ్వబడుచున్నదన్న

మాట. ఈ విధంగా కాపిటలిజంలో పునరుత్పత్తి విస్తరించినదంటే, కాపిటలిజంలో సర్వదావుండే అంతర్విభేదాలు మరింత తీవ్రమై విస్తరించినవన్నమాట: ఈ విధంగా “కాపిటలిజం' అభివృద్ధి” దాని నాశనాన్ని కూడా తెస్తుంది; కాపిటలిజం తప్పనిసరిగా నశించి, నూతన సమాజస్థాపనకు సోషలిజం స్థాపనకు దారితీస్తుంది.

## కాపిటలిస్టు వ్యవస్థలో ధనసంచయము

ఎక్కువ బట్టలను వుత్పత్తి చేయాలంటే ఎక్కువ మిల్లులను స్థాపించాలి: ఎక్కువ రాక్షసిబొగ్గు వుత్పత్తి గావించాలంటే ఎక్కువ గనులను తవ్వాలి. ఎక్కువ ఫౌంటెన్ పెన్నులను వుత్పత్తిచేయాలంటే ఎక్కువ ఫాక్టరీలను పెట్టాలి ఈవిధంగా వుత్పత్తిని ఎక్కువ జేయాలంటే వున్న ఫాక్టరీలనైనా పెంచాలి. లేదా కొత్త వాటినైనా స్థాపించాలి ఇది కాపిటలిస్టు వ్యవస్థలో ఎట్లా జరుగుతుంది?

కాపిటలిస్టు దేశాలలో వుత్పత్తి సాధనాలన్నీ కాపిటలిస్టులవి. కాపిటలిస్టు లకు ఎట్లా ధనసంచయం చేకూరిందో, ఈధనాన్ని కూడబెట్టటానికి దోపిడీ, మోసం, దౌర్జన్యం ఎట్లా వుపయోగింపబడినవో లోగడ చూశాము. ఈ విధంగా ఒకపర్యాయం స్వంత ఆస్తిని సంపాదించిన పిమ్మట దానిని పెంచటానికీ, విస్తరింపజేయటానికీ, కాపిటలిస్టులు చూస్తారు.

కాపిటలిస్టులు అదనపు విలువను గుంజుతారు. ఇది కార్మికుల శ్రమఫలిత మని లోగడచూశాము ఈ అదనపు విలువతో అనగా లాభంతో కాపిటలిస్టు తనయిష్టం వచ్చినట్లుచేస్తాడు. ఇందుకు అటంకాలేమీలేవు. ఒకనికి ఒకఏడాది రు 1,00,000 లు లాభం వచ్చిందనుకొందాము. అతడు తిండిపోతుఅయితే తిండికే దానినంతటినీ ఖర్చు పెట్టవచ్చు. త్రాగుబోతు అయితే త్రాగుడుకే, వ్యభిచారి అయితే జారత్వమునకే ఖర్చుపెట్టవచ్చు. ఈ విధంగా దుబారాచేసే కాపిటలిస్టు ప్రభువులు లేకపోలేదు. కాని ఇదిమాత్రం అరుదుగా జరిగేదే.

తప్పనిసరిగా ఫలానా విధంగా చేయాలి అనే శాసనం ఏమీలేకపోయినా, సర్వసాధారణంగా కాపిటలిస్టులు తమలాభాలను మరల తమ పరిశ్రమలోనే పెట్టుబడి పెట్టుతారు. ఈ విధంగా అసలు మొత్తానికి అదనపు విలువను జేర్చటాన్ని “కాపిట లిస్టు ధనసంచయం” అని అంటాము.

కాపిటలిస్టుకు రు 1,00,000 లు లాభం వచ్చినది. ఇందులో ఏ 60, 80 వేల రూపాయలో మరల పరిశ్రమలోనే పెట్టుబడి పెడతాడు కొత్తయంత్రా లను కొనుటకో, ఫ్యాక్టరీ భవనాలు వగయిరాలను పెంచుటకో ఈ ఖర్చు జేస్తాడు. ఇందుకు రెండు కారణాలు వున్నవి. ఒకటి ఎక్కువలాభం సంపాదించాలనే కోర్కె: రెండు పోటీ భయం. కాపిటలిజంలోవున్న ప్రధాన లక్షణం ఇదే. దాని లాభాల దాహానికి అంతేలేదు. ఎంత పెట్టుబడి పెట్టనీయుండి, ఎంత లాభం రానీయండి:

ఇంకా ఎక్కువ పెట్టుబడిపెట్టి, ఇంకా ఎక్కువ లాభం తీయాలనే కాపిటలిస్టు చూస్తూ వుంటాడు. ఎక్కువ లాభం సంపాదిస్తానికి ఒకటే మార్గం. ఎక్కువ అదనపు విలువను కార్మికులనుండి పిండాలి. ఇందుకై ఎక్కువ పెట్టుబడిని పెట్టాలి. ఇందుకై లాభంలో కొంతభాగాన్ని కాపిటల్‌కు జేస్తూ వుంటాడు. తన పోటీదారులయిన కాపిటలిస్టులు వుత్పత్తి నెక్కువ గావిస్తూవుంటే, మన కాపిటలిస్టు భోజనప్రియుడై వూరికే గడ్డు మిటకరిస్తూ కూర్చుంటాడా? లేదు. వారిని మించాలనే ఆశతో, వారికన్నా ఎక్కువ లాభాలను సంపాదించాలనే ఆకాంక్షతో ఎక్కువ పెట్టుబడిని గుప్పుతాడు. ఇందుకై ఫ్యాక్టరీలను పెంచుతాడు. టెక్నికల్ అభివృద్ధిని గావిస్తాడు. మంచి సరుకును చవుకగా వుత్పత్తి గావిస్తాడు. ఈ విధంగా పోటీలో తాను నాశనం గాకుండా వుండాలంటే, తన లాభంలో కొంతభాగాన్ని తిరిగి వ్యాపారంలో పెట్టుబడి పెట్టాలి.

ఈ విధంగా తిరిగి పరిశ్రమలలోనే లాభాలను, పెట్టుబడి పెట్టాలనే నియమం లేకపోయినా కాపిటలిస్టులు సర్వసామాన్యంగా తమ లాభాలను తిరిగి పరిశ్రమలలోనో, వ్యాపారంలోనో పెట్టుబడి పెడుతూనే వుంటారు. కార్మికులు వుత్పత్తిగావించే అదనపువిలువ ఈ విధంగా విస్తృత పునరుత్పత్తికి మూలాధారంగా వుంటుంది.

## కాపిటల్ సమీకరణ, కేంద్రీకరణ

తన లాభాలలో కొంతభాగాన్ని కూడబెట్టటం ద్వారా పారిశ్రామికాధిపతి మరింత ఎక్కువ కాపిటల్‌కు అధిపతి యౌతాడు. లోగడ అతని పరిశ్రమ రు. 10,00,000/-లు విలువజేసిందనుకుందాము. దానిపై ప్రతిఏటా రు. 70,000/-లు లాభం వచ్చిందనుకొందాము ఇందులో ఏటేటా రు. 50000/-ల చొప్పున కూడబెట్టి కాపిటల్‌కు జేరుస్తుంటే ఒక్క పదిసంవత్సరాలలో అతని కాపిటల్ మొత్తం రు. 15,00,000/-లు అవుతుంది. ఈ విధంగా ఎక్కువ అదనపు విలువను జేర్చటం ద్వారా కాపిటల్ పెరుగుటను "కాపిటల్ సమీకరణ" అని అంటాము. (Concentration of capital)

ఒక్కొక్క కాపిటలిస్టుయొక్క ధనం పెరగటానికి మరోమార్గమున్నది. కాపిటలిస్టుల మధ్య పోటీలో బక్క కాపిటలిస్టులను పెద్దకాపిటలిస్టు లెట్లా మ్రింగేస్తారో, పెద్ద పరిశ్రమలు చిన్నపరిశ్రమలనెట్లా నాశనంజేస్తాయో చూశాము. ఈ దివాళా తీసిన కాపిటలిస్టుయొక్క పరిశ్రమను కొనటం ద్వారానో, బాకీక్రింద కట్టుకోవటం ద్వారానో పెద్ద కాపిటలిస్టు సంపాదిస్తాడు. కాపిటలిస్టులమధ్య వుండే ఎడతెగనిపోటీలో ఈ విధంగా అనేకమందికాపిటల్ కలిసిపోయి ఒకటిగా అవుతుంది. ఒక్కొక్కప్పుడు ఈ విధంగా కాపిటల్ కూడటం శాంతియుతంగానే జరుగుతుంది. స్టాక్ కంపెనీలను, కార్పొరేషనులను స్థాపించటంద్వారా అనేక కాపిటలిస్టు సంస్థలను ఒకే

పెద్ద సంస్థగా నిర్మించవచ్చును. ఈ విధంగా కాపిటల్ పోగుపడటాన్ని "కాపిటల్ కేంద్రీకరణ" అని అంటాము.

కాపిటల్ ఈవిధంగా సమీకరింపబడటంవల్ల, కేంద్రీకరింపబడటంవల్ల పెద్ద పెద్ద కోటీశ్వరుల చేతులలో అగణితమగు ధనరాసులు పేరుకుని పోతాయి, లక్ష కొలది ప్రజల మాన ప్రాణాలన్నీ ఈ కోటీశ్వరుల అరచేతులలో వుంటాయి. కాపిటల్‌యొక్క సమీకరణ, కేంద్రీకరణంవల్ల వర్గవిభేదాలు మరీ తీవ్రమవుతాయి. ఒకవయిపున వేళ్ళమీద లెక్కించదగిన కోటీశ్వరులు, మరొకవయిపు శవాకృతులగు అసంఖ్యాక శ్రామిక ప్రజలు వుంటారు.

అశేష ధన సంపదలను కొలదిమంది చేతులలో చేకూర్చుటంద్వారా, కాపిటల్ సమీకరణ, కేంద్రీకరణ బ్రహ్మాండమగు పారిశ్రామిక సంస్థలను నెలకొల్పుటకు వీలును కలుగజేయుచున్నది. స్వల్ప పరిశ్రమలకన్న భారీ పరిశ్రమలు లాభదాయకమని మనం లోగడనే చూశాము. కాబట్టి అసంఖ్యాకమగు కార్మిక ప్రజలను నియోగించే బ్రహ్మాండమగు పారిశ్రామిక సంస్థలు వెల్లి విరుస్తాయి. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఈ పరిణామం ఎట్లా జరిగిందో 30 ఏండ్ల లెక్కలను బట్టి చూడవచ్చును.

| (ఒక్కొక్క పరిశ్రమకు సగటు లెక్క) | 1889 | 1899 | 1909 | 1919 |
|---|---|---|---|---|
| కార్మికులు | 8.1 | 13.8 | 24.1 | 33.0 |
| కాపిటల్ (వేల డాలర్లలో) | 6.7 | 19.0 | 68.7 | 154.0 |
| ఉత్పత్తి ,, | 13.4 | 28.1 | 77.2 | 216.9 |

విప్లవానికి పూర్వపు రష్యాలో ఈ అభివృద్ధి మరింత వేగంతో జరిగింది పరిశ్రమల పై జామాట్టి కార్మికుల సంఖ్య ఈ విధంగా పెరిగింది.

| పారిశ్రామిక సంస్థ | 1895 | 1915 |
|---|---|---|
| 500 కార్మికులపైన నియోగించేవి | 45.2% | 61.2% |
| 50–500 మధ్య కార్మికుల నియోగించేవి | 38.9% | 30.6% |
| 10–50 మధ్య కార్మికుల నుపయోగించేవి | 15.9% | 8.2% |

(10 మందికి తక్కువ కార్మికుల నుపయోగించే సంస్థలను లెక్కలోనికి తీసుకోలేదు.)

ఒక్కొక్క పరిశ్రమలో సగటున 1895 లో 98.5 కార్మికులను నియోగిస్తే 1915 లో 173.4 కార్మికులు నియోగించబడినారు.

1901 నుండి 1910 వరకూ 10 ఏండ్ల కాలంలోనూ పరిశ్రమల కేంద్రీకరణ రష్యాలో ఎంత ఎక్కువగా జరిగినదో ఈ పట్టీవల్ల తెలియగలదు.

| పారిశ్రామిక సంస్థలు | పరిశ్రమల సంఖ్య వేలలో | | కార్మికుల సంఖ్య వేలలో | |
|---|---|---|---|---|
| | 1901 | 1910 | 1901 | 1910 |
| 50 కార్మికుల వరకు నియోగించేవి | 12740 | 9909 | 244 | 220 |
| 51-100 కార్మికులవరకు నియోగించేవి | 2428 | 2201 | 171 | 159 |
| 101-500 కార్మికులవరకు నియోగించేవి | 2288 | 2213 | 492 | 508 |
| 501-1000 కార్మికుల వరకు నియోగించేవి | 403 | 433 | 269 | 303 |
| 1000 పైన కార్మికుల నియోగించేవి | 243 | 324 | 526 | 713 |
| మొత్తం | 18102 | 15080 | 1702 | 1903 |

"ప్రావ్దా" పత్రికలో ఈ పట్టీని వుదహరిస్తూ లెనిన్ తన వ్యాసంలో యీ క్రింది విధంగా వ్రాశాడు.

"ప్రతికాపిటలిస్టు దేశంలోనూ కన్పించేదృశ్యమే ఇవి. చిన్న పారిశ్రామిక సంస్థల సంఖ్య "తగ్గుతుంది." పెటీ బూర్జువా ప్రజలు: చిన్న పారిశ్రామిక వేత్తలు నాశనమౌతారు. వారు గుమాస్తాలుగానో, కూలీలుగానో తయారౌతారు పెద్ద పారిశ్రామిక సంస్థల సంఖ్య పెరిగి, మొత్తము పరిశ్రమంలో వీని మొత్తం దామాషాన పెరుగుతుంది. 1901 నుండి 1910 లోగా ఒక్కొక్కటి 1000 మంది కార్మికులకు పైగా ఉపయోగించే పారిశ్రామిక సంస్థలు దాదాపు 1½ రెట్లు పెరిగినవి. వాస్తవానికి 243 సంస్థలు 324 అయినవి. 1901 లో ఈ సంస్థలలో 5,26,000 కార్మికులుంటే 7,00,000 లకు పైగా ఈ సంఖ్య 1910 నాటికి పెరిగింది. పెద్దఫాక్టరీలు చిన్నవాటిని అణచివేసి ఉత్పత్తిని కేంద్రీకరించుతవి. కొలది పారిశ్రామిక సంస్థలలో అసంఖ్యాక కార్మిక జన సామాన్యం కేంద్రీకరింపబడుతుంది. వీరు ఉత్పత్తిజేసే లాభం కూడా కొలదిమంది కోటీశ్వరులగు కాపిటలిస్టుల చేతులలో కేంద్రీకరింపబడుతుంది.

## కాపిటలిస్టు ధనపంచయము యొక్క చారిత్రిక గతి పరిణామము

కాపిటలిజం అభివృద్ధిజెందినకొలదీ శ్రమ సామాజికమౌతుంది. వివిధ పారిశ్రామిక సంస్థల మధ్య రాష్ట్రాలమధ్య, మొత్తందేశాల మధ్యనే సంబంధాలుఎక్కువ కాగలవు. ఇది వరకు విడివిడిగా, దేనికదే ప్రత్యేకంగా ఉండే పరిశ్రమలు ఇపుడు ఒకదానితో ఒకటి సంబంధంకల్గి పెనవేసుకొని ఒకే కుటుంబము యొక్క విభాగాలుగా తయారౌతాయి. వివిధ వ్యక్తుల పని సమైక్యతపొందింది. వారిమధ్య అదృశ్యములగు

ఖండంముల నేర్పరచుతుంది. కాని ఉత్పత్తి ఈ విధంగా సామాజిక మొనర్చబడినా, కాపిటలిస్టు సమాజ వ్యవస్థ ఉన్నంతకాలం దాని లాభాలు సమాజం మొత్తానికిగాని కష్టజీవులకుగాని కల్గవు ప్రయోజనమంతా కొలదిమందిగా ఉన్న కాపిటలిస్టులకే పోతుంది. శ్రమ సామాజిక మౌటతోబాటు, శ్రమ విభజన మరింత ఎక్కువౌతుంది. కాపిటలిస్టుల మధ్య పోరాటం, పోటీకూడా వృద్ధియౌతవి. ఉత్పత్తి సాధనాలపై స్వంత అస్థిహక్కులు రద్దుగావింపబడినప్పుడే, ఈ ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం మొత్తం సమాజానికి వున్నప్పుడే బూర్జువావర్గ ప్రయోజనాలను అంతమొందించి, ఉత్పత్తిని సామాజిక పద్ధతులపై నిర్మించినప్పుడే యీ అంతర్విభేదాలు తొలగిపోగలవు.

కాపిటల్ సమీకరణ, కేంద్రీకరణల మూలకంగా పరిశ్రమలు విస్తరించటం వల్ల ఉత్పత్తి సాధనాలను సామాజిక పరమొనర్చుటకు సోషలిస్టు సిద్ధాంతాలపై ఆర్థిక జీవితాన్ని పునర్నిర్మించుటకు "తగు పరిస్థితులు ఏర్పడగలవు." గృహ పరిశ్రమకూ, వేలకొలది కార్మికులు పనిజేసే పారిశ్రామిక సంస్థకూ హస్తిమశకాంతరం చిన్నచిన్న పరిశ్రమలను అసంఖ్యాకములైన వాటిని సమాజపర మొనర్చుటకష్టం. కాని ఉత్పత్తి కొలదిసంఖ్యగల బ్రహ్మాండములగు పారిశ్రామిక సంస్థలలోను, ఫాక్టరీలలోను సాగుచున్నపుడు వాటిని సులభంగా సమాజ పరమొనర్చవచ్చును.

కాపిటలిస్టు ధన సంచయముయొక్క చారిత్రికగతి పరిణామం ఎట్లా వుంటుందో మార్క్స్ ఈ విధంగా చెప్పాడు :

తన శ్రమవల్ల వుత్పత్తిచెయ్యబడ్డ వస్తువులను తన స్వంత ఆస్తిగా పొందే విడివిడి వుత్పత్తిదారులు పోతారు. దీనిబదులు. పేరుకు స్వతంత్రులయిన కార్మికుల శ్రమను దోచుకోవటంపై ఆధారపడిన కాపిటలిస్టు స్వంతఆస్తి వస్తుంది.

"ఈ విధంగా, పాతవ్యవస్థ సకలం పర్యంతమూ శిథిలమైపోయిన పిమ్మట, కార్మికులు కేవలం శ్రమశక్తి నమ్ముకొని జీవించే శ్రామికులుగా మారిన పిమ్మట, ఈ శ్రామికుల శ్రమయే కాపిటల్ రూపాన్ని ధరించిన పిమ్మట. కాపిటలిస్టు వుత్పత్తి విధానం స్వయంగా నిల్చిన పిమ్మట, అప్పుడు శ్రమ మరింత సామాజిక మౌతుంది. భూమి, ఇతరవుత్పత్తి సాధనాలు సామాజికంగా మరింత దోచుకోబడతాయి. అందువల్ల సమిష్టి ఉత్పత్తిసాధనాలుగా మారుతాయి. వ్యక్తిగత ఆస్తిపరులు దోచుకోబడటం నూతనరూపాన్ని ధరిస్తుంది. కార్మికులు దోచుకోబడటం కాదు. కార్మికులను దోచుకొనే దోపిడిగాండ్రే, కాపిటలిస్టులే దోచుకోబడాలి. దోపిడిగాండ్రచే దోచుకోవటం కాపిటలిజమందలి అనివార్య సూత్రాలననుసరించే జరుగుతుంది. ఒక కాపిటలిస్టు చాలామంది ఇతరులను నాశనంజేస్తాడు. ఈ విధంగా కాపిటలిస్టులు దోచుకోబడటం, కాపిటల్ కేంద్రీకృతమవటంవల్ల శ్రమమరింత సహకారరూపాన్ని ధరిస్తుంది సైన్సు తెల్పే టెక్నికల్ అభివృద్ధి వుపయోగం హెచ్చుతుంది. వ్యవసాయం నవీనపద్ధతులలో జరగటం హెచ్చుతుంది. శ్రమసాధనములు సమిష్టి శ్రమసాధనములుగా మాత్రమే వుపయోగపడునట్లు మారుతాయి. సమిష్టియైన, సమాజపరమైన శ్రమద్వారా వుత్పత్తి

సాధనాల నెంకో పొదుపుగా వాడటం: ప్రపంచమంతా ఒకే బజారయి, ఈ వలలో ప్రపంచమందలి ప్రజలందరూ పడటం: ఈవిధంగా కాపిటలిస్టురాజ్యం ప్రపంచమంతా వ్యాపించటం జరుగుతుంది. కోటీశ్వరులసంఖ్య తగ్గుతున్నకొలదీ, ఈ పైజెప్పిన పరిణామం జరుగుతూ వున్నకొలదీ దరిద్రం, ఆకలి, జాడ్యాలు, దాస్యం, దోపిడీ అభివృద్ధియౌతాయి. కాని వీటితోబాటుగానె, కాపిటలిస్టు వుత్పత్తిక్రమంలోని మెకానిజంవలనే ఐక్యమై, సంఘీభావాన్ని పెంపొందించుకొని, గట్టి శిక్షణను కల్గియుండే కార్మికవర్గసంఖ్య పెరుగుతూవుంటుంది. వీరి పోరాటాలు వృద్ధియౌతూవుంటాయి. ఉత్పత్తి విధానంతో పెనవేసుకుపోయి, దానితోనే పెరుగుతూవుండే కాపిటల్ గుత్తాధికారం ఇకముందు వుత్పత్తిక్రమానికి అవరోధంగా నిలుస్తుంది. ఉత్పత్తిసాధనాల కేంద్రీకరణ శ్రమసామాజికం కావటం ఎంత అభివృద్ధియౌతాయంటే ఇకవీటికి కాపిటలిస్టు సంబంధాలకూ పొత్తుకుదరదు. ఈ సంబంధాలు ప్రేలి, పగిలిపోతాయి. కాపిటలిజందలి వ్యక్తి ఆస్తిహక్కులకు యమమాతల దర్శనం కల్గుతుంది. దోచుకునేవారే దోచుకోబడతారు." •

## పునరుత్పత్తి, సరుకుల విక్రయం

కాపిటలిస్టు సరుకులనుత్పత్తి గావించాలంటే మొట్టమొదటగా ముడి సరుకులు, చమురు వగైరా ఉత్పత్తి సాధనాలను కొనాలనీ, కార్మికుల శ్రమశక్తిని కొనాలనీ చూశాము. వీటితో కాపిటలిస్టు ఏడాదిలో కొన్ని సరుకులను ఉత్పత్తి గావించటం పూర్తి అయింది. చెప్పులు తయారై వేర్‌హౌసులలో పడివున్నవి. అయితే ఉత్పత్తిక్రమాన్ని తిరిగి సాగించుటకు, చెప్పుల పునరుత్పత్తికి ఇంకా ఏమి అవసరం? అనేది చూడాలి.

మొదట్లో కొన్ని ముడి సరుకులు వగైరా ఖర్చు అయిపోయినవి. కాబట్టి కాపిటలిస్టు "కొత్త" ముడిసరుకులను కొనాలి. కార్మికులను తిరిగి మరొక సంవత్సరం పనికి పెట్టుకోవాలి. ఇందుకై అతనికి డబ్బుకావాలి. అతడు అప్పుచేయవచ్చును. కాని తిరిగి చెల్లించాలి గదా? కాబట్టి అతనికి కావలసిన డబ్బు సరుకులను "విక్రయించుటద్వారా" (దీనినే సరుకులను సొమ్ముచేసుకోవటం అంటారు) సంపాదిస్తాడు. ఈ విధంగా సరుకుల నమ్ముకోవటం ద్వారా ధనాన్ని సంపాదించి, దానితో తిరిగి వుత్పత్తికి పూనుకుంటాడు. కాబట్టి "పునరుత్పత్తికి సరుకులను సొమ్ముచేసుకోవటం" అత్యవసరం. పునరుత్పత్తి క్రమంలో మూడుదశలను చూస్తున్నాము. (1) వుత్పత్తి సాధనాలను, శ్రమశక్తిని కొనటం (2) వుత్పత్తిని గావించటం (3) తయారయిన సరుకులను విక్రయించటం: ఈ మూడు దశలలోనూ కాపిటలిస్టుకు లాభం. అనగా అదనపు విలువ సృష్టింపబడటం రెండవ దశలోనే జరుగుతున్నది. ఇదే మనకు సూటిగా కన్పించే వుత్పత్తి. దీనినే మనం "వుత్పత్తి క్రమం అంటున్నాము. మొదటి,

• 'కాపిటల్' నుండి.

చివరి రెండు దశలను "చలామణీ క్రమం" అంటున్నాము. అంటే మొదటిదశలో డబ్బు సరుకుగా మారుతున్నది: మూడవదశలో డబ్బుగా మారుతున్నది. ఈ డబ్బు కాపిటలిస్టు తింటానికి కాదు: దీనిని తిరిగి మార్చి సరుకులను వుత్పత్తిగావిస్తావికే. ఈ విధంగా కాపిటల్ నిరంతరంగా పరిభ్రమిస్తూవుంటుంది.

కాపిటలిస్టు ప్రపంచములో ఒక్కడుగాక, వేలు, లక్షల కాపిటలిస్టులు వున్నారు. వీరిలో ప్రతిఒక్కడూ తన స్వార్థాన్నే, తన లాభాన్నే చూసుకుంటాడు. ఈ విధంగా ఒకరితో ఒకరు ఘర్షణపడుతూ, కలుస్తూ, విడిపోతూ వుంటారు. కాని వీరందరూ వుపయోగించేది కాపిటల్. కాబట్టి మొత్తం కాపిటల్ సామాజికరూపాన్ని ధరిస్తున్నది. విడివిడిగా వుండే కాపిటల్ సామాజికంగానే కలుస్తూవుండటం వల్లనే అనగా కాపిటలిస్టులు ఒకరితో ఒకరు కలుస్తూ, విడిపోతూ వుండటంవల్లనే, వుత్పత్తి పునరుత్పత్తి క్రమాలు సాగుతున్నవి. పునరుత్పత్తి సాగాలంటే, ఒక్క కాపిటలిస్టే కాదు: "మొత్తం కాపిటలిస్టులందరూ తమ మొత్తం సరుకులు అమ్ముకోవాలి".

"శాస్త్రీయంగా మార్క్సు సిద్ధాంతానికి వున్న ప్రాధాన్యత ఏమిటంటే పునరుత్పత్తి క్రమంయొక్క, సమాజంతో మొత్తం కాపిటల్‌యొక్క చలామణీ క్రమం యొక్క లోతుపాతులను వెల్లడిచేయడమే" అని లెనిన్ వ్రాశాడు.

కాపిటలిస్టు విధానంలోని ఈ పునరుత్పత్తి క్రమంలో "తీరని అంతర్విభేదాలు" ఉన్నవని మనం చూస్తాము. కాపిటలిస్టు వ్యవస్థలో సరకుల మొత్తంఉత్పత్తి గావాలంటేను, వాటిని సొమ్ము చేసుకోవాలంటేను "ఎన్నో విషమపరిస్థితులు ఉన్నవని కన్పిస్తుంది. కాని ఈ విధంగా సరుకులను సొమ్ముచేసుకోవటానికి, కాపిటలిజం అభివృద్ధికి మధ్య వైరుధ్యం వున్నదనీ, ఇందువల్ల తరచు సంక్షోభములూ, ఒడుదుడుకు పరిస్థితులూ కల్గుతాయని కూడా మనం చూస్తాము.

## సాధారణ పునరుత్పత్తి, విస్తృత పునరుత్పత్తి క్రమాలలో సరుకులను సొమ్ముజేసుకొనే పరిస్థితు లెట్లా వుంటాయి?

కాపిటలిస్టు పునరుత్పత్తిలో సరుకులు సొమ్ముజేసుకోబడటం ఎట్లా జరుగుతుందో, ఏయే చిక్కులు వస్తాయో మనం మరికాస్త వివరంగా చూడాలి. కాపిటలిస్టు దేశంలో, ఉత్పత్తి అయ్యే మొత్తం సరుకుల విలువ ఈ మూడు భాగాలను కలిగి వుంటుంది. (1) స్థిరమైన కాపిటల్ (2) అస్థిరమైన కాపిటల్ (3) అదనపు విలువ. ఇదేవిధంగా మొత్తం పరిశ్రమలన్నీ రెండు పెద్ద గ్రూపులు క్రింద ఉంటాయి. అవి (1) ఉత్పత్తి సాధనాలను (యంత్రాలు, ముడిసరుకులు, బొగ్గు వగైరా) ఉత్పత్తి గావించే పరిశ్రమలు (2) ఆహార వస్తువులను ఉత్పత్తిగావించే పరిశ్రమలు.

"సరుకులను సొమ్ము చేసుకోవాలంటే, బజారులో ఒకసరుకు విలువతో సరితూగు మరొక సరుకు (స్థిరమైన కాపిటల్. అస్థిరమైన కాపిటల్. అదనపు

విలువ పరిమాణమునవి) ఉండాలి. వాటి భౌతిక రూపానికి పరిసమాపమగు విలువగల వస్తువులు (ఉత్పత్తి సాధనాలు, ఆహార వస్తువులు అందులోనూ ముఖ్యంగా జీవితావసర వస్తువులు విలాసవస్తువులు) ఉండాలి" *

మనం ఒక ఉదాహరణను చూద్దాము- కాపిటలిస్టు ప్రపంచంలో కాపిటలిస్టు సూత్రాల ప్రకారమే ఉత్పత్తి అంతా జరుగుతుందను కొందాము. (నిజానికి ఇది వాస్తవం కాదు: బాగా అభివృద్ధి అయిన కాపిటలిస్టు దేశాలలో కూడా చేతివృత్తులు, చిన్నరైతుల స్వంత వ్యవసాయం ఉంటూనే వుంటుంది. కాని సౌలభ్యంకొరకై కాపిటలిస్టు ఉత్పత్తివిధానం ప్రకారం ఉత్పత్తి జరుగుతుందను కొందాము) సాధారణ పునరుత్పత్తిక్రమంలో పరిస్థితులీవిధంగా ఉంటాయి. మొదటిగ్రూపు పరిశ్రమలో (ఉత్పత్తి సాధనాల నుత్పత్తిజేసే పరిశ్రమలలో) ఉత్పత్తికాబడే సరుకులు మొత్తం రెండు గ్రూపులూ ఉపయోగించే వస్తువులకు సమానం అవుతాయి. ఉదాహరణకు. రెండు రకాల పరిశ్రమలలోనూ 2 కోట్ల టన్నుల బొగ్గు ఖర్చు అయింది. అంటే మొదటి గ్రూపు పరిశ్రమలలో 2 కోట్ల టన్నులబొగ్గు ఉత్పత్తి కావాలన్నమాట; అదేవిధంగా 1 లక్ష మరకదుళ్ళు ఖర్చు అయినవంటే, అవన్నీ కొత్తగా మొదటి గ్రూపు పరిశ్రమలలో ఉత్పత్తి అయినవన్నమాట. ఇక రెండో గ్రూపు పరిశ్రమలు (ఆహార వస్తువులుత్పత్తి గావించే పరిశ్రమలు) మొత్తం రెండు గ్రూపులలోని కాపిటలిస్టులు, కార్మికులు ఉపయోగించే వస్తువులెన్నో అన్నింటినీ ఈ గ్రూపుపరిశ్రమలు ఉత్పత్తి గావించాలి కాబట్టి ఈ సరుకుల మొత్తం విలువ కాపిటలిస్టుల, కార్మికుల మొత్తం ఆదాయానికి సరిపోవాలి. ఇక్కడ మనం చూసే సమాజంలో కాపిటలిస్టులూ, కార్మికులూ తప్ప, మరెవరూ లేరు. కాబట్టి వీరి ఆదాయాలబట్టే వీరు సరుకులను కొనగల్గుతారు. కార్మికులు వారికివచ్చే జీతములనుబట్టి. కాపిటలిస్టులు వారికివచ్చే అదనపు విలువను (లాభాన్ని)బట్టి మాత్రమే సరుకులను కొనగల్గుతారు.

ఏడాదిలో కొన్నిసరుకులు వుత్పత్తి అయినవి. అవి సొమ్ముజేసుకోబడటంలో ఆ సరుకుల వివిధభాగాలు, అనగా స్థిరమైన కాపిటల్ అస్థిరమైన కాపిటల్, అదనపువిలువ ఏవిధంగా ఎవరెవరికి పోతుంది అనేది చూడాలి. మొదటి గ్రూపు వుత్పత్తిగావించుటకై వెచ్చించిన కాపిటల్‌లో స్థిరమైన పెట్టుబడి, ఆ గ్రూపులోనే యంత్రములు మున్నగు వుత్పత్తి సాధనముల రూపంలో వుండి పోతుంది. ఇక మిగిలిన అస్థిరమైన కాపిటల్ (జీతాలు) అదనపువిలువ (లాభం) ఆ గ్రూపులోనే వుండిపోదు ఆహారవస్తువులను కొనుటకై వినియోగించబడి రెండవ గ్రూపును జేరుతుంది. ఇక రెండవ గ్రూపును చూద్దాము. దీని యొక్క స్థిరమైన పెట్టుబడి ఉత్పత్తి సాధనాలను కొనుటకై వెచ్చింపబడుచున్నది; కాబట్టి మొదటి గ్రూపును జేరు

* "నరోద్నిక్ ఆర్థిక శాస్త్రవేత్తలు సిద్ధాంతాలలో చేసినతప్పులు" అన్న లెనిన్ గ్రంథం నుండి.

చున్నది: అస్థిరమైన కాపిటల్, అదనపువిలువ ఆహారవస్తువుల రూపంలో వుంటాయి కాబట్టి వాటిని సొమ్ముచేసుకోవటంద్వారా వచ్చేధనం ఆగ్రూపులోనే వుండిపోతుంది. కాబట్టి ఈ మార్పిడిలో ఏమి కన్పిస్తున్నది? మొదటగ్రూపుయొక్క వుత్పత్తి సాధనాలు, రెండవగ్రూపుయొక్క జీతాలు, అదనపు విలువ పరస్పరం మారుచున్నవి. మొదటిగ్రూపు వుత్పత్తిసాధనాలనిచ్చి, రెండవగ్రూపునుండి ఆహారవస్తువులను కొంటున్నది. రెండవగ్రూపు ఆహారవస్తువులనిచ్చి మొదటి గ్రూపునుండి ఉత్పత్తి సాధనాలను కొంటున్నది. ఉత్పత్తిసాధనాల రూపంలో వుండేది స్థిరమైన కాపిటల్. జీతాలు, లాభాల రూపంలో వుండేది అస్థిరమైన కాపిటల్. అదనపువిలువ. కాబట్టి మొదటిగ్రూపుయొక్క అస్థిరమైన కాపిటల్, అదనపువిలువ కలిసి రెండవ గ్రూపు యొక్క స్థిరమైన కాపిటల్‌కు సమానమన్నమాట

మార్క్స్ దీనినే ఒక ఫార్ములాలో చూపించాడు. మొదటి గ్రూపుకు గుర్తు I: రెండవ గ్రూపుకుగుర్తు II: స్థిరమైన పెట్టుబడికి గుర్తు స్థి: అస్థిరమైన కాపిటల్‌కు గుర్తు అస్థి: అదనపువిలువ గుర్తు అ: కాబట్టి సామాన్య పునరుత్పత్తి ఫార్ములా ఈ విధంగా వుంటుంది. I (అస్థి + అ) = II స్థి.

విస్తృత పునరుత్పత్తి క్రమంలో సొమ్ముచేసుకొనటం ఎట్లా వుంటుందో చూద్దాము. సామాన్య పునరుత్పత్తి కాపిటలిస్టు విధానంలో వుండనేవుండదు. మనం కేవలం ఉదాహరణకే దానిని చూశాము. కాపిటలిజం ఎల్లప్పుడూ విస్తృత పునరుత్పత్తి క్రమంలోనే, అనగా ఎల్లప్పుడూ వుత్పత్తి తిరిగి తిరిగి హెచ్చుమొత్తంలో జరుగుతూనే వుంటుంది. ఇటువంటి సందర్భంలో సొమ్ముచేసుకొనటం, అనగా సరుకులు అమ్ముకోబడటం ఏ పరిస్థితులలో జరుగుతుందో చూడాలి.

విస్తృత పునరుత్పత్తి అనగానే కొంత సొమ్మును కూడబెట్టక లేదని తెలుస్తున్నది. ఉన్న ఫాక్టరీలు పరికరాలను పెంచనైనా పెంచాలి. లేదా కొత్తవాటిని నిర్మించాలి. ఏ విధంగానైనా కావలసింది, వుత్పత్తి సాధనాలను పెంచాలి. కాని ఇవి వాటియంతట అవే ఊడిపడవు. మొదటిగ్రూపు. అనగా వుత్పత్తిసాధనాల వుత్పత్తి జేసే పరిశ్రమలు. ప్రతి ఏడాది కొన్ని వుత్పత్తిసాధనాలను అదనంగా సృష్టిస్తూ వుండాలి ఈ విధంగానే ఇందలి పరిశ్రమలు విస్తరించుతూ వుండగలవు. అంటే రెండవ గ్రూపుయొక్క స్థిరమైన కాపిటల్‌కన్న మొదటిగ్రూపు అస్థిరమైన కాపిటల్ అదనపు విలువల మొత్తం "ఎక్కువ వుండాలి" అన్నమాట. అంటే రెండవగ్రూపు తనకు కావలసిన యంత్రములు పరికరాలకు ఖర్చుపెట్టే స్థిరమైన కాపిటల్ కన్న మొదటి గ్రూపుకో కొంత లాభాలు, జీతాలు కలిసిన మొత్తం ఎక్కువ వుండాలి. అప్పుడే మొదటి గ్రూపులో కొంత ధనం వుత్పత్తిసాధనాల రూపంలో మిగిలి, పరిశ్రమలను పెంచడానికి వినియోగపడుతుంది. అంటే, ఇంతకుముందు మనం చూపిన ఫార్ములా మారుతుంది. ఇప్పుడు I (అస్థి + అ) II స్థి కన్న ఎక్కువ అన్నమాట.

కాపిటలిజంలో అస్థిరమైన కాపిటల్‌కన్న, అనగా కార్మికుల కిచ్చే జీతాం కన్న స్థిరమైన కాపిటల్ అనగా యంత్రములు, ముడిసరుకులు వగైరాల క్రింద వుండే కాపిటల్ ఎక్కువ త్వరగా పెరుగుతూ వుంటుందని మనం చూశాము. పని జేసే కార్మికులకున్న యంత్రాభివృద్ధి వేగంగా జరుగుతుంది: ఎక్కువ అవుతుంది. ఈ విస్తృత పునరుత్పత్తి క్రమంలో రెండవ గ్రూపు యంత్రసామాగ్రిపై పెట్టే స్థిరమైన కాపిటల్‌కన్న మొదటి గ్రూపు యొక్క అస్థిరమైన పెట్టుబడి అనగా కార్మికుల కిచ్చే జీతాలు, లాభాలు కలిసి ఎక్కువ త్వరగా వృద్ధిజెందుతాయి అంటే రెండవ గ్రూపు వుపయోగించే యంత్రసామాగ్రి వగైరాకన్న మొదటి గ్రూపు వుత్పత్తి గావించే యంత్రసామాగ్రి అధికమౌతూ వుంటుంది. అంటే రెండో గ్రూపు స్థిరమైన కాపిటల్ ఎంత పెరుగుతూవుందో అంతకన్న వేగంగా మొదటి గ్రూపు స్థిరమైన పెరుగుతూ వుంటుంది. దీని ప్రకారం కాపిటలిస్టు వ్యవస్థలో ఆహారవస్తువుల వుత్పత్తి గావించే భాగంకన్నా వుత్పత్తి సాధనాల వుత్పత్తి గావించే భాగం ఎక్కువవేగంగా అభివృద్ధి జెందుతూ వుంటుంది.

కాపిటలిజంలో కార్మికులకిచ్చే జీతాల రూపంలోవుండే అస్థిరమైన కాపిటల్‌కన్న యంత్రాల రూపంలోవుండే స్థిరమైన కాపిటల్ ఎక్కువ వేగంతో వృద్ధి బొందుతున్నది. టెక్నిక్ అభివృద్ధి జరుగుతూవుంటుంది. యంత్రముల సంఖ్య పెరిగి, వాటి శక్తి పెరిగి, అదే సమయంలో కార్మికుల సంఖ్య తగ్గుతుంది. ఈ విధంగా యంత్రముల సంఖ్య వృద్ధిగావించాలంటే ఉత్పత్తి సాధనాలను వుత్పత్తి గావించే పరిశ్రమలలో ఎక్కువ యంత్రములు వుత్పత్తి గావాలి. అంటే రెండవ గ్రూపు పరిశ్రమలలో యంత్రములపై పెట్టే కాపిటల్‌కన్న, మొదటి గ్రూపు పరిశ్రమలలో కార్మికులకిచ్చే జీతాలు, అదనపువిలువ క్రిందవుండే కాపిటల్ (రెండవ గ్రూపు స్థిరమైన కాపిటల్‌కన్న మొదటి గ్రూపు అస్థిరమైన కాపిటల్, అదనపు విలువలు) హెచ్చువేగంతో వృద్ధియౌతాయి. రెండో గ్రూపు పరిశ్రమలలోవుండే స్థిరమైన కాపిటల్ కన్న మొదటి గ్రూపు స్థిరమైన కాపిటల్ ఎంతో ఎక్కువ వుండాలి. కాబట్టి ఆహార వస్తువుల వుత్పత్తిజేసే పరిశ్రమలకన్న వుత్పత్తిసాధనాలను వుత్పత్తిగావించే పరిశ్రమలు ఎక్కువ వేగంతో వృద్ధి చెందుతాయి.

ఇట్టి విస్తృత పునరుత్పత్తి క్రమంలో సరకులు ఏ విధంగా అమ్మబడి, సొమ్ముజేసుకోబడునో మరింత వివరంగా చూద్దాము. సామాన్య పునరుత్పత్తిలో అయితే, అదనపువిలువ నంతటినీ వృద్ధిగావించేందుకై అదనపు విలువలో కొంత భాగాన్ని కాపిటలిస్టు కూడబెట్టి, నూతన యంత్రాలను కొంటున్నాడు. అప్పుడు కాపిటలిస్టుకు వచ్చే అదనపు విలువ రెండు భాగాలు అవుతుంది. (1) ఖర్చు పడే భాగం (2) కూడబెట్టబడే భాగం. ఈ కూడబెట్టిన అదనపు విలువను మూలధనానికి చేరుస్తాడు. అంకెలలో చూద్దాము: బట్టల మిల్లులో రు. 10 లక్షలు మూలధనంతో ప్రారంభమైంది ఏడాది కాగానే ఉత్పత్తిపై రు. 1,25 000 లు లాభం వచ్చింది.

ఇందులో రు. 25 000 లను ఖర్చుచేసి రు 1,00,000 లను పరిశ్రమను అభివృద్ధి చేయుటకై తిరిగి మూలధనమునకు చేరుస్తున్నారు. ఈ మూలధనం కూడా రెండు భాగాలుగా వుంది. రు. 8 లక్షలు యంత్రములు వగైరా రూపంలో స్థిరమైన కాపిటల్ గాను. రు, 2 లక్షలు కార్మికులకిచ్చే జీతాలరూపంలో అస్థిరమైన కాపిటల్‌గాను వున్నది. కూడబెట్టిన అదనపు విలువ రు. 1,00,000 లలోనూ రు. 90,000 లు స్థిరమైన కాపిటల్‌కు చేర్చబడింది. అనగా కొత్త యంత్రాల్ని కొనుటకూ, ఎక్కువ ముడిసరుకులు కొనుటకూ పెట్టుబడి పెట్టబడింది. మిగిలిన రు. 10,000 లు అదనంగా పెట్టిన కార్మికులకు జీతాలిచ్చుటకు ఖర్చుఅయింది. అంటే అస్థిరమైన కాపిటల్‌కు చేర్చబడింది. కాబట్టి రెండవయేడు ప్రారంభమగునాటికి మూలధనం రు. 11,00,000లు అయింది. ఇందులో రు. 8 90,000 లు స్థిరమైన కాపిటల్, రు. 2,10,000 లు అస్థిరమైన కాపిటల్‌గాను వుంది.

మనం దీనినే అంకగణితం రూపంలో చూద్దాము: మొత్తం అదనపు విలువకు 'అ' అనిగుర్తు: అందులో కాపిటలిస్టు స్వంతానికి ఖర్చుచేసుకొనేదానికి 'ఖ' అనిగుర్తు: మూలధనానికి చేర్చినదానికి 'ధ' అని గుర్తు. ఈ మూలధనానికి చేర్చినదానిలో, అనగా 'ధ' లో కొంతభాగం మూలధనంలోని స్థిరమైన కాపిటల్‌కు చేర్చబడుతూ వున్నది. అనగా రు. 1,00,000 లోనూ రు. 90,000 'ధ'. ఈ రు. 90 000 స్థిరమైన కాపిటల్ భాగమగు రు. 8 00,000 లకు చేర్చబడుతోంది. కాబట్టి 'ధ-స్థి' = . 8,90,000 లు. ఇక మిగిలిన రు. 10,000 అస్థిరమైన కాపిటల్‌కు, అనగా రు. 2,00,000 లకు చేర్చబడుతోంది. కాబట్టి 'ధ-అస్థి = రు. 2,10,000.

బట్టలమిల్లుకు కావలసిన యంత్రముల ఉత్పత్తిగావించే పరిశ్రమకూడా వుండాలి. దీనిని మూలపరిశ్రమ అంటాము. ఈ రెండింటిమధ్య మారకం ఎట్లా జరుగుతుందో, రెండు గ్రూపుల పరిశ్రమలు తమ సరుకుల నెట్లా సొమ్ముజేసుకుంటాయో చూద్దాము.

బట్టలమిల్లులో 10 లక్షల రూపాయల మూలధనంవుంది. దానిలో 8 లక్షలు స్థిరమైన కాపిటల్. 2 లక్షలు అస్థిరమైన కాపిటలు. ఇంనుపై 2 లక్షలు అదనపు విలువవచ్చింది. ఈ రెండులక్షలలోనూ రు. 50,000 లను కాపిటలిస్టు తన స్వంత ఖర్చులకై వుపయోగిస్తున్నాడు. ఇంకా రు. 1,50,000 లు మిగిలినవి. ఇందులో రు. 1,00 000 లను పెట్టి యంత్రములను కొంటున్నాడు. కొత్త యంత్రములో పని చేయుటకు హెచ్చుగా కార్మికులను పెట్టుకొన్నాడు. గనుక వారికి జీతాలిచ్చుటకై మిగిలిన రు. 50000/-లను వినియోగించుచున్నాడు. కాబట్టి తాను ఖర్చుపెట్టుకొనే రు. 50000/-లు, కార్మికులకిచ్చే రు. 50000/-లు మొత్తం రు. 1,00 000 లూ, మూలధనంలోని అస్థిరమైనకాపిటల్ రు. 2,00,000 లూ మొత్తం రు. 3 00 000 లూ ఈ గ్రూపు పరిశ్రమలోనే వుండిపోతాయి. ఇంకా మొదటిగ్రూపు పరిశ్రమ అనగా మూలపరిశ్రమను చూద్దాము. ఈ పరిశ్రమల బట్టల మిల్లుకు రు. 9,00,000 ల

యంత్రములను అమ్ముచున్నది. అంతే, యీ గ్రూపులోని కాపిటలిస్టులు, కార్మికుల కిచ్చే జీతాలు (అస్థిరమైన కాపిటల్) తమ స్వంతానికి వాడుకునే ధనం, పరిశ్రమను వృద్ధిచేయటం మూలకంగా అదనంగా నియమించిన కార్మికులకు జీతాలుగా తన లాభంనుండి ఇచ్చినభాగం కలిపి రు. 9,00,000 లను యంత్రరూపంలో రెండవ గ్రూపుకిచ్చి, ఆ గ్రూపునుండి బట్టలు వగైరా తీసుకుంటున్నారన్నమాట ఈ గ్రూపు పరిశ్రమలో కూడా స్థిరమైన కాపిటల్, అస్థిరమైన కాపిటల్ అదనపు విలువలోని ఖర్చుచేసేభాగం (కాపిటలిస్టు స్వంతానికి వాడుకునేభాగం), మూలధనానికి (స్థిరమైన కాపిటల్‌కు) జేర్చేభాగం, అదనపు కార్మికులకు జీతాలక్రింద (అస్థిరమైన కాపిటల్‌కు) జేర్చేభాగం వుంటాయి, ఇందులో స్థిరమైన కాపిటల్, అదనపు విలువలో స్థిరమైన కాపిటల్‌కు జేర్చేభాగం ఈ గ్రూపులోనే వుండిపోతుంది. ఇవి మూల పరిశ్రమ యంత్రముల రూపంలో వుంటాయి. ఇక కార్మికులకు జీతాల రూపంలోవున్న ధనం. అదనపు కార్మికులకు జీతాల రూపంలో యివ్వబడ్డ ధనం, కాపిటలిస్టులు స్వంతానికి వాడుకున్న ధనం అంతా ఆహార వస్తువులను కొనటక్కై వెచ్చింపబడు చున్నది. కాబట్టి ఇది రెండవ గ్రూపుకు జేరుతున్నది. అంటే యంత్రముల, రూపంలో మొదటి గ్రూపు రెండవ గ్రూపుకు: ఆహారవస్తువుల రూపంలో రెండవ గ్రూపు మొదటి గ్రూపుకు సరుకులను అందజేస్తున్నవి. కాబట్టి విస్తారిత పునరుత్పత్తి క్రమంలో సరుకులు సొమ్ముచేసుకోబడటం ఈ క్రిందివిధంగా వుండాలి:

1. (అస్థి + జీ + ధ–స్థి)  2. (స్థి + ధ–స్థి)

ఈ రెండు గ్రూపుల సరుకులు పైరూపంలో వున్నప్పుడే అవగా సరి సమానంగా వున్నప్పుడే పరస్పరం మారగలవని తెలియగలదు.

## కాపిటలిస్టు పునరుత్పత్తిలో వుండే వైరుధ్యాలు

కాపిటలిస్టు వ్యవస్థలో సామాన్య పునరుత్పత్తి క్రమంలో గానీయండి, విస్తారిత పునరుత్పత్తి క్రమంలో గానీయండి, సరకులు సొమ్ముజేసి కొనటానికి ఎటువంటి పరిస్థితులుండాలో మార్క్సు సిద్ధాంతాలు స్పష్టం జేస్తున్నవి. ఈ పరిస్థితులు వుండాలి అంటే వాస్తవంగా వున్నవనికాదు. కాపిటలిస్టు వ్యవస్థలో ఆద్యంతమూ "వక్రములు, మార్పులు" వుంటూనే వుంటాయి. పరిశ్రమలలో వివిధ భాగముల మధ్య వుండవలసిన పరస్పర సంబంధాలు "తల్లక్రిందులౌతూ వుండట." మూలమునవే సరుకులు సొమ్ముజేసుకోబడటం సవ్యంగా జరగక, అనేక అవాంతరములు ఏర్పడుతూ వుంటాయి.

కాబట్టి కాపిటలిజంలో వున్న పరస్పర వైరుధ్యాల నన్నిటినీ కాపిటలిస్టు పునరుత్పత్తి క్రమం బహిరంగం జేస్తుంది. కాపిటలిజంలో వుండే "ప్రప్రధాన పరస్పర వైరుధ్యం" - వుత్పత్తి సామాజిక స్వభావం కల్గియుండటమూ, ఫలితాన్ని

కాపిటలిజము స్వంతానికి స్వాహా జేయడమూ - బైటపడుతుంది. కాపిటలిస్టు వుత్పత్తి క్రమంవల్ల వేకొలదీ కార్మికులు ఐక్యమౌతారు. ప్రతి పరిశ్రమయొక్క, పరిశ్రమ భాగ యొక్క వుత్పత్తి సమాజ సంతటికీ అత్యవసర మౌతుంది. ఈ పరిశ్రమలతో సామాజికాభివృద్ధి అంతా ద్యోతకమౌతూ వుంటుంది. టెక్నికల్ అభివృద్ధి అంతా వినియోగించుకో బడుతుంది. వేలు లక్షల కార్మికులు ఏకమై, సమిష్టిగా భారీయెత్తున వుత్పత్తిగావిస్తూ వుంటారు. కాని వీటియన్నిటి ఫలితాన్ని, అధిక లాభాపేక్ష గల కొలదిమంది కాపిటలిస్టులు హరిస్తూ వుంటారు.

కాపిటలిజం వృద్ధియైనకొలదీ "బూర్జువా వర్గానికీ, శ్రామికవర్గానికీ మధ్య వైరుధ్యం" మరింత పెరుగుతుంది. పునరుత్పత్తి, ధన సంచయము జరిగినకొలదీ ఒకప్రక్క అమిత ధనరాసులు, కొంతమంది కాపిటలిస్టుల చేతులలో కేంద్రీకరింపబడి వుంటాయి: మరోప్రక్క శ్రామికవర్గంలో అత్యధిక ప్రజాసామాన్యం యొక్క దారిద్ర్యం, ఆకలి, పీడన అభివృద్ధియౌతుంది. దీనిని అంతమొందించాలనీ, అందుకై తాము తీవ్రంగా పోరాడాలనీ వీరి సంకల్పం మరింత దృఢమౌతుంది.

కాపిటలిజంలో వుండే ప్రప్రధాన వైరుధ్యం - ఉత్పత్తి సామాజిక స్వభావాన్ని కల్గివుండటం. ఉత్పత్తి ఫలితం కొంతమంది చేతులలోకి పోవటం వల్ల కాపిటలిస్టు "ఉత్పత్తి విధానంలో వుండే అరాజకం" స్పష్టంగా గోచరిస్తుంది. కాపిటలిజానికి ప్రత్యేక లక్షణమైన ఈ అరాజక సామాజికోత్పత్తిని గూర్చి ఎంగెల్సు ఈ క్రింది విధంగా వ్రాశాడు.

"....సరుకుల ఉత్పత్తి విధానంపై ఆధారపడిన ప్రతి సమాజం యొక్క ప్రత్యేక లక్షణం ఏమిటంటే, ఉత్పత్తిదారులు వారి స్వంత సామాజిక సంబంధాలపై కంట్రోలు లేకుండా పోతున్నారు. ప్రతి వుత్పత్తిదారుడు తన దగ్గరవున్న వుత్పత్తి సాధనాలతో, సరుకుల మారకముద్వారా తన అవసరాలను సంతృప్తి పర్చుకొందామనే వుద్దేశంతో, సరుకుల నుత్పత్తి గావిస్తున్నాడు. తాను ఉత్పత్తిగావించే సరుకు బజారులో అమ్ముడు అవుతుందో, లేదో, దానికి డిమాండు వున్నదో లేదో ఎవరికీ తెలియదు. తన సరుకు ఎవరికైనా నిజంగా అవసరం వుందో లేదో, తన వుత్పత్తి ఖర్చులయినా గిట్టుబాటు అవుతాయో లేదో, అసలు తన సరుకు అమ్ముడు అవుతుందో లేదోకూడా ఎవరికీ తెలియదు. సామాజికోత్పత్తిలో అరాజకం ప్రబలియుంటుంది. కాని ఇతర వుత్పత్తి విధానాలకువలెనే, సరుకుల వుత్పత్తి విధానానికి కూడా, దానిలోనే అంతర్వ్యాప్తమైయుండి, దానినుండి వేరుజేయరానట్టి, కొన్నిసూత్రాలు వున్నవి. ఈ సూత్రాలు వుత్పత్తితో అరాజకం వున్నా, అరాజకంలోనే, అరాజకం ద్వారా కూడా బైటపడుతూ వుంటాయి. వుత్పత్తి సామాజికంగా జరగటంద్వారానే ఈ సూత్రాలు బైటపడుతాయి. సరుకుల మారకం ద్వారా ఇవి నిలచి వుంటాయి. ఈవిధంగా విడివిడిగా వుండే ఉత్పత్తిదార్లను

అనివార్యమగు వ్యాపార పోటీద్వారా సామాజిక జీవితంలోనికి తెచ్చుచున్నవి. కాబట్టి మొట్టమొదటలో ఈ సూత్రాలు వుత్పత్తిదార్లకుకూడా కన్పించవు, కాని క్రమంగా, అనుభవంద్వారా ఇవి వ్యక్తమౌతాయి. ఉత్పత్తిదార్లు విడివిడిగా వుత్పత్తి గావిస్తూ, స్వంతంగానే అమ్ముకొని లాభాలు సంపాదించజూస్తారు. కాని వారిఇష్టాలకు వ్యతిరేకంగానే ఈ సూత్రాలు వుత్పత్తి సంబంధాలను సహజంగానే సామాజికమొనర్చుతాయి. కాని కాపిటలిస్టు వుత్పత్తి విధానం కబట్టి గుడ్డిగా పనిజేస్తాయి, సరుకే వుత్పత్తిదార్లను శాసిస్తుంది." *

కాబట్టి కాపిటలిస్టు విధానంలో సరుకును సొమ్ముగామార్చుకోవటం ఎన్ని చిక్కులతో కూడుకొన్నదో చూశాము. కాని ఈ చిక్కులన్నీ వున్నవని ఎవరు చూస్తారు? ఒకప్లాను, క్రమంలేని కాపిటలిస్టు వుత్పత్తి విధానంలో సరుకులు సొమ్ముజేసుకోబడటం "బజారు యొక్క గుడ్డిపోకడవల్లనే" జరుగుచున్నది. అనేక వక్రమార్గాలు, అనవసర మార్గాలద్వారా, వివిధ పరిశ్రమల సరుకులు ఒకదానితో ఒకటి మారుచూ, సొమ్ముజేసుకోబడుచూ, ఏదోవిధంగా ఖర్చు అవుచున్నవి.

"పరిశ్రమలు మితం లేకుండా పెరగటమనే స్వభావం" కాపిటలిజంలో స్వతహాగా వున్నవి. లాభాలు సంపాదించాలనే వుద్దేశ్యంతో ప్రతి కాపిటలిస్టూ అంతకంతకూ ఎక్కువమొత్తం సరుకులను బజారులోకి పంపుతాడు. కాని వాటిని ఎవరికో ఒకరికి అమ్మాలి. కాని "అత్యధిక సంఖ్యాకమగు ప్రజానీకము యొక్క కొనుగోలు శక్తిని" తగ్గించుటద్వారా వీటిఖర్చుకూడా తగ్గుతూవుండే స్వభావం కాపిటలిజంలో వున్నది. ఉత్పత్తిసాధనాలను అంతకంతకూ హెచ్చుగా వుత్పత్తిగావించుటద్వారా కొంతవరకూ పరిశ్రమ పెరుగుతూ వుండవచ్చును. కాని ఈ వుత్పత్తి సాధనాలవల్ల వుత్పత్తియైన సరుకులు మాత్రం అంతకంతకూ పెరిగి అమ్ముడుకాకుండా నిల్చిపోతాయి. ఈ విధంగా కాపిటలిస్టు వుత్పత్తిక్రమంలో "ఉత్పత్తికి, ఖర్చుకాబడుటకూ మధ్య పెద్ద వైరుధ్యం ఏర్పడుతుంది" ఉత్పత్తి సామాజికంగా జరగటం. ఫలితం వ్యక్తులలాభంగా పోవటం అనే కాపిటలిజంలోని ప్రప్రధాన వైరుధ్యంయొక్క రూపాలలో ఉత్పత్తికి, ఖర్చుకాబడుటకూ మధ్యవుండే వైరుధ్యం ఒకటి.

అయితే కాపిటలిజంలో ఇన్ని వైరుధ్యాలు వున్నాయంటే, కాపిటలిజం విలువలేదని అనుకోవటం పొరపాటు. ప్రస్తుతం కాపిటలిజం దాని చరమావస్థలో, దానిపతనకాలానికి సమీపంలోవుంది. అయినా, ఒకనొకప్పుడు సమాజంలోని వుత్పత్తి శక్తుల వత్యదికం చేయటంద్వారా, ఇంతకన్న అభివృద్ధికరమైన సోషలిస్టు సమాజ వ్యవస్థకు బాటనేర్పర్చింది. కాపిటలిజం పరస్పర వైరుధ్యాల ద్వారానే వృద్ధియౌతూ వుంటుంది. కాని ఇందలి పరస్పర వైరుధ్యాలను మాత్రమేచూసి, ఈవ్యవస్థపరిత్రలో

* "డుహ్రింగు సిద్ధాంత ఖండనము" అనే గ్రంథంనుండి.

ఒక క్షణభంగురమైనదశయేనవీ, మరొక అభివృద్ధికరమైన, పున్నతమైన సామాజిక వ్యవస్థకు ఒక మజిలీమాత్రమేననీ గుర్తించకపోయినట్లయితే పొరపాటు అవుతుంది.

కాపిటలిస్టు పునరుత్పత్తినిగూర్చి వెల్లడిచేసిన మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతం బూర్జువా అర్థికశాస్త్రవేత్తలందరి తప్పుడు సిద్ధాంతాలను చిత్తుచేసింది. కాపిటలిస్టు అనుయాయులు, ఏ ఒడుదుడుకులూ లేకుండా, సంక్షోభమూ దుస్థితిలేకుండా కాపిటలిజం రాజబాటను నడుస్తూవుంటుందని చెప్పుతారు. ఇది సర్వ అబద్ధమని మార్క్సిజం రుజువు జేసింది. మరికొంతమంది, కాపిటలిస్టు పునరుత్పత్తిలో ఎన్నో పరస్పర వైరుధ్యాలు వున్నవిబట్టి కాపిటలిజం అభివృద్ధి కావేకాలేదని సిద్ధాంతాలు సృష్టించారు. కాపిటలిజం బాల్యదశలో, దాని అభివృద్ధినిజూచి "ఇది అసాధ్యం: ఇది వృద్ధికాదు" అన్న పెద్దలువీరు. కాని ఇదికూడా ఎట్లు తప్పుసిద్ధాంతాలో మార్క్సిజం రుజువు చేసింది. కాని 'కాపిటలిజం వృద్ధికావటం అసాధ్యం' అన్న బుద్ధిమంతుల వారసులు కాపిటలిజం. అందలి అంతర్గతమైన పరస్పర వైరుధ్యాల సంఘర్షణ ఫలితంగా ఎట్లాగో నశిస్తుంది. దానికొరకై శ్రామికవర్గం ఏమీపోరాడ నక్కరలేదు, అనే ద్రోహచింతన గలసిద్ధాంతాలకు వచ్చారు.

కాపిటలిస్టు పుత్పత్తి విధానంయొక్క మూలసూత్రాలేమిటో, కాపిటలిస్టు వ్యవస్థలో పునరుత్పత్తి ఎట్లాజరుగుతుందో మార్క్సుస్పష్టంజేశాడు. కాని మార్క్సు విమర్శకులు కొందరు ఈ సూత్రాలను ఖండించారు. దీనిలో రోజాలగ్జెంబర్గుకూడా వున్నది. వారి వాదన ఇది : సంఘంలో సామాన్య ఉత్పత్తి క్రమాన్ని నాశనం జేసే వరకే కాపిటలిస్టు పునరుత్పత్తి క్రమం సాగుతుంది. : అటుపిమ్మట యీ పునరుత్పత్తి వల్ల జనించే పరస్పర వైరుధ్యాల ఘర్షణ ఫలితంగా కాపిటలిజం దానంతట అదే నాశనమౌతుంది : కాబట్టి కాపిటలిజాన్ని కూలద్రోయుటకై మనం ఏమీ పోరాడ నక్కరలేదు. కాని ఇటువంటి వాదన విప్లవ శంఖారావమగు మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతాలకు పూర్తిగా వ్యతిరేకం. కాపిటలిజం స్వఛ్చందంగా, దానంతట అదే మరణించటం ఎన్నడూ సంభవించదు. శ్రామికవర్గంయొక్క అఖండ త్యాగంవల్లనే విప్లవ పోరాట ఫలితంగానే, కాపిటలిజం, దోపిడీ, దాస్యం నశించగలవు.

అమెరికాలో గనుల కార్మికుల జీవితం ఎట్లా వుంటుందో ఒక పుస్తకంలోవున్న ఈ క్రింది సంభాషణ తెలియజెప్పింది :

## అమితోత్పత్తివల్ల కాపిటలిస్టు ఆర్థిక సంక్షోభం

ఒక బొగ్గుగనుల కార్మికుని కుమారుడు తనతల్లి నిట్లా ప్రశ్నించాడు : "అమ్మా నాకు చలివేస్తోందే : మంట వేయవూ ?"

"నాయనా, బొగ్గులు లేవురా"

"అమ్మా. బొగ్గులెందుకు లేవే ?"

"మీ నాన్నకు పనిపోయింది. బొగ్గులు కొందామంటే డబ్బులేదు బాబూ",

"నాన్నకు పని ఎందుకు పోయిందే అమ్మా?"

"బొగ్గు ఎక్కువగా వుందిరా బాబూ."*

కాపిటలిస్టు ఆర్థిక సంక్షోభంలో ఎటువంటి విపరీతములు సంభవిస్తాయో ఈ పై సంభాషణ చక్కగా తెలియజేస్తున్నది. బొగ్గు ఎక్కువగా భూగర్భంనుండి తీయబడింది కాబట్టి బొగ్గుగని కార్మికుని కుటుంబం మంటలేక చలిలో బిగుసుకుపోతుంది; గోధుమ చాలా ఎక్కువగా పండినది, కాబట్టి అది రైలు యింజనులో బొగ్గుక్రింద కాల్చబడుతోంది. అందుకే లక్షలకొలది ప్రజల పొట్టలు మాడుతున్నాయి. చాలా ఎక్కువ ఇండ్లు కట్టబడినవి. అందుచే అవి ఖాళీగా వుంటున్నవి.

కాని నిజానికి, అవసరం లేనంత ఎక్కువగా రాక్షసిబొగ్గు, రొట్టెలు, బట్టలు, ఇండ్లు మున్నగునవి ఉత్పత్తి అవుతున్నవా? లేదు. సంక్షోభ సమయాలలో ప్రజలకు ఎన్నో వస్తువులు కావలసి వుంటాయి. కాని కాపిటలిస్టు ప్రపంచంలో ప్రజల కెన్ని కోర్కెలు వున్నా, వారిచేతులలో డబ్బువుంటేనే కోర్కెలు తీరేది. డబ్బువుంటే కొండమీద కోతైనా దిగివస్తుంది. అది లేకపోతే, ఎవరూ ఖాతరు చేయరు. కాబట్టి సంక్షోభ దినాలలో బొగ్గు, ఇండ్లు, బట్టలు, రొట్టెలు వగైరాలకు అవుసరం చాలా వున్నా, ఈ కోర్కెల వెనుక ధనబలం లేకపోవుటచే, ప్రజలు యమయాతనలకు గురికావలసివస్తుంది. ఈ విధంగా ఒకమూల వస్తురాసులు, మరోమూల ఆ వస్తువులు కావలసినవారు కటిక దరిద్రంలో, లేమిలో వుంటూ వుండటం జరుగుతూంది. సంక్షోభకాలంలో ఈ విపరీతం మరింత తీవ్రమవుతుంది.

కాపిటలిజంలో ఆర్థికసంక్షోభం రావటం అమితోత్పత్తి వల్లనే వస్తుంది. ఒకమూల అత్యధికంగా సరుకులు వుత్పత్తి అవుతాయి. ఇంకోమూల ఈ వస్తువులను ఉపయోగించవలసిన వారు విపరీతంగా దోచుకోబడుటవల్ల వీనిని కొనే శక్తి లేనివారౌతారు. అందుచే ఈ సరుకులు అమ్ముడుకావు.

## కాపిటలిస్టు వ్యవస్థలో ఆర్థిక సంక్షోభములు ఎందుకు తప్పనిసరిగా వస్తున్నవి?

సరుకుల వుత్పత్తి క్రమంలో విడివిడిగా వుండే వుత్పత్తిదార్లందరూ కలుస్తున్నారు. బజారు గుడ్డినడకయొక్క ప్రభావం ప్రతికాపిటలిస్టుపైన పడుతోంది; ఇటువంటి పరిస్థితులలో ఏమి వుత్పత్తి అయింది? ఏమి బజారులో అవసరమున్నది? అనేవాటిమధ్య వైరుధ్యం ఏర్పడక తప్పదు. ఈ విధంగా సరుకుల వుత్పత్తి విధానంలోనే ఆర్థిక సంక్షోభాన్ని తెచ్చిపెట్టే పరిస్థితులు, పునరుత్పత్తి అంతా తారుమారు కావటానికి, తలక్రిందు కావడానికి కావలసిన పరిస్థితులు వున్నవి.

* "కార్మికులు-రాక్షసిబొగ్గు" అన్న రాషెస్టర్ గ్రంథంనుండి.

సరుకుల సామాన్య వుత్పత్తి విధానంలోకూడా ఆర్థిక సంక్షోభాలు రావచ్చును: కాని రాకుండాచేసుకొనే మార్గాలు కూడా వున్నవి. కాపిటలిజంలోని ఆర్థిక సంక్షోభాలు సంభవించటం "అనివార్యం". కాపిటలిజంలో పరస్పర వైరుధ్యాలు కారణంగానే అదపా, దడపా ఆర్థిక సంక్షోభాలు అధికోత్పత్తివల్ల సంభవిస్తూ వుంటాయి.

కాపిటలిజంలో శ్రమ అంతకంతకూ సామాజికమౌతుంది. ఒక్కొక్క కార్మికుని శ్రమ అంతా వుత్పత్తి క్రమంలో లీనమైపోయి ఒకే ధారా సంతతిగా జరుగుతూ వుంటుంది. ఇదే సమయంలో వేలు, లక్షలు సంఖ్యగల కార్మికులు ఉమ్మడిగా శ్రమపడి ఉత్పత్తి గావించే వస్తువులను పరిశ్రమలన్నింటిపై రాజ్యమేలే కొలదిమంది కాపిటలిస్టులు స్వంతం చేసుకుంటారు.

"ఈ విధంగా ఉత్పత్తి అంతా ఒక సామాజిక ఉత్పత్తి క్రమం ప్రకారం జరుగుతూవుంటుంది. కాని ప్రతిపరిశ్రమ ఒక్కొక్క కాపిటలిస్టుకు చెందివుంటుంది. ఉత్పత్తి అతని ఇష్టానిష్టములపై ఆధారపడి వుంటుంది. సామాజిక శ్రమద్వారా ఉత్పత్తి అయిన వస్తుసంపద సంతటినీ ఈ కాపిటలిస్టు కాజేస్తాడు. కాబట్టి యిటువంటి ఉత్పత్తి విధానం ఆ ఉత్పత్తి ఫలితాన్ని కాజేసే దోపిడి పద్ధతితో తీవ్రంగా ఘర్షణ పడటంలేదా?" అని లెనిన్ ఈ ఆర్థికసంక్షోభానికి మూలకారణాలను వివరిస్తూ వ్రాశాడు.

ఉత్పత్తి యొక్క సామాజిక స్వభావమూ, కొంతమంది వ్యక్తులు ఈ ఉత్పత్తి ఫలితాన్ని కాజేయటమే ఈ రెండింటి మధ్య వైరుధ్యమే కాపిటలిజంలోని ప్రప్రధాన పరస్పర వైరుధ్యము. ఇందువల్లనే తప్పనిసరిగా ఆర్థిక సంక్షోభం వస్తున్నది. సంక్షోభ సమయాలలో ఈ వైరుధ్యమే బాహాటంగా కన్పించేది.

ఈ వైరుధ్యంవల్ల సరుకులు అమ్ముడుపోవడానికి మార్కెటులేకపోయేస్థితి వస్తుంది. బట్టలు, తిండి, ఇళ్ళు మున్నగునవి కావలసినవారు లేకకాదు ఇవి అమ్ముడు కానిది. చాలా ఆవశ్యకరంగానే కావాలి. లక్షలు కోట్లకొలది ప్రజలకు యివికావాలి. కాని కాపిటలిస్టు దోపిడీవల్ల వారిచేతులలో చిల్లి గవ్వయైనా వుండదు. వారి కొను గోలు శక్తి పూర్తిగా పడిపోతుంది. ఇందువల్ల బజారువేగం తగ్గించబడుతుంది. ఫ్యాక్టరీలు, పరిశ్రమలు మూలబడుతాయి. లక్షలకొలది కార్మికులు నిరుద్యోగులౌతారు. గోదాములనిండా సరుకులు నిండవుంటాయి. కాని నిరుద్యోగంవల్ల కొనుగోలుశక్తి మరీ పడిపోవడంవల్ల ఒక్క సరుకుకూడా ఖర్చుకాని పరిస్థితి ఏర్పడుతుంది. కాబట్టి కాపిటలిస్టు ఆర్థిక సంక్షోభంయొక్క ముఖ్య లక్షణమేమిటంటే, కొట్లన్నీ సరుకులతో నిండివుంటాయి. కాని అశేష ప్రజానీకం సరుకులులేక మాడిపోతూ వుంటారు.

1901 ఆర్థిక సంక్షోభంయొక్క వినాశకర పాత్రను వర్ణిస్తూ లెనిన్ ఇట్లా వ్రాశాడు :

"కాపిటలిస్టు ఉత్పత్తి గంతులువేస్తూ మాత్రమే అభివృద్ధి చెందుతుంది. రెండు గంతులు ముందుకువేస్తే ఒకగంతు (ఒక్కొక్కప్పుడు రెండుగంతులుకూడా) వెనక్కువేస్తూ పోతూవుంటుంది. కాపిటలిజంలో సరుకులు ఉత్పత్తి అవుతున్న వంటే అవి అమ్మకానికి, బజారు బేరానికి ఉత్పత్తి కాబడుచున్నవి. ఉత్పత్తి ఒక్కొక్క కాపిటలిస్టుచే విడివిడిగా సాగించబడుతుంది. ఎవరు ఎంత ఉత్పత్తి చేయాలో ఏమి ఉత్పత్తిచేయాలో, దేనికి బజారులో డిమాండు వున్నదో ఏకాపిట లిస్టుకూ తెలియదు. ఉత్పత్తి అంతా గుడ్డిగోజుగా జరుగుతూవుంటుంది. ప్రతివాడి దృష్టి ఒక్కదానిమీదనే ఎక్కువ లాభం తీయాలనే వుంటుంది. ప్రతివాడూ రెండో వానిని మించాలనే చూస్తాడు. కాబట్టి సహజంగా బజారులోవుండే డిమాండుకూ, మీరు ఉత్పత్తిగావించే సరుకుల మొత్తానికి లంగరు అందదు. ఎక్కడైనా, ఏ దేశ మైనా కొత్తగా అమ్మకానికి అనువైనచోటుగా, పెద్దమార్కెటుగా కన్పించిందంటే, సరుకుల అధికోత్పత్తి మరీ విపరీతంగా బజారుడిమాండుకు సంబంధం లేకుండా ఉత్పత్తిగావడం మరీ ఎక్కువగా జరుగుతున్నది.

ప్రతి కాపిటలిస్టూ అధిక లాభాపేక్షంతో అనేకరకాల సరుకులను అతి వేగంతో సృష్టిస్తూ వుంటాడు బజారులో ఏది ఎంత కావాలనడానికి అవకాశంపులేదు, ఏ సరుకు ఉత్పత్తిచేస్తే ఏమి? అన్నీ సరుకులే. అన్నీ అమ్మకోబడేవే లాభం వస్తే సరి. కాబట్టి ప్రతి కాపిటలిస్టు ఉత్పత్తిని అత్యధికం గావిస్తాడు. ఈ విధంగా లాభాపేక్షతో విపరీతవేగంతో సరుకులు ఉత్పత్తిగావింపబడటంతో వివిధ పరిశ్రమల మధ్య ఉండవలసిన బాలెన్సు ఎగిరిపోతుంది.

"బ్రహ్మాండమైన సామాజిక ఉత్పత్తి శక్తులను స్వాధీనం చేసుకొని లాభాపేక్షతో కొలదిమంది ధనస్వాముల గ్యాంగు ఉత్పత్తిని విచ్చలవిడిగా గావిస్తూ వుండటంవల్లనే బ్రహ్మాండమగు ఆర్థిక సంక్షోభములు సంభవించుచున్నవి."

కాపిటలిజంలో ఉత్పత్తి "దానంతటదే" జరుగుతూ వుంటుంది ఒకప్లాను ఒక క్రమములేక ఉత్పత్తి అరాజకంగా జరుగుతూ వుంటుంది. అధిక లాభాపేక్ష వల్ల అమితంగా సరుకుల ఉత్పత్తి జరుగుతూ వుంటుంది. కాని యీ అత్యధి కోత్పత్తి కాపిటలిస్టు సంబంధాలవల్ల ఏర్పడిన అడ్డంకులను ఎదుర్కొంటుంది. కాపిట లిజంవల్ల దోచుకోబడిన ప్రజాసామాన్యం యొక్క కొనుగోలుశక్తి పూర్తిగా వుడిగి వుండటమే ఈ అభేద్యమగు అడ్డంకి

"ఉత్పత్తి అయిన సరుకులు సొమ్ముచేసుకోబడాలంటే, వాటిని కొనే మనిషి ఒకడు కావాలి. ప్రజాసామాన్యమేగదా ఈ సరుకులను కొనేది? ఎక్కువ సరుకులు ఉత్పత్తి అవుతున్నవి కాబట్టి ఎక్కువమంది ప్రజలు వాటిని కొనాలి. కాని కాపిటలిస్టు దేశాలలోని ప్రజానీకంలో $\frac{9}{10}$ వంతులు పరమపేదలు. వీరందరూ పూటకు గతిలేని కార్మికులు; ఇంతకన్న నికృష్ట స్థితిలోవుండే రైతులు. వర్తక వ్యాపారాలు జోరుగా సాగుతూవుండే కాలంలో రకరకాల సరుకులు ఉత్పత్తిస్తుండగా

వుత్పత్తి చేయబడతాయి : కాని అత్యధిక సంఖ్యాకులగు ప్రజాసామాన్యం బీదవారగుటచే ఇవన్నీ అమ్ముడుగావు. యంత్రాలు, ఫ్యాక్టరీలు, గోదాములు, రైల్వేలు మున్నగునవి వృద్ధియౌతూ వుంటాయి. కాని అప్పుడప్పుడూ ఈ వృద్ధిక్రమానికి అంతరాయం కల్గుతూ వుంటుంది. ప్రజలలో ఎక్కువ వస్తువుల నమ్ముకోవాలని వుత్పత్తికై కొత్త కొత్త యంత్రాల అమర్చి వుత్పత్తి అధికం జేస్తారు. కాని ప్రజలు బీదవారగుటచే వాటిని కొనలేరు : అందువల్ల ప్రజల కొరకే ఉద్దేశింపబడ్డ యంత్రసాధనాలు మూలబడవలసి వస్తుంది."

ఈ విధంగా ఉత్పత్తిశక్తుల విపరీతాభివృద్ధి ఒకమూల పెరుగుతూవుంటే కార్మికవర్గపు కొనుగోలుశక్తి క్షీణిస్తూ వుండటాన్ని చూస్తాము. ఉత్పత్తిశక్తులు అంతులేకుండా పెరుగుతూ వుంటాయి. మరింత ఎక్కువలాభం సంపాదించాలనే ఉద్దేశ్యంతో కాపిటలిస్టులు యంత్రాల నెక్కువ జేసాకు పెట్టుబడి నభివృద్ధి జేస్తారు. ఉత్పత్తి శక్తులను బాగా పెంచెదరు. కార్మికులను మరింత ఎక్కువగా దోచుకుంటారు. ఈ విధంగా పరిశ్రమలను వృద్ధిజేస్తానికి బ్యాంకులు ఇచ్చే అరువుగాగా వినియోగ పడుతుంది. కాబట్టి వారిశక్తికిమించినట్లుగా కూడా వారు పరిశ్రమలనువృద్ధిజేస్తారు. కాని పరిశ్రమలో స్థిరమైన కాపిటల్ పెరిగినకొలదీ లాభం రేటు తగ్గుతూవుంటుంది. లాభాల రేటు తగ్గినకొలదీ పరిశ్రమను పెంచటం వస్తువుల నెక్కువ ఉత్పత్తి గావించటం జరుగుతుంది. ఈ విధంగా "అమితంగా పరిశ్రమలను పెంచటానికీ, విపరీతంగా ప్రజాసామాన్యపు కొనుగోలుశక్తి పడిపోవటానికీ" మధ్య వైరుధ్యం తీవ్రమౌతుంది. కాబట్టి మితిమీరిన ఉత్పత్తివల్ల ఆర్థిక సంక్షోభం రావటాన్ని కాపిటలిస్టు వ్యవస్థలోనే చూడగలము.

## ఆర్థిక సంక్షోభం క్రమానుగతంగా వస్తుంది

కాపిటలిజం ఉద్భవించిన నాటినుండి ఆర్థిక సంక్షోభం దాని వెన్నంటియే వున్నది. ఒక నిర్ణీతమైన విరామకాలంలో యీ సంక్షోభం వస్తూవుండటం కాపిటలిజం ఆరంభదినాలనుండే వున్నది, గత 100 సంవత్సరాలలో మూ ప్రతి 8, 10 ఏండ్లకొక పర్యాయం కాపిటలిస్టు ప్రపంచం ఈ ఆర్థిక సంక్షోభంచే ఊపివేయబడటాన్ని చూడగలము.

ఆర్థికసంక్షోభం మొట్టమొదటిసారిగా 1825 లో వచ్చింది : పిమ్మట 1836 1847. 1857 1872 (యూరపులో మాత్రం) 1890 1900, 1907 1921, 1920-33 లలో వచ్చింది. 1825 లో ప్రారంభమై కాపిటలిజం ప్రబలిన ప్రతిదేశాన్ని ఈ ఆర్థిక సంక్షోభం చుట్టుముట్టింది.

ఈ కాలమంతటా, నిర్ణీతమైన విరామకాలంలో ఈ సంక్షోభం వరుసగా రావటాన్ని మనం చూడగలం, అది క్రమానుగతంగా రావటమనేది ఒక ప్రత్యేక లక్షణం. ఒక సంక్షోభానికి, మరొకసంక్షోభానికీ మధ్యకాలంలో కాపిటలిస్టు వుత్పత్తి

ప్రదక్షిణపూర్వకంగా నడుస్తుంది. దీనినే సైకిల్ అంటాము. ప్రథమ ప్రపంచ యుద్ధానికి పూర్వం ఈ సైకిల్ ఇట్లావుండేది. ఆర్థికసంక్షోభం కొంతకాలం గడచిన పిమ్మట ఆర్థిక మాంద్యము ప్రవేశిస్తుంది. అంటే, అడుగంటిన వ్యాపారం, పరిశ్రమలు అలాగే, ఎదుగు బొదుగులు లేకవుంటాయి. క్రమంగా కొంత తెప్పరిల్లుతాయి. ఈ విధంగా పరిశ్రమలు కోలుకోవటం ప్రారంభించిన పిమ్మట వుత్పత్తి జోరు అవుతుంది. వ్యాపారం, పరిశ్రమల ప్రగతి వెలుగుతుంది. దీనినే బూమ్ (Boom) అంటాము. లాభాలకొరకై వేట, పారిశ్రామికాభివృద్ధి, అధికోత్పత్తి తిరిగి ఆర్థిక సంక్షోభం, మరల సైకిల్ ప్రారంభమౌతుంది.

కాపిటలిజం ఈ విధంగా ఒక సంక్షోభంనుండి మరియొక సంక్షోభానికి పోవటాన్ని ఎంగెల్సు ఈ విధంగా వర్ణించాడు ;

“1825 లో మొట్టమొదటిసారిగా ఆర్థిక సంక్షోభం వచ్చినప్పటినుండీ, నాగరిక దేశాలు, వాటిపై ఆధారపడి వుండే అనాగరిక దేశాలు కూడా ప్రతి 10 ఏండ్లకొక పర్యాయం ఆర్థిక సంక్షోభాన్ని చవిచూస్తూనే వున్నవి. వ్యాపారం స్తంభించిపోతుంది. బజార్లలో కొట్లన్నీ సరుకులతో కిక్కిరిసిపోయి వుంటాయి. అవి అమ్ముకావు. అన్నీ బాకీల క్రిందే వుంటాయి గాన ఖుద్దున డబ్బు చెల్లించడం వుండదు. అరువు ఇవ్వబడదు. ఫాక్టరీలు మూతపడుతాయి. అమితంగా ఆహారపదార్థాలు ఉత్పత్తి గావించారు కాబట్టే శ్రామిక ప్రజలు తిండిలేకుండా పోతారు. దివాలామీద దివాలా, బలవంతంపై బలవంతంగా అమ్మకాలు సాగుతాయి. ఈ విధమైన దుస్థితి కొన్నిసంవత్సరాలు వుంటుంది. అమిత వస్తురాసులు నాశనం చేయబడుతాయి. చివరకు చాలా తక్కువ వెలకు, అసలు విలువకు చాలా తక్కువగానే సరుకు అమ్మివేయబడి, గోదాములు ఖాళీచేయబడుతాయి. తిరిగి వుత్పత్తి, మారకం కొద్దిగా కదలటం ప్రారంభమవుతోంది. ఈ చలనం నడకలోనికి, నడక హుటాహుటి నడకలోనికి, ఇది పరుగులోనికి, పరుగుచివరకు వాయువేగ మనోవేగములతో పోయి పోయి, చివరకు పరిశ్రమలు, వర్తక వాణిజ్యములు అమాంతంగా కూలిపోతాయి. ఆర్థిక సంక్షోభం వస్తుంది. తిరిగితిరిగి ఇదే నాటకం—

ఈ సంక్షోభములలో సామాజికోత్పత్తికి, ఉత్పత్తి కాపిటలిస్టులచే స్వాధీనం చేసుకోబడటానికి మధ్య వైరుధ్యం మరింత తీవ్రమౌతుంది. సరుకుల చలామణీ ఎందుకూ కొరగాకుండాపోతుంది. చలామణీ సాధనమైన ధనం చలామణీకి అంతరాయంగా పరిణమిస్తుంది. (డబ్బువుంటేనేగాని సరుకులు చలామణీ కావాయెను: డబ్బు ఎవరి దగ్గర వుంది?) సరుకుల ఉత్పత్తికి చలామణీకి సంబంధించిన సూత్రాలన్నీ తల్లక్రిందులౌతాయి. ఆర్థిక సంఘర్షణ మిన్నుముట్టుతుంది. ఉత్పత్తి విధానం మారకవిధానంపై తిరగుబాటు చేస్తుంది.... *

* “డూహ్రింగు సిద్ధాంత ఖండన” అనే గ్రంథం నుండి.

కాపిటలిజ లో సామాజికోత్పత్తికీ, ఫలితాన్ని కాపిటలిస్టులు స్వాధీనం చేసుకోవటానికి వుండే వైరుధ్యంవల్లనే తరచు ఆర్థిక సంక్షోభములు వస్తున్నవని చూశాము. ఒకసారి సంక్షోభంవచ్చి, దేశాన్నంతటినీ క్రిందుమీదుగా పెట్టినపిమ్మట, పరిశ్రమలు కోల్కొంటానికి కొంత ఊపు వుండాలి. అటువంటిది కొంత కల్గు తుంది. పరిశ్రమలు, కొత్త యంత్రాల నమర్చి, ఎక్కువ వుత్పత్తి గావించాలని చూస్తాయి. ఈ యంత్రాల మత్పత్తి గావించుటకై మూల పరిశ్రమలు కదలి, పని ప్రారంభిస్తాయి. ఒక పరిశ్రమ కదలిన పిమ్మట దీని వూపు చాలాదూరం వెళ్ళు తుంది. మామూలుగా ఒక పర్యాయం అమర్చిన యంత్ర సామాగ్రి 10ఏండ్లు వుండు నని అంచనా వేయవచ్చును. కాబట్టి ప్రతి 10 ఏండ్లకూ పరిశ్రమలకూ ఊపు వస్తూ వుంటుంది. అందుచే ప్రతి 10 ఏండ్లకూ పరిశ్రమల విశ్వబలమైన (ఫిక్సెడ్) కాపి టల్ను మారుస్తూ వుండాలి. కాబట్టి దాదాపు ప్రతి 10 ఏండ్లకూ ఒకసారి పరిశ్రమ లకు ఊపు వస్తూ వుంటుంది.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం ఈ స్థితి మారింది. కాపిటలిజం జీవ చ్ఛవమైంది, అది జీర్ణస్థితిలో వుంది. ఇప్పుడు ఆర్థిక సంక్షోభం వచ్చిందంటే పూర్వంకన్న ఎన్నో రెట్లుగా సమాజాన్ని కదిలించివేస్తుంది, వ్యాపారం, పరిశ్రమల అభివృద్ధి క్షీణతలలో పూర్వం వుండే ప్రదక్షణలు ఇకముందు వుండవు. చాలా దేశాలలో పరిశ్రమల ఇభివృద్ధి పూర్తిగా నిల్చియేపోయింది. కొన్నిటిలో వున్నా అది చెప్పుకోదగ్గది మాత్రం కాదు.

## సంక్షోభం యొక్క ప్రాముఖ్యత

మొత్తం కాపిటలిస్టు విధానంయొక్క అభివృద్ధిపై ఈ ఆర్థిక సంక్షోభాల ప్రభావం చాలా వుంది. కాపిటలిజం వల్లనే ఉత్పన్నమై, అభివృద్ధిచెందిన ఉత్పత్తి శక్తులను సంక్షోభ దినాలలో కాపిటలిజం కాపించలేదు. కాపిటలిస్టు ఉత్పత్తి, పున రుత్పత్తి క్రమములో వుండే గందరగోళం అంతా బయటపడుతుంది. విపరీతంగా సరుకులు ఉత్పత్తి అవుతూవుంటాయి కాని ఆశేష ప్రజానీకానికి అవి అందక వారు యమయాతనలకు గురియౌతూ వుంటారు. ఈ విధంగా కాపిటలిజంలోని తర్కాతర్క్యం, దోపిడీ స్పష్టంగా కన్పిస్తుంది.

"ప్రజల లీవరికం మందే కోట్లు సంపాదించే కొందిమంది కాపిటలిస్టుల చేతులలోనే ఫ్యాక్టరీలు, యంత్రాలు, గనులు, భూమి వగైరా ఉత్పత్తిసాధనములన్నీ వుండిపోబట్టిగాని లేకపోయినచో ఇప్పుడు ఉత్పత్తిఅయ్యే సరుకులకన్న యింకా ఎక్కువ ఉత్పత్తి చేయవచ్చుననీ, ప్రజలందరకూ కావలసినవన్నీ సమకూర్చ వచ్చుననీ మనం చూడగలం. ఈ వైరుధ్యాన్నే సోషలిజం బయటపెట్టుచున్నది"అని లెనిన్ వ్రాశాడు.

ఆర్థిక సంక్షోభంవల్ల "వర్గభేదాలు" మరింత తీవ్రమౌతాయి. కార్మికుల స్థితిగతులు విషమిస్తాయి. నిరుద్యోగం విపరీతంగా పెరుగుతుంది. మరెందుకు వచ్చిందంటే అది ఉపేక్ష వహించి కూర్చునే కార్మికులను కూడా కాపిటలిజానికి వ్యతిరేకంగా పోరాడునట్లు కార్యరంగంలోనికి దింపుతుంది. సంక్షోభంవల్ల కాపిటలిజంలో వుండే "వైరుధ్యాలన్నీ బైటపడి, దాని వినాశనం తప్పనిసరియని రుజువవుతుంది.

ఆర్థిక సంక్షోభంయొక్క పాత్రనుగూర్చి ఎంగెల్సు ఈ క్రింది విధంగా వ్రాశాడు :

సామాజికోత్పత్తి, దానితో బాటుగా దానిని కాపాడుతూవుండే ఉత్పత్తి సంబంధాలతో, అందలి ఆధునిక పద్ధతులతో తీవ్ర ఘర్షణకు వస్తుంది. అనేకమంది పెద్ద, చిన్న కాపిటలిస్టు లందరూ దివాళాతీసి, కాపిటల్ కొద్దిమంది చేతులలో కేంద్రీకరింపబడటంవల్ల సంక్షోభం యొక్క వినాశకర పాత్రను కాపిటలిస్టులు కూడా చవిచూస్తారు. తానే సృష్టించిన ఉత్పత్తి శక్తుల మూలకంగా కాపిటలిస్టు ఉత్పత్తిక్రమం, నిర్మాణం అంతా కూలిపోతుంది. ఈ బ్రహ్మాండమైన ఉత్పత్తి సాధనాల మొత్తమంతా కాపిటల్ క్రింద మారటానికి సాధ్యపడదు ఇవన్నీ మూలబడ్డవంటే, కార్మికుల రిజర్వుకూడా మూలబడ్డదన్నమాట. ఉత్పత్తి సాధనాలు, ఆహార సాధనాలు, పనిచేయ ఇచ్చగించే శ్రామిక సైన్యం, ఉత్పత్తికి, సంపదలకు అవసరమైన సకల సాధనాలు అమితంగా వున్నవి. కాని ఈ 'అమితం' వల్లనే అసంఖ్యాక ప్రజానీకం యొక్క దరిద్రం, రోగాలు, కరువు, ఉత్పన్నమౌతున్నాయి. (ఫోరియర్), ఎందుచేతననగా, సరకులు అమితంగా వుండటంవల్లనే అవి ఖర్చు కావటంలేదు. కాపిటల్గా మారటంలేదు. కాపిటల్గా మారితేనేగాని, కార్మిక శ్రమశక్తిని దోచుకొనే సాధనలుగా మారితేనేగాని, ఉత్పత్తి సాధనాలు ముందుకు నడవవు. ఉత్పత్తి సాధనాలు, ఆహారసాధనాలు మారి కాపటల్గా తయారుకావాలనే అవుసరమే ఒక పిశాచంగా తయారై, వాటికి, కార్మికులకు మధ్య నిలుస్తుంది. ఉత్పత్తి భౌతికశక్తులకూ, వ్యక్తియజమానుల లాభాపేక్షలకూ కూడి కలవకుండా జేస్తుంది ఈ పిశాచమే ఇదే ఉత్పత్తి సాధనాలను పనిజేయకుండునట్లునూ, కార్మికులు నిరుద్యోగులుగా వుండేటట్లునూ చేస్తుంది. ఈ విధంగా కాపిటలిస్టు ఉత్పత్తి క్రమం ఒకమూల తన ఉత్పత్తి శక్తులను తానే కంట్రోలు చేయలేక పోతుంది. రెండోమూల ఈ ఉత్పత్తి శక్తులే తమకు అడ్డంకులుగా నిల్చిన వైరుధ్యాలనన్నిటినీ నాశనం జేస్తానికి, తాము కాపిటల్గా అవతారం పొందవలసిన అవుసరాన్ని రద్దుపరుస్తానికి, "తాము సామాజిక ఉత్పత్తి శక్తులుగా స్పష్టంగా, నిజంగా గుర్తింపబడటానికి," ముందుకు తోసుకువస్తాయి. •

• "డ్యూహ్రింగు సిద్ధాంతాల ఖండన" అనే గ్రంథంనుండి

కాపిటలిస్టు వుత్పత్తివల్ల వచ్చే ఆర్థిక సంక్షోభాన్నిగూర్చి 'కమ్యూనిస్టుమానిఫెస్టో' లో ఈ క్రింది విధంగా వివరమైన వర్ణనవున్నది:

"ప్రత్యేకమైన వుత్పత్తి సంబంధాలను, మారకం సంబంధాలను, ఆస్తి సంబంధాలను కల్గివున్న, ఈనాటి బూర్జువా సమాజం ఎంత బ్రహ్మాండమైన వుత్పత్తి, మారకం సాధనాలను సృష్టిస్తూ వున్నదంటే, తన మంత్రములచే ఒక భూతలోకాన్ని సృష్టించి ఆ భూతాలను తన అదుపు ఆజ్ఞలలో వుంచుకోలేని ఒక మంత్రగానిని తలపిస్తున్నది. గతకొలది దశాబ్దాలలో పరిశ్రమల, వ్యాపారం యొక్క చరిత్ర ఏమిటంటే, బూర్జువా సమాజం అస్తిత్వానికి, దాని పరిపాలనకూ కారణమైన వుత్పత్తి సంబంధాలు, ఆస్తి సంబంధాలకోటి ఈనాటి వుత్పత్తి శక్తుల తిరుగుబాటు చరిత్రయే. ప్రతిసారి, అతిశయిస్తున్న భీకరత్వంతో ప్రత్యక్షమవుతూవున్న ఆర్థిక సంక్షోభాన్ని వుదహరిస్తే చాలును. ఈ సత్యాన్ని తెలుసుకుంటానికి, ఈ సంక్షోభములలో, నేడు వుత్పత్తి గావించబడేవేగాక, ఇంతకుపూర్వం వుత్పత్తి గావించిన సంపదలు కూడా విశేషంగా నాశనం చేయబడతాయి.

"ఈ సంక్షోభ దినాలలో – అంతకుపూర్వం అశ్రుతమైన, అగోచరమైన – ఒక వితండార్థ్యం, అధికోత్పత్తికార్యం పుట్టుకవస్తుంది. అకస్మాత్తుగా సమాజం అంతా మోటు ప్రపంచం అయిపోయినట్లూ, ఏ కరువో, ప్రళయమో వచ్చి అన్ని జీవితావసర సాధనములను మాయం చేసినట్లూ, పరిశ్రమలు, వ్యాపారం నాశనం గావించినట్లూ అవుతుంది. ఎందువల్లనా? నాగరికత మరీ ఎక్కువ కావటంవల్ల, మరీయెక్కువ జీవితావసర సాధనాలు వుండటంవల్ల, పరిశ్రమలు వ్యాపారం మరీ వృద్ధిగావటంవల్ల, సమాజ స్వాధీనంలోవున్న వుత్పత్తి శక్తులు బూర్జువా ఆస్తిని ఇంకా పెంచటానికి ఇకముందు వుపయుక్తంకావు. పైపెచ్చు, వుత్పత్తిశక్తులు మరీ బలిష్ఠమౌతాయి. తమను బంధించే వుత్పత్తి సంబంధాల కట్టుబాట్లకు అతీతమౌతాయి: ఎప్పుడైతే ఈ కట్టుబాట్లను త్రెంచుతాయో అప్పుడు బూర్జువాసమాజంలో అల్లకల్లోలం ప్రారంభమౌతుంది. బూర్జువా అస్తిత్వానికే ప్రమాదం వాటిల్లుతుంది. తాను సృష్టించిన సంపదలను అదుపులో వుంచటానికి, వినియోగించటానికి బూర్జువా సమాజం అశక్తమౌతుంది. అయితే బూర్జువా సమాజం యీ సంక్షోభమునుండి యెట్లా బయటపడుతుంది? ఒకమూల వుత్పత్తి శక్తులను విపరీతంగా నాశనం గావించటంద్వారా, మరోమూల కొత్తదేశాల మార్కెట్లను జయించటంద్వారా, పాత మార్కెట్లను మరింత ఎక్కువగా దోచుకోటంద్వారా–అంటే మరింత పెద్ద సంక్షోభాలకు దారితీయటంద్వారా, ఈ సంక్షోభాలను అరికట్టగల్గే శక్తులను మరింత బలహీనపర్చటంద్వారా."

# అధ్యాయం 9

# సామ్రాజ్యవాదం - సోషలిస్టు విప్లవంయొక్క అద్యతన కాలము

## పారిశ్రామిక కాపిటలిజం నుండి సామ్రాజ్యవాదానికి బాట

19వ శతాబ్దంలో కాపిటలిజం ఒక దేశాన్నుండి మరో దేశానికి ఎగబ్రాకి, చివరకు ప్రపంచమంతటా విస్తరించింది. ఈవిధంగా కాపిటలిజం వృద్ధియైనకొలదీ, అంతలి పరస్పర వైరుధ్యాలు కూడా తీవ్రమౌతూవచ్చినవి. ఈ దశలో పారిశ్రామిక కాపిటల్ ప్రాధాన్యత వహిస్తూవచ్చింది. అందుచే కాపిటలిజం యొక్క ఈ దశను పారిశ్రామిక కాపిటలిజం అని అంటాము.

పారిశ్రామిక కాపిటలిజంలో అంతర్భూతమై వుండే పరస్పర వైరుధ్యాలు పెరిగి తీవ్ర సంఘర్షణలకు అలవాలమగునరికి మరొక నూతనమైన దశ- సామ్రాజ్యవాద దశ- ఏర్పడింది. 20వ శతాబ్దితో ఈ దశ ప్రారంభమైంది. కాపిటలిజం యొక్క ఉచ్ఛదశయే సామ్రాజ్యవాదం. ఈ సామ్రాజ్యవాద దశలో కాపిటలిజంలో అంతర్భూతమై వున్న వైరుధ్యాలన్నీ ఉచ్ఛదశకు పోయినవి. కాపిటలిజం యొక్క అంతిమదశ సామ్రాజ్యవాదం: సామ్రాజ్యవాదమును "మరణావస్థలో వున్న కాపిటలిజం" అంటాము. సామ్రాజ్యవాద దశతో కాపిటలిజం సమాజ పురోభివృద్ధికి ఆటంకకరంగా పరిణమించుతుంది.

## సామ్రాజ్యవాదాన్ని గూర్చి లెనిన్ ఉపదేశాలు

శోషణనుండి విముక్తి పొందే శ్రామికవర్గం చేతులలో, సామ్రాజ్యవాదాన్ని గూర్చిన లెనిన్ ఉపదేశాలు పెద్ద ఆయుధంగా ఉపయోగపడగలవు. సామ్రాజ్యవాదమంటే మరణావస్థలో వున్న కాపిటలిజమని "శ్రామికవర్గం యొక్క సోషలిస్టు విప్లవమునకు అద్యతన కాలమని" లెనిన్ తెలియజేశాడు.

లెనినిజం యొక్క పునాదులమీదటో స్టాలిన్ గ్రంథమువంలో వ్రాశాడు. మార్క్సు ఏంగెల్సు సామ్రాజ్యదశ ప్రారంభంకాని దినాలలోవుండి పోరాడారనీ, వారు ఉన్న దశలో శ్రామికవర్గ విప్లవానికి నాంది ప్రస్తావన మాత్రమే జరిగినదనీ, లెనిన్ యొక్క కార్యాచరణ అంతా సామ్రాజ్యవాదం బాగా అభివృద్ధియైన కాలంలో

వున్నదనీ, ఈదశ శ్రామికవర్గవిప్లవం విజృంభించే దశయనీ స్టాలిన్ తెలియజేశాడు. కాబట్టి నూతనదశ సామ్రాజ్యవాదం, శ్రామికవర్గ విప్లవాల శకమునకు సంబంధించి సరిగ్గా "అభివృద్ధికాబడిన మార్క్సిజమే" లెనినిజం. కాబట్టి ఈకాలంలో మార్క్సిస్టు కావాలంటే లెనినిస్టు కూడా అయితీరాలి. సామ్రాజ్యవాదాన్ని గూర్చిన లెనిన్ సిద్ధాంతాలను గుర్తించనట్లయితే మార్క్సిజమునే గుర్తించకపోవడమవుతుంది. కాబట్టి సామ్రాజ్యవాద సిద్ధాంతాన్ని తారుమారు చేయడంగాని గుర్తించక విప్లవ సిద్ధాంతమగు మార్క్సిజం-లెనినిజం నుండి తొలగిపోవటమే అవుతుంది.

సామ్రాజ్యవాదమంటే కాపిటలిజం అభివృద్ధిలో ఒక ప్రత్యేకమైన దశయనీ, ఉచ్ఛదశయనీ ఈ చారిత్రక పరిణామ దశలో ఆర్థిక సూత్రాలలో కూడా మార్పులు సంభవించినవనీ లెనిన్ తెలియజేశాడు. కాపిటలిస్టు ఉత్పత్తిక్రమంలో చాలా తీవ్రమైన మార్పులు జరిగినవి. కాబట్టి సామ్రాజ్యవాద దశ అంతకు పూర్వ దశయగు పారిశ్రామిక కాపిటలిజం నుండి భిన్నమగుచున్నది. ఈ విషయాలను రుజువుచేయుటకై కాపిటలిజం అభివృద్ధికి సంబంధించిన మార్క్సు సిద్ధాంతాలనే అనుసరించి, నూతన పరిణామదశలో ఈ సూత్రాలు ఎట్లా వర్తిస్తాయో లెనిన్ స్పష్టం చేశాడు.

కాపిటలిజం శిథిలమై, అంతమయ్యే ఈ దశయొక్క సోషలిస్టు విప్లవం యొక్క సంధికాలమైన ఈ సామ్రాజ్యవాదానికి భిన్నమైన "ప్రత్యేక లక్షణాలెన్నో వనీ" లెనిన్ చూపించాడు. సామ్రాజ్యవాదం, "వినాశకరమగు యుద్ధాలను తెచ్చిపెట్టటం," మొత్తం కాపిటలిస్టు వ్యవస్థలో "సర్వసాధారణ ఆర్థిక సంక్షోభాన్ని తెచ్చిపెట్టటం" ఈ ప్రత్యేక లక్షణాలని లెనిన్ చూపించాడు.

"సర్వ సాధారణంగా కాపిటలిజానికి వుండే ప్రధాన గుణాల అభివృద్ధి ఫలితంగా వచ్చిన నూతన దశయే సామ్రాజ్యవాదం." * సామ్రాజ్యవాదం కాపిటలిజములో నూతనదశ; కాని యీ నూతనదశ ఇంతకు పూర్వమున్న పారిశ్రామిక కాపిటలిజం కొనసాగటం వల్లనే వచ్చింది. పారిశ్రామిక కాపిటలిజంలో వున్న ప్రధాన వైరుధ్యాలన్నీ- బూర్జువా, శ్రామిక వర్గాలమధ్య వైరుధ్యం కాపిటలిస్టులలో కాపిటలిస్టులకుండే పోరాటం ఉత్పత్తిలో అరాజకం, ఆర్థిక సంక్షోభాలు-అంతరించవు సరిగదా, వాటి వుచ్ఛస్థాయికి చేరుకుంటాయి.

సామ్రాజ్యవాదానికి, ఇంతకుపూర్వం వుండే పారిశ్రామిక కాపిటలిజానికి ఏమీ సంబంధం లేదని చెప్పేదానికంటే వేరు బుద్ధిహీనత వుండబోదు. బుఖారిన్ మొదలైనవారు ఇట్టి సిద్ధాంతాన్నే ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధకాలంలో లేవదీశారు. సామ్రాజ్యవాదంయొక్క ప్రత్యేక స్వభావాన్ని గూర్చి వీరు మరీ నొక్కి చెప్పారు. వీరి సిద్ధాంతాలు చాలా 'అతివాదం'గా కన్పించినా, వాస్తవంలో ఆచరణలో నేటి

* "సామ్రాజ్యవాదం, కాపిటలిజం యొక్క ఉచ్ఛదశ" అన్న లెనిన్ గ్రంథంనుండి.

కాపిటలిజాన్ని గూర్చి బోషలిస్టు సమాజస్థాపనకై జేయు ప్రయత్నములలోనూ పూర్తి అవకాశవాదానికి తావునియ్యగలవు.

ఈ ప్రశ్నపై లేచిన బూర్జువా, పెటీబూర్జువా సిద్ధాంతాలకోటి, మార్క్సిజాన్ని తారుమారుచేస్తూ ఈ ప్రశ్నపై లేచిన అవకాశవాద పూరితమగు సిద్ధాంతాల కోటి "ఎడతెగని పోరాటాన్ని" జరుపుట ద్వారా లెనిన్ తన సామ్రాజ్యవాద సిద్ధాంతాన్ని స్థాపించాడు. సామ్రాజ్యవాద సిద్ధాంతానికి, శ్రామికవర్గ విప్లవ సిద్ధాంతానికి అవినాభావ సంబంధం వున్నది. కాబట్టి సామ్రాజ్యవాద సిద్ధాంతాలను సరిగా గుర్తించక పోవటం విప్లవ ప్రతికూల రాజకీయ సంధానాలకు దారితీస్తుంది.

"మొనాపలి సంస్థల" సర్వాధికారాన్ని ప్రతిష్ఠించే "ఉత్పత్తి కేంద్రీకరణ" పూర్తిగా పరిశోధన చేయటం ద్వారా లెనిన్ సామ్రాజ్యవాదమును పరీక్ష గావించాడు. సామ్రాజ్యవాద దశలో, అంతకుపూర్వం వుండే స్వేచ్ఛా వాణిజ్యము, పోటీలో స్వేచ్ఛపోయి, మొనాపలీ కాపిటలిజ యొక్క రాజ్యం వచ్చిందని ఇందు వల్ల కాపిటలిజంలోని పరస్పర వైరుధ్యాలన్నీ ఉచ్ఛస్థాయికి పోయినవనీ గుర్తించి లెనిన్ సామ్రాజ్యవాదాన్ని గూర్చిన నిర్ణయాలకు వచ్చాడు.

## సామ్రాజ్యవాదం యొక్క ఐదు లక్షణాలు

సమాజం మొత్తం యొక్క రాజకీయార్థిక జీవితాన్ని శాసిస్తూ సర్వాధికారాన్ని చలాయించి మొనాపలీలుండే దశయే సామ్రాజ్యవాదం. జీవితంలోని ప్రతి భాగంపైన మొనాపలీల అధికార చిహ్నాల్ని మనం చూడగలం. సామ్రాజ్యవాదములోని ప్రధానమైన ఐదు లక్షణాలనుగూర్చి లెనిన్ ఈ క్రిందివాటిని చూపాడు.

1. అర్థిక జీవితంలో విపరీత ప్రభావాన్ని ప్రసరింపజేసే మొనాపలీసంస్థలను నిర్మించి వాటి చేతులలో వుత్పత్తి, కాపిటల్ కేంద్రీకరింప జేయుట.

2. బ్యాంకు కాపిటల్, పారిశ్రామిక కాపిటల్ లీనమై 'ఫైనాన్సు కాపిటల్'గా మారుట: దీని బలంతో కొంది మంది కుబేరుల చేతులలో సంపదంతా కేంద్రీకరింపబడుట.

3. సరుకుల ఎగుమతి అయ్యేదానికి బదులు, కాపిటలే ప్రధానంగా ఎగుమతి కావటం.

4. ప్రపంచాన్నంతటినీ తమలో తాము పంచుకొన్నట్టి అంతర్జాతీయ మొనాపలీ సంస్థలు ఏర్పడుట.

5. ప్రధాన కాపిటలిస్టు దేశాల మధ్య ప్రపంచం విభాగింపబడటం పూర్తియగుట.

"సామ్రాజ్యవాదం, సోషలిజంలో చీలికలు" అన్న మరో గ్రంథంలో లెనిన్ సామ్రాజ్యవాదాన్నిగూర్చి సూక్ష్మంగా ఈ క్రింది విధంగా తెలియజేశాడు.

"కాపిటలిజం అభివృద్ధిలో సామ్రాజ్యవాదం ఒక చారిత్రక దశ. దాని ప్రత్యేకస్వభావం మూడు విధాలుగా వుంటుంది. సామ్రాజ్యవాదం అంటే (1) మొనాపలీ కాపిటలిజం (2) శిథిలావస్థలో వున్న కాపిటలిజం (3) మరణావస్థలో వున్న కాపిటలిజం. స్వేచ్ఛగా పోటీ చేసుకొనే పద్ధతిపోయి, మొనాపలీ పద్ధతి రావటమే సామ్రాజ్యవాదము యొక్క "సారము", ప్రధాన ఆర్థిక లక్షణం మొనాపలి పద్ధతి ఐయిదు రూపాలలో ప్రత్యక్షమవుతుంది. (1) కార్టెల్స్, సిండికేట్స్, ట్రస్ట్సు: ఉత్పత్తి విపరీతంగా కొలదిమంది కాపిటలిస్టుల చేతులలో కేంద్రీకరింపబడుట వల్ల ఈ సంస్థలు స్థాపించబడటానికి కారణం. (2) పెద్ద బ్యాంకుల మొనాపలీ అధికార స్థానం: అమెరికా, ఫ్రాన్స్, జర్మనీల ఆర్థిక జీవితాన్ని అంతటినీ 3, 4 మొనాపలీ బ్యాంకులు శాసిస్తున్నవి. (3) ట్రస్టులవల్ల, కోటీశ్వరుల ముఠాలవల్ల ముడిసరుకుల మూలస్థానాలన్నీ కబళింపబడుట (ఫైనాన్స్ కాపిటల్ అంటే బ్యాంకు కాపిటల్‌తో ఐక్యంపొందిన మొనాపలీ పారిశ్రామిక కాపిటల్). (4) అంతర్జాతీయ కార్టెల్సు మధ్య ప్రపంచం (ఆర్థికంగా) పంచుకోబడటం ప్రారంభమైనది. ప్రపంచ మార్కెటువంతా స్వాధీనం చేసుకొని 'సమాధాన పూర్వకంగా' తమలోతాము పంచుకొనే-యుద్ధాలు జరిగి పునర్విభజన జరిగేదాకా- "కార్టెల్సు దాదాపు 100 వరకూ ఇప్పుడే వున్నవి. ఈ విధంగా ప్రపంచం ఆర్థికంగానూ, రాజకీయంగానూ పంచుకోబడటంతో పాటుగా సరుకుల బదులు కాపిటల్ ఎగుమతి కావటంకూడా ప్రత్యేక లక్షణమౌతుంది. (5) ప్రపంచం (వలస దేశాలుగా) పంచుకోబడటం పూర్తియౌతుంది."

## మొనాపలీ సంస్థల ప్రాబల్యం

కాపిటలిజం సూత్రాలలో ప్రధానమైనది. కాపిటల్ కేంద్రీకరణ, సమీకరణయని మనం చూశాము. కాపిటలిజం వృద్ధియైనకొలదీ చిన్న ఎత్తున జరిగే పరిశ్రమలన్నీ నాశనమై పెద్ద పెద్ద సంస్థలుత్పన్నమౌతాయి. పోటీలో చిన్నసంస్థలు నాశనమై పెద్దసంస్థలే నిలుస్తాయి. టెక్నికల్ సైన్సు అభివృద్ధిని పూర్తిగా వినియోగించుకొనటద్వారా పెద్ద సంస్థలీ స్థితికి రాగల్గుచున్నవి.

ఈ విధంగా పెద్దసంస్థలు మాత్రమేనిల్చి, కాపిటల్ చాలా ఎక్కువగా కొలదిమంది చేతులలోనే కేంద్రీకరింపబడి, సమీకరింపబడి వున్నప్పుడు క్రమంగా మొనాపలీ పద్ధతి వస్తుంది. మొనాపలీ అంటే కొన్ని వస్తువుల ఉత్పత్తిలో అత్యధిక భాగం హస్తగత చేసుకొన్న కొద్దిమంది కాపిటలిస్టులు ఏకం కావటం లేక ఒక అంగీకారానికి రావటం. ఆ విధంగా కాపిటలిస్టుల మధ్య ఐక్యత కుదురుటవల్ల చాలా ప్రయోజనాలువున్నవి. ఉత్పత్తి యంత్రంగాని; అత్యధిక భాగంగాని తమ చేతులలో కేంద్రీకరింపబడి వుండుటచే, ధరలను పెంచటం ద్వారా లాభాలను విపరీతంగా

సంపాదించగల్గుతారు. ఈవిధమైన మొనాపలీలు ఉత్పత్తిలో అత్యధికభాగం కొంది మంది చేతులలో కేంద్రీకరింపబడి వున్నప్పుడే సాధ్యమౌతుంది.

ఒక దశాబ్దం ఆరంభంనాటికే ఉత్పత్తి బ్రహ్మాండమైన కొంది సంస్థల చేతులలో కేంద్రీకరింపబడి వుండటం చాలా కాపిటలిస్టు దేశాలలో వచ్చింది. అక్కడక్కడా చిన్నచిన్న సంస్థలు స్వల్పంగా ఉత్పత్తిగావిస్తూ వుండటం లేకపో లేదు. కాని ఉత్పత్తిచక్రాన్ని తిప్పేదిమాత్రం బ్రహ్మాండమైన ఫ్యాక్టరీలు, సంస్థలు మాత్రమే. ఇట్టివే వేలకొలది కార్మికులను వినియోగిస్తూ, ఉత్తమ యంత్రములను ఉపయోగిస్తూ విద్యుచ్ఛక్తితో హెచ్చుభాగాన్ని ఉపయోగిస్తూ వుండేవి. విపరీతమైన సరుకుల మొత్తాన్ని ఉత్పత్తిచేస్తూ ఈ సంస్థలు ఎంతో పలుకుబడిని, ప్రభావాన్ని కల్గివుండేవి. ఉదాహరణకు అమెరికా సంయుక్త రాష్ట్రాలలో మొత్తం ఉత్పత్తిలో సగభాగం దాదాపు మూడువేల సంస్థల చేతుల్లో కేంద్రీకరింపబడి వున్నవి. ఈ 3000 సంస్థలు మొత్తం సంస్థల సంఖ్యలో 1% మాత్రమే. అనగా 1% సంస్థల చేతులలో మొత్తం ఉత్పత్తిలో 50%ను వుత్పత్తిజేసే యితర 99% సంస్థలు, అక్కడక్కడా చెదురుగా పడివుండే చిన్నసంస్థలు, ఫ్యాక్టరీలు.

క్రమంగా జాయింటుస్టాకు కంపెనీలు ఏర్పడసాగినవి. ఇంతకు పూర్వం ఫ్యాక్టరీలు, సంస్థలు విడివిడిగా కాపిటలిస్టులవి. వాటిని వారు సంపుతూవచ్చిన లాభాన్ని స్వంతజేబులో వేసుకొనేవారు. కాని కొన్ని కొన్ని పరిశ్రమలు-రైల్వే నిర్మాణం వగైరా-ఒకరిద్దరు కాపిటలిస్టులవల్ల సాధ్యమయ్యేవిగావు. కాటికిగాను జాయింటుస్టాకు కంపెనీలు వచ్చినవి. జాయింటుస్టాకు కంపెనీలనగా, చాలామంది కాపిటలిస్టుల కాపిటల్ ఒకేమొత్తంగా చేర్చబడుతుంది. కాపిటలిస్టులు ఎవరెంత స్టాకును (వాటాలను) కల్గియున్నారో ఆ క్రమాన్నిబట్టి లాభాలు పంచిపెట్టబడుతాయి. పేరుకు వాటాదార్ల జనరల్‌బాడీ సమావేశం అన్ని ప్రధాన విషయాలను నిర్ణయిస్తుంది. కాని వాస్తవానికి పెద్దవాటాదార్లే అన్ని విషయాలను నిర్ణయించుతూ వుంటారు. ఎవరికెంత స్టాకువున్నది. (వాటావున్నది) అన్న విషయాలనుబట్టి వారి ఓట్లసంఖ్య వుంటుంది. కాబట్టి చిన్నవాటాదార్లు ఏ విషయాలలోనూ అధికారాన్ని కల్గియుండలేరు. వాటాలలో 30%, 40% వాటాలను గనుక కొలదిమంది హస్తగతం చేసుకుంటేచాలు, వారే మొత్తం స్టాకు కంపెనీనంతటినీ పరిపాలించగలరు. కాబట్టి చిన్నచిన్న కాపిటలిస్టుల కాపిటల్ కొంతవరకూ ఆఫీసు గుమాస్తాలు మున్నగు మధ్యతరగతి ప్రజలు, కార్మికుల ఆదాయసొమ్ము. దానంతట అదే పెద్ద కాపిటలిస్టులచే పరిపాలింపబడటం ఈ స్టాకు కంపెనీలద్వారా జరుగుతుంది.

ఈనాటి కాపిటలిస్టు దేశాలలో పెద్ద పరిశ్రమలలో అత్యధిక భాగం జాయింటు స్టాకు కంపెనీలుగానే వుంటున్నాయి. ఇందువల్ల విపరీతమైన పెట్టుబడి పెట్టుటకూ, భారీఎత్తున ఉత్పత్తి సాధించుటకూ వీలగుచున్నది. ఒకరిద్దరు కాపిట

లిస్టులు సాగించలేని భారీ పరిశ్రమలు, రైల్వేలు, గనులు, ఉక్కు పరిశ్రమ, మోటారుకార్ల పరిశ్రమ, స్టీమరు, కంపెనీలు మున్నగునవి- జాయింటు స్టాకు కంపెనీలద్వారానే నిర్వహించడం సాధ్యమగుచున్నది.

పరిశ్రమలను పెద్దవిజేయటం ద్వారా జాయింటు స్టాకు కంపెనీలు మొనాపలీ కార్పొరేషన్లకు దారి వేస్తున్నవి. మొట్టమొదటగా బరువు పరిశ్రమలైన మూలపరిశ్రమలు మొనాపలీ సంస్థలుగా పరిణమిస్తాయి. ఈ మూలపరిశ్రమలలోనే భారీఎత్తున ఉత్పత్తి వేగంగా అభివృద్ధి పొందుతుంది. కాపిటల్ కేంద్రీకరణ కూడా వీటిలోనే ఎక్కువగా జరుగుతుంది. నూనె గానుగలు, రాక్షసిబొగ్గు గనులు, ఇనుము గనులు, ఇనుము, ఉక్కు పరిశ్రమలు, ప్రతిదేశంలోనూ కొలది సంస్థల చేతులలో సమీకరింపబడి వుంటాయి. ఈ బ్రహ్మాండమైన సంస్థలమధ్య పోటీ అతి తీవ్రంగా వుంటుంది. ఈ పరిశ్రమల నుండి త్వరగా కాపిటల్ను మరొక పరిశ్రమకు మళ్ళించుటకు వీలుండదు, పెద్దపెద్ద మంది మార్బలములమీద చాలా కాపిటల్ వెచ్చింపబడి వుంటుంది: గాన కాపిటల్ స్వేచ్ఛగా మారుటకు వీలుపడదు. అందుచే ఆర్థిక సంక్షోభం వస్తే బరువు పరిశ్రమలే పెద్ద దెబ్బ తినగలవు. ఎందుచేతననగా సంక్షోభ కాలంలో, యంత్రాలకు, ఇనుముకు, బొగ్గు వగైరాలకు డిమాండు పూర్తిగా పడిపోతుంది. ఏ పరిశ్రమలో ఉత్పత్తి దెబ్బ తగిలినా ఆదెబ్బ బరువు పరిశ్రమలకుకూడా తగులుతుంది: కొద్ది కాపిటల్ గలపరిశ్రమలు మూలబడతాయి. కాపిటల్ ఎక్కువగా కేంద్రీకరింపబడుటచే బరువు పరిశ్రమలే మొట్టమొదగా మొనాపలీ సంస్థలుగా తయారౌతాయి. క్రమంగా చిన్న పరిశ్రమలు, ఆహార వస్తువులను ఉత్పత్తిజేసే సంస్థలుకూడా మొనాపలీలచే ఆక్రమించబడతాయి.

## కార్టెల్సు, సిండికేట్లు, ట్రస్టులు

కాపిటలిస్టు సంఘాలు అనేక రూపాలలో వుంటాయి. మొదట్లో లాభాలను పంచుకుంటానికై ధరలనుగూర్చి తాత్కాలిక ఒడంబడికలను గావించుకుంటాయి. ఇవే క్రమంగా దీర్ఘకాలపు ఒడంబడికలకు దారితీస్తాయి.

ఒకే పరిశ్రమకు సంబంధించిన వివిధసంస్థలు ధరలను ఒక ప్రమాణానికి తగ్గించకూడదని తమలో తాము ఒడంబడికకు వస్తాయి. సంస్థలు విడివిడిగానే వుంటాయి. వేటి లాభాలు వాటివే, కాని పోటీపడి ధరల మట్టమును తగ్గించకుండా మాత్రం ఇవి ఒడంబడికలను కుదుర్చుకుంటాయి. ఇట్టివాటిని కార్టెల్సుఅని అంటాము.

కొన్ని సంస్థలు ఇంకా ఎక్కువ జోస్తిని ఏర్పరచుకుంటాయి. అవి కొనే ముడి సరుకులలోను, తయారుచేసి అమ్మే సరుకులలోను జాయింటుగా వ్యాపారం జేస్తాయి. వుత్పత్తిచేసేది దానిదే, కాని ముడిసరుకులు, అమ్మకంవిషయంలో మాత్రం జాయింటు సంస్థద్వారా వ్యాపారం జరుగుతుంది. ఇట్టివాటిని సిండికేట్లు అని అంటాం.

సిండికేటులోని సభ్యత్వం వున్న ప్రతి సంస్థా స్వయంగా ఉత్పత్తిగావించినా, ఎంత ఉత్పత్తి గావించాలో ప్రతి సంస్థకూ కోటా సిండికేటుచే నిర్ణయింపబడుతుంది.

ట్రస్టులో ఈ జోస్తి ఇంకా అధికమౌతుంది. విడివిడిగా వుండే వివిధ సంస్థలూ "పూర్తిగా కలిసిపోతాయి" సంస్థల యజమానులు ట్రస్టులో వాటాదార్లు అవుతారు. ట్రస్టులో భాగస్వాములయిన వివిధ సంస్థల వ్యవహారాలన్నీ జనరల్ మేనేజిమెంటుద్వారా జరుగుతూ వుంటాయి.

## వివిధ పరిశ్రమల కలయిక : సూటిగా పెరుగుట

వివిధ పరిశ్రమలు ఉత్పత్తి క్రమంలో ఏదో విధంగా లీనమైపోవటం అంతకంతకూ వృద్ధియౌతుంది. ఉదాహరణకు : లోహ పరిశోధన పరిశ్రమ. దానికి రాక్షసబొగ్గుమా. వంటబొగ్గునూ సప్లయిచేసే బొగ్గుగనుల పరిశ్రమలో లీనమైపో వచ్చు. ఈ రెండింటితోనూ, మోటార్లు మున్నగు ఆవిరి యంత్రములు ఉత్పత్తి కాబడే యంత్ర పరిశ్రమతో కలిసిపోవచ్చు. ఈ విధంగా వివిధ పరిశ్రమలు కలవ టాన్ని "నిలువు కలయిక" (Vertical combination) అని అంటాము.

గుత్త సంస్థల ఏర్పాటుతో అనేకమంది కాపిటిస్టులు ఐక్య సంస్థలలో జేరుటకు పురికొల్పబడతారు. ఉదాహరణకు : బొగ్గుగనుల పరిశ్రమల సిండికేటు ఏర్పడి రాక్షసిబొగ్గు, వంటబొగ్గు ధరలు పెంచబడ్డవనుకుందాము. లోహపరిశోధన పరిశ్రమకు ఈ రెండు సరకులు అమితంగా కావాలి. కాబట్టి లోహ పరిశోధన పరిశ్రమల యజమానులలో చాలామంది తమ స్వంత బొగ్గుగనులుండాలని కోరుతారు. స్వంత గనులుగనుక వుంటే బొగ్గు సిండికేటుకు హెచ్చుధర ఇచ్చుకోనక్కరలేదు. తాము విపరీత లాభాలను సంపాదించవచ్చును.

## కార్పొరేషన్లు

సంస్థలలో జాయింటు స్టాకు కంపెనీల రూపంవచ్చిన పిమ్మట వివిధ పరిశ్రమల మధ్య దోస్తి, కలయిక ఏదోవిధంగా వృద్ధియౌతుంది. ఒక పరిశ్రమ మరో పరిశ్రమతో, ఆ పరిశ్రమ మరోదానితో ఈ విధంగా చాలా పరిశ్రమలకు లంకె ఏర్పడుతుంది. బ్యాంకుల సంబంధం, జోక్యం ఎక్కువ కావడంతో పరిశ్రమల ముఠాల మధ్యనే లంకె ఎక్కువౌతుంది.

కొంతమంది బలవంతులైన కాపిటలిస్టుల ముఠా ఇతర పరిశ్రమలలో చాలా వాటాలను కొనివేసే సందర్భాలను చూడవలసి యుంటుంది. మొత్తం వాటాలలో 30% 40% వాటాలుంటే చాలు. ఆ పరిశ్రమను తన అదుపు ఆజ్ఞలలో వుంచుకోవచ్చునని చూస్తాము. ఈ విధంగా ఒక పరిశ్రమను తన అదుపులో వుంచుకొనడానికై వాటాలను వుంచుకొనటాన్ని "కంట్రోలింగు ఇంటరెస్టు" అని అంటాము. ఈ విధమైన కంట్రోలింగు ఇంటరెస్టును కలిగి వుండటంద్వారా కాపిటలిస్టు ముఠా ఒక కంపెనీ స్టాకు తర్వాత మరొక కంపెనీ స్టాకును తన పలుకుబడిలోకి తెచ్చు

ఉంటూ వుంటుంది. ఈ విధంగా అనేక పరిశ్రమలపై అధికారాన్ని కలిగివుండే కాపిటలిస్టులను "పారిశ్రామిక రాజులు" అంటాము. ఇట్టి పారిశ్రామిక రాజులు పలుకుబడిలోనికి విడివిడిగావుండే పరిశ్రమలన్నీ రావటం అనేక విధాలుగా జరుగుతూ వుంటుంది. ఈ విధంగా ఆర్థికరీత్యా వివిధ పరిశ్రమలు ఒకదానిపై ఒకటి ఆధారపడి లంకెగా ఏర్పడటాన్ని "ఏక సంఘీకృతం"కావటం అని అంటాము. ఇట్టి గ్రూపులను "కార్పొరేషన్లు" అని అంటాము.

## గుత్త వ్యాపారము మొనాపలీ; పోటీ

స్వేచ్ఛగా పోటీపడటం పోయి, కాపిటలిస్టులు గుత్తసంస్థలు ఏర్పడటం సామ్రాజ్యవాద శకంలోని ప్రప్రధాన గుణము. మార్క్సుకూడా స్వేచ్ఛ పోటీపద్ధతి పోయి గుత్త వ్యాపార పద్ధతి వస్తుందని తెలియజేశాడు. కాని గుత్త వ్యాపారం స్వేచ్ఛా వ్యాపారాన్ని, స్వేచ్ఛాపోటీని నాశనంగావిస్తుంది. ఒక సరుకుయొక్క మొత్తం ఉత్పత్తిపై కంట్రోలును సంపాదించ గుత్తసంస్థ ప్రయత్నిస్తుంది. ఈ విధంగా గుత్తాధికారులు ఏర్పడటంవల్ల అశేష శ్రామిక జనసామాన్యమును మరింత దోచుకోవటంద్వారా కాపిటలిస్టుకు తమలాభాలను పెంచుకొనుటకు లెక్కలేనన్ని అవకాశాలు ఏర్పడగలవు.

గుత్త సంస్థలు ఏర్పడటం మూలకంగా కాపిటలిస్టుల మధ్య పోటీ తగ్గదు సరికదా మరింత తీవ్రమవుతుంది. స్వేచ్ఛ పోటీ పద్ధతిలో ప్రత్యేక కాపిటలిస్టులు పోటీపడటం పోయి కాపిటలిస్టు సంఘాలకు సంఘాలే, ముఠాలకు ముఠాలే పోరాటంలోకి ప్రవేశించుతాయి. తమతోజేరక తిరుగుబాటు చేసిన సంస్థలను (వీటినే పొగరుబోతు సంస్థ లంటారు) నాశనంజేయ గుత్త సంస్థలు తీవ్రంగా ప్రయత్నించుతాయి. ఈ పోరాటాలలో అన్నిరకాల కుచ్చితాలూ ఉపయోగించబడుతాయి. ఆఖరుకు ఎదిరి సంస్థకు క్రింద గోతులు త్రవ్వి దానిని కూల్చివేస్తావికికూడా గుత్తసంస్థలు వెరవవు. ఇంతేగాక, ఒక గుత్తసంస్థ తన సరుకు ధరను పెంచినదంటే దాని సరుకును ఉపయోగించే లేక కొనే ఇతర పరిశ్రమలన్నీ దానిపైకి తగువుకు వస్తాయి. లేదా ఈ సరుకుకు బదులు మరొకసరుకును వాడటం మొదలుపెట్టుతాయి. ఉదాహరణకు: బొగ్గుగనుల గుత్తసంస్థ బొగ్గుధర పెంచినదనుకొందాము. వెంటనే రాక్షసబొగ్గును, వంటబొగ్గును ఉపయోగించే పరిశ్రమలు తమ సొంతానికి గనులను సంపాదించుకొనుటకు ప్రయత్నిస్తాయి. లేదా బొగ్గుబదులు నూనె, ఊక, వంటచెరకు మున్నగు వాటి నుపయోగిస్తాయి. లేదా ఎలక్ట్రిసిటీని ఉపయోగించ మొదలిడుతాయి. ఈ విధంగా వివిధ పరిశ్రమల మధ్య చావు బ్రతుకుల పోరాటం ప్రారంభమవుతుంది. పరిశ్రమలు కేంద్రీకరింపబడినకొలదీ గుత్తవ్యాపారబలం వృద్ధియౌతుంది. కాపిటలిస్టుల అంతర్యుద్ధం విజృంభించుతుంది.

గుత్తసంస్థల మధ్యనేకాదు, గుత్త సంస్థలలోకూడా తీవ్ర పోరాటం ప్రారంభమౌతుంది నిన్న మొన్నటివరకూ పోటీలుపడి ఈ రోజున కార్టెల్సు, సిండికేట్లు, ట్రస్టులు మున్నగువాటిలో భాగస్వాములుగా జేరినా, ఎవరికివారే లాభాలెక్కువ

సంపాదించాలని చూస్తారు. ఇందుకై చాటుమాటు పద్ధతులెన్నో అవలంబించబడ తాయి: ఎప్పుడోగాని ఈ రహస్య పోరాటం బయటపడదు.

కాబట్టి పోటీనుండి గుత్తవ్యాపార పద్ధతులు ఉత్పన్నమగుటయేగాక, "గుత్తవ్యాపార పద్ధతులలోగూడా బహు తీవ్రమైనట్టి, దీర్ఘమైనట్టి పోటీ ఏర్పడటం చూడగలము."

"కాపిటలిజంయొక్క, సామాన్యంగా సరుకుల ఉత్పత్తి విధానంయొక్క మూలగుణం పోటీ. గుత్తవ్యాపారం స్వేచ్ఛ పోటీకి పూర్తిగా వ్యతిరేకం. కాని మన కళ్ళఎదుటే స్వేచ్ఛ పోటీ గుత్తవ్యాపారం పద్ధతిలోకి మారటంజరిగింది. చిన్న చిన్న పరిశ్రమలు పోయి భారీపరిశ్రమలు రావటం, ఇవిపోయి బ్రహ్మాండమైన పారిశ్రామిక సంస్థలురావటం; ఇందుమూలంగా కాపిటల్, ఉత్పత్తి కేంద్రీకరింప బడటం జరిగింది. కార్టెల్సు, సిండికేట్లు, ట్రస్టులు వీటిలో కోట్లకొలది వ్యాపారం గావించే ఏ పది, పన్నెండు బ్యాంకులో ఏకంకావటం, వీటి అన్నిటి మూలకంగా గుత్త వ్యాపారం ఏర్పడుతుంది. స్వేచ్ఛ పోటీ పద్ధతినుండి గుత్తవ్యాపారం పద్ధతి వచ్చినా, మొదటిదానిని రెండవది పూర్తిగా రద్దుగావించదు. రెండూ తోడుగా జరుగుతూ వుంటాయి. ఇందువల్ల ఎన్నో తగాదాలకు, ఘర్షణలకు, విరోధాలకు దారి ఏర్పడుతుంది." *

## గుత్త వ్యాపారపు కాపిటలిజమే సామ్రాజ్యవాదం

స్వేచ్ఛ పోటీ పద్ధతినుండి ఉత్పన్నమై, దానిని రద్దుగావించకుండా, దానిని మరింత తీవ్రంజేసే గుత్తవ్యాపారం సామ్రాజ్యవాదం యొక్క ప్రప్రధాన గుణం అని లెనిన్ నొక్కినొక్కి తెలియజేశాడు. సామ్రాజ్యవాదమంటేనే గుత్త వ్యాపారపు కాపిటలిజం. కాపిటల్‌యొక్క ఆఖరు దశయే సామ్రాజ్యవాదమని లెనిన్ తెలియజేశాడు ఈ విధంగా స్వేచ్ఛపోటీ పద్ధతిబదులు గుత్తవ్యాపార పద్ధతి రావటమే సామ్రాజ్యవాదం. సామ్రాజ్యవాదం కాపిటలిజంలో ఒక ప్రత్యేక దశయని తెలియజేస్తూ లెనిన్ ఈ క్రిందివిధంగా వ్రాశాడు:

సామ్రాజ్యవాదాన్ని సూక్ష్మరూపంలో వివరించాలంటే, కాపిటలిజం యొక్క గుత్తవ్యాపార పద్ధతి దశ అని చెప్పవచ్చును. అంటే, ఈసరికి పారిశ్రామికుల ఐక్య గుత్తసంస్థలతో బ్యాంకు గుత్తసంస్థలు లీనంగావటం ఒకవైపు, ఖాళీగా వున్న వలస దేశాలను ఆక్రమించుకోవటం పూర్తిఅయి, ప్రపంచ కాపిటలిస్టు దేశాల మధ్య పంచుకోవటం పూర్తిఅయి, ఆ వలసదేశాలపై గుత్త అధికారాన్ని చలాయించటం మరోవైపున జరుగుతుంది.

మరోచోట లెనిన్ ఇట్లా వ్రాశాడు :

"సామ్రాజ్యవాదమంటే (ఫైనాన్సు కాపిటల్‌శకం అనవచ్చు. మాటల

---

* "సామ్రాజ్యవాదం కాపిటలిజం" లెనిన్ గ్రంథంనుండి.

కొరకై దెబ్బలాడ నక్కరలేదు.) ఆర్థిక శాస్త్రరీత్యా, కాపిటలిజంయొక్క ఉచ్ఛదశ ఈ దశలో ఉత్పత్తి ఎంత భారీగా జరుగుతుందంటే "స్వేచ్ఛా పోటీపద్ధతికి బదులుగా గుత్త వ్యాపారపద్ధతి వస్తుంది." సామ్రాజ్యవాదంయొక్క ఆర్థికసారం ఇదే. ట్రస్టులు, సిండికేట్లు వగైరాలద్వారాను, బ్రహ్మాండమైన బ్యాంకుల సర్వశక్తిత్వముద్వారాను, ముడిసరుకుల మూలస్థానములను కాజేయటంద్వారాను, బ్యాంకు కాపిటల్ సమీకరణ వగైరాల ద్వారాను గుత్తవ్యాపారం దోతక్యమౌతోంది. అసలు విషయమేమిటంటే ఆర్థికరీత్యా గుత్తవ్యాపారం పద్ధతిప్రబలతుంది" *

సామ్రాజ్యవాదమును గూర్చిన విమర్శనలో లెనిన్ సిద్ధాంతములకు సోషల్ డెమాక్రాటు సిద్ధాంత కర్తయైన హెల్ఫర్డింగు సిద్ధాంతములెలకు ఇక్కడనే ప్రధానమైన భేదం కన్పిస్తుంది. కాపిటలిజంలో అంతకంతకూవచ్చే మార్పులను హెల్ఫర్డింగు గుర్తించాడు. అతడు చూచేదల్లా, మారకంలో అందులోనూ ముఖ్యంగా అరువు పద్ధతిలోనూ, బాంకింగు రంగంలోనూవచ్చే మార్పులను మాత్రమే. ఈ విధంగా మార్క్స్ సిద్ధాంతాలను తారుమారు చేస్తాడు. వుత్పత్తి పద్ధతియే ప్రప్రధానమైనదనీ, బాధ్యవిర్ణీతయనీ గుర్తించక, చలామణీయే అన్నిటికన్న ముఖ్యంఅని వాదిస్తాడు. ఈజబ్బు సోషల్‌డెమోక్రట్ల కందరకూవున్నదే. ఈవిధంగా మారకాన్నిగూర్చిన దృక్పధంవల్లనే దీనితోబాటుగా ధనాన్నిగూర్చి, విలువనుగూర్చి, ఆర్థికసంక్షోభములంగూర్చివున్న తప్పుడు అభిప్రాయములవల్లనే హెల్ఫర్డింగు ప్రధమ ప్రపంచయుద్ధానికి పూర్వమే పప్పులోకాలువేసి, అవకాశవాదంలో పూర్తిగా దిగబడిపోయాడు. దేశంలోని ప్రధానమైన 5, 6 బెర్లిన్ బ్యాంకులనుగనుక స్వాధీనం జేసుకొన్నట్లయితే దేశాన్నంతటినీ స్వాధీనం జేసుకోవచ్చునన్నంత చులకనగా విప్లవాన్నిగూర్చి హెల్ఫర్డింగ్ యుద్ధానికి పూర్వం చెపుతూ వుండేవాడు. ఈవిధంగా సమస్యను చూపటమంటే, శ్రామికవర్గ విప్లవప్రాధాన్యతను కాపిటలిస్టులతో ఎంత తీవ్రంగా పోరాడాలో, పరిపాలనాయంత్రాన్ని స్వాధీనం చేసుకొని శ్రామికవర్గ నియంతృత్వాన్ని ఎట్లా ఏర్పర్చాలో వుత్పత్తిని ఎట్లు అదుపులో వుంచుకోవాలో ఈ విషయాలనన్నిటినీ హెల్ఫర్డింగు నిరసిస్తున్నాడన్నమాట. విప్లవానంతరం అడుగడుగుకూ శ్రామికవర్గం కాపిటలిస్టుల తీవ్రప్రతిఘటన నెదుర్కోవలసి వుంటుందనే విషయాన్నికూడా హెల్ఫర్డింగు సిద్ధాంతాలు గుర్తించుటలేదు. ప్రధమ ప్రపంచయుద్ధానంతరం హెల్ఫర్డింగు పూర్తిగా ద్రోహియైపోయి, 'సంఘటిత కాపిటలిజం' అనేసిద్ధాంతాన్ని లేవదీశాడు. మారకాన్నిగూర్చిన దృక్పధం పర్యవసానంగానే ఈ 'సంఘటిత కాపిటలిజం' సిద్ధాంతం బయలుదేరింది. ఈ సిద్ధాంతాన్నిగూర్చి ముందు ముందు వివరంగా విమర్శన చేయగలము.

---

* "సామ్రాజ్యవాద ఆర్థికవాదము" అనే లెనిన్‌గ్రంథం నుండి.

## ప్రధాన కాపిటలిస్టు దేశాలలో గుత్తసంస్థలు

అమెరికాలో గుత్తసంస్థలు విపరీత వేగంతో విస్తరించినవి. అందుచేతనే అమెరికాను "ట్రస్టులదేశం" అని అంటారు. వుత్పత్తిలో అత్యధికభాగం ఈ గుత్త సంస్థల చేతులలోనే వున్నది. మొత్తం నూనెవుత్పత్తిలో 95% ఈ నూనె గుత్త సంస్థల చేతులలోనేవున్నది. 1882లో 5% లాభంవచ్చేది. 1900 నాటికి ఈట్రస్టులకు 42% లాభం వస్తున్నది. కెమికల్ ట్రస్టుల చేతులలో 81%, సీసం ట్రస్టుల చేతులలో 85% ఈవిధంగా ట్రస్టుల చేతులలో వుత్పత్తిలో అత్యదికభాగం సమీకరించబడి వుంది. ప్రపంచంలో గొప్ప కాపిటలిస్టు సంస్థలలో యునైటెడ్ స్టేట్సు కార్పొరేషన్ ఒకటి. 1902లో దీని క్రిందవుండే కాపిటల్ 150 కోట్లడాలర్లు. ఈకాపిటల్ 1929 నాటికి 250 కోట్ల డాలర్లకు పెరిగింది; మొత్తం 147 పరిశ్రమాగారాలు దీనిక్రిందవున్నవి. ఆర్థిక సంక్షోభ కాలంవరకూ ఈకార్పొరేషన్ యేడాదికి 1 కోటి 60 లక్షల టన్నుల ముడియినుమును 2 కోట్లటన్నుల ఉక్కును, అనగా ఈలోహాల మొత్తం వుత్పత్తిలో 40%ను వుత్పత్తి జేస్తూవుంది. 2,76,000 మంది దీనిలో వియోగింపబడివున్నారు. అమెరికన్ టెలిగ్రాఫ్, టెలిఫోన్ కంపెనీలోకూడా ఇంత సంఖ్యయే వియోగింపబడివున్నది. దేశం మొత్తముమీదవున్న టెలిగ్రాఫ్, టెలిఫోను సంబంధాలలో 80%-85% వరకూ ఈ కార్పొరేషను చేతులలో వున్నవి. బ్రహ్మాండమైన 3ట్రస్టుల చేతులలో దేశంమొత్తం ఉక్కువుత్పత్తిలో 3/4వంతులు వుత్పత్తి కేంద్రీకరింపబడివున్నది. ఎలక్ట్రికల్ పరిశ్రమలో జనరల్ ఎలక్ట్రికల్ కంపెనీ అనే ఒక్క ట్రస్టు ఎంతో ప్రాథాన్యతను వహిస్తున్నది. పంచదార, పొగాకు పరిశ్రమలలో 80% ఆయా పరిశ్రమల ట్రస్టుల చేతులలో వున్నది.

అమెరికన్ నూనె ట్రస్టుకు 100 కోట్ల డాలర్లకుపైగా కాపిటల్ వున్నది. ఆటోమోబైల్ (చలన యంత్రాలు) పరిశ్రమలో దాదాపు 20 కంపెనీలున్నవి. వీటిలో 5 పెద్ద కంపెనీల చేతులలో మొత్తం పరిశ్రమలో 3/4 వంతులు వున్నవి. ఈ 5 పెద్ద కంపెనీలలోనూ రెండు మరీపెద్దవి. వీటిమధ్య చాలా దారుణమైన పోరాటం జరుగుతూ వున్నది. ఒకటి ఫోర్డు కంపెనీ, రెండవది జనరల్ మోటార్సు కంపెనీ. ఫోర్డు కంపెనీ కాపిటల్ 100 కోట్ల డాలర్లు: జనరల్ మోటార్సుది 150 కోట్ల డాలర్లు: 1926 లో ఆటోమోబైల్ యంత్రాల నమ్మటం ద్వారా జనరల్ మోటార్సు ఆదాయం 100 కోట్ల డాలర్లు: ఫోర్డు ఆదాయం 75 కోట్ల డాలర్లు. వీరి నికర లాభం జనరల్ మోటార్సుకు 18 కోట్లు, ఫోర్డుకు 10 కోట్లు.

అమెరికాలో అల్లిబిల్లిగా అల్లుకొనివున్న రైల్వేరోడ్లన్నీ కొలదిమంది కుబేరులవి. 1927లో మోర్గన్ బ్యాంకింగుముఠా చేతులలో 22,000 మైళ్ళ రైల్వే లైనువుంది. దీని విలువ 360 కోట్ల డాలర్లు.

అమెరికన్ బ్యాంకులకు పరిశ్రమలలో చాలా ఎక్కువ సన్నిహితత్వం

వుంది. బ్యాంకులకంట్రోలులో చాలా పరిశ్రమలువున్నవి. ఒక్క మోర్గన్ బాంకింగు ముఠా కంట్రోలులోనే 7,400 కోట్లడాలర్ల కాపిటల్ గలిగిన పరిశ్రమలున్నవి.

ఆర్థిక సంక్షోభం దెబ్బతో బ్రహ్మాండమైన ట్రస్టులుకూడా బీటలువారి పగిలిపోగలవు. ఫోర్డు కంపెనీ ఉదహరణయే చాలును. 1929 ఆర్థిక సంక్షోభానికి ముందు 1,20,000మంది ఫోర్డు పరిశ్రమాగారాలలో వియోగింపబడితే, 1932లో 15,000 మంది మాత్రమే వియోగింపబడ్డారు. ఇతర గుత్త సంస్థలుకూడా ఇట్టిపరిస్థితిలోనే వున్నవి. క్రూగర్ అగ్గిపెట్టెలట్రస్టువంటి బ్రహ్మాండమైన సంస్థలెన్నో దివాళా తీసినవి. సోవియటు యూనియన్ వ్యవహారాలలో జోక్యంకల్గించుకోవాలని వదరే డెటర్డింగువంటి బ్రిటిషు నూనె పారిశ్రామికరాజు ఎప్పుడూ చిక్కులలో పడుతూనే వుంటాడు.

జర్మనీలో ప్రధమయుద్ధానికి పూర్వం స్టీల్ (ఉక్కు) యూనియన్ చేతులలో మొత్తం ఉక్కు ఉత్పత్తిలో 9/10 వంతులు వుండేది. జర్మనీలోకెల్ల భాగ్యవంతమైన రైన్‌లాండు ప్రాంతం బొగ్గుగనులలో 87% (తర్వాత 95%) వరకూ బొగ్గు పరిశ్రమ రైనిష్, వెస్టు ఫాలియన్‌కోల్ సిండికేటు కంట్రోలులో వుండేది. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం జర్మనీలో స్టిన్నిస్ కార్పొరేషన్ చాలా ప్రాముఖ్యత వహించినది. యుద్ధావసరాలకు సప్లయిగావించటంమూలకంగా స్టిన్నిస్ విశేష లాభాలు గడించాడు. యుద్ధానంతరం మార్కు * లలో ఇన్‌ఫ్లేషన్ (నోట్లముమ్మరం) వచ్చింది. దీనితో దాదాపు ఊరికేనన్నట్లుగా స్టిన్నిస్ అనేక పారిశ్రామిక సంస్థలను కొనివేశాడు. బొగ్గుగనులు, ఎలక్ట్రిక్ సప్లయి ఫాక్టరీలు, టెలిగ్రాఫ్ ఏజన్సీలు, బ్యాంకులు, కాగితం మిల్లులు, ఓడలలైనులు, లోహ పరిశోధన పరిశ్రమలు, వార్తాపత్రికలు ఇవి అవి యననేల: అనేక ప్రధాన పరిశ్రమలను కొనివేశాడు. మార్కు విలువ ఎప్పుడైతే విలకడ జేయబడిందో ఈ బ్రహ్మాండమైన సంస్థ లక్షలకొలది కార్మికులను వియోగించే సంస్థ కాస్తా దివాళాతీసింది.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం జర్మనీలో గుత్తసంస్థలు కేంద్రీకరణ మరీ వేగంగా జరిగింది. 1928 నాటికి స్టాక్ కంపెనీలలో 2/3 వంతులు కార్పొరేషన్లుగా ఐక్యమైనవి. దాదాపు అదే సమయానికి రెండు బ్రహ్మాండమైన ట్రస్టులు -కెమికల్ ట్రస్టు, ఉక్కు ట్రస్టు- ఏర్పడినవి. కెమికల్ ట్రస్టు కంట్రోలులో 120 కోట్లమార్కులు ఉన్నవి. మొత్తందేశంలోవున్న రంగుల పరిశ్రమలో 80% నత్రజని వుత్పత్తిలో 72% ఈ ట్రస్టు చేతులలో వున్నవి. ఉక్కు ట్రస్టు కాపిటలు 80 కోట్ల మార్కులు. ఆర్థిక సంక్షోభంవరకూ దీనిక్రింద 1,50,000 మంది పని

---

* మార్కు జర్మనునాణెం. ప్రధమ ప్రపంచ యుద్ధానంతరం ఇన్‌ఫ్లేషన్ రోజులలో మార్కుల విలువ విపరీతంగా పడిపోయింది. మార్కునోటు, అనోటు అచ్చువేయబడ్డ కాగితం విలువకన్న చవుకమై పోయింది. (అనువాదకుడు)

జేస్తూ వుండేవారు. జర్మనీ మొత్తంలో వుత్పత్తి అయ్యే ముడిఇనుము; ఉక్కులో నగం ఈ ట్రస్టు యే వుత్పత్తి గావిస్తున్నది.

ఇదేపరిణామాన్ని సరిగ్గా ఇతర కాపిటలిస్టు దేశాలలోకూడా చూడగలం. ఇంగ్లండు, జపాను, ఫ్రాన్సు, ఇటలీ, ఆఖరుకు స్వీడన్, బెల్జియం మున్నగు చిన్న కాపిటలిస్టు దేశాలలోగూడా కొలదిమంది డైరక్టర్లచే నడపబడే కొద్ది సంఖ్యగల బ్రహ్మాండమైన ట్రస్టుల చేతులలో ఆర్థికంపై కంట్రోలు కేంద్రీకరింపబడి వున్నది.

జారుకాలంనాటి రష్యాలోకూడా గుత్తసంస్థల ప్రాబల్యం చాలా హెచ్చుగా వుండేది. డోనెట్సు బేసిన్‌లో వుత్పత్తిఅయ్యే రాక్షసి బొగ్గులో సగానికిపైగా ప్రాడుగల్ సిండికేటు చేతులలో వుండేది. దేశం మొత్తంమీద జరిగే ఇనుము వ్యాపారంలో 95% కుపైగా ప్రోడామెట్ సిండికేటు చేతులలోవుండేది. మొట్ట మొదటగా స్థాపింపబడిన సిండికేట్లలో పంచదార సిండికేటు ఒకటి.

## ఫైనాన్సు కాపిటల్

సామ్రాజ్యవాద కాలంలో బ్యాంకులు వహించే నూతన పాత్రతో గుత్త సంస్థల పలుకుబడి, ప్రాముఖ్యత చాలాఎక్కువ విస్తరించుతుంది. బ్యాంకులు మొట్ట మొదటగా ఒకరినుండి ఒకరు ఇచ్చిపుచ్చుకునేదానికి సాధనంగా వుండేవి క్రమంగా ఇవి ఋణములీయటం ప్రారంభించినవి. తాత్కాలికంగా తాము ఉపయోగించని కాపిటల్‌ను కొందరు కాపిటలిస్టులు బ్యాంకులలో దాచుకొంటారు. ఈ కాపిటల్‌ను ఆ సమయంలో అవుసరంగా కోరుచున్న మఱికొందరు కాపిటలిస్టులకు బ్యాంకు ఋణమిస్తుంది. ఇంతేగాక, ఇతరుల ఆదాయాలనుకూడా వసూలు చేసుకొనివచ్చి కాపిటలిస్టులకు అప్పులనిస్తుంది.

కాపిటలిజం వృద్ధియైనకొలదీ, పరిశ్రమలవలెనే కూడా ఐక్యమై వాటి వ్యాపారాన్ని ఎక్కువగా వృద్ధిబొందించగలవు. వాటి కాపిటల్ బ్రహ్మాండంగా పెరుగుతుంది. ఇందులో అత్యధికభాగం ఇతరులదే కాని బ్యాంకు సొంత కాపిటల్, కూడా త్వరత్వరగా పెరుగుతుంది చిన్నచిన్న బ్యాంకులు పెద్ద బ్యాంకులచే మ్రింగి వేయబడును. ఈవిధంగా బ్యాంకులసంఖ్య తగ్గుతుంది. సంఖ్య తగ్గటమేగాక సైజుగాని, కాపిటల్ పరిమాణంగాని అమితంగా పెరుగుతుంది ఒక్కచిన్న ఉదాహరణమబట్టి దీనిని తెలుసుకొనవచ్చును 1890 నుండి 1912 నాటికి ఇంగ్లాండులోవున్న బ్యాంకులు 104 నుండి 44 కు తగ్గినవి కాని ఇదేసమయంలో బ్యాంకు కాపిటల్ £ 43 కోట్లనుండి £ 83 కోట్లకు పెరిగింది * ఇంత పెద్ద మొత్తాన్ని కాపిటల్‌గా కల్గిన తర్వాత చిన్న చిన్న పరిశ్రమదారులకు స్వల్పకాలు వాయిదాలపై అప్పులివ్వటంతో సరిపోదు. కాపిటలు పూర్తిగావినియోగింపబడాలంటే,

---

* £ అనగా పౌను స్టెర్లింగుకు గుర్తు. పౌను స్టెర్లింగు ఇంగ్లీషు నాణెము, ప్రస్తుతం రు. 13-6-4 లు ఒక పౌను స్టెర్లింగు. (అనువాదకుడు)

"బాంకులు పరిశ్రమలతో ఇంకా సన్నిహితత్వాన్ని ఏర్పర్చుకోవాలి" కాబట్టి వుత్పత్తిని పెంచుకుంటానికి దీర్ఘకాల వాయిదాలపై అప్పుల నివ్వటంద్వారా బాంకులు పరిశ్రమలలో కొంత పెట్టుబడిపెట్టి ప్రారంభించును

పరిశ్రమలలో బ్యాంకులు పెట్టుబడి పెట్టుటకు జాయింటు స్టాకుకంపెనీల నిర్మాణం వీలు కలుగజేస్తుంది. బ్యాంకులు చేయవలసిందల్లా స్టాకుకంపెనీ వాటాల్లో కొన్ని వాటాలను కొనటమే. మొత్తం స్టాకులో 1/3 వంతు గనుక కంట్రోలులోనికి తెచ్చుకున్నట్లయితే మొత్తం కంపెనీలపై పెత్తనాన్ని చలాయించవచ్చును. ఈ విధంగా బ్యాంకులు, పరిశ్రమల మధ్య లంకెనేర్పరచడానికి జాయింటు స్టాకు కంపెనీలు బాగా ఉపయోగపడగలవు. అదేవిధంగా జాయింటు స్టాకు కంపెనీలు అభివృద్ధి అగుటకూ, ప్రయివేటు యజమానుల స్వంతంగావుండే పరిశ్రమలు (కొత్త సూత్రాలపై) పునర్నిర్మింపబడుటకూ, కొత్త స్టాకు కంపెనీలు ఏర్పడుటకూ బ్యాంకులు సహాయపడగలవు. వాటాలను కొనడం, అమ్మటం బ్యాంకులద్వారానే జరగటం అంతకంతకూ ఎక్కువౌతుంది.

బ్యాంకింగులో కేంద్రీకరణ, సమీకరణల సూత్రం మరింత స్ఫుటంగా కన్పిస్తుంది. పెద్ద కాపిటలిస్టు దేశాలలో బ్యాంకుల వరుసనంతటినీ ఏ నాల్గు, ఐదు పెద్ద బ్యాంకులో కంట్రోలు చేస్తాయి తక్కిన చిన్నచిన్న బ్యాంకుల స్వాతంత్ర్యం నామమాత్రమైనదే అవన్నీ ఈ పెద్ద బ్యాంకులకు తైనాతీలుగా వుండేవే: లేదా అవి చాలా స్వల్ప వ్యాపారాన్నే జేస్తూ అల్పమైన పాత్రనువహించుతూ వుంటాయి. ఈ బ్రహ్మాండమైన బ్యాంకులు గుత్త పారిశ్రామిక సంస్థలతో దగ్గర సంబంధాలను కలిగి వుంటవి. క్రమంగా బ్యాంకు కాపిటలు పారిశ్రామిక కాపిటలుతో లీనమైపోతుంది. ఈ విధంగా లీనమైనపుడు ఫైనాన్సు కాపిటలు అవి అంటాము. ఇది సామ్రాజ్యవాదం యొక్క ఒక విశిష్టమైన లక్షణం. అంచేతనే సామ్రాజ్యవాద దశను ఫైనాన్సు కాపిటలు శకం అంటాము

ఈ విధంగా గుత్త వ్యాపారం, ఫైనాన్సు కాపిటలు అభివృద్ధి కావటం ద్వారా మొత్తం కాపిటలిస్టు ప్రపంచముయొక్క అదృష్టమంతా కొలదిమంది కుబేరుల చేతులలో వుంటుంది. బ్యాంకు కాపిటలు పారిశ్రామిక కాపిటలుతో లీనం కావటంవల్ల పెద్దపెద్ద బ్యాంకర్లు పరిశ్రమలపై పెత్తనాన్ని చలాయించుటకు, పారిశ్రామికాధిపతులు డైరెక్టర్లు అగుటకు అను వేర్పడుతుంది. ప్రతి కాపిటలిస్టు దేశం యొక్క ఆర్థిక జీవితం, భవిష్యత్తు అంతా కొలదిమంది బ్యాంకర్ల, గుత్త వ్యాపారుల చేతులలో ఇమిడివుంటుంది. ఆర్థిక జీవితాన్ని నిర్ణయించేదే దేశ జీవితము నంతటినీ నిర్ణయించుతుందిగదా, కాబట్టి కాపిటలిస్టు దేశాలలో సామ్రాజ్యవాద కాలంలో, ప్రభుత్వం ఏ రూపంలోనైనా వుండనీయండి, అది నియంతృత్వం కానీయండి, ప్రజాస్వామ్యం కానీయండి, రాజరికం గానీయండి—"అధికారమంతా" కొలదిమంది యైన కుబేరుల చేతులలో వుంటుంది: అధికారయుతమగు ప్రభుత్వం ఈ కాపిటలిస్టు

ప్రభువుల చేతులలో కీలుబొమ్మగా వుంటుంది. ఆ దేశాలలో బహు ముఖ్యమైన సమస్యలు కూడా ఈ కాపిటలిస్టు ప్రభువుల ఇష్టానిష్టాల ప్రకారం పరిష్కరింపబడుతూ వుంటాయి. తమ స్వలాభములకై ఈ ధనాఢ్యులు దేశాలకు దేశాలకూ మధ్య తగవులను పెట్టుటకు, యుద్ధాలను ప్రేరేపించుటకు, కార్మికోద్యమము నణగద్రొక్కుటకు వలనదేశ ప్రజల తిరుగుబాటును అణచివేయుటకు సమర్థులవుతారు

గుత్త సంస్థ లేర్పడడంవల్ల కోట్లకొలది ప్రజల జీవితాన్ని కొద్దిమంది ధనాఢ్యులు శాసిస్తున్నారు. జర్మనీలో బ్రహ్మాండమైన బ్రస్టులగు జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీ డైరెక్టరగు రథెనా ఒక పర్యాయం ఈ విధంగా బహిరంగంగా తెలియజేశాడు.

"ఒకరితో మరొకరికి బాగా పరిచయం వున్న 300 మంది మనుష్యులు మొత్తం ప్రపంచాన్నంతటినీ పరిపాలిస్తున్నారు. వారి వారసులను కూడా వీరే తమ వర్గంనుండి నిర్ణయిస్తూ కూడా వుంటారు."

ఉదాహరణకు : ఫ్రాన్సులో 50, 60 పెద్ద ధనాధిపతులు 108 బాంకులకు, 105 బ్రహ్మాండమైన భారీ పరిశ్రమలకు (అంటే ఇనుము, బొగ్గు వగైరా పరిశ్రమలు) 101 రైల్వే కంపెనీలకు, 107 యితర ప్రధాన పరిశ్రమలకు మొత్తం 421 పరిశ్రమలకు అధిపతులై యున్నారు. ఈ పరిశ్రమ లన్నింటిలోనూ కలిసి వంద కోట్ల ఫ్రాంకుల* కాపిటలు వున్నది. సంపదంతా కొలదిమంది చేతులలో కేంద్రీకరింపబడుట కూడా చాలా త్వరగా జరుగుచున్నది. ఇంగ్లండులో మొత్తం జనాభాలో 0.12% అయిన యజమానుల చేతులలో మొత్తం సంపదలో 38% వున్నది. 2% మంది చేతులలో 64% సంపద కేంద్రీకరింపబడి వున్నది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో జనాభాలో 1% అయిన వారి చేతులలో దేశం మొత్తం సంపదలో 59% సంపద కేంద్రీకరింపబడి వున్నది.

## కాపిటల్ ఎగుమతి

స్వేచ్ఛా వాణిజ్యం, పోటీల కాలంలో అంతర్జాతీయ వాణిజ్యం వృద్ధియౌతుంది. సరుకుల ప్రవాహం విపరీతంగా ఒక దేశాన్నుండి మరొక దేశానికి ప్రవహించుతుంది. గుత్తవ్యాపార కాలములో "కాపిటలే ఎగుమతి కావటం" బహు వేగంగా పెరుగుతుంది.

కాపిటలు నెగుమతి చేయటం సామ్రాజ్యవాదంలోని ఒక ప్రధాన గుణం. గుత్త వ్యాపారం పెరిగినకొలదీ కాపిటలు ఎగుమతి వృద్ధియౌతూ వుంటుంది. గుత్త వ్యాపారంలో విశేష లాభాలు వస్తాయి. కాపిటల్ "అదనంగా" మిగులుతుంది. ఇంతేగాక, స్వదేశాలలో గుత్త సంస్థ లేర్పడినవి గనుక ఇంక పెట్టుబడి పెట్టుటకు ఆ కాపిటలిస్టు దేశాలలో వీలుగాదు. కాబట్టి ఇతర ప్రదేశాలను వెతుక్కుంటూ బయలు

---

* ఫ్రాంకు ఫ్రెంచినాణెము.

దేరుతారు. ఇందుకు చక్కటి అవకాశాన్ని ఇచ్చే ప్రదేశాలు వెనుకబడ్డ దేశాలు. అక్కడ కూలిరేట్లు తక్కువ. ఎక్కువ గంటలు పనిచేయించుకోవచ్చు. పెట్టుబడి దారులు అక్కడి ముడి సరుకులను పూర్తిగా కొల్లగొట్టని కారణాన అవి యింకా లభ్యమవుతూనే వుంటాయి. మార్కెటు అవకాశముకూడా చాలా హెచ్చు. లక్షల కొలదిగా వుండే స్వల్ప వుత్పత్తి దారులు ఏమైతేనేమి గృహ పరిశ్రమలను నాశనం గావించి యంత్రోత్పత్తి వస్తువులను విరివిగా అమ్ముకోవచ్చును. ఈ దేశాలలో కూడా గుత్త సంస్థలు సర్వాధికారాలను కలిగివుండి, ఇతర దేశాల కాపిటలిస్టులను చొరనివ్వరు. ఇతర సరుకుల దిగుమతికి అభ్యంతరకరంగా హెచ్చు సుంకాలను విధిస్తారు. ఇదే సమయంలో ఈ విధంగా ఇతర దేశాల మార్కెట్లను కొల్లగొట్టు చున్న సమయంలోనే కాపిటలిస్టుల స్వదేశాలలోని మార్కెటు, ఆ దేశాలలో బ్రహ్మాండంగా వుత్పత్తి అయ్యే సరుకులకు చాలకపోతుంది. పైగా, గుత్త సంస్థలు ధరలను పెంచటం మూలకంగా స్వదేశంలోని మార్కెటు మరింత సంకుచితమౌ తుంది. అందుచే సరుకుల బైట మార్కెట్లకు మరింత ఎక్కువగా పంపాలి, కాని ఈ ఇతర దేశాలచుట్టూ దిగుమతి సుంకాల గోడలు అభేద్యంగా వుంటే, ఈ సరు కులనెట్లా ఆ దేశాలలో అమ్మట సాధ్యమౌతుంది? ఇట్టి పరిస్థితులలో కాపిటలును ఎగుమతి చేయటం సహాయపడుతుంది. పెద్ద కాపిటలిస్టులు తమ కాపిటలులో కొంత భాగాన్ని ఈ కొత్త దేశంలో పెట్టుబడి పెట్టి పరిశ్రమలను స్థాపించుతారు. ఈ విధంగా ఆదేశంలోని మార్కెటులోనికి తమ సరుకులను పంపగలుగుతారు. దిగుమతి సుంకాలను తప్పించుకో గలుగుతారు.

పరిశ్రమలను స్థాపించుటకే కాపిటల్ ఎగుమతి కాబడనక్కరలేదు. భాగ్య వంతమైన కాపిటలిస్టు దేశాలు, ఇతర దేశాలకు, ఋణాలివ్వటం మూలకంగా కాపిటలు ఎగుమతి కాబడుతుంది. చిన్న దేశాలను పెద్దదేశాల బానిసలుగా తొత్తు లుగా జేసుకొంటానికి యిదొక మార్గం.

ప్రథమ ప్రపంచ యుద్ధానికి పూర్వంనాటికి ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ దేశాలు ఇతర దేశాలలో పెట్టిన పెట్టుబడి బ్రహ్మాండంగా పెరిగింది. అది దాదాపు పదివేల కోట్ల ఫ్రాంకులు, ఈ కాపిటలుమీద సాలీనా వచ్చే ఆదాయం 800 లేక 1000 కోట్ల ఫ్రాంకులు.

కాపిటలు ఎగుమతివల్ల సామ్రాజ్య దేశాలకు ఎంత లాభం వుంటుందో ఈ క్రింది ఉదాహరణవల్ల తెలియగలదు. 1925 లో ఇంగ్లండు దేశం సరుకుల నెగుమతిచేసిన మొత్తం 70 కోట్లు. దీనిపై లాభం 10 కోట్లు. కాని అదే సంవత్స రంలో పరదేశాలలోని పెట్టుబడులపై వడ్డీ రూపంగావచ్చిన ఆదాయం 42 కోట్లు, అంటే సరుకుల ఎగుమతికన్న కాపిటలు ఎగుమతివల్ల 4 రెట్లు ఎక్కువ ఆదాయం వచ్చింది.

సామాన్యంగా వెనకబడ్డ దేశాలకే కాపిటలు ఎగుమతి చేయబడుతుంది.

ఆ దేశాలలో కూలి చవుక, పరిశ్రమలు తక్కువ కాబట్టి మార్కెటు అవసరాలు హెచ్చు. ప్రథమ ప్రపంచ యుద్ధ ప్రారంభం నాటికి రష్యాలో ఇతర దేశాల పెట్టుబడి మొత్తం 200 కోట్ల రూబుళ్ళు, * బొగ్గుగనులలో ఫ్రెంచి, బెల్జియం కాపిటలు ఎంత ఎక్కువగా వున్నదంటే, రష్యాలోని మొత్తం బొగ్గులో 65%ను తన కంట్రోలులో వుంచుకొన్న ప్రాదుగల్ సంస్థయొక్క శాశ్వత కేంద్ర కార్యాలయం పారిస్‌లో వుంచబడింది. రష్యాలో ఎలక్ట్రిక్ పరిశ్రమ అంతా దాదాపు జర్మను జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీ స్వాధీనం. నూనెగనులలో అమెరికా, ఇంగ్లాండు, డచ్చి దేశాల కాపిటలు అత్యధికంగా ఉంది.

కాపిటలు ఎగుమతిద్వారా ఎగుమతి దేశాల, దిగుమతి దేశాల మధ్య దగ్గర సంబంధాలు ఏర్పడుతాయి. ఎగుమతి దేశం తాను పెట్టుబడి పెట్టిన దేశాలలోని స్థితిగతులు మారకుండా ఉండాలనికోరుతుంది. అందుకనే, రష్యాలో జారుప్రభుత్వం పడిపోకుండా నిలబెట్టటానికై ఫ్రెంచి ప్రభుత్వం 1906 లో జారుచక్రవర్తికి పెద్ద మొత్తాన్ని ఋణంగా ఇచ్చి, ప్రథమ రష్యన్ విప్లవాన్ని అణచుటకై ప్రత్యక్షంగా సహాయం చేసింది.

గుత్త వ్యాపారం ఏర్పడినకొలదీ, కాపిటల్ ఎగుమతి వృద్ధియౌతుంది. దీని ప్రాముఖ్యతకూడా చాలా వృద్ధియౌతుంది.

"స్వేచ్ఛా పోటీవున్న కాపిటలిజంయొక్క పాతరూపంలో సరుకులు ఎగుమతి అయ్యేవి. గుత్త వ్యాపారంవున్న నవీన కాపిటలిజం రూపంలో కాపిటలు ఎగుమతి కావడం ప్రధానగుణంగా కన్పించుతుంది" అని లెనిన్ వ్రాశాడు.

సామ్రాజ్యవాదంలో కాపిటలు ఎగుమతి ప్రాధాన్యత వహిస్తుంది. కాని ఇంత మాత్రంచేత సరుకుల ఎగుమతి తగ్గిపోయిందనికాదు. సరుకుల ఎగుమతి మరింత వృద్ధియౌతుంది. ఉదాహరణకు ఇంగ్లాండు, అర్జెంటైనాకు కాపిటలును ఎగుమతి చేసిందనుకొందాము. అంటే అర్జెంటైనాలోని పరిశ్రమల స్టాకును ఇంగ్లాండు కొన్నదన్నమాట. ఆ స్టాకు కంపెనీలలో వుత్పత్తి అయిన సరుకులను అమ్ముచున్నదన్నమాట. ఇంకొక రూపంలోకూడా కాపిటలు ఎగుమతి కావచ్చును ఇంగ్లాండు గ్రీసుకు అప్పుయిచ్చినదనుకుందాము. ఈ అప్పు మొత్తంతో గ్రీసు ఇంగ్లాండులో యంత్రములు, రైల్వే సామాన్లు యుద్ధ సామాగ్రి వగైరాలను కొంటుంది. ఈ విధంగా కాపిటలు ఎగుమతి కావటంద్వారా సరుకుల ఎగుమతి వృద్ధియౌతుంది. ఇంతేగాక ఈ విధంగా సరుకుల ఎగుమతికై పోటీవచ్చి తీవ్ర పోరాటాలకు దారి తీస్తుంది.

## కాపిటలిస్టు సంఘాలమధ్య ప్రపంచ విభజన

సిండికేట్లు, ట్రస్టులు ధరలను పెంచి అమిత లాభాలను సంపాదించును. ఈ లాభాలను రక్షించుకొనుటకై తమ దేశాల చుట్టూ సుంకమనే కోటగోడలను

* రు బుల్ రష్యను నాణెం, షుమారు 1-10-0 ఉంటుంది. [అనువాదకుడు]

విర్మించును. ఈ విధంగా ఇతర దేశాల పోటీనుండి రక్షించుకొనుటకు చూస్తాయి. ఒక్కొక్కప్పుడు అసలు ధరకంటె ఈ సుంకముల మొత్తమే చాలా ఎక్కువగా కూడా వుంటుంది.

1927 నాటికే సగటున (సరుకుల విలువతో పోల్చినప్పుడు) సుంకముల ప్రమాణం యీ క్రిందివిధంగా వుండేది. అమెరికా సంయుక్త రాష్ట్రాలు 37%, జర్మనీ 20%, ఫ్రాన్సు 21%, బెల్జియం 15% అర్జెంటైనా 29%, స్పెయిన్ 41%, ఆస్ట్రియా 16%, జెకొస్లోవేకియా 27%, యుగోస్లేవియా 23%, హంగరీ 27%, పోలెండు 33%, ఇటలీ 22%, స్వీడను 16%, ఇది సగటు శాతమేనని మాత్రం గుర్తుంచుకోవాలి. స్వదేశంలో దొరకని సరుకుల నితర దేశాలనుండి తెప్పించు కోవాలి కాబట్టి, అట్టిసరుకులపై దిగుమతుల సుంకం స్వల్పంగా వుంటుంది, కాబట్టి ఇతర సరుకులపై ఇంకా ఎక్కువ సుంకాలు వుంటాయి. ముఖ్యంగా స్వదేశాలలో వుత్పత్తి అయ్యే సరుకులు, భోజన దినుసులు మున్నగు వాటిపై ఎక్కువ సుంకా లుంటాయి. గత కొలది ఏండ్లలోనూ ఈ సుంకాలింకా పెరిగినవి 1930 లో అమెరికాలో దాదాపు అనేక సరుకుల దిగుమతిని నిషేధించునంతగా హెచ్చు సుంకములు విధింపబడినవి. అదే సమయంలో జర్మనీలో వ్యవసాయిక దినుసులపై చాలా హెచ్చు సుంకములు విధింపబడినవి. ఈ విధంగా తూర్పు ప్రష్యాలోని జెంకర్లు (పెద్ద భూస్వాములు) తమ పంటల ధరలను పెంచుకుంటానికి వీలు కలుగ జేసికొన్నారు. ఈ సుంకాలన్నింటివల్లా బాధపడేది కొనుగోలుదారులైన ప్రజానీకం, కార్మిక వర్గం.

ఈ విధంగా దేశాంతర్గత మార్కెటు పూర్తిగా గుత్త సంస్థలపై ఆధార పడివుంటుంది. కాని, ఈ మార్కెటుకుకూడా హద్దున్నది. సామ్రాజ్యవాద కాలంలో సరుకుల వుత్పత్తి పెరిగేకొలదీ కార్మికుల దరిద్రంకూడా వృద్ధియౌతుంది కాబట్టి దేశంలో బ్రహ్మాండమైన పారిశ్రామిక సంస్థలలో వుత్పత్తి అయ్యే సరుకుల నన్నింటినీ ఖర్చు చేయలేవు. అందుచే ఇతరదేశాల మార్కెట్లకై ఎగబ్రాకటం సంభవిస్తుంది. గుత్త సంస్థల చెప్పుచేతలలో వుండే ప్రభుత్వాలమధ్య ఆయుధ సహితమైన యుద్ధాలు ప్రారంభమౌతాయి. ఈ యుద్ధాలలో బ్రహ్మాండమైన ట్రస్టులు మున్నగు గుత్త సంస్థలు పాల్గొంటాయి. ఇవి అంతకంతకూ తీవ్రమౌతాయి. కాబట్టి సామ్రాజ్యవాద దశలో ముడిసరుకుల కొరకు, కాపిటలు ఎగుమతికి అనువైన ప్రదేశాలకొరకు, ప్రపంచాన్ని పంచుకొనుటకొరకు చాటుగా మార్కెట్లకొరకు కూడా పోటీ హెచ్చి, వినాశనకరమగు యుద్ధాలకు దారి ఏర్పడుతుంది.

గుత్తసంస్థలు కొన్నిదేశాలలో ఏర్పడిన పిమ్మట ప్రపంచ మార్కెటును పంచుకోటానికై వాటిలో వాటికి అంగీకారం కుదురుటకై ప్రయత్నాలు జరుగుతాయి. ఏదో ఒక పరిశ్రమలో, మొత్తం ప్రపంచంలో ఏ రెండు, మూడు గుత్త సంస్థలో పూర్తిపెత్తనాన్ని సంపాదించినప్పుడు వాటిమధ్య అతితీవ్రమైన పోరాటం ప్రారంభ

మౌతుంది. అట్టిసమయంలో వాటిమధ్య అంగీకారం కుదుర్చుకొనుటకై ప్రయత్నాలు జరుగుతాయి. ఫలానాదేశం మార్కెటులో ఫలానాసంస్థ అమ్ముకోవాలనీ, మరో సంస్థ అక్కడ పోటీకి రాకూడదనీ అంగీకారం కుదురుతుంది. ప్రథమ ప్రపంచ యుద్ధానికి పూర్వమే ఇటువంటి అంతర్జాతీయ కార్టెల్సు ఏర్పడినవి. ఆ కాలంలో ప్రపంచమంతటికీ ఎలెక్ట్రిక్ సామాన్లను వుత్పత్తి గావించే ట్రస్టులలో అమెరికన్, జర్మను ట్రస్టులు పెద్దవిగా వుండేవి. వీటికి బ్యాంకులతో సన్నిహిత సంబంధం వుండేది. 1907లో ఈ రెండు ట్రస్టులమధ్య ఒడంబడిక కుదిరి, ఒక్కొక్క ట్రస్టు కొన్ని దేశాలను తనపరం జేసుకొన్నది. ఇదేవిధంగా అమెరికన్, జర్మన్ ఓడల కంపెనీల మధ్య ఒడంబడిక వుండేది. ఇదేవిధంగా రైల్వే, రోడ్లు, జింకు (తుత్తు నాగం) సిండికేట్లు వుండేవి. నూనె ట్రస్టులమధ్యకూడా ఒడంబడికకై సంప్రదింపులు జరుగుతూ వచ్చినవి.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం యూరపులోని అనేక దేశాలకు సంబంధించిన కార్టెల్సు ఏర్పడినవి. ఉక్కు కార్టెల్ రాళ్ళ పరిశ్రమ కార్టెల్, కెమికల్ వుత్పత్తికార్టెల్, రాగి, అల్యూమినియం, రేడియోలు, వైర్, కృత్రిమ సిల్కు, జింకు, బట్టలు, ఎనామిల్ వస్తువులు మున్నగువాటి వుత్పత్తిలో కార్టెల్సు ఏర్పడినవి. ఈ కార్టెల్సులో చాలా వాటిలో ఫ్రాన్సు, జర్మనీ, బెల్జియం, జకొస్లో వేకియా, అస్ట్రియాలుకూడ వుండేవి. కొన్నిటిలో స్విట్జర్లండు, హంగరీ, స్పెయిన్, స్కాండినేవియన్ దేశాలైన నార్వే, స్వీడనులు కూడా కలిసివుండేవి. 1929 లో ప్రారంభమైన ఆర్థిక సంక్షోభం ఈ కార్టెల్సులో చెప్పనలవికానంత విచ్ఛిన్నతను తెచ్చింది. అంతర్విభేదాలు వృద్ధియైనవి. చాలా కార్టెల్సు భగ్నం అయినవి. లేదా, భగ్నమగుటకు సిద్ధంగా వున్నవి.

ఈ అంతర్జాతీయ గుత్తసంస్థల మధ్య ఒడంబడిక కుదరటమంటే శాంతి యుతంగా తగాదాలు పరిష్కారమౌతవని అనుకోవటం వెర్రి. వాస్తవానికి ఇందుకు పూర్తిగా విరుద్ధంగా జరుగుతుంది.

"కాపిటలిస్టు గుత్త సంస్థ లెట్టిస్థాయికి పోయినవో వివిధ కాపిటలిస్టు సంఘాలమధ్య వైరుధ్యాలు ఎంత తీవ్రదశకు పోయినవో అంతర్జాతీయ కార్టెల్సు తెలియజేస్తాయి" అని లెనిన్ వ్రాశాడు.

అంతర్జాతీయ ఒడంబడికలకు స్థిరత్వంవుండదు. వాటిమధ్య పోరాటాలకు బీజాలు వాటిలోనె యిమిడి వుంటాయి. మార్కెట్లను పంచుకోవటంలో వివిధ గ్రూపులకు వాటి బలాన్ని బట్టి, పలుకుబడినిబట్టి, వాటాలు వస్తాయి. కాని ట్రస్టుల బలాబలాలు మారుతూ వుంటాయి. ప్రతి ట్రస్టు తన వాటాను పెంచుకోవాలనీ, బలాన్నివృద్ధి గావించుకోవాలనీ చాటుమాటుగా ప్రయత్నిస్తూనే వుంటుంది. ఈ బలా బలాల మార్పుతో మార్కెట్ల పునర్విభజనకై ఆందోళన బయలుదేరుతుంది. దీనితో

తీవ్రపోరాటాలు ప్రారంభమౌతాయి. కాబట్టి అంతర్జాతీయ ట్రస్టులు పోరాటాలను తగ్గించడానికి బదులుగా వీటివింకా తీవ్రం జేస్తానికే ఉపయోగ పడగలవు.

గుత్త సంస్థ, ఫైనాన్సు క్యాపిటల్‌యొక్క శకంలో కాపిటలిస్టు దేశాలచే వలస దేశాలు ఆక్రమించుకోబడటం వృద్ధియౌతుంది.

## వలసదేశాల ఆక్రమణ : ప్రపంచ విభజన

పురాతన కాలమునుండి ఐరోపాదేశాలు ఇతర దేశాలకు తీసుకొనివెళ్ళే, తుక్కు సరుకులుకూడా మూడు, నాల్గురెట్ల ధరలకు అమ్మకొని విపరీతలాభాలు సంపాదించేవి. ఆ దేశాలనుండి చాలా విలువగల వస్తువులను దోచుకొని పోయేవి. క్రమంగా బలవంతమైన రాజ్యాలు ఇతర దేశాలను జయించి స్వాధీన పర్చుకొన్నవి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు 'బ్రిటిష్ సామ్రాజ్యంలో రవి అస్తమింప'దని డంభాలు పల్కుతారు. నిజమేకూడా, బ్రిటిష్ సామ్రాజ్యం ప్రపంచమందలి అన్ని ప్రాంతాల లోనూ విస్తరించి యుండుటచే ఏదో ఒకమూల సూర్యుడు ఉదయిస్తూనే వుంటాడు. ఆర్థిక నీతిలోవున్న సదవకాశాలవల్ల కొన్ని సరుకులను సోవియటు యూనియన్ కాపిటలిస్టులకన్న చవుకగా వుత్పత్తి గావించగలదు. అక్టోబరు విప్లవంతో అనేక రకాల పరాశ్రయ జీవులు-భూస్వాములు కాపిటలిస్టులు పోయారు. దీనితో కౌలు పన్ను, లాభాలు మున్నగునవి పోవుటద్వారా వుత్పత్తి ఖర్చులు తగ్గినవి. కాబట్టి సోవియటు 'డంపింగు' వినాదం బూటకం. ఏనాడైతే కాపిటలిస్టు మార్గాన్ని వదలి సోవియటు యూనియన్ సోషలిస్టు ఆర్థిక నీతిని అవలంబించినదో, అప్పుడే కాపిట లిజంలో వుండే విదేశాల దోపిడీనికూడా విసర్జించింది.

## సామ్రాజ్యవాద కాలంలో దేశాల అసమానాభివృద్ధి : అందుకు సంబంధించిన సూత్రాలు

కాపిటలిజంలో ప్రత్యేక పరిశ్రమలు, లేదా పరిశ్రమలలోని ప్రత్యేక లాభాలు, శాఖలు "అసమానంగా ఉవ్వెత్తుగా" పెరుగుతాయి. లాభాలకొరకుపెనుగు లాట, వుత్పత్తిలో అరాచకమువల్ల పరిశ్రమాభివృద్ధి ఈ విధంగా కాక వేరు విధముగా ఎందుకుంటుంది? సామ్రాజ్యవాద కాలములో ఈ విధమైన "అసమానాభి వృద్ధి బహు స్పష్టంగా ప్రధానంగా వుంటూదాని ప్రధాన సూత్రంగా వుంటుంది"

"ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో, వివిధ భాగాలలో అభివృద్ధిక్రమం సమా నంగా వుండుటకు బదులు ట్రస్టులు, ఫైనాన్సు కాపిటలు మూలకంగా అభివృద్ధి క్రమంలో భేదాభిప్రాయాలు హెచ్చుచున్నవి, తీవ్రమౌతున్నవి" అని లెనిన్ వ్రాశాడు.

సామ్రాజ్యవాదంలో గుత్త వ్యాపారం సర్వాధికారాలు గలది. గుత్త వ్యాపారం మూలకంగా వివిధ దేశాల అభివృద్ధిలో చాలా హెచ్చుతగ్గులు వుంటాయి,

గుత్త సంస్థ లేర్పడటం మూలకంగా పారిశ్రామికంగా కొత్తగా అభివృద్ధి జెందే దేశాలు - వీటినే యువదేశాలంటాము - పెద్ద దేశాలయందు కాని వాటిని మించుటకు కూడా అవకాశాన్ని కల్గజేస్తాయి మరోమూల ఈ సంస్థల మూల కంగానే పరాశ్రమ జీవనం పెరుగుతుంది. టెక్నికల్ అభివృద్ధి అరికట్టబడుతుంది. కొన్నికొన్ని దేశాలు ముందుకు దూరుకుపోతూవుంటే కొన్నికొన్ని ముందుకు రావటానికి, అభివృద్ధి కావటానికి, అవరోధాల నేర్పరుస్తాయి.

"....కాపిటలిజంలో, వివిధ పరిశ్రమల, ట్రస్టుల, పరిశ్రమ శాఖల, లేక దేశాల అభివృద్ధి సమానంగా వుండదు. 50 ఏండ్ల క్రితం ఆ కాలంనాటి ఇంగ్లాండు బలంతో పోలిస్తే జర్మనీ బలం లెక్కలోకి రాదు. అదేవిధంగా రష్యాతో పోలిస్తే జపాను ఎక్కడుండేది? కాని ఈనాడు అవి మహారాజ్యాలు అయినవి. కాబట్టి 10, 20 ఏండ్లలోగూడా సామ్రాజ్యములమధ్య బలాబలాల తారతమ్యం మారకుండా వుంటుందని ఎవరైనా చెప్పగలరా? అనూహ్యమైన విషయం అది...." అని లెనిన్ యీ అసమానాభివృద్ధిని గూర్చి తెలియజేశాడు.

కాపిటలు ఎగుమతి మూలకంగా కొన్ని దేశాల అభివృద్ధి మందగించుటకూ, కొన్ని దేశాల అభివృద్ధి అతిశయించుటకూ, వీలు ఏర్పడుతుంది. ఆధునాతన టెక్నిక్ ఉత్పత్తి శక్తుల విపరీతాభివృద్ధి వల్ల యువదేశాలకు చక్కటి అవకాశాలు కలుగుతాయి. ఒక్క చిన్న కంతు వేయటంలో అవి పెద్ద దేశాలను అధిగమించి పోవుటకు అనువేర్పడుతుంది.

సామ్రాజ్యవాద కాలంలో ప్రపంచ పంపకం పూర్తిఅవుతుంది, పునర్విభజనకురకు పోరాటం ప్రారంభమవుతుంది. తన ప్రత్యర్థిని మించాలనే ఉద్దేశంతో ఏ దేశాని కాదేశమే అతివేగంగా బలాన్ని సమకూర్చుకొన ప్రయత్నిస్తుంది.

వివిధ దేశాల అభివృద్ధిలో వుండే అసమానత్వం సామ్రాజ్యవాద దశలో మరింత అతిశయించి, దేశాలమధ్య తగాదాలను తీవ్రం జేస్తుంది. ఇందువల్లనే సామ్రాజ్య దేశాలమధ్య ఐక్యత అసాధ్యమవుంది. కుదిరినా అది బహు చంచలంగా వుంటుంది. వివిధ దేశాల బలాబలాలు ఎప్పుడూ మారుతూ వుంటాయి. ఇందువల్ల వీటిమధ్య ఘర్షణ వృద్ధియవుతూ వుంటుంది.

సామ్రాజ్యవాద దశలో వుండే యీ దేశాలమధ్య అసమానాభివృద్ధిని గూర్చిన లెనిన్ సిద్ధాంతాలను అభివృద్ధి జేసింది స్టాలిన్. ఈ సిద్ధాంతాన్ని అంగీకరించని ట్రాట్స్కీయిజంతో పోరాటంలో దీనిని అభివృద్ధి పర్చాడు. ఈ విషయాన్ని గూర్చి సూక్ష్మంగా స్టాలిన్ ఇట్లా చెప్పాడు:

"సామ్రాజ్యవాద దేశాల అభివృద్ధిలో అసమానత్వం వున్నదంటే, కొన్ని దేశాలు ఉవ్వెత్తుగా పెరుగుతూంటే కొన్ని వెనకబడ్డవన్నమాట. ప్రపంచ మార్కెటులో కొన్నిదేశాలు కిక్కిరిసిపోయ ఇతరములకు స్థానంలేకుండా చేయటం,

ఇదివరకే ఒక పర్యాయం అంతా విభజింపబడివున్న ప్రపంచాన్ని మరల పంచు కొనుటకై యుద్ధాలు జరగడం, సామ్రాజ్యవాద కుటుంబలలో వైరుధ్యాలు పెచ్చు మీరిపోవటం, ప్రపంచ కాపిటలిస్టువ్యూహం బలహీనపడటం, విడి విడి దేశాలలో కార్మికులు జయించి ఈ వ్యూహాన్ని కొన్ని దేశాలలో భేదించుటకు అవకాశాలు ఏర్పడటం, విడివిడి దేశాలలో సోషలిజం విజయం పొందుటకు అవకాశాలు కల్గటం అన్నమాట.

సామ్రాజ్యవాదంలో వివిధదేశాల అభివృద్ధిలో అసమానత్వం వున్నదంటే అందలి ప్రధాన ధర్మాలేవి ?

ఒకటి : ప్రపంచమంతా సామ్రాజ్య ముఠాల మధ్య పంచుకోబడటం పూర్తిఅయింది. పంచుకుంటానికి ఇక'స్వతంత్ర' దేశాలేమీలేవు. కొత్త మార్కెట్లను సంపాదించాలంటే ముడి సరుకులు లభ్యమయ్యే ప్రదేశాలను సంపాదించాలంటే ఇతరులనుండి బలాత్కారంగా లాక్కోనవలసినదే.

రెండు : టెక్నిక్ విపరీతంగా అభివృద్ధికావటంలో కాపిటలిస్టు దేశాలన్నీ ఈ టెక్నికల్ అభివృద్ధిని లంకించుకొనుటవల్ల, కొన్నిదేశాలు ఉవ్వెత్తుగా అభివృద్ధియై ఇతరదేశాలను అధిగమించుటకు బలహీనమైనప్పటికీ అతిత్వరగా అభివృద్ధిజెంది ప్రపంచములో విస్తరించి బలవంతమైన ఇతర దేశాలకు స్థానం లేకుండా చేయటం జరుగుతుంది.

మూడు : సామ్రాజ్యముఠాల పలుకుబడి విస్తరణలో తరచు ఘర్షణ వస్తూవుండటం; ముందుగా కొంత వెనుకబడ్డ దేశాలు వువ్వెత్తుగా పెరగటంవల్ల ఉన్నస్థితిలో మార్పులు జరగవలసి రావటం; బలాబలాలమధ్య పలుకుబడిలోమా మార్పులు జరగరావలసి రావటంవల్ల ప్రపంచపు పునర్విభజన తప్పవిసరియౌతుంది. ఈవిధంగా సామ్రాజ్యవాద యుద్ధాలు తప్పవిసరియౌతాయి.*"

సామ్రాజ్యవాదంలో తప్పవిసరి యగు జైత్రయాత్రలవల్ల వివిధదేశాల బలాబలాల సంబంధాలలో తీవ్రమార్పులు రాగలవు 1914_18 సామ్రాజ్యవాద యుద్ధంలో జర్మనీ సర్వనాశనమైంది. ఆస్ట్రియా-హంగరీ సామ్రాజ్యం వికావికలై పోయి ఆ శిధిలాలపై అనేక నూతన రాజ్యాలు వెలిసినవి. ఈవిధంగా వివిధ దేశాల అభివృద్ధిక్రమంలోకల్గే అసమానత్వం యుద్ధానంతరదశలో మరీ స్పష్టంగా గోచరిస్తుంది, అమెరికా విపరీత లాభాన్ని పొందింది. ఇతరుల యుద్ధం మూలముగా ఇది బాగుపడ్డది. పూర్వం ఇతర దేశాలకు ముఖ్యంగా ఇంగ్లాండుకు ఋణపడివుండే దేశం నేడు ప్రతిదేశానికి, ఇంగ్లాండుకుకూడా ఋణదాతయైనది. అమెరికాలో అనేక పరిశ్రమలు యుద్ధానికి పూర్వంకన్న అనంతరం వుత్పత్తిని రెటింపు గావించినవి.

* 'సోషల్ డెమోక్రటిక్ డీవియేషన్లు' గూర్చి

అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఎంత వేగంగా అభివృద్ధిచెంది ఇతర దేశాలన్నింటినీ వెనకబడవేసినదీ వసం ఈ క్రింది లెక్కలనుబట్టి చూడవచ్చును (1929 ఆర్థిక సంక్షోభానికి పూర్వం లెక్కలు)

| సరుకు | ప్రపంచం ఉత్పత్తిలో అమెరికా భాగం % లో |
|---|---|
| భూమివిస్తీర్ణం | 6 |
| జనాభా | 7 |
| బొగ్గు | 40 |
| హైడ్రో ఎలక్ట్రికశక్తి (జలవిద్యుత్తు) | 35 |
| చమురు | 70 |
| గోధుమ పత్తి | 60 |
| కట్టడములకుపయోగించే కలప | 55 |
| ఇనుము, రాగి | 50 |
| సీసం, ఫాస్ఫేట్లు | 40 |

| సరుకు | ప్రపంచంలోని సరుకు ఖర్చులో అమెరికా వంతు % లో |
|---|---|
| ఇనుము | 42 |
| రాగి | 47 |
| మావె | 69 |
| రబ్బరు | 58 |
| టిన్ | 53 |
| కాఫీ | 48 |
| పంచదార | 21 |
| సిల్కు | 72 |
| మోటారు యంత్రాలు | 80 |

ఇంగ్లాండు ఇందుకు విరుద్ధము. 1914 యుద్ధంవరకూ ఇంగ్లాండు ప్రపంచంలో ప్రథమస్థాన మాక్రమించివుండేది. కాని యుద్ధానంతరం అది కేవలం ఋణదాత్రు దేశంగానే వుండిపోయింది. చాలాముఖ్యమైన పరిశ్రమలలో ముఖ్యంగా బొగ్గుగనులలో ఎదుగు బొదుగు ఏ మాత్రం లేక యథాతథంగానే వుండిపోయింది. ఇదే సమయంలో దీని ప్రత్యర్థి దేశాలు ఎంతో ముందుకు పోయినవి.

1929 ఆర్థిక సంక్షోభంతో ప్రపంచమందలి వివిధ కాపిటలిస్టు దేశాల మధ్య బలాబలాల సంబంధాలలో పెద్ద మార్పులు వచ్చినవి. ఈ విధంగా వీటిలో వుండే అసమానత్వం మరీ హెచ్చింది. సంక్షోభమునకు పూర్వం ప్రపంచంలో

అతి బలిష్ఠముగా వుండే అమెరికా, ఐరోపాలోని బూర్జువా వర్గానికి సోషల్ డెమోక్రాట్లకు ఉపదేష్టగా వుండే అమెరికా సంక్షోభానంతరం తన ప్రతిభను కోల్పోయింది, నిర్వికల్పమనుకున్న దాని బలంలో అనిశ్చితమేర్పడింది. అమెరికన్ కాపిటలిజంలో వుండే వైరుధ్యాలన్నీ బైటపడినవి. విపరీతమగులోగ త్రబలిన అమెరికన్ 'భాగ్యం' అదృశ్యమైనది సంక్షోభానంతరం కూడా అమెరికా సంయుక్తరాష్ట్రాలే కాపిటలిస్టు దేశాలన్నిట్లో కెల్లా ప్రథమ స్థానంలో వున్నవి. కాని అవి బలహీనపడుట మూలకంగా కాపిటలిస్టు ప్రపంచంలో వుండే పరస్పరవైరుధ్యాలు మరింత బలపడినవని తెలుస్తున్నది.

## అసమానాభివృద్ధి సూత్రం: శ్రామికవర్గ విప్లవం

కాపిటలిజం అభివృద్ధి క్రమంలోనే అసమానత్వం వుంది. సామ్రాజ్యవాద దశలో ఇది మరీ తీవ్ర పరిణతిని పొందుతుంది. దీనివల్ల సామ్రాజ్యాల మధ్య శాశ్వత శాంతి ఏర్పడుతుందనుకొనే భ్రమలన్నీ తొలగిపోగలవు. సామ్రాజ్యవాద దొంగలమధ్య వైరుధ్యాలు పెరిగిన కొలదీ, యుద్ధాలు పెరిగిన కొలదీ కాపిటలిస్టు ప్రపంచము బలహీనపడుతూ వుంటుంది. సామ్రాజ్యవాద గొలుసు బలహీనపడుతుంది. శ్రామికవర్గ విప్లవం యొక్క దెబ్బలకు తట్టుకోవలసి వచ్చే పరిస్థితులు కలుగుతాయి. ఎక్కడయితే ఈ గొలుసు బలహీనముగా వుంటుందో, ఎక్కడయితే శ్రామికవర్గ విజయానికి అనుకూలమైన పరిస్థితులు ఒనగూడగలవో అక్కడ "ఈ గొలుసు పటుక్కున తెగిపోగలదు. కాపిటలిస్టు వ్యూహంలో గండికొట్టబడగలదు." సామ్రాజ్యవాద దశలో బహు తీవ్రస్థాయికి పోయే యీ కాపిటలిస్టు అసమానాభివృద్ధి సూత్రమునకు అనుబంధించియే లెనిన్ యొక్క శ్రామికవర్గ విప్లవ సిద్ధాంతమూ వున్నది. లెనిన్‌యొక్క యీ సిద్ధాంతాన్ని ట్రాట్స్కీయిస్టులు బహు తీవ్రముగా ఎదిరించారు. ఈ సిద్ధాంతాన్ని గూర్చి లెనిన్ ఈ క్రింది విధంగా వ్రాశారు:

"రాజకీయ ఆర్థిక అసమానాభివృద్ధికి కాపిటలిజం యొక్క తప్పనిసరి సూత్రం. ఇందువల్ల, మొట్టమొదటగా కొన్ని దేశాలలోగాని, లేదా ఒక్క దేశంలో నయినా, సోషలిజం, విజయం పొందుటకు అవకాశములున్నవి. ఆ దేశంలోని శ్రామిక వర్గం, తన దేశంలోని కాపిటలిస్టు వర్గాన్ని పరిహరించి, సోషలిస్టు ఉత్పత్తి క్రమాన్ని నిర్మించుటద్వారా, కాపిటలిస్టు ప్రపంచాన్ని ఎదుర్కొంటుంది. ఆ ప్రపంచంలో వున్న పీడిత ప్రజలనందరినీ ఆకర్షించుతుంది. కాపిటలిస్టులకు వ్యతిరేకంగా వారిలో తిరుగుబాట్లను ప్రోత్సహించుతుంది. అవసరమైతే దోపిడీ వర్గాలకు వాటి ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ఆయుధాల ధాటితోకూడా ముందుకొస్తుంది.

ఈ విధంగా "శ్రామికవర్గ విప్లవాచరణకు అసమానాభివృద్ధిని గూర్చిన లెనినిస్టు సిద్ధాంతం అత్యంత ప్రాముఖ్యతగలది. ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలోనే అవకాశ వాదుల సిద్ధాంతాలకు వ్యతిరేకంగా లెనిన్ శ్రామికవర్గ విప్లవాన్ని గూర్చి "కాపిటలిస్టు శక్తుల పూర్తిగా అభివృద్ధి గాకపోయినా" ఒక్క దేశంలోనైనా సోష

లిజం విజయము పొందజాలదనే తన సిద్ధాంతాన్ని విశదీకరించారని స్టాలిన్ తెలియజేశారు.

విప్లవానికి తాము చేసిన ద్రోహాన్ని కప్పిపుచ్చుకొనేందుకై ఏ యెండకా గొడుగుపట్టే అవకాశవాదులు ప్రపంచమంతటా ఒకేసారి విప్లవం ప్రారంభం కావాలనే సిద్ధాంతాన్ని ముందుకుదెచ్చారు. ఈ విధంగా ఈ ద్రోహులు తమలో తమకు 'వంప్పుర బాధ్యత'ను సృష్టించుకొన్నారు. కాపిటలిస్టు అసమానాభివృద్ధిని గూర్చిన మార్క్సిస్టు సోషల్ డెమోక్రటు సిద్ధాంత కర్తయొక్క, ముఖ్యంగా విప్లవ ప్రతికూలమగు బూర్జువా వర్గ యొక్క పురోగామి పక్షమగు ట్రాట్స్కీయిస్టుల యొక్క తీవ్ర విమర్శలకు గురియైనది. సామ్రాజ్యవాద దశలో ఈ అసమానాభివృద్ధి పెరుగదు సరిగదా తరుగుతుందని ట్రాట్స్కీ అతని అనుయాయులు వాదిస్తారు. కాని సామ్రాజ్యవాద దశలో అసమానాభివృద్ధి ఇంకా పెరగటమనేది అంతకు పూర్వపు సంఘటనవల్లనే విధిగా జరిగితీరుతుందనే సత్యాన్ని వీరు గుర్తించలేకపోతున్నారు. కాబట్టి ట్రాట్స్కీయిస్టులు, సోషల్ డెమోక్రట్ పెద్దలు ఏ నిర్ణయానికి వచ్చారంటే, ఏ ఒక్క దేశంలోనైనా విడిగా సోషలిజం విజయం పొందటం అసాధ్యం. సోవియట్ యూనియన్‌లో సోషలిజం విజయం పొందదనే ఈ సిద్ధాంతంతోపాటు 'ప్రపంచ విప్లవ సిద్ధాంతము' కార్మికవర్గం రైతాంగమందలి అత్యధిక సంఖ్యాకులతో ఐక్యం కాదనే సిద్ధాంతం సోషలిజాన్ని స్థాపించుటకై కార్మికవర్గమునకు గల శక్తి సామర్థ్యములను శంకించటమూ లంకె వేయబడి వున్నవి.

సోవియటు యూనియన్‌లో సోషలిజమును నిర్మించుటకై కృషిచేస్తున్న సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కోసం, అది అనుసరించే లెనినిస్టు పంథాను ట్రాట్స్కీయిస్టులు తీవ్రంగా ఎదుర్కొంటున్నారు. ఇట్టి ట్రాట్స్కీయిజం యొక్క విప్లవ ప్రతికూల స్వభావాన్ని బహిరంగపర్చి దానిని నాశనం చేయుటకై స్టాలిన్ విశేషమగు కృషిచేశారు. "అతివాద" నినాదాలను, పదజాలమును వుపయోగించటం వెనుక ట్రాట్స్కీయిస్టులలో ఎట్టి విప్లవ ప్రతికూలత, కార్మికవర్గము యెడ ద్రోహం దాగివున్నదో స్టాలిన్ స్పష్టం చేశారు.

సోవియటు యూనియన్‌లో ప్రథమ పంచవర్ష ప్రణాళిక జయప్రదం కావటంతో ట్రాట్స్కీయిస్టుల వాదనలన్నీ వేరుకూలిపోయినవి. ప్రథమ పంచవర్ష ప్రణాళిక విజయాలను గూర్చి సింహావలోకనం చేస్తూ స్టాలిన్ క్రింది విధంగా చెప్పారు:

"ఒకే ఒక దేశంలో, అదేశానికి పట్టుకు ఆ దేశంలో, సోషలిజం జయించటం అనే సోషల్ డెమోక్రాటు థీసిస్ ప్రథమ పంచవర్ష ప్రణాళిక దిగ్విజయం కావటంతో ఎగిరిపోయింది. ఇప్పటికే సోవియటు యూనియన్ సుస్థిరమగు పునాదుల

* "యూరోపు సంయుక్త రాష్ట్రాలు అన్న నినాదం" గూర్చిన లెనిన్ వ్యాసంనుండి

వేయబడటం మూలకంగా, ఏ ఒక్క దేశంలో నైనప్పటికి సోషలిజం జయించి తీరుతుందన్న విషయం సత్యమని రుజువైనది" •

## అతీత సామ్రాజ్యవాదం

సామ్రాజ్యవాదాన్ని గూర్చిన లెనిన్ సిద్ధాంతాలకు వ్యతిరేకంగా సోషల్ డెమొక్రటులు కొత్త సిద్ధాంతాలను లేవదీశారు. వీరిలో మొదటివాడు కాట్స్కీ. ఈ కాట్స్కీ మార్క్సిజాన్ని తారుమారు చేయటంలో ఆరితేరిన ఘటం. సోవియట్ యూనియన్ను గూర్చి దుష్ప్రచారాన్ని గావించటంకు, దానిపై కుట్రలు పన్నటంకును తయారైన ఘనుడు.

సూక్ష్మంగా చెప్పాలంటే కాట్స్కీ అభిప్రాయాలివి: కాపిటలిజంలో ఒక నిర్దిష్టమైన, ప్రత్యేకమైన దశయే సామ్రాజ్యవాదమని ఒప్పుకోడు. సామ్రాజ్యవాదంలో తీరని అంతర్విభేదాలున్నవన్న సంగతి గుర్తించడు. కాట్స్కీ ఉద్దేశ్యాల ప్రకారం సామ్రాజ్యవాదం ఒక ఆర్థిక నీతి కాదు. కొన్ని దేశాలు అవలంబించే పంథామాత్రమే కాట్స్కీ ప్రధాన సిద్ధాంతం ఇది (దీనినే లెనిన్ తీవ్రంగా ఎదుర్కొన్నాడు.)

"బాగా అభివృద్ధియైన పారిశ్రామిక కాపిటలిజం ఫలితమే సామ్రాజ్యవాదము. ఇతర పారిశ్రామిక దేశాలను తన కంట్రోలు క్రిందకు తెచ్చుకోవటంకు ఏ జాతులు నివసిస్తున్నప్పటికి వ్యవసాయిక దేశాలను మ్రింగివేస్తానికి ప్రయత్నించటమే సామ్రాజ్యవాదం."

"ఈ వివరణ సిద్ధాంతరీత్యా పూర్తిగా తప్పు" అని లెనిన్ అన్నాడు. ఇందులో వున్న తప్పు ఏమిటి? లెనిన్ ఈ క్రింది విధంగా వివరిస్తారు:

"సామ్రాజ్యవాదం యొక్క ప్రధాన లక్షణం ఏమిటంటే పారిశ్రామిక కాపిటల్ పలుకుబడికాదు, ఫైనాన్సు కాపిటల్ పలుకుబడి. వ్యవసాయిక దేశాలను కబళించటమేకాదు, అన్నిరకాల దేశాలనూ కబళించటం. సామ్రాజ్యవాద రాజకీయాలను సామ్రాజ్యవాద ఆర్థిక నీతినుండి కాట్స్కీ విడదీస్తున్నారు. రాజకీయాలలో సర్వాధికారంనుండి ఆర్థిక వ్యవహారాలలో గుత్తాధికారాన్ని వేరు చేస్తున్నారు. ఇందు మూలకంగా 'ఆయుధ విసర్జన,' 'బలిష్ఠ సామ్రాజ్యవాదం' అనే తుక్కురకం వివాదాలకు, తుక్కురకం బూర్జువా సంస్కరణ వాదానికి దిగజారాడు. ఈ విధంగా వచ్చి అబద్ధాలను, తప్పుడు సిద్ధాంతాలను వల్లెవేయటంలో వున్న వుద్దేశం ఒకటే: అర్థం ఒకటే. దానివల్ల సామ్రాజ్యవాదంలో వున్న అతి తీవ్రవైరుధ్యాలు మరుగు పర్చబడుచున్నవి. సామ్రాజ్యవాదం యొక్క తైనాతీలు, జాతీయ దురహంకారము గల

• "ప్రథమ పంచవర్ష ప్రణాళికా ఫలితాలు" —స్టాలిన్.

సోషలిస్టు నాయకులు, ఏ యెండకా గొడుగుపట్టే అవకాశవాదులు మున్నగువారితో 'ఐక్యత' కావాలనే వివాదాన్ని సమర్థించుట. కాట్స్కీ సిద్ధాంతాల పర్యవసానం."*

కాట్స్కీ యొక్క యీ వాదనలన్నీ పూర్తిగా తప్పు. మార్క్సిస్టు సిద్ధాంతాలకు వ్యతిరేకం. ఈయన రాజకీయాల నుండి ఆర్థిక నీతిని వేరుచేస్తున్నాడు. కాబట్టి సామ్రాజ్యవాదం యొక్క ఆర్థికనీతిని ఏమాత్రం ముట్టుకోకుండానే 'శాంతి యుతమగు' సంధాల ననుసరించుటకు వీలున్నదని బూర్జువా సంస్కరణ వాదుల దృక్పధాన్నే కాట్స్కీ కూడా కలిగియున్నారు. అందుచేతనే లెనిన్ చెప్పినట్లుగా, కాట్స్కీ కాపిటలిజం యొక్క ఉన్నత దశగా సామ్రాజ్యవాదాన్ని చూడటంలేదు. కాపిటలిజంలో వుండే అంతర్విభేదాలు తీవ్రతరమవుచున్నవని గమనించుటలేదు. ఇది బూర్జువా సంస్కరణ వాదానికి దారితీస్తుందిగాని మార్క్సిజం మాత్రం కాదు.

సామ్రాజ్యవాదాన్ని గూర్చిన పూర్తి తప్పుడు సిద్ధాంతాలన్నీ కాట్స్కీ యొక్క 'అతిత సామ్రాజ్యవాదం' అనే వివాదంలో ఇమిడియున్నది. ఈ సిద్ధాంతాలు ఏమిటంటే: వివిధ దేశాలలో గుత్త సంస్థలేర్పడటం మూలకంగా, ఈ దేశాలమధ్య వుండే వైరుధ్యాలు, పోరాటాలు అంతరిస్తాయి. ఈ దేశాలలోని కాపిటలిస్టులు వారిలో వారు ఒడంబడికలను చేసుకొని ఏకమవుతారు. సామ్రాజ్యవాద యుద్ధాలు అంతరించిపోతాయి. ఏక ప్రపంచ ఆర్థికనీతి అవలంభించబడుతుంది. ఇది "శాంతియుతమైన" "అతిత సామ్రాజ్యవాదం" వివాదం. ఇది మార్క్సు సిద్ధాంతాలకే పూర్తిగా వ్యతిరేకం. సామ్రాజ్యవాద నిజస్వభావాన్ని మరుగుపరుస్తున్నది. కాట్స్కీ యొక్క యీ కట్టుకథలను ఖండిస్తూ లెనిన్ ఇట్లా వ్రాశారు:

"ఒకమూల ఆర్థిక రాజకీయ వ్యవస్థలలో విపరీత విభేదాలున్నవి. వివిధ దేశాల అభివృద్ధి క్రమంలో విపరీత భేదాలున్నవి. సామ్రాజ్య దేశాలమధ్య తీవ్ర యుద్ధాలు చెలరేగుచున్నవి. కాని మరోమూల "శాంతియుతమగు" బలిష్ట సామ్రాజ్య వాదం అనే కట్టుకథను కాట్స్కీ చెప్పుతున్నారు. స్పష్టమైన సత్యాన్ని మరుగు పర్చుటకై చేసే అభివృద్ధి నిరోధక ప్రయత్నం కాదా ఇది? బలిష్ట సామ్రాజ్య వాదానికి చిహ్నాలని ఏ అంతర్జాతీయ కార్టెల్సును కాట్స్కీ చూపుతున్నాడో ఆ కార్టెల్సుయే ప్రపంచం విభజించబడటాన్ని, పునర్విభజింపబడటాన్ని చూపించడం కాదా? శాంతియుతమైన విభజననుండి దౌర్జన్యయుతమగు విభజనకు తిరిగి ఇటు నుంచి అటుకు మారటాన్ని సూచించుట లేదా? అంతర్జాతీయ రైల్వే సిండికేటులోనూ, వర్తక నౌకాయానపు కార్టెల్సులోనూ భాగస్వాములయిన అమెరికన్, జర్మన్ ఫైనాన్సు క్యాపిటలిస్టులు ప్రథమంలో శాంతియుతంగా ప్రపంచాన్ని పంచుకొన్నా, తమ బలాబలాలలో మార్పులు రాగానే శాంతి పద్ధతులకు స్వస్తిచెప్పి ఏమాత్రం శాంతియుతంగా కాని పద్ధతులద్వారా ప్రపంచ పునర్విభజనకు పూనుకొనలేదా?"

* "సామ్రాజ్యవాదము - సోషలిస్టు ఉద్యమంలో చీలిక" అన్న వ్యాసం నుండి.

సామ్రాజ్యవాద దశలో మరీ తీక్షణమయ్యే వివిధ దేశాల అసమానాభివృద్ధివల్ల కాట్స్కీయొక్క 'అతిత సామ్రాజ్యవాద' సిద్ధాంతం వమ్మైపోతోంది. దీనిని గూర్చి లెనిన్ ఈ విధంగా వ్రాశాడు:

"అతిత సామ్రాజ్యవాదమని కాట్స్కీచేసే పిసివాదం వల్ల పైనాన్స్ కాపిటలు పలుకుబడి ప్రభావమువల్ల కాపిటలిజంలో వుండే వైరుధ్యాలు తగ్గిపోతున్నాయని చెప్పే బూర్జువా తైనాతీల వాదనలకు బలం చేకూరుతుంది."

కాట్స్కీ బూర్జువా సంస్కరణవాది, సామ్రాజ్యవాద తైనాతీ కాబట్టి సామ్రాజ్యవాదంలో వుండే తీవ్ర వైరుధ్యాలను చూసి చూడనట్టుగా దాటవేస్తున్నాడు. సామ్రాజ్యవాదం కాపిటలిజం అభివృద్ధి క్రమంలో ఒక దశయనే విషయాన్నే అతడంగీకరించడు. అతనికిది అవసరంకూడా. ఎందుకంటే సామ్రాజ్యవాద దశయే సోషలిస్టు విప్లవముల ఆవశ్యకత కాలమని గుర్తించకుండా వుండాలంటే సామ్రాజ్యవాదము కాపిటలిజం ఉచ్ఛదశయని గుర్తించకుండా వుండాలి. అతిత సామ్రాజ్యవాద సిద్ధాంతంద్వారా సామ్రాజ్యవాద దశలో కాపిటలిజంలోని పరస్పర వైరుధ్యాల తీక్షణతను, కాపిటలిజం అసమానాభివృద్ధిని కాట్స్కీ మరుగుపరుస్తున్నాడు. కాపిటలిజంలో మౌలికంగా వచ్చిన పరిణతిని, గుత్త సంస్థల ప్రాధాన్యాన్ని, కాట్స్కీ గుర్తించడు; గుత్త సంస్థల దశలోనే కాపిటలిజం శిథిలమైపోవటం ప్రారంభమవుతుందనికూడా గుర్తించడు; సామ్రాజ్యవాదం కేవలం పరాశ్రయ జీవనాన్ని గడుపుతుందనే విషయాన్నిగాని, అది మరణావస్థలోవున్న కాపిటలిజమన్న విషయాన్నిగాని గుర్తించడు. పైగా, సామ్రాజ్యవాదం కాపిటలిజం యొక్క చరమావస్థ కాదంటాడు. కాపిటలిజం ఇంకా తన శక్తిని కోల్పోలేదంటాడు. ఈవిధంగా, కాపిటలిజానికింకా దీర్ఘాయువు వున్నదనీ, అది ఇప్పుడిప్పుడే యవ్వనము పొందుతున్నదనీ, చెప్పే బూర్జువా అగ్రశ్రేణిలో కాట్స్కీకూడా చేరాడు.

కాట్స్కీయిజంలో కొంచెం రూపాంతరం పొందినదే ట్రాట్స్కీయిజం. ప్రథమ ప్రపంచయుద్ధం రోజులలోనే ట్రాట్స్కీ సిద్ధాంతాలకు తేడా యేమీలేదని లెనిన్ స్పష్టపర్చాడు. ట్రాట్స్కీ కాపిటలిజంలోని అసమానాభివృద్ధిని గుర్తించడు. ఈ ప్రధానసూత్రాన్ని గుర్తించకపోవడంవల్లనే ఏఒక్క దేశంలోనైనా సోషలిజమును స్థాపించుట కవకాశము గలదనే సత్యాన్నికూడా ట్రాట్స్కీ గుర్తించడు. కాని లెనిన్ "అతిత సామ్రాజ్యవాదాన్ని" తుక్కు తుక్కు చేసినట్లే ట్రాట్స్కీయిజమును స్టాలిన్ పూర్తిగా నాశనం గావించాడు.

## సంఘటిత కాపిటలిజం సిద్ధాంతం

గుత్త సంస్థలు ప్రాబల్యంలోకి రావటంతోనే సోషల్ డెమొక్రాటు నాయకులు, కాపిటలిజంలోని అరాజకం పోయిందనీ, అది సమన్వితమైనదనీ,

సిద్ధాంతాలు లేవదీశారు. అరాజకపు కాపిటలిజం బదులు సుసంఘటిత కాపిటలిజం అనే సిద్ధాంతమే ఇది. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం పారిశ్రామిక వుత్పత్తి కొంత నిలకడ పొందిన రోజులలో ఈ సిద్ధాంతం బయలుదేరింది. ఈ సిగ్గుమాలిన సిద్ధాంతాన్ని బయలుదేరదీసిన సోషలు డెమొక్రాటులలో ప్రధానవ్యక్తి హిల్ఫర్డింగు. వీరి వాదన ఏమిటంటే— గుత్తసంస్థ లేర్పడటం మూలకంగా, కాపిటలిస్టు మార్కెట్టులోని గుడ్డి శక్తులన్నీ అంతరించగలవు, కాపిటలిజం సుసంఘటిత మౌతుంది, పోటీ పోతుంది; అరాజకం పోతుంది. ఆర్థిక సంక్షోభాలు పాతకథలై పోతాయి. ప్లాను ప్రకారం, చైతన్యయుతమైన విజ్ఞానం ప్రాధాన్యత వహిస్తుంది. కాబట్టి ట్రస్టులు, సిండికేట్లు క్రమ పరిణామం చెంది సోషలిస్టు ఆర్థిక విధానంగా తయారౌతాయి. కాబట్టి ఎవరైనా చేయవలసిన కర్తవ్యమేమిటంటే బ్యాంకర్లు, పారిశ్రామికాధిపతులకున్న చిక్కులు తొలగిపోవుటకు సహాయం మాత్రమే; అప్పుడు కాపిటలిజం, దానంతటదే ఎవ్వరితో చెప్పకుండా, ఎవ్వరికి తెలియకుండా క్రమంగా, ఏ పోరాటం అవసరం లేకుండా, సోషలిజముగా మారి కూర్చుంటుంది.

ఈ సుసంఘటిత కాపిటలిజం సిద్ధాంతంకూడా కాట్స్కీ ప్రబుద్ధుని 'అతీత సామ్రాజ్యవాద' సిద్ధాంతంయొక్క రూపమేగాని వేరుకాదు. ఇద్దరూకూడా సామ్రాజ్యవాదంలో స్పష్టంగా కన్పించే పరస్పర వైరుధ్యాలను గుర్తించలేదు. హిల్ఫర్డింగు, సామ్రాజ్యవాదంలోని శిథిలావస్థను, పరస్పర వైరుధ్యాలను గుర్తించలేకపోవటంవల్ల కొందరు బూర్జువా ఆర్థిక శాస్త్రవేత్తలకంటేకూడా ఎక్కువగా దిగజారిపోయారని ప్రథమ ప్రపంచయుద్ధానికి పూర్వమే లెనిన్ తెలియజేశారు. బూర్జువా ఆర్థికశాస్త్రవేత్తలు సామ్రాజ్యవాదంలో పైకిబాహాటంగా కన్పించే వైరుధ్యాలనైనా గుర్తించారు. కాని హిల్ఫర్డింగు వీటినికూడా మరుగుపరుస్తూ వారికన్న హీనమైనాడు.

'సుసంఘటిత కాపిటలిజం' వాదం, పోరాటం అవసరం లేకుండానే సోషలిజం వస్తుందని చెప్పటం, అజ్ఞానులగు కొందరు కార్మికులను మోసగిస్తుంది వారిని విప్లవపోరాటమునుండి దూరంగా వుంచుతుంది.

కాని ఈ సుసంఘటిత కాపిటలిజం 'సిద్ధాంతం పూర్తిగా తప్పని తదుపరి వర్తమాన చరిత్రయే స్పష్టం చేసింది. లెనిన్ స్పష్టపర్చిన సామ్రాజ్యవాద సిద్ధాంతం మూలకంగా ఈ సోషలు డెమొక్రాటు సిద్ధాంతం పటాపంచలైపోయింది. సామ్రాజ్యవాదదశలో కాపిటలిజంలో అంతర్యుద్ధాలు సమసిపోవు సరిగదా మరింత తీవ్రమౌతాయని మనంచూశాము. ఉత్పత్తిలో అరాజకంపెరుగుతుంది. ఆర్థికసంక్షోభాలు తరచువస్తాయి. వివిధ కాపిటలిస్టుల మధ్యనున్న గుత్తసంస్థల మధ్య పోటీ మహా భయంకరంగా జరుగుతుంది దీని ఫలితం కార్మికులమీద మరింత వినాశకరంగా వస్తుంది. గుత్త వ్యాపారపద్ధతి బాగా పెరిగి అమెరికా సంయుక్త రాష్ట్రాలలో 1907లో వచ్చిన ఆర్థిక సంక్షోభంవల్ల యీ పైవిషయాలు పత్యక్షమని తేలగలవు 1920 లో

వచ్చిన సంక్షోభంవల్ల ఈ సుసంఘటిత కాపిటలిజం 'సిద్ధాంతం ఎంత తప్పుడు సిద్ధాంతమో' ఇది బూర్జువా తొత్తుల సిద్ధాంతమెట్లో, రుజువు అయింది.

"సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీలోని దక్షిణపక్ష నాయకులు కూడా ఇట్టి సిద్ధాంతాన్నే లేవదీశారు. మార్కెట్లు, ధరలు, పోటీ, ఆర్థిక సంక్షోభం మున్నగు సమస్యలు ప్రపంచ ఆర్థిక విధానంలో మాత్రమే వస్తాయి. కానీ ఏదేశానికా దేశంలో మాత్రం వీటిబదులు నిర్మాణ సమస్యలు ఏర్పడతాయి. అని బుఖారిన్ ఒక సిద్ధాంతాన్ని బయలుదేర దీశాడు, దీనివల్ల బుఖారిన్ తెల్పిన నిర్ణయమేమిటంటే కాపిటలిజంలోని అంతర్యుద్ధాలు క్రమంగా సన్నగిల్లుచున్నవి కాపిటలిజం క్రమంగా బలపడుచున్నది. విప్లవ వెల్లువ వస్తే ఏదైనా సామ్రాజ్యవాద యుద్ధానంతరమే వస్తుంది అని.

బుఖారిన్ ఈ తప్పుడు సిద్ధాంతాన్ని పొరపాటుగా లేవతీసిందికాదు, యుద్ధం ప్రారంభమైనప్పటి నుండీ ఇతడు సామ్రాజ్యవాదాన్ని గూర్చి తప్పుడు అభిప్రాయాలనే వెల్లడించుతూ వచ్చాడు. 1915_20ల మధ్య ఈ బుఖారిన్ తప్పుడు సిద్ధాంతాలను లెనిన్ ఖండిస్తూవచ్చాడు. లెనిన్ సిద్ధాంతానికి వ్యతిరేకంగా, బుఖారిన్ 'స్వచ్ఛ సామ్రాజ్యవాదం' అనేసిద్ధాంతాన్ని లేవదీశాడు. పెద్ద పెద్ద కబుర్లుచెప్పుతూ అతివాద నినాదాలను విసరుతూ ఈ సిద్ధాంత అనుయాయులు సోషల్ డెమోక్రాటులతో కలిసిపోయారు.

బుఖారిన్ లేవదీసిన "స్వచ్ఛ సామ్రాజ్యవాదం" సిద్ధాంతంలో వున్న ప్రధాన తప్పు ఏమిటంటే, అది వాస్తవిక సామ్రాజ్యవాదమును అతితేలిక చేసి వేస్తుంది: సామ్రాజ్యవాదాలలోవుండే అతిగాఢమగు అంతర్విభేదాలను గుర్తించదు. కాపిటలిజంమందే సామ్రాజ్యవాదం వృద్ధియైనదనీ, కాబట్టి కాపిటలిజంలో వుండే వైరుధ్యాలన్నీ సామ్రాజ్యవాదంలో ఇమిడించివుండుననీ బుఖారిన్ గుర్తించలేదు.

1919 లో జరిగిన 8వ పార్టీ కాంగ్రెసుకు పార్టీ కార్యక్రమముపై రిపోర్టు ఇస్తూ బుఖారిన్‌తో గల తగాదాలను గూర్చి లెనిన్ ఇట్లా వ్రాశాడు:

"కాపిటలిజం అనే పునాది లేకుండా స్వచ్ఛ సామ్రాజ్యవాదం అనేది ఎన్నడూ లేదు: ఇప్పుడులేదు; ఇకముందు వుండబోదు."

ఇంకా ఇట్లా చెప్పాడు.

"బుఖారిన్ తానుమాటిగా, స్పష్టంగా చెప్పుతున్నాననుకుంటాడు. కాని అదంతా అనుభవశూన్యమైన పిచ్చిరాతలు తప్ప మరేమీకాదు. అనేకరంగాలలో స్వేచ్ఛ పోటీలేకుండా గుత్త వ్యాపారపద్ధతి ప్రపంచలో వుండనేవుండదు: ఇక ముందుఅట్లు వుండనూ వుండదు."

ఇంకా యిట్లా చెప్పాడు:

"కాపిటలిజమును పూర్తిగా మార్చి తయారైన స్వతఃసిద్ధమగు సామ్రాజ్య వాదంగనుక వుంటే మానవసమస్యలు చాలా సులభమయ్యేవి. అప్పుడు ఫైనాన్స్ కాపిటల్‌కు అన్నీలోబడివుండేవి, ఫైనాన్సు కాపిటల్‌ను తొలగించి తీరాలి. శ్రామిక వర్గము మిగతావనిని చేసేస్తుంది. ఇదిచాలా మంచిదే: కాని దురదృష్టవశాత్తు వాస్తవిక జీవనం ఇదికాదు. వాస్తవంలో ఈ కాపిటలిజం అభివృద్ధి ఎట్లావుటున్నదంటే మనం ఇంత తెలివిగాగాక వేరువిధంగా వర్తించవలసియుంది. కాపిటలిజం యొక్క పై అంతస్తుయే సామ్రాజ్యవాదం.... ...పాత కాపిటలిజమే వుంది. కాని అనేక రంగాలలో ఇది సామ్రాజ్యవాదంగా పెరిగింది."

1929 ఆర్థిక సంక్షోభంవల్ల బుఖారిన్ యొక్క 'స్వచ్ఛ సామ్రాజ్యవాద' సిద్ధాంతంకూడా దూదిపింజవలె ఎగిరిపోయింది. ఈ సిద్ధాంతానికి, మార్క్సిజానికి సంబంధమేలేనటు తేలిపోయింది. గుత్తసంస్థలు పోటీని రద్దుచేయవు సరిగదా దాన్ని మరింత తీక్షణం గావిస్తాయి. పోటీవుంటూనే గుత్తసంస్థలు వ్యాపారాన్ని సాగిస్తూ వుంటాయి. ఈ విధంగా తగాదాలు, వైరుధ్యాలు ప్రత్యేకంగా తీవ్రరూపందాల్చగలవు.

"కాపిటలిజంలోని వైరుధ్యాలను సామ్రాజ్యవాదం తీక్షణంచేస్తుంది: గుత్త సంస్థలు, పోటీ వ్యాపారం పెనవేసుకుని వుంటాయి: కాని సామ్రాజ్యవాదం, మారకమును, మార్కెట్టును, పోటీని, ఆర్థిక సంక్షోభములను రద్దుగావించదు." "సామ్రాజ్యవాదమంటే నశించిపోతూవున్న కాపిటలిజం. అంతేగాని కాపిటలిజం పూర్తిగా నశించలేదు.... మరణావస్థలో వున్నదిగాని పూర్తిగా మరణించలేదు. స్వచ్ఛమైన గుత్తసంస్థలే వుండవు: వీటితోపాటుగానే మారకం, మార్కెట్లు, పోటీలు ఆర్థిక సంక్షోభాలు వగైరా – ఇవన్నీ సామ్రాజ్యవాద ప్రధానలక్షణాలుగా వుంటూనే వుంటాయి"

అందుచేతనే లెనిన్

"పోటీ వ్యాపారం, గుత్తసంస్థలు అనే పరస్పర విరుద్ధమైన సూత్రముల కలయికే సామ్రాజ్యవాద ప్రధానగుణం. "అందువల్లనే దాని అంత్యదశ వస్తుంది. సోషలిజం వస్తుంది."

## కాపిటలిజం యొక్క పరాశ్రయ జీవనం, శిథిలత

పరాశ్రయ జీవియైన, శిథిలమౌతున్న కాపిటలిజమే సామ్రాజ్యవాదము. గుత్తసంస్థలు ప్రబలమైనకొలదీ సమాజవ్యవస్థ ఎదుగుబొదుగులు లేకుండాపోతుంటుంది: శిథిలమౌతూ వుంటుంది. స్వేచ్ఛ పోటీవున్న రోజులలో ప్రతికాపిటలిస్టూ వుత్పత్తిపై తన పెట్టుబడిఖర్చు తగ్గించి లాభాలెక్కువ లాగాలని చూసేవాడు. అందుచేత వుత్పత్తిలో టెక్నికల్ అభివృద్ధి తేవాలని చూసేవాడు. కాని గుత్తవ్యాపారం నిస్పర్ధ నిమ్మతి. అనవసరంగా హెచ్చుధరలు నిలుపబడుతున్నవి గాబట్టి ఈ గుత్తసంస్థలు టెక్నికల్

అభివృద్ధియం దాన క్తి చూనవు. అంతేగాదు. వుత్పత్తిపై తమ వస్వాధికారాలకు దెబ్బతగులు తుందనే భయంవల్లగాని, లేక తాము వివరీతంగా పెట్టిన పెట్టుబడి అంతా నిరర్థకమై పోతుందనే భయంవల్లగాని ఈ గుత్తనంస్థలు టెక్నికల్ అభివృద్ధిని అరికట్టజూడగలవు కూడా. ఈ విధంగా కృత్రిమంగా గుత్త నంస్థలు టెక్నికల్ అభివృద్ధికి అడ్డంకులు కల్గిస్తవి. సామ్రాజ్యవాద శకంలో ఇందుకు వుదాహరణలు ఎన్నోవి వున్నవి.

లెనిన్ ఒక ఉదాహరణను చూపాడు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఓవెన్ అనువాడు ఒకకొత్త బాట్లింగు మెషీనును సృష్టించాడు. ఒక జర్మన్ కార్టెల్ దానికి పేటెంటులను కొనివేసి, మెషీనును ప్రచారంలోనికి లేకుండా దాచివేసింది. 1914-17 యుద్ధానంతరం ఇటువంటి ఉదాహరణలు లెక్కలేనన్ని. కొద్ది ఏండ్ల క్రితమే ఎన్నడూ కాలిపోని ఎలక్ట్రిక్ దీపం, 'శాశ్వత దీపం' ఒకటి సృష్టించబడింది. కాని ఎలక్ట్రికల్స్ సామాన్ల ట్రస్టుల వ్యాపారం దెబ్బతింటుందనే భయంకొద్దీ ఈ నూతన సృష్టిని బయటకు రానీయలేదు. ట్రూగను అగ్గిపెట్టెల ట్రస్టు ప్రపంచ మందలి అగ్గిపెట్టెల పరిశ్రమలన్నింటినీ తన కబంధ హస్తములలో ఇరికించు కొన్నది. ఆ నమయంలో వియన్నా కెమిస్టు ఒకశాశ్వతమైనఅగ్గిపెట్టెను సృష్టించాడు. కాని ట్రూగరు అమెరికన్ బ్యాంకుల సహాయంతో ఈ నూతన సృష్టిని అంత మొందించాడు. జర్మనీలో ప్రొఫెసర్ బెర్గియస్ రాళ్ళనిబొగ్గునుండి చమురు తీయటం కనిపెట్టాడు. కాని అమెరికన్ అయిల్ట్రస్టు ఈ పరిశోధనను కొనివేసి ఆచరణలోనికి రాకుండా ఆపివేసింది. అమెరికన్ రైల్వేలను ఎలక్ట్రిసిటీతో నడుపుటలేదు. కారణం అమెరికన్ గుత్తనంస్థలకది దెబ్బ.

ఈ విధంగా సామ్రాజ్యవాద కాలంలో టెక్నికల్ అభివృద్ధికి కాపిటలిజం వ్యతిరేకమైనా, కొంతవరకు టెక్నికల్ అభివృద్ధి జరుగుతూ వేవుంటుంది. టెక్నికల్ అభివృద్ధిద్వారా లాభాలెక్కువగా నంపాదించవచ్చుననే ఆశయే ఈ మాత్రం టెక్నికల్ అభివృద్ధికైనా కారణం. ఇందువల్లనే బ్రహ్మాండమగు ట్రస్టుకంపెనీలు చక్కటి లేబరేటరీలను సైంటిఫిక్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లను నెలకొల్పి పేరుకొందిన ఇంజనీర్లను కెమిస్టులను, ఫిజిస్టులను పోషిస్తూవుంటాయి. కాని వ్యాపారంలో గుత్తాధికారమునుబొందుటచే జరిగే పరిశోధనలన్నిటిని ఈ గుత్తనంస్థలు వినియోగం లోనికితేవు. కాబట్టి పరిస్థితులనుబట్టి ఒకప్పుడు టెక్నికల్ అభివృద్ధి మరొకప్పుడు ఎదుగుబొదుగు లేనిస్థితి వుంటూ వుంటాయి.

సామ్రాజ్యవాదం పరాశ్రయ జీవితయొక్క శిథిలమౌతూవుండేవ్యవస్థగనూ, దానిలోవుండే పరస్పర వైరుధ్యాల విజృంభణావాన్ని ప్రాతిక్యాయిజం ఏమాత్రం గ్రహించలేదు. సామ్రాజ్యవాదంలో వుండే రెండు ప్రవృత్తుల మధ్య సంఘర్షణ, ఒకవైపున, ఉత్పత్తిశక్తుల నభివృద్ధిచేయాలనే ప్రవృత్తి మరోవైపున టెక్నికల్

అభివృద్ధిని అరికట్టాలనే ప్రవృత్తిమధ్య సంఘర్షణ - ఏమాత్రం గుర్తించను. ఈ పోరాటమే, రెండు ప్రవృత్తుల మధ్యవుండే ఈ ఘర్షణయే సామ్రాజ్యవాదానికి విలక్షణమైన వైరుధ్యాలను మరింత తీక్షణం చేస్తోంది. కాని ట్రాట్స్కీయిస్టుల ఉద్దేశంలో, ఉత్పత్తి శక్తుల అభివృద్ధి కాపీయకుండా 'మేకులుంది' చేసి వేయటంద్వారా సామ్రాజ్యవాద దశలో టెక్నికల్ అభివృద్ధి ఏమాత్రం ఎదుగు బొదుగులు లేకుండా వుంటుందని ట్రాట్స్కీయిజం వూహ. ఇట్టి వూహ కాపిటలిజం దానంతటదే కూలి పోతుంది అనే ద్రోహ సిద్ధాంతానికి దోవతీసింది. ఈ విధమైన సిద్ధాంత భేదము సామ్రాజ్యవాద దశలోవుండే అసమాన అభివృద్ధి సూత్రాన్ని నిరాకరించడంతో కూడా పెనవేసుకొని వున్నది.

బూర్జువా వర్గం యొక్క పరాశ్రయ జీవన స్వభావం మరీ స్పష్టంగా సామ్రాజ్యవాద దశలో కన్పిస్తోంది. బూర్జువా వర్గంలో అత్యధిక సంఖ్యాకులకు ఉత్పత్తి క్రమంతో ఎలాంటి సంబంధం వుండదు. వారిలో ఎక్కువమంది 'కూపన్లను చించటం'తోనే బ్రతుకుతూ వుంటారు. వీరి ఆస్తిఅంతా వాటాలు, బాండ్లు, ప్రభుత్వ రుణ హామీపత్రాలు, ఇతరవిధమైన పత్రాలు మున్నగు వాటి రూపంలో వుంటుంది. వీటి ద్వారానే వారి ఆదాయం వస్తూవుంటుంది. పరిశ్రమలన్నీ టెక్నికల్ ఉద్యోగబృందంతో నడుస్తూవుంటాయి. కాపిటలిస్టు వారసులైన లక్షాధికారులు ప్రజల శ్రమ ఫలమైన సంపదలన్నింటినీ బూర్జువా వర్గమూ దాని అనుచర బృందమైన రాజకీయజ్ఞులు, బూర్జువా మేధావులు, సైనికాధిపతులు, అపహరించి బ్రతుకుతూవుంటారు. ప్రపంచంలో అన్నిమూలల నుంచీ వచ్చి తమ భోగలాలసలో ఒళ్ళుమరచి త్రుళ్ళింత లాడుటకై దేశాలకు దేశాలను (స్విట్జర్లాండు లాంటివి) రాష్ట్రాలకు రాష్ట్రాలను (ఫ్రాన్సు, ఇటలీ, ఇంగ్లాండులలో ప్రాంతాలు) విహారస్థలాలుగా ప్రత్యేకించి వుంచుకుంటారు.

సామ్రాజ్యవాదంతోపాటు కాపిటలిస్టు నాగరికత పతనం ప్రారంభమౌతుంది. నీచత్వం, లంచగొండితనం ప్రబలమైన రాజకీయాలు, కళలు, ప్రజాహిత జీవనం మున్నగు అన్ని శాఖలకు విస్తరించుకుంది. పార్లమెంటులోను, పెద్ద ప్రభుత్వోద్యోగులలోను తమ ప్రతినిధులుగా వుంచుకొనుటకై పెద్ద కాపిటలిస్టులు కొన్ని ముఠాలకు లంచాలు మేపుతారు. ప్రభుత్వాధినేతలు కూడా సామాన్యంగా పెద్ద బ్యాంకులతోను, ట్రస్టులు, కార్పొరేషన్లతోనూ దగ్గర సంబంధాలు కల్గివుంటారు. ఉన్నత ప్రభుత్వోద్యోగులకు లక్షల ధనాన్ని "బహుమతులుగా" చదివించటంద్వారా బ్యాంకుల ట్రస్టుల అధిపతులు దేశంలో తమ ఇష్టవచ్చిన పనులను నెరవేర్చుకుంటూ వుంటారు. పత్రికలు కూడా కోటీశ్వరుల కీలుబొమ్మలుగానే వుంటాయి. బూర్జువా పత్రికల్లో పురాతనమైనవీ, ఘనమైనవీ అగు పత్రికలు కూడా వాటికి యజమానులు మారగానే, తమ రాజకీయపు రంగునుకూడా ఫిరాయిస్తాయి. ఇటువంటి పక్షపాత పత్రికలు ఎన్నో కలిపి ఒకే కాపిటలిస్టు స్వాధీనంలో వుంటూవుంటాయి. 1914-18 యుద్ధానంతరం అమెరికాలో ఇటువంటి "పక్షపాత పత్రికలు" పక్షరహిత పత్రికలుగా

కన్సర్నులు కూడా కోటీశ్వరుడగు స్టిన్నెసు స్వంతములుగా వుండేవి. ఈతడు యుద్ధానంతరం స్పెక్యులేషన్ వ్యాపారంలో విపరీతంగా సంపదను ఆర్జించాడు. ఈతని స్వాధీనంలో బొగ్గుగనులు, స్టీలు షిప్పు కంపెనీలు, లోహపుగనులు, విమానాలు, పత్రికలు వగైరాలు వుండేవి. ఈతని సంస్థ కూస్తా కూలిపోయిన పిమ్మట పత్రికలలో అత్యధికభాగం, శాస్త్రపరిశ్రమలు కోటీశ్వరుడగు హ్యూగెన్‌బర్గ్ చేతుల్లో పడినవి. (ఈ హ్యూగెన్‌బర్గు జర్మను బూర్జువా వర్గ నాయకులలో ఒకడు. ఫాసిస్టు హిట్లరు అధికారంలోనికి వచ్చేందుకు ఎక్కువగా సహాయపడినవారిలో ఒకడు.)

పెద్ద కాపిటలిస్టులు, బూర్జువా రాజకీయ వేత్తలు పైకిరావటానికై దగా, ఫోర్జరీ, మోసం, వంచన అన్ని దుర్మార్గాలను అవలంబిస్తారు. వీరి దుర్మార్గాలు చాలా అరుదుగా - బహిర్గతమై, వీరి బాహ్యంగా బైటపడిన పిమ్మట - కనిపెట్టబడతాయి. స్వీడిషు అగ్గిపెట్టెల ట్రస్టు యజమాని, సోవియటు ప్రతికూల ప్రచారంలో ఘనుడు. అయిన ఐవర్ క్రూగర్ 1932 లో దివాళా తీసినప్పుడు పెద్ద రగడ బయలుదేరింది. ప్రపంచమంతా ఈ బండారం తెలిసిపోయింది. తాను దివాళాతీసే స్థితిలో వుండగా ఈతడు ఆత్మహత్య చేసుకున్నాడు. ఈతని ఆత్మహత్య పిమ్మట, ఈతడు ఎన్ని ఫోర్జరీలు చేశాడో, ఎన్ని దొంగ రికార్డులు సృష్టించాడో, ఒకడానికి తెలియకుండా మరొక బ్యాంకువద్ద మోసపు మార్గాలద్వారా ఋణాలు తెచ్చాడో అన్నీ బయటబడ్డవి. ఇదే 1932 లోనే ఫ్రాన్సులో ఔస్ట్రిక్ స్టాకు కంపెనీ దివాళా తీసినప్పుడు ఆ కంపెనీ ఏవిధంగా దగాకోర్ల కంపెనీయో ఈ దగాకోర్లకు ఉన్నతప్రభుత్వ వర్గాల యొక్క, బ్యాంకర్ల యొక్క సహాయం ఎట్లా వుండేదో బయటపడింది. ఈ దగాకోర్ల ముఠా ఎన్నోరకాల దొంగమాటలద్వారా, మోసపుటాశలు చూపెట్టి అమాయకులగు మధ్య తరగతి ప్రజలనుండి కోట్లకొలది ధనాన్ని గుంజినది. ఇదే విధంగా 1933 లో అమెరికాలోకెల్ల గొప్ప కాపిటలిస్టు అగు మోర్గనును గూర్చికూడా అనేక అపవాదులు బయలుదేరినవి. అతడు అనేక అవినీతి సంబంధాలను గల్గియున్నాడని అనుమానింపబడింది.

అమెరికాలో సుసంఘటితమైన బందిపోటు దొంగల ముఠాలు ఎన్నో వున్నవి. వీటికి చాలా గౌరవంకూడా యివ్వబడుతూవుంటుంది. వీరికికూడా ట్రస్టులు ముఖ్యమగు సంస్థలున్నవి. ఈసంస్థలెల్లప్పుడూ పోలీసులతోను, ప్రభుత్వంతోనూ మంచి సంబంధాలను పెంచుకుంటున్నవి.

ప్రధాన కాపిటలిస్టు దేశాలలో సామ్రాజ్యవాదులు కార్మిక వర్గంలో "ఉన్నతశ్రేణిని" లంచాలద్వారా స్వాధీనం చేసుకొంటారు. వలస దేశాలను దోచుకొనటం ద్వారాను, వెనుకబడ్డ దేశాలనుండి విపరీత లాభాలను గుంజటంద్వారాను, కార్మికవర్గంలో అత్యధిక భాగాన్ని విపరీతంగా దోచుకొనటం ద్వారాను అమిత సంపదలను చేకూర్చుకొని, ట్రస్టు కంపెనీలు కార్మికులలో ఒక చిన్న భాగానికి హెచ్చు జీతాలిచ్చి, చక్కటి సౌకర్యాలనేర్పర్చి, దానిని లోబర్చుకొంటాయి. లంచాలుమేసే

ఈ కార్మికవర్గ భాగం బూర్జువా వర్గం యొక్క కోట బురుజుగా వుంటుంది. కాని సామ్రాజ్యవాదులు కార్మిక వర్గంలో చాలా చిన్న భాగాన్ని మాత్రమే లంచాలనిచ్చి స్వాధీనపర్చుకోగల్గుతారు. అత్యధిక సంఖ్యాకులైన కార్మికులను అత్యధికంగా దోచుకోవటం ద్వారానే వ్యాప్తభాగాన్ని, లంచాలిచ్చి పోషించటం సాధ్యమౌతుంది. ఈవిధంగా వర్గవైషమ్యాలు హెచ్చుతాయి: వర్గముల మధ్య అఖాతం పెరుగుతుంది.

## సామ్రాజ్యవాదం కాపిటలిజం యొక్క పతనదశ

కాపిటలిజం యొక్క ఒక చారిత్రిక దశయే సామ్రాజ్యవాదం. ఈ దశ యొక్క స్పష్టమగు లక్షణాలు మూడు : ఒకటి గుత్తసంస్థల ప్రాబల్యం, రెండు : శిథిలావస్థలో వున్న పరాశ్రయ జీవితయైన కాపిటలిజం: మూడు మరణావస్థయందున్న కాపిటలిజం. మార్క్సిజం, లెనినిజములకూ యితర సిద్ధాంతములకు మధ్యగల ప్రధానభేదములను ఈ వివరణబట్టియే తెలుసుకొనదగును. సామ్రాజ్యవాదమంటే గుత్త సంస్థల ప్రాబల్యమనీ : పరాశ్రయ జీవితయైన, శిథిలావస్థలోవున్న మరణావస్థలోనున్న కాపిటలిస్టు వ్యవస్థయనీ లెనిన్ స్పష్టంచేశారు ఇతరుల సిద్ధాంతములన్నీ మార్క్సిజాన్ని తారుమారు చేయటమే. సామ్రాజ్యవాద దశలో కాపిటలిజంలోవుండే పరస్పర వైరుధ్యములన్నీ అతి తీవ్రరూపాన్ని ధరిస్తాయి. ఇందులో మూడు మరీ మరీ ముఖ్యమైనవని స్టాలిన్ "లెనినిజం పునాదులు" అనే గ్రంధంలో తెలియచేశారు.

అవి, ఒకటి : కాపిటలిస్టులకు కార్మికులకు మధ్య వైరుధ్యం, సామ్రాజ్య వాదంలో కొలదిమంది కుబేరులు సర్వశక్తిమంతులై గుత్తసంస్థలను, బ్యాంకులనూ ఏలుతూ వుంటారు. వీరి దోపిడి, పీడన అత్యధికంగా, దుస్సహంగా వుంటుంది. కాబట్టి, వీరితోటి పోరాటంలో కార్మికులకు పూర్వపు పార్లమెంటరీ పద్ధతులు, పాత పద్ధతి కార్మిక సంఘాలు ఉపకరించవు కాబట్టి విప్లవ మార్గమే శరణ్యం. సామ్రాజ్య వాదమే, కార్మికుల దుస్థితిని ఇనుమడింప చేయుటద్వారా తప్పనిసరియగు యిట్టి విప్లవపోరాటములకు కారణభూతమౌచున్నది.

రెండు: బకాసురులవంటి కొలదిమంది కుబేరుల ముఠాలమధ్య, సామ్రాజ్య దేశాలమధ్య అంతర్గతంగా యుండే వైరుధ్యం. వీరు కొత్త ప్రదేశాలను, ముడి సరుకులు దొరికే ప్రదేశాలకు మార్కెట్లను, కాపిటల్ ఎగుమతికి అనువగు ప్రదేశాలను సంపాదించుటకై ఎప్పుడూ తగవులు పడుతూ ఘోరయుద్ధాలకు దారితీస్తారు. ఇదివరకే పంచుకోబడిన ప్రపంచాన్ని తిరిగి పంచుకొనుటకై పోరాడుతారు. ఈ భీకర సామ్రాజ్యవాద యుద్ధాలలో రక్తపుటేరులు ప్రవహించినవి: పీనుగు గుట్టలు పేరుకు పోయినవి, ఇదంతా కొలదిమంది కుబేరుల స్వార్థంవల్లనే, ఈ విధంగా సామ్రాజ్య వాదులు తమతో తాము కీచులాడుకోవటంద్వారా మొత్తం అంతరూ బలహీనపడతారు, మొత్తంమీద కాపిటలిజమే బలహీనపడుతుంది. ఈ విధంగా శ్రామికవర్గ విప్లవాన్ని

సన్నిహితం చేస్తుంది. సమాజం పూర్తిగా నశించకుండా ఫ్యూడలిజంతో శ్రామికవర్గ విప్లవం తప్పనిసరి అని రుజువు అవుతుంది.

మూడు: కొద్దిసంఖ్య గల నాగరిక దేశాలమధ్య, కోటానుకోట్ల ప్రజలు నివసించే వలసదేశాలు, పరాధీన దేశాలమధ్య వైరుధ్యం. ఈ వలస, పరాధీన దేశాలలో నివసించే కోటానుకోట్ల ప్రజలు సామ్రాజ్యవాద దొంగలచే దోచుకోబడి కల్యాణకష్టులుగా నివసిస్తూ జీవనయాత్రను సాగిస్తూ వుంటారు.

విపరీత లాభాలను ఆశిస్తూ సామ్రాజ్యవాదులు వలస దేశాలలోను, పరాధీన దేశాలలోనూ ఫ్యాక్టరీలను, పరిశ్రమలను, రైల్వేలను, ఇతరములను నిర్మిస్తారు. పురాతన సాంఘిక వ్యవస్థను నిర్మూలించి, దౌర్జన్యబలంతో కాపిటలిస్టు సంబంధాల ప్రవేశమునకు దారిచక్కబరుస్తారు. సామ్రాజ్యవాద దోపిడి పెరుగుతున్న కొలది వలసదేశ ప్రజల స్వాతంత్ర్య వాంఛ ఇనుమడిస్తుంది. ఇందువల్ల సామ్రాజ్యవాదుల స్థానం ప్రపంచంలో బలహీనపడుతుంది. వారి పునాదులే పెల్లగించబడతాయి. ఈ వలస పరాధీనదేశాలు ఇంతవరకు సామ్రాజ్యవాదం యొక్క రిజర్వ్‌గా వుండే దశపోయి శ్రామిక విప్లవంయొక్క రిజర్వ్‌గా తయారౌతాయి. ఈ విధంగా వలస దేశాల స్వాతంత్ర్యోద్యమాలు సామ్రాజ్యవాదానికి దెబ్బగాను, విప్లవ శ్రామికవర్గానికి పెద్ద అండగాను వుంటాయి.

సామ్రాజ్యవాద దశలో కాపిటలిజంలో వుండే పరస్పర వైరుధ్యాలన్నీ అతి తీవ్రదశకు రావటం మూలకంగా "సోషలిస్టు విప్లవం ఆవశ్యమౌతుంది." ఈ వైరుధ్యాలెంతటి తీవ్రదశకు చేరుకొంటే ఇక కాపిటలిజం వుండటం సమాజ క్షేమానికే అపాయకరం. సమాజాభివృద్ధికే ఆటంకకరం. ఉత్పత్తి శక్తుల అభివృద్ధి అరికట్టబడుతుంది. ఫలితంగా కాపిటలిజం ప్రాణముండగానే శిథిలమై రాలిపోవడం ప్రారంభిస్తుంది. ఈ విధంగా శిథిలత్వం ప్రారంభమైనదంటే కొన్ని దేశాలలో గాని, కొన్ని పరిశ్రమలలో గాని అభివృద్ధి వుండదనికాదు. కాని మొత్తంమీద కాపిటలిజం అభివృద్ధి నిరోధకమై శిథిలావస్థలో వుంటుంది. కాపిటలిస్టు వర్గమూ, దాని తైనాతీలు, రాచపుండువలె సమాజాన్ని పీల్చుకతింటూ బ్రతుకుతారు. వీరి దోపిడీ శ్రామిక ప్రజాసామాన్యానికి అంతకంతకూ దుస్సహమౌతుంది. ఇదే సమయంలో గుత్త పెట్టుబడిదారీ విధానంవల్లనే సోషలిజమును స్థాపించుట కవసరమగు పరిస్థితులేర్పడగలవు.

"ప్రపంచ కాపిటలిజం అత్యున్నత దశకు వచ్చింది. స్వేచ్ఛా పోటీ వ్యాపారం పోయి ప్రభుత్వం గుత్తవ్యాపారం వచ్చింది. సరుకుల ఉత్పత్తి పంపిణీం సామాజిక నిబంధనలు బంధులు, కార్పొరేషన్లద్వారా అనుగుణ తనువగు రూపాలేర్పడినవి. గుత్తసంస్థల ప్రాబల్యంవల్ల ధరలు విపరీతంగా పెరిగి, కార్మికవర్గ దారిద్ర్యం మరింత హెచ్చింది. సామ్రాజ్యవాద ప్రభుత్వానికి కార్మికవర్గం దాసులుగా బంధింప

ఇద్దాను. కార్మికుల రాజకీయార్థిక పోరాటాలపై అనేక నిర్బంధాలు ఏర్పరచబడినవి. సామ్రాజ్యవాద యుద్ధాలఫలితంగా విపరీతమగు నాశనం, దౌర్భాగ్యం, విపత్తులు సంభవించినవి. వీటన్నిటి ఫలితంగా కాపిటలిజం నాశనం, దానిస్థానే అభ్యుదయ వ్యవస్థ అను సామాజిక వ్యవస్థ రావటం తప్పనిసరి అవుతుంది." *

సామ్రాజ్యవాదం తప్పనిసరిగా యుద్ధాలకు దారితీస్తుంది. 1914–18 లలో వచ్చిన యుద్ధం మొత్తం కాపిటలిస్టు ప్రపంచాన్నంతటినీ సంక్షోభంలో ముంచెత్తింది. సామ్రాజ్యవాదంలో వుండే పరస్పర వైరుధ్యాలన్నీ అప్పుడు బాహాటంగా కన్పించినవి. కాపిటలిజంలో వచ్చిన జనరల్ సంక్షోభము, అనగా కాపిటలిజం క్షీణమై పతనమై పోతుంది అన్న విషయాన్ని గూర్చి కొమింటర్న్ • ప్రతిపాదించిన సూత్రాలు మార్క్సిస్టు–లెనినిస్టు సిద్ధాంతాల ననుసరించియే ప్రతిపాదింపబడినవి. కొమింటర్న్ ప్రతిపాదించిన ఈ సూత్రాలను ట్రాట్స్కీయిస్టులు అంగీకరించరు సరిగదా ఖండిస్తారు. ఈ విధంగా వారు మార్క్సిజానికే ద్రోహంచేస్తూ పూర్తిగా విప్లవ వ్యతిరేక పంథాలోకి జారిపోయారు.

కాపిటలిజంయొక్క పతన కాలమే, వినాశకాలమే సామ్రాజ్యవాదం. శ్రామికవర్గ విప్లవ కాలమే సామ్రాజ్యవాదం. లెనిన్ ఒక వ్యాసంలో ఈ విధంగా చెప్పారు:

"కాపిటలిజంయొక్క ఉచ్ఛదశయే సామ్రాజ్యవాదం. పురోగమించిన దేశాలలోని పెట్టుబడి తన స్వదేశాల, జాతీయదేశాల హద్దులమించి పెరిగిపోయింది. స్వేచ్ఛా పోటీ బదులు గుత్తవ్యాపారం వచ్చింది. ఈ విధంగా సోషలిజం స్థాపన కవసరమగు సామగ్రినంతా పేకరించి వున్నది."

పరాకచోట, మంది, పతనమైపోవుటకు సిద్ధంగావున్న కాపిటలిజమే, సోషలిజమునకు స్థానమిచ్చి తొలగిపో సిద్ధంగా వున్న కాపిటలిజమే సామ్రాజ్యవాదమని లెనిన్ తెలియజేశాడు. కాబట్టి సామ్రాజ్యవాదం కాపిటలిజంయొక్క పతనకాలం. సోషలిస్టు విప్లవంయొక్క అద్మతక కాలం.



* "సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్) ప్రోగ్రాము నిబంధనలు" నుండి

• అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ. 1944 లో ఇది రద్దుగావించబడింది. (అనువాదకుడు.)

# అధ్యాయం 10

# యుద్ధము : కాపిటలిజంలో జనరల్ సంక్షోభము

## సామ్రాజ్యవాదము : కాపిటలిజం పతనము

కాపిటలిజంలో వుండే మౌలిక వైరుధ్యాలన్నీ సామ్రాజ్యవాద దశలో అతి తీవ్ర పరిణామాన్ని చెందుతాయి. ఒకవైపున కొలదిమంది భ్రష్టులైన కుబేరులు, మరొకవైపున పూర్తిగా అభాగ్యులైన కోటానుకోట్ల నిస్త్రాణులు, - సామ్రాజ్యవాద కాలంలో, వృద్ధదశనొందిన కాపిటలిజం పరిణామమిది.

సామ్రాజ్యవాద దశలోనే కాపిటలిజం క్షీణమై, పతనమై పోతుంది. వర్తమాన వ్యవస్థ సమాజాభివృద్ధికి ఆటంకంగానిలుస్తుంది, మానవమేధస్సు, విజ్ఞాన శాస్త్రము, ఇంజనీరింగు మున్నగునవన్నీ ప్రకృతిని జయించి స్వాధీనంలోకి తెచ్చుకుంటాయి. ఒకదాని వెన్కట మరొక శక్తిని మానవుడు స్వాధీనంలోకి తెచ్చుకుంటాడు. కానీ దీని ఫలితాలన్నీ కొలదిమంది అదృష్టవంతుల చేతిక్కుతాయి. ఇంతేకాదు: మానవ పరిశోధనల మహా విజయాలను మానవ కల్యాణానికై వినియోగించే అవకాశాలనుకూడా కాపిటలిజం సన్నగిల జేస్తుంది.

ప్రతివారు సుఖంగా జీవిస్తానికై అవసరమగు సంపదలు సృష్టింపబడుతాయి. కాని అత్యధిక సంఖ్యాకులు అతిదరిద్రస్థితిలో జీవయాత్ర గడుపుతూవుంటారు, ఇందుకు కాపిటలిస్టు సంబంధాలే కారణం. ఈ అమితసంపదలన్నీ మానవకళ్యాణానికి కాక దానివర్ధగించుటకే వినియోగపర్చబడుచున్నవి. వినాశకరమగు యుద్ధాలు సంభవించి లక్షలు, కోట్ల ప్రజలు ఆహుతియౌతున్నారు. తరతరాలుగా సృష్టించబడిన సంపదలన్నీ ఒక్కసారిగా ధ్వంసం గావింపబడుచున్నవి.

సోషలిజమా, వినాశనమా? సోషలిజమా, తప్పనిసరిగా భ్రష్టమై పోవటమా? ఇదే నేడు సామ్రాజ్యవాదం మనకిచ్చే ప్రశ్న. ప్రపంచ శ్రామికవర్గ మానవ జాతిని సామ్రాజ్యవాదంయొక్క పట్టునుండి తప్పించాలి, ఇదే దాని చారిత్రక కర్తవ్యం. సామ్రాజ్యవాద పరిపాలనను కూలద్రోయు పోరాటంలో శ్రామిక వర్గానికి సహాయులుగా, మిత్రులుగా సామ్రాజ్యవాద 'సౌఖ్యములను' అనుభవించే వలసదేశ

ప్రజలు, నాశనమైన రైతులు, మధ్యతరగతి కష్టజీవులు విలవిలలాడుతారు. ఒక దేశంలో లేక మరో దేశంలో తాత్కాలిక శ్రామికవర్గ పోరాటం దెబ్బతినవచ్చును. కాని అంతటకు శ్రామికవర్గ విజయం తప్పదు.

ఈ విధంగా వర్గ విభేదాలను, వర్గ పోరాటాలను సామ్రాజ్యవాదం అతి తీక్షణం గావిస్తుంది. ఈ పోరాటంలో కాపిటలిజంయొక్క రాత తేలిపోతుంది. అందుచే అది తీవ్రంగా ఎదురుతిరిగి పోరాడుతుంది.

కాపిటలిజంలోని అసమానాభివృద్ధి వల్ల వివిధదేశాలలో విభిన్నపరిస్థితులలో శ్రామికవర్గ పోరాటం విజయం పొందుతుంది. ఏ దేశాలలో పరిస్థితులు అనుకూలంగా వుంటాయో ఆ దేశంలో విజయంపొంది, సోషలిస్టు నిర్మాణానికి కృషి సాగుతుంది.

"టెక్నికల్ అభివృద్ధి విపరీతంగా జరుగుట మూలకంగా, ముఖ్యంగా రహదార్లు విపరీతంగా వృద్ధిపొందటం ద్వారాను, బ్యాంకుల పెట్టుబడియొక్క అభివృద్ధి విపరీతంగా జరుగుతుంది. ఈ విధంగా కాపిటలిజం పండి, మిగలపండి పతనమౌటకు సిద్ధమౌతుంది. దీనికాలం చెల్లిపోయింది. ఇక అది సమానాభివృద్ధికి అడ్డుగా నిలిచింది. కొద్దిమంది కుబేరుల, కోటీశ్వరుల సర్వాధికారంగా ఇది పరిణమించింది. వీరిలో జర్మను దొంగల ముఠాయా, బ్రిటీషు, ఫ్రెంచి ముఠాయా ప్రపంచాన్ని దోచుకోవలసినది; వలసదేశాల మీద 'ఏజెన్సీలో వుండే' దేశాలమీద 'మాండేటుల' మీద పెత్తనం వహించవలసినది అని నిర్ణయించుటకై ఘోరమారణ యుద్ధాలు జరుగుతాయి.

అందుకొరకే, అందుకొరకుమాత్రమే 1914-18 యుద్ధంలో కోట్లకొలది ప్రజలు ఆహుతి అయినారు · వికలాంగులైనారు. ఈ సత్యాన్ని క్రమంగా దేశదేశాల ప్రజలు, కష్టజీవులు గుర్తిస్తున్నారు. మరీ ముఖ్యంగా 1914-18 యుద్ధంలో కల్గిన విపరీత నష్టాలను, జయించిన దేశాలు సహితం దివాలాస్థితికి రావటాన్ని చూసిన పిమ్మట ఈ సత్యం మరింత తేలికగా అవగాహన అవుతున్నది.

కాపిటలిజం పతనం తథ్యం. ప్రజల విప్లవ చైతన్యం వృద్ధిపొందుతున్నది; వేలకొలది సూచనలు దీనిని ధృవపరుస్తున్నవి.

"మరికొన్ని లక్షలమంది కార్మికులను రైతులను బలియివ్వటం ద్వారా కాపిటలిజం ఈ దేశంలోనో, ఆ దేశంలోనో, మరికొంతకాలం సోషలిజం విజయాన్ని అభ్యంతరపెట్టవచ్చును కాని కాపిటలిజం నాశనాన్ని మాత్రం ఆపలేదు."*

## సామ్రాజ్యవాద ప్రపంచ యుద్ధం

సామ్రాజ్యవాదులు ప్రపంచాన్ని పునర్విభజించుకొనుటకై ఘర్షణపడుట వల్లనే, 1914-18 యుద్ధం వచ్చింది. ఈ యుద్ధం కాపిటలిజాన్ని మొదలంటా ఊపి

---

* "అమెరికన్ పత్రికా రచయిత ప్రశ్నలకు జవాబులు" లెనిన్.

వైపోయింది. ప్రజలకు మితిలేని బాధలను తెచ్చిపెట్టింది. యుద్ధక దేశాలన్నింటిలోనూ మొత్తం 6 కోట్ల 20 లక్షలమంది ఆయుధపాణులైనారు. కోటిమందికిపైగా మరణించారు; జీవితాంతం వికలాంగులైనవారు, గాయపడ్డవారు 2 కోట్ల 47 లక్షలమంది. అతిభాగ్యవంతమగు దేశాలలో విస్తారమగు సంపదలు మట్టిపాలుగావించబడ్డాయి. యుద్ధానికి మొత్తం ముప్పదివేలకోట్ల డాలర్లు ఖర్చు అయింది. అనాడు యుద్ధక దేశాలన్నింటి సంపదల మొత్తం అరువది వేలకోట్ల డాలర్లంటే ఈ నష్టం ఎంత ఎక్కువో ఊహించవచ్చును. అంటే, తరతరాలుగా కష్టజీవులు తమకండలను కరగించి సృష్టించిన సంపదలో సగం నాశనంగావించబడిన దన్నమాట.

కాపిటలిస్టు ఆర్థికవిధానానికి యుద్ధం చావుదెబ్బ కొట్టింది. కొన్నిదేశాల మధ్య ఏమాత్రమైనా సంబంధాలున్నవంటే అవికాస్తా తుడిచి పెట్టుకుపోయినవి. ఆక్రమించబడిన దేశాలుకొన్ని పూర్తిగా లూటీ గావించబడినవి. ముడిపదార్థముల, ఆహార పదార్థాల దిగుమతులు చాలా తగ్గించబడినవి. సైన్యంలో సమీకరించబడుటకు గాను విపరీత సంఖ్యలో కార్మికులు, రైతులు ఉత్పత్తి నుండి దూరం గావించబడ్డారు. కొన్నిదేశాలలో మొత్తం కార్మికులు, రైతులలో మూడవవంతు సైన్యంలో చేర్చబడ్డారు. యుద్ధంలోకి చేర్చబడ్డవారు మంచి దృఢమైన యువకులన్న విషయాన్ని మరువరాదు. ఇంక చేయగలిగినవారే, ముసలి, ముక్కి, స్త్రీలు, బాలురు మాత్రమే ఉత్పత్తిని సాగించుటకై మిగిలారు.

యుద్ధ చర్యలలో పెద్దపెద్ద దేశాలు సర్వనాశనం గావించబడినవి. యుద్ధ రంగముగా వ్యాపించిన ప్రదేశములకేగాక పట్టణాలలోని పారిశ్రామిక ప్రదేశాలకు కూడా వ్యాపించినవి. ఫిరంగిగుళ్ళు పెద్ద పెద్ద ఫాక్టరీలను, పరిశ్రమాగారాలను కూడిచిపెట్టివేసినవి, గనులు వరదల మయమైనవి, పెద్దపెద్ద పట్టణాలు పారిశ్రామిక ప్రదేశాలు నామరూపాలు లేకుండా పోయినవి. యుద్ధాలన్నింటికెల్లా ప్రధానమైన రంగమగు ఫ్రాన్సు ఉత్తర ప్రాంతం ఈ విధంగా విపరీత నష్టానికి గురియైనది.

చివరకు యుద్ధంవల్ల ఆర్థిక విధానంలో గల్గిన ప్రధాన నష్టమేమిటంటే: జాతీయార్థిక విధానమే పూర్తిగా తల్లక్రిందులై యుద్ధావసరాల ప్రకారం వుత్పత్తి క్రమమంతా నడువసాగింది.

యుద్ధంకారణంగా ఉత్పత్తి స్వభావం పూర్తిగా మారిపోయింది. పూర్వం వుండే మూడురకాల వస్తువులకూ - ఉత్పత్తి సాధనాలు, ఆహారవస్తువులు, భోగ వస్తువులు-నాల్గవది చేర్చబడినది. ఈ నాల్గవ వరుస యొక్క ఉత్పత్తియే అత్యంత ప్రాధాన్యత వహించినది. ఇదే మారణసాధనాల ఉత్పత్తి-ఫిరంగులు: మందుగుండు సామగ్రి విమానాలు, మెషినుగన్లు, రైఫిళ్ళు, టాంకులు, విషవాయువులు వగైరాలు. యుద్ధసన్నద్ధమైన దేశాలన్నింటి సంపద మొత్తం 60,000 కోట్ల డాలర్లయివుండగా కేవలం యుద్ధకార్యాలకొరకై 30,000 కోట్లడాలర్లు ఖర్చుచేయబడినవి. ఈ దేశాల

పెరిగింది. రైతాంగము నాశనమునకు గురైనది. ఆఫీసు ఉద్యోగులు, పెటీబూర్జువా వర్గమూ దరిద్రులై వారి జీవన ప్రమాణం ఎంతో పడిపోయింది.

“ఇరుపక్షాలూ సామ్రాజ్యకాంక్షతోనే యుద్ధాన్ని సాగిస్తున్నారు... ...విదేశాలను ఆక్రమించటానికి, చిన్నదేశాల గొంతుకలను నులుముటకూ, ప్రపంచంపై ఆర్థిక పెత్తనాన్ని సంపాదించుటకు, వలస దేశాల పునర్విభజనకు, వివిధదేశాలలోని కార్మికులను మోసగించి చీల్చియుటద్వారా కూలిపోతున్న కాపిటలిస్టు వ్యవస్థను నిలకడ నొందించుటకూ. జర్మను బూర్జువావర్గం, బ్రిటీషు ఫ్రెంచి బూర్జువావర్గాలు రెండూ, సామ్రాజ్య విస్తీర్ణం అనే ఒకే కాంక్షను గల్గియున్నవి.” *

## ప్రథమ ప్రపంచయుద్ధ పర్యవసానములు :
## కాపిటలిజంలో జనరల్ సంక్షోభం

సామ్రాజ్యవాదదశ అభివృద్ధిమూలకంగా వచ్చినదే యుద్ధం. మానవ సమాజాభివృద్ధికి కాపిటలిజం ఇక ఆటంకకరంగా పరిణమించినదని ఈ యుద్ధం రుజువుచేసింది. మానవజాతి శత్రువు కాపిటలిజం ఎట్టి ప్రమాదం తెచ్చిపెట్టగలదో రుజువైనది.

కాపిటలిజంయొక్క జనరల్ సంక్షోభానికి ప్రారంభమే ఈ సామ్రాజ్యవాద యుద్ధం. ప్రపంచ చరిత్రలో ఒక క్రొత్తశకం ప్రారంభమైనది. సామ్రాజ్యవాద గొలుసు రష్యాలో అక్టోబరు విప్లవంవల్ల త్రెంచబడింది. కరుడుగట్టిన సామ్రాజ్యమగు జారిస్టు రష్యా బదులు సోవియట్ ప్రభుత్వం అవతరించినది. కాపిటల్ యొక్క కోరలనుండి ప్రపంచంలో 1/6 భాగం తప్పించుకొన్నది. అక్కడ సోషలిజం పాదుకొల్పబడినది. అక్టోబరు విప్లవం ప్రపంచ శ్రామిక విప్లవానికి నాంది. ప్రపంచం ఇంతటితో రెండు శిబిరములక్రింద - కాపిటలిస్టు శిబిరమూ, సోషలిజం ప్రభవించే శిబిరం-చీలిపోయింది. కాపిటలిస్టు భవనంలో మొట్టమొదట బీట ఏర్పడింది, విశ్వవ్యాప్తమగు కాపిటలిజం బదులు ఇప్పుడు పరస్పర శత్రువులైన, కాపిటలిస్టు వ్యవస్థ, సోషలిస్టు వ్యవస్థ - రెండుపక్షాలు ఏర్పడినవి.

అక్టోబరు విప్లవానంతరం, ప్రపంచాన్ని ఏలగల్గిన కాపిటలిజం ఒక్కటే సామాజిక వ్యవస్థగా వుండటం అంతరించింది. ఇప్పుడు సోషలిజం కూడా ప్రపంచంలోని 1/6 వ భాగంలో ఒక నూతన సామాజిక వ్యవస్థగా అభివృద్ధి చెందుతుంది., ప్రపంచ శ్రామిక వర్గానికి సోవియట్ యూనియన్ పితృదేశం. ప్రస్తుత దశ కాపిటలిజం యొక్క పతనదశ: వినాశనదశ: శ్రామికవర్గ ప్రపంచ విప్లవశకం: సోషలిజం విజయకాలం.

యుద్ధం ప్రపంచ పటాన్నే మార్చివేసింది. కాపిటలిస్టు దేశాల బలాబలా

---

* (1) లెనిన్ గ్రంధావళి, 20 వ వాల్యూం 1 వ గ్రంథం.

లలో పెద్దమార్పును తెచ్చింది. ప్రపంచంలో 1/6వ భాగంలో సోషలిజం ఏర్పడి కాపిటలిస్టు కోరల నుండి తొలగింపబడింది. ఇతరభాగం కాపిటలిస్టు కోరలలోనే ఇరుక్కునివున్నా, అక్కడకూడా చాలా పెద్ద మార్పులు జరిగినవి.

యుద్ధంలో పాల్గొన్న అన్ని దేశాల ఆర్థికస్థితి తలక్రిందులైనది. గెల్చిన దేశాలు ఓడిన దేశాలపై యుద్ధభారాలను త్రోసివేయటానికి చూడటం సహజమే. కాని ఓడినపక్షంలో జర్మనీ మినహా యితర దేశాలు (ఆస్ట్రియా, హంగరీ, టర్కీ, బల్గేరియా) కొన్ని బాధలు పడినవే. జర్మనీయే మిత్ర రాజ్యాల ప్రధాన శత్రువు. జర్మను సామ్రాజ్యవాదులకు ఆంగ్లో-ఫ్రెంచి సామ్రాజ్యవాదులకు ఘర్షణ పడుట వల్లనే ఈ యుద్ధం వచ్చింది. కాబట్టి మొట్టమొదటగా జర్మనీ పనిపట్టించటం, జర్మనీని ఇక పోటీలోనికి రాకుండా చేయుటం మిత్రరాజ్యాల కర్తవ్యం, అందుకై ఆర్థికంగా జర్మనీని బలహీనపర్చుటకు పూనుకొన్నవి. ఇదే సమయంలో జర్మనీపై యుద్ధనష్టాలను రుద్దపూనుకున్నవి జర్మనీనుండి వసూలు జేయుటయే 1919 వర్సైలీసు సంధి ప్రధానోద్దేశం. జర్మనీనుండి అనేక ప్రాంతాలు కాజేయబడినవి. ఇనుము, బొగ్గు విస్తారంగా దొరికే ప్రాంతాలను ఫ్రాన్సు స్వాహా చేసింది. వర్తక నౌకలన్నీ మిత్ర రాజ్యాల పరమైనవి. జర్మను సామ్రాజ్యం, వలస దేశాలుకూడా జర్మనీ నుండి లాక్కోబడినవి. చివరకు - ఇదే మరీ ముఖ్యమైనది - యుద్ధంలో వాటిల్లిన నష్టాలను భర్తీచేయుటకై యుద్ధ నష్టపరిహారములను (Reparations) జర్మని నెత్తిపై రుద్దారు. వర్సైలీసు సంధి ప్రకారం పదమూడువేల రెండువందల కోట్ల (13,200,00 00,00 000) బంగారు మార్కులను జర్మనీ చెల్లించాలి. అయితే యీ మొత్తాన్ని వాయిదాలలో చెల్లించాలి. ఇక్కడ ఆస్ట్రియా మినహా (అమెరికా అప్పులిచ్చి ఆస్ట్రియాను కొంతవరకు రక్షించింది.) యుద్ధంలో పాల్గొన్న దేశాలలో జర్మనీయే వర్సైలీసు సంధివల్ల అత్యధికంగా దోచుకోబడింది.

మిత్రరాజ్యాల బలాబలాలలో కూడా వ్యత్యాసం ఏర్పడింది. యుద్ధరంగాలలో పెద్దపాత్రను వహించకపోయినా, యుద్ధ సరఫరాల మూలకంగా బాగా లాభపడ్డ అమెరికా సంయుక్త రాష్ట్రాలు బాగా పైకివచ్చాయి, బ్రిటీషు కాపిటలిస్టు భానుడు అస్తమించాడు. ప్రపంచ విపణివీధిలో బ్రిటీషు పెత్తనం తొలగింది. దీనిస్థానం అమెరికా సంయుక్త రాష్ట్రాలకు లభించింది. యుద్ధానంతరకాలంలో అమెరికా, ఇంగ్లాండుల మధ్యనున్న వైరుధ్యాలే సామ్రాజ్యవాద వైరుధ్యాలకు ఇరుసుగావుంటూ వచ్చాయి.

జర్మనీ ఇంగ్లాండులు ఒకరినొకరు లోబరచుకోవాలనుకుంటే, వీటి పోటీదారు అమెరికా అత్యధిక లాభాలను పొందింది. యుద్ధానికి అంతకంతకు ఎక్కువ యినుము, ఉక్కు, బొగ్గు రొట్టెలు, మాంసం, బట్టలు కావలసివచ్చినవి. కాని యుద్ధరత దేశాలు వీటిని స్వయంగా సప్లయి చేసుకొనలేక పోయినవి. కాబట్టి అమెరికాకు గిరాకీ తగిలింది. ఇదే సమయంలో దక్షిణ అమెరికా, ఆసియా ఖండాలలోని

వ్యవసాయిక దేశాల మార్కెట్లు కూడా పోటీలేకుండా స్వాధీనమైనవి. యుద్ధానికి పూర్వం బ్రిటను, జర్మనీ, ఇతర యూరోపాదేశాలు ఈ మార్కెట్లకు సరుకుల నెగుమతి గావించేవి. కాని యుద్ధకాలంలో ఈదేశాలు ఎగుమతులను సంక్షేపింపకున్నవి. ఇందువల్ల అమెరికా సంయుక్త రాష్ట్రాలలో (అ. సం. రా.) పరిశ్రమలు, వ్యవసాయం విపరీతంగా అభివృద్ధి చెందినవి. ప్రపంచంలోకల్లా అ. సం. రా. భాగ్యవంతమైన దేశం అయినది. కాపిటలిస్టు ప్రపంచంయొక్క ఆకర్షణకేంద్రం యూరోపు నుండి అమెరికాకు మారింది.

ప్రథమ ప్రపంచయుద్ధానికి పూర్వం అ. సం. రా. లలో పరిశ్రమల ప్రాధాన్యత వుండేదికాదు. 1905 లో ఆ దేశం నుండి వ్యవసాయ దినుసుల ఎగుమతులు 100 కోట్ల డాలర్ల విలువవుంటే పారిశ్రామిక వస్తువుల ఎగుమతుల విలువ 48 కోట్ల డాలర్లు మాత్రమే. కాని యుద్ధదినాలలో పరిశ్రమలు విపరీతాభివృద్ధి నొందినవి. పరిశ్రమల ఉత్పత్తి విలువ 1914 లో 2424 కోట్ల 80 లక్షల డాలర్లు 1918 నాటికి 6258 కోట్ల డాలర్లు వుంది.

అ. సం. రా లలో యుద్ధకాలంలో బొగ్గుల ఉత్పత్తి 40% చొ॥ ఉక్కు ఉత్పత్తి 40% చొ॥ రాక్షసిబొగ్గు దాగి ఉత్పత్తి 20% చొ॥ సింకు (తుత్తునాగం) 80%చొ॥ చమురు 45% చొ॥ పెరిగింది. 1913-18 ల మధ్య సముద్రయానం చేసే నౌగటడల నిర్మాణం 10 రెట్లు పెరిగింది. మోటార్ల నిర్మాణం రెట్టింపు పెరిగింది. యుద్ధకాలమంతటా ప్రధానంగా పారిశ్రామిక వస్తువులఎగుమతి విశేషంగా జరిగింది. 1919 లో అ. సం. రా ల నుండి ఎగుమతి కాబడిన పారిశ్రామిక వస్తువుల విలువ 207 కోట్ల డాలర్లు, అహారవస్తువుల ముడిసరుకుల విలువ 140 కోట్ల 80 లక్షల డాలర్లు. ఆహారవస్తువుల ఎగుమతి తక్కువయే అయినా వ్యవసాయంకూడా చాలా అభివృద్ధి జెందినది. 1913-18 ల మధ్య పంటలు 17% అభివృద్ధి అయినవి. పశుసంపద ఇంకా ఎక్కువ అభివృద్ధి అయింది.

ప్రథమ ప్రపంచయుద్ధంవల్ల అ. సం. రా.లు ప్రపంచములోకెల్ల అతి భాగ్యవంతమైన దేశమైనది. ఇంతకుపూర్వం బ్రిటను ఆ స్థానంలో వుండేది. దానికి ప్రపంచమంతటా అమెరికాలో కూడా కాపిటల్ వుండేది. ప్రపంచ రాజకీయాలలో అదే అతిప్రధానమైన పాత్రను వహిస్తూవుండేది. అన్ని దేశాలు బ్రిటనుకు బాకీపడి వుండేవి బ్రిటిషు కర్రెన్సీ అయిన పౌండుస్టెర్లింగు ప్రపంచంలోకెల్లా భద్రమైన కరెన్సీగా పరిగణించబడేది. కాని యుద్ధంలో ఇదంతా మారిపోయింది. యుద్ధంలో సంపదలో ఎక్కువభాగం కోల్పోయింది. ద్వితీయ స్థానానికి వచ్చింది. అ. సం. రా.లు ప్రథమ స్థానానికి వచ్చినది.

1915-20 ల మధ్య అ. సం. రా. దిగుమతులకన్న ఎగుమతులను ఎక్కువచేయుట ద్వారా 1800 కోట్ల డాలర్లను సంపాదించింది. అంటే యుద్ధక దేశాలనుండి కొనుకొన్న దానికంటె కూడా ఆ దేశాలకు అమ్మిన సరుకుల విలువ

1800 కోట్ల డాలర్లు హెచ్చుగా వున్నదని తెలుస్తోంది. ఈ మేరుపర్వతం అంతా ఎట్లా వచ్చింది? ఎట్లా చెల్లించబడింది.

మొట్టమొదటగా ఐరోపా క్యాపిటలిస్టులకు అమెరికాలో వున్న వస్తువులన్నీ అ. సం. రా. క్యాపిటలిస్టులకు దఖలుకాబడినవి. ఈ విధంగా 300-500 కోట్ల డాలర్లు చెల్లినవి. పైగా ప్రపంచములోవున్న బంగారు సంపదలో సగంపైగా అ. సం. రా. కు చేరుకున్నవి. అంటే యుద్ధరత దేశాలు తమ బంగారు నిల్వలను తరలించి వేసినవన్న మాట. ఇవ్వేగాక మిత్రరాజ్యాలు అ. సం. రా. కు 1000 కోట్ల డాలర్లు ఋణపడి వున్నవి. బ్రిటనుకు తన ఋణస్థులనుండి 160 కోట్ల పౌనులు రావలసివుండగా, తాను అ.సం.రా. కు 90 కోట్ల పౌనులు ఋణపడింది. తనకు ఋణపడిన దేశాలలో, మిత్రరాజ్యాలతో అ. సం. రా. ఒడంబడికలు చేసుకోవడంవల్ల, 1927 నాటికి అసలు ఫాయిదాలతో కలిపి ఈ దేశాలన్నీ అ సం రా. కు 240 కోట్ల పౌనులను ఋణపడినవి. బ్రిటనుకు రావలసిన బాకీలు తగ్గించబడి, అది తాను అ. సం. రా. కు చెల్లించవలసిన మొత్తమునకు దాదాపు సరిసమానం చేయబడింది.

జర్మనీ చెల్లించవలసిన యుద్ధనష్ట పరిహారం మొత్తం 13200 కోట్ల బంగారు మార్కులుగా నిర్ణయించబడినది. దీనిని పరిష్కరించుటకై డావ్ కమీషన్ ఏర్పాటుకాబడింది. ఈ డావ్ ప్లాను ప్రకారం మొత్తం ఎంత చెల్లించాలి అనేది నిర్ణయించకపోయినా 1929 వరకూ సాలీనా 250 కోట్ల మార్కులు చెల్లించాలని నిర్ణయించబడింది. 1929 లో ఈ ప్లాను రద్దుగావించబడి యంగుప్లాను ఏర్పర్చబడింది. ఈ ప్లాను ప్రకారం జర్మనీ సాలుకు 190 కోట్ల మార్కులను 59 సం॥ కాలంపాటు యుద్ధనష్ట పరిహారములకుగాను చెల్లించాలి. కాని ఈ ప్లాను 22 నెలలు మాత్రమే అమలులోవుంది. ఈలోగా ఆర్థిక సంక్షోభం వచ్చింది. 1931 జూలై 1 న హూవర్, ఋణముల చెల్లింపుకు ఒక్క సంవత్సరం వాయిదావేస్తూ మారటోరియం ప్రకటించారు. దీనితోపాటుగా యుద్ధ ఋణాలకు కూడా మారటోరియం వచ్చింది.

ఈ మధ్యకాలంలో జర్మనీ చెల్లించిన నగదు మొత్తం 64 కోట్ల 50 లక్షల పౌండ్లు.

జర్మను యుద్ధ నష్టపరిహారాలు, యుద్ధఋణాలు యుద్ధానంతర సమస్యలలో ప్రధానమైన వాటిలో ఒకటి. వీటి మూలకంగా క్యాపిటలిస్టు దేశాలమధ్య ఎంతో ఘర్షణ, కీచులాట ప్రారంభమైంది. యుద్ధ నష్టపరిహారాల సందర్భంలో అ. సం. రా. జోక్యం కలుగజేసుకోకుండా వుండేది. ఐరోపా సమస్యలలో తనకు జోక్యం లేదన్నట్లుగా వ్యవహరించేది. కాని ఇదే సమయంలో, తనకు ఋణపడివున్న దేశాలుమాత్రం తనకు ఋణాలు చెల్లించి తీరవలసిందేనని శాసించేది.

కాని 1929 ఆర్థిక సంక్షోభంతో అవి ఎగరగొట్టబడినవి. కాని ఈ విధంగా బాకీలు, యుద్ధ నష్టపరిహారాలు ఎగగొట్టబడటం మూలంగా కాపిటలిస్టు దేశాలమధ్య తగవులు మరింత తీవ్రమైనవి.

## కాపిటలిజంలో వచ్చిన జనరల్ సంక్షోభంలో మూడు దశలు

కాపిటలిజం పతనం ఒక్కరోజులో సంభవించదు అది ఒక చారిత్రాత్మక శకమంతటా జరుగుతుంది. ఈ శకమే శ్రామికవర్గ నియంతృత్వం కొరకై జరిగే విప్లవ పోరాటాల కాలం. సోషలిజంకొరకై జరిగే విప్లవోద్యమముల కాలం.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరకాలం మూడు దశలుగా విభజింపబడి వున్నది. 1918–21 నాటికాలం ఒకదశ. ఈ దశలో మొత్తం కాపిటలిస్టు వ్యవస్థయే ఛిన్నాభిన్నమై పోయింది. అనేక దేశాలలో కాపిటలిస్టులకు, కార్మికవర్గానికి అతి తీవ్ర పోరాటాలు ఉద్భవించి అంతఃకలహాలు ప్రజ్వరిల్లినవి. యుద్ధంలో సకల సంపదలకు సంభవించిన విస్తార నష్టాల మూలకంగా ప్రజల కడగండ్లు మిన్ను ముట్టినవి. కాపిటలిజంలోని వైరుధ్యాలన్నీ ఒకకొనకు చేరుకున్నాయి. దారిద్ర్యంలో ముంచబడ్డ ప్రజాసామాన్యం యొక్క క్రోధానికి మితిలేదు. మధ్య ఐరోపా దేశాలన్నీ అంతఃకలహంలో మునిగిపోయినవి. 1919 లో హంగరీలో సోవియటు ప్రభుత్వం ఏర్పడి కొన్ని నెలలపాటు నిలబడింది. బవేరియాలో మరొక సోవియటు ప్రజాస్వామ్యం వెలసి కొన్ని వారాలపాటు జీవించింది. 1921లో గాఢమైన ఆర్థికసంక్షోభం అన్ని కాపిటలిస్టు దేశాలను చుట్టుముట్టి అంతర్విభేదాలను మరింత తీవ్రం చేసింది.

ఈ కాలంలోనే తనపైకి దండెత్తి వచ్చిన వైట్‌గార్డులను, * అంతర్జాతీయ కాపిటలిస్టు మూకను సోవియట్ యూనియన్ వెనక్కి త్రిప్పికొట్టుచున్నది. అంతఃకలహాలలో సోవియటు శక్తి జయించి, దృఢపడింది. దీనిని కూలద్రోయాలనే కుట్రలు, ప్రయత్నములు అన్నీ శ్రామికవర్గం యొక్క అజేయశక్తిని ఛేదించలేక పోయినవి. ప్రపంచ విప్లవం యొక్క మిలిటెంట్‌స్టాఫ్ (సైనికోద్యోగుల కూటమి)గా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ స్థాపించబడింది. మొట్టమొదటసారిగా, అనేక కాపిటలిస్టు దేశాలలో కమ్యూనిస్టుపార్టీలు ఏర్పడి సోషలిస్టు ద్రోహులగు రెండవ ఇంటర్నేషనల్ అనుయాయులచే మలినమొనర్చబడి, రక్త ప్లావితం గావించబడిన విప్లవ సోషలిస్టు జండాను పైకెగురవేశారు.

ద్రోహులగు సోషల్ డెమోక్రాటు నాయకుల సహాయంతో కాపిటలిస్టులు అనేక దేశాలలో విప్లవ శ్రామికవర్గాన్ని నిర్జించగల్గారు. 1923 లో జర్మనీలోకూడా బూర్జువావర్గం ఆ దేశమందు విప్లవ శ్రామికవర్గాన్ని ఓడించగల్గింది. ఈ విధంగా ఒకవైపున శ్రామికవర్గానికి సోవియట్ యూనియన్‌లో సంపూర్ణ విజయము, మరో

* సోవియటు ప్రభుత్వాన్ని కూలద్రోయాలని కొందరు రష్యను సేనాధిపతులు లేవదీసిన సైన్యం. (అనువాదకుడు)

వైభవ పశ్చిమ ఐరోపాలోని శ్రామికవర్గానికి తాత్కాలిక అపజయము సంభవించటంతో “ఈ దశ అంతమొందినది.”

కార్మికవర్గాన్ని దెబ్బతీయటం ద్వారా పశ్చిమ ఐరోపా బూర్జువా వర్గం దాడిని ప్రారంభించింది. ఈ విధంగా రెండవ దశ ప్రారంభమైనది. ఈ దశలో కాపిటలిస్టు దేశాలు కొంతవరకు నిలదొక్కుకున్నవి. ప్రపంచ యుద్ధంలో జరిగిన నాశనమంతను భర్తీ చేయుటకై ‘పునర్నిర్మాణము’ అవసరమైనది. రెండో వైపున సోషలిస్టు ప్రపంచంలో ఆర్థిక విధానమును నిర్మించటంలోను సోషలిస్టు నిర్మాణంలో ఎన్నదగిన విజయములను సాధించుటలోను ఈ దశ ప్రారంభమైనది.

కార్మికవర్గం మొట్టమొదటి త్రిప్పికొట్టిన విస్మృత బూర్జువావర్గం, తనకు గల్గిన గాయాలను కట్టుకట్టుకొనుట ప్రారంభించినది. అయితే తమ జబ్బుకున్నటువంటి కార్మికవర్గం నెత్తిపై ప్రయోగించే ఈ చికిత్స. కార్మికవర్గం యొక్క జీవన ప్రమాణాన్ని అతి ఘోరంగా తగ్గించటంద్వారా కాపిటలిస్టులు తాత్కాలికంగా కొంతవరకు స్థిరత్వమును సంపాదించుకొన్నారు. యుద్ధకాలంలోను, యుద్ధానంతర గందరగోళంలోను క్రిందుమీదులైన ధనం చలామణి తిరిగి స్థిరం చేశారు. కాపిటలిజంలో రేషనలైజేషన్ * పద్ధతులను అమలులో పెట్టారు. కాపిటలిజంలో రేషనలైజేషన్ అంటే కార్మికులను మరింత దోపిడీకి లోనుచేయటమన్నమాట. మానవ మెకానికల్ పరికరాలను ఉత్పత్తికి వినియోగించటంద్వారా ఇది సాధ్యమౌతుంది; రేషనలైజేషన్‌వల్ల కార్మికుల సంఖ్య తగ్గుతుంది. కాని వారి ఉత్పత్తిశక్తి అధికమౌతుంది. తిరిగి ఉద్యోగం దొరికే ఆశలేకుండా వేలకొలది, లక్షలకొలది కార్మికులు వీధిలోకి గెంటబడతారు. ఇక ఫ్యాక్టరీలలో మిగిలిన కార్మికులు ఇదివరకు తాముచేసే పనికి రెండుమూడు రెట్లు ఎక్కువ చేస్తూ, కాపిటలిస్టుల లాభాలకై తమ ఆఖరి నెత్తురుబొట్టునుకూడా ఓడ్చేటట్లు నిర్బంధించబడతారు.

కాపిటలిజం కొంతవరకు పొందిన ఈ స్థిరత్వం తాత్కాలికమైనది, వణుకుతూ వున్నట్టిది. కాపిటలిజంలోని వైరుధ్యాలను ఇది ఏమాత్రం పరిష్కరించలేదు: శాశ్వతంగా కాక, తాత్కాలికంగా, కొద్దికాలం మాత్రం వాటిని అణిచిపెట్టగలదు. కాని ఏ యేటికాయేడు ఈ వైరుధ్యాలు తీవ్రరూపం దాల్చుతూ ఒక్కసారి విరుచుకు పడతాయి.

ఈ ఆర్థిక స్థిరత్వంకూడా అన్ని దేశాలలోను ఒకేమాదిరిగాని, ఒకే విధంగాగాని జరగలేదు. అందువల్ల ఈ దేశాలమధ్యనుండే అసమానాభివృద్ధి మరింత తీవ్రమైనది. కొన్ని దేశాలు త్వరగా కోలుకున్నవి, కొన్ని చాలా వెనకబడ్డవి. తిరిగి స్థిరత్వంకూడా వివిధ దేశాలలో వివిధ సమయాలలో జరిగినవి. ఇదేవిధంగా

* కార్మిక శక్తిని ఏమాత్రం వృధాగానీయక పూర్తిగా పిండటాన్ని కాపిటలిస్టు రేషనలైజేషన్ అంటాము, మంచి యంత్రములద్వారా, తక్కువశ్రమతో ఎక్కువ ఉత్పత్తిని గావించటం సరియగు రేషనలైజేషన్. (అనువాదకుడు)

ఉత్పత్తి కూడా వివిధదేశాలలో వివిధసమయాలలో తిరిగి ప్రారంభమైనది. ఈవిధంగా ఆర్థిక స్థిరత్వం చెందే కాలంలో హెచ్చుతగ్గు లుండటం మూలంగా వివిధ దేశాల మధ్య వైరుధ్యాలు మరింత పెరిగి స్పష్టంగా కన్పించినవి.

కాపిటలిజం తాత్కాలికంగా కొంత స్థిరత్వాన్ని పొందటంతో పాటుగా సోవియటు యూనియనులో పునర్నిర్మాణం పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ఉరకలు దీసింది. సామ్రాజ్యవాద యుద్ధంవల్ల, తదుపరి వచ్చిన అంతర్యుద్ధంవల్ల దేశానికి తగ్గిన గాయాలు అతిత్వరగా మాసిపోయినవి. బయటి సహాయం ఏమీ లేకుండానే స్వతంత్రంగానే ఇది జరిగింది. ఈవిధంగా సోవియటు యూనియన్ ఎలనది అభివృద్ధి కావటంవల్ల కాపిటలిస్టు సంక్షోభం మరింత గాఢమై తీవ్రమైనది.

వలస దేశాల ప్రజలు తమ్ము దోచుకునే సామ్రాజ్యవాద దొంగలకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు సాగించుతారు. తాత్కాలికంగా కొంత వెనుక్కు తగ్గినా, చైనాలో జరిగే విప్లవం సామ్రాజ్యవాదులను విద్రవింపజేయుడు * ఇండియా మున్నగు వలస దేశాలలో బ్రిటిషు ఫ్రెంచి సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా జరిగే పోరాటం మిన్నుముట్టుతూ వుంటుంది. సామ్రాజ్యదేశాల మధ్యనే వున్న వైరుధ్యాలు ఇంకా తీవ్రమౌతాయి. ప్రపంచ ఆర్థిక కేంద్రంగాను, ప్రపంచానికంతటికీ దోపుకోవేడిగాను అ. సం. రా లు తయారౌటచే అమెరికన్ యూరపియన్ సామ్రాజ్యవాదులకు, ముఖ్యంగా అమెరికన్, బ్రిటిషు సామ్రాజ్యవాదులకు మధ్య వ్యవహారాలు మరింత చెడుస్తవి. ఈ రెండు సామ్రాజ్యాల మధ్య ఘర్షణయే ప్రపంచ సామ్రాజ్యవాద రాజకీయాల పరిభ్రమణకు ఇరుసుగా వుంటుంది. కొన్నిదేశాలలో పారిశ్రామికోత్పత్తి 1914 పూర్వపు ప్రమాణానికి చేరిన పిమ్మట మార్కెట్లకై ఘర్షణ తీవ్రమౌతుంది.

## మూడవ దశ

కాపిటలిజంలో జనరల్ సంక్షోభము ప్రారంభము కావటంతో మొదలిడుతుంది. ఈ దశలో సమకాలీన కాపిటలిజంలోవుండే మూలవైరుధ్యాలన్నీ అతి తీక్ష్ణ రూపాన్ని పొందుతాయి. 1913 తో పోలిస్తే 1927 లో ప్రపంచంలో ఈ క్రింది విధంగా ఉత్పత్తి జరిగింది.

చమురు 300%, ఇనుము 102%, ఉక్కు 127%, నత్తి 125% గోధుమ 110% రైధాన్యం 95%, 1928 లో కొన్ని వస్తువుల ఉత్పత్తి ఇంకా పెరిగింది. ఈ విధంగా యుద్ధం పూర్తిఅయిన 10 ఏండ్లకు కాపిటలిజం యుద్ధానికి పూర్వమున్న స్థాయిని మించినది. ఇదే సమయంలో కాపిటలిస్టు దేశాలలో, దేశాంతర్గతంగాను, వివిధ దేశాల మధ్య వైరుధ్యాలు పెరిగినవి. ఈ దశలో, కాపిటలిజం పొందిన తాత్కాలిక స్థిరత్వం పటాపంచలైనది. 1924 లో ప్రారంభమైన ప్రపం

---

* 1924 నాటి చైనావిప్లవం (అనువాదకుడు)

ఆర్థిక సంక్షోభం కాపిటలిస్టు దేశాలను మూలపట్టాలనే కదల్చివేసింది. కాపిటలిస్టు ఆర్థిక వ్యవస్థాపితత్వానికి అంత్యదశ వచ్చింది. ఈ విషయం 1932 లో జరిగిన 12 వ ప్లీనంయొక్క తీర్మానంలో వ్యక్తపర్చబడింది.

కాపిటలిస్టు వ్యవస్థలో ప్రవేశపెట్టబడే రేషనలైజేషన్ వల్ల కార్మికులను దోచుకోవటం మరింత ఎక్కువౌతుంది. వర్గవైరుధ్యాలు మరింత తీవ్రమౌతాయి. కాపిటలిజంలో రేషనలైజేషన్ అంటే పాత పరిశ్రమలన్నిటినీ మూసివేయటం, సాగే పరిశ్రమలలో కార్మికులసంఖ్య తగ్గించబడటం అని అర్థం. ఏడువని నిరుద్యోగం ప్రబలుతుంది. మిక్కిలి అభివృద్ధి చెందిన కాపిటలిస్టు దేశాలలో కూడా కార్మికుల స్థితి మరింత హీనమౌతుంది.

ఉదాహరణకు : సంస్కరణవాదులచే "భూలోకస్వర్గము" అనిపొగడబడే అ. సం. రా. లను చూడండి. 1919-1925 ల మధ్య ఈ క్రింది మార్పులు జరిగినవి. పరిశ్రమలలోను, రైల్వేలలోను, వ్యవసాయంలోను నియోగించబడిన కార్మికుల సంఖ్యలో 7% తగ్గింది. ఉత్పత్తి 20% పెరిగింది. ఉత్పత్తిశక్తి 27% పెరిగింది. మొత్తం కార్మికులసంఖ్య 20 లక్షలకుపైగా తగ్గింది. వీరిలో కొందరు వ్యాపారములోనూ నౌకరీలలోనూ కుదురుకున్నా అత్యధిక సంఖ్యాకులు నిరుద్యోగులుగానే వుండిపోయారు.

1929 ప్రారంభం నాటికి జర్మనీలో 30 లక్షలమంది నిరుద్యోగులైన కార్మికులున్నారు. కాపిటలిస్టు-రేషనలైజేషను ఎక్కువయినకొలది నిరుద్యోగుల సంఖ్య (కార్మిక రిజర్వు) కూడా క్రమంగా పెరుగుతూవచ్చింది. బాగా ఎక్కువగా పారిశ్రామికోత్పత్తి జరుగుతున్న కాలంలో కూడా ఈ నిరుద్యోగులసంఖ్య 10, 15 లక్షలకు ఎప్పుడూ తగ్గలేదు. ఇందులో 5, 10 లక్షలమంది కార్మికులు శాశ్వతంగా నిరుద్యోగులైపోయారు. వారికి గతిమోక్షం లేదు. కాపిటలిస్టు రేషనలైజేషన్ మూలంగా పీల్చిపిప్పిచేయబడి శక్తియంతా ఉడిగిపోయిన పిమ్మట వీధిలోకి గెంటబడిన బలి జంతువులే వీరు.

రేషనలైజేషన్ మూలకంగా ప్రధాన కాపిటలిస్టు దేశాలలోని నిరుద్యోగులైన కార్మికులసంఖ్య ఒక కోటికి పెరిగింది. సరిగ్గా యుద్ధ హతులసంఖ్య ఎంత ; యుద్ధహతులవలెనే వీరుకూడా కాపిటలిజానికి బలైపోయినవారే. ఉన్న తేడా అంతా శాంతికాలంలో క్రమంగా రాలిపోయేవారు వీరు.

టెక్నికల్ అభివృద్ధి జరిగిన కొలదీ కార్మికుల దుస్థితి, పేదరికం హెచ్చుతుంది. లక్షల కొలది కార్మికులు నిరుద్యోగులౌతుంటే, అమిత వస్తురాసులు ఉత్పత్తి అవుతూ వుంటాయి. సరుకుల మొత్తం అధికమైనకొలదీ దేశాంతర్గత అంగడి కుంచించుకుపోతుంది. ఈ విధంగా సరుకుల ఉత్పత్తిలోవృద్ధి ప్రజాసామాన్య పేదరికంతో ఘర్షణపడుతుంది. అమ్మకం ఇబ్బందులు పెరిగి వివిధదేశాల కాపిటలిస్టులమధ్య "బాహ్య అంగళ్ళ" కొరకై తీవ్రపోటాటం ప్రారంభమౌతుంది.

ఈ మూడవ దశలో వుత్పత్తి శక్తులు అధికమౌతూ వుంటే అంగళ్ళు కబళించుకు పోవడం మరీ అధికమౌతూ వుంటుంది. అంతర్గత భేదాలు, బాహ్య భేదాలు మరీ పెరిగి జనరల్ సంక్షోభంలో కాపిటలిస్టు వ్యవస్థ ప్రేలి బీటలువారిపోతుంది. ఈ విధంగా మూడవదశలో అతి వినాశకరమైన సంక్షోభం సంభవించి మరీ తీవ్ర సామ్రాజ్యవాద యుద్ధాలకు దారియేర్పరుస్తుంది.

ఇదే సమయంలో సోవియట్ యూనియన్‌లో ఆర్థికవ్యవస్థ పునస్థాపితం కావటమునుండి పునర్నిర్మాణానికి సాగిపోతుంది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా సాగుతూ వుంటుంది. జాతీయార్థిక వ్యవస్థయంతా పునర్నిర్మింపబడటము, సోషలిస్టు పరిశ్రమలన్ని విశేషాభివృద్ధి నొందటమూ, వ్యవసాయం సమిష్టి పద్ధతులపై జరుగుటకు పునాదులు వేయటమూ-ప్రపంచంలోని 1/6 భాగంలో ఇవన్ని జయప్రదంగా జరుగుతూ వుండగలవు. ఈ మూడవదశలో, రెండువ్యవస్థల మధ్య-మరణవేదన పడుచున్న కాపిటలిస్టు వ్యవస్థ దినదిన ప్రవర్ధమానమగు సోషలిస్టు వ్యవస్థల మధ్య - పోరాటం మరింత తీవ్రమౌతుంది. ఒకవైపున ప్రళయాంతకమగు ఆర్థిక సంక్షోభం వచ్చి కాపిటలిస్టు దేశాలన్నిటిని మొదలంట వూపివేస్తూ వుంటే కాపిటలిజం యొక్క నిరర్థకత, సోషలిజం యొక్క అత్యంతోపయోగం ఈ దశలో బహు స్పష్టంగా కన్పించ గలవు.

కాపిటలిజం కొంతవరకు నిలదొక్కుకున్న కాలంలో, యుద్ధంలో గల్గిన గాయాలన్నింటిని పూర్తిగామాన్పుకున్నదనీ, యుద్ధానంతరం సంక్షోభాన్ని గడించిందనీ. బూర్జువా పండితమ్మన్యులు, సోషల్ డెమోక్రటు ప్రబుద్ధులు చెప్పసాగారు. వారి వాదన ప్రకారం కాపిటలిజంలో ఇంకా పూర్తిగా జీవం, శక్తి, హుషారు వున్నవి. దీని భవిష్యత్తు బహు ఉజ్వలంగా వుంటుంది. వీరి దృష్టిలో సాధివంటలు పొంగిపొర్లే కాలం వచ్చింది. ఏమీ ఉత్పాతములు, సంక్షోభములు; యుద్ధాలు ఎరుగని రామరాజ్యం ప్రారంభమైనది.

ఈ బూర్జువా బానిసలవాదనలనే చాటుమాటు కమ్యూనిస్టు పార్టీలలోని ఏ ఎండకా గొడుగుపట్టే అవకాశవాదులుకూడా వల్లెవేయ ప్రారంభించారు. ఈ అవకాశవాదులలో మితవాదులు సోషల్ డెమొక్రాట్ల వాదనలనే పునశ్చరణచేయ నారంభించారు. రెండవదశ నుండి మూడవదశకు మారుకాలం కాపిటలిజం యొక్క స్థిరత్వం అంత్యదశకాదనీ, పైపెచ్చు అది మరింత కుదుటపడు దశయని వీరు వాదించసాగారు. వీరు అమెరికన్ 'సౌభాగ్యాన్ని' పొగడజొచ్చారు. అమెరికా, ఇతరదేశాలవలె ఆర్థిక సంక్షోభంవలె దెబ్బతినేదికాదట. ఈవిధంగా అమెరికాకు 'అతీతత్వము'ను ఆరోపించ సాగారు. కాపిటలిజం స్థిరత్వం శాశ్వతమనీ, అచంచలమనీ వీరిభావం. ట్రాట్స్కీ-యిస్టులు ప్రథమంలో కొంత తీవ్రపదజాలాన్ని ఉపయోగించి, అసలు 'స్థిరత్వమే' పొందలేదు పొమ్మన్నారు. కాని త్వరలోనే రంగు ఫిరాయించి, కాపిటలిస్టు స్థిరత్వాన్ని గూర్చి పొగడనారంభించారు. అనేకమంది బూర్జువా అర్థశాస్త్రవేత్తలే కాపిటలిజంలో

ప్రవేశించిన తీవ్రసంక్షోభాన్ని గుర్తించి ఆరాటపడుతూ వుంటే, ఈ మితవాద అవకాశ వాదులూ; ట్రాట్స్కీయిస్టు-జినోవీవిస్టులూ ఆర్థికసంక్షోభం వచ్చిందనే విషయాన్నే అంగీకరించరు

మరొక తీవ్ర ఆర్థిక సంక్షోభం విచ్ఛిత్తమవుతుందనే విషయాన్ని కాపిటలిజం కొంతవరకు నిలదొక్కుకుంటూ వుండే సమయంలోనే సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ, కామింటర్న్ గుర్తించినవి. కాపిటలిజంలోని అంతర్విభేదాలను మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలప్రకారం అనుశీలనం గావించడంద్వారానే ఈ పరమ సత్యాన్ని ఈ సంస్థలు ముందుగానే గుర్తించగల్గినవి. 1927 డిసెంబరులో జరిగిన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 15వ కాంగ్రెసుకు సమర్పించిన రిపోర్టులో "కాపిటలిజం యొక్క స్థిరత్వం నుండే దాని సంక్షోభం జనిస్తున్నది" అని స్టాలిన్ తెలియజేశాడు. అతడీ క్రింది విధంగా వివరించాడు:

"కాపిటలిజం యుద్ధానికి పూర్వపు స్థాయిని అందుకోగలదు, దానిని మించగలదు కూడా. ఉత్పత్తిని రేషనలైజేషన్ పద్ధతులప్రకారం నడుపగలదు. కాని ఇంతమాత్రంచేత కాపిటలిజం స్థిరత్వం శాశ్వతమనీ, తన పూర్వాపన్నత్వాన్ని తిరిగి పొందగలదనీ చెప్పటం పూర్తిగా తప్పు. ఈ విషయం 14వ కాంగ్రెసు రిపోర్టులోనే స్పష్టం చేయబడింది. కాపిటలిజం స్థిరత్వం నిల్వదు సరిగదా, పైపెచ్చు, దాని స్థిరస్థితి నుండే, ఉత్పత్తి పెరుగుదల నుండే, వ్యాపార విస్తరణ నుండే, టెక్నికల్ అభివృద్ధి, ఉత్పత్తి శక్తి అభివృద్ధుల నుండే ప్రపంచ కాపిటలిజంలో సంక్షోభం వస్తున్నది. ఇవన్నీ పెరుగుతున్నవి. కాని ప్రపంచ మార్కెట్లు, దాని హద్దులు, వేర్వేరు సామ్రాజ్యవాద దేశాల పలుకుబడి ప్రదేశాలు దాదాపు ఎదుగు బొదుగులు లేకుండా వుంటాయి. ఈ వైరుధ్యం నుండే మహా భీకరమగు యుద్ధాలకు కారణభూతమై, కాపిటలిజం స్థిరస్థితినే కూలద్రోసే మహాతీవ్రమైన సంక్షోభం ముంచెత్తుకు వస్తున్నది. ఈ కొంచెపు స్థిరస్థితినుండే సంక్షోభం తీవ్రమౌతుంది. సంక్షోభం తీవ్రమైనకొలదీ స్థిరస్థితి తల్లక్రిందులౌతుంది. ఈ చారిత్రక దశలో కాపిటలిజంయొక్క పరిణామగతి మాత్రమిదే."

స్టాలిన్‌యొక్క అంచనా సరియైనదని తర్వాత ఘటనలు రుజువుచేశాయి. 1929 ఆఖరుకే కాపిటలిజంలో కనివిని యెరుగని ప్రళయసన్నిభమైన సంక్షోభం ప్రారంభమైనది. బూర్జువా ఆర్థిక శాస్త్రవేత్తలు, సోషల్ డెమోక్రాట్లు, అవకాశ వాదులు అల్లిన కట్టుకథలన్నీ దీనితో ఎగిరిపోయినవి. కాపిటలిజంలో ప్రవేశించిన జనరల్ సంక్షోభం యొక్క మూడవదశను గూర్చి కామింటర్న్, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చేసిన అంచనా సరియైనదని రుజువైనది. 1932 సెప్టెంబరులో జరిగిన కామింటర్న్ కార్యవర్గం యొక్క 12 వ ప్లీనంగావించిన తీర్మానంలో సూచించబడినట్లుగా ఈ ప్రపంచ సంక్షోభంవల్ల కాపిటలిజంలో తాత్కాలికంగా కల్గిన స్థిరస్థితికాస్తా అంత్యదశకువచ్చింది.

కాపిటలిజం ప్రవేశించిన ఈ జనరల్ సంక్షోభ శకంలో వర్గ వైరుధ్యాలు మరీ తీవ్రతరమౌతాయి. తన అంత్యదశ సమీపిస్తున్నదని గ్రహించి తన అధికారాన్ని సుస్థిరం చేసుకొనుటకై బూర్జువావర్గం కార్మికవర్గాన్ని అతిక్రూరంగా అణచివుంచుటకు ప్రయత్నించుతుంది. యుద్ధానంతరము మొదటి సంవత్సరాలలో కార్మికవర్గ విజృంభణమును అణచివేసిన పిమ్మట ఇటలీ, హంగరీ మున్నగు దేశాలలో బూర్జువావర్గం ఫాసిస్టు నియంతృత్వాలను స్థాపించింది. జర్మనీలో అనేక మలుపులు గడచి చివరకు 1933లో హిట్లరు అధికార స్వీకరణతో ఫాసిస్టు పరిపాలన ప్రారంభమైనది.

నియంతృత్వాన్ని మరుగుపర్చి ఇతర రూపాలద్వారా పరిపాలనను సాగించటం బూర్జువా వర్గానికి కష్టసాధ్యమైపోతోంది. అందుచేతనే బహిరంగమైన ఫాసిస్టు నియంతృత్వాన్ని సాధిస్తుంది. అతిదారుణ పద్ధతులద్వారా కార్మికోద్యమాన్ని అణచివేస్తుంది. ఇదంతా కాపిటలిజంయొక్క బలహీనతను అశాశ్వతత్వమును రేపు మనగతి ఏమిటా యనే కాపిటలిస్టుల భయాన్ని వెల్లడిజేస్తుంది.

కాపిటలిజంయొక్క శిథిలావస్థలో, పతనదశలో ఫాసిస్టు నియంతృత్వం రావటం దాని ప్రత్యేక లక్షణం. కార్మికవర్గంనుండి రక్షించుకొనుటకై బూర్జువావర్గానికి కొంత బలమును నిర్మించబూనుకుంటుంది ఫాసిజం. పెటీ బూర్జువావర్గం, రైతాంగం, ఉద్యోగిబృందం చిన్న వ్యాపారులు, మేధావులు మున్నగువారినిది కూడగట్టుతుంది. కార్మికవర్గంలో వెనకబడ్డ తరగతులలోనికి కూడా ఇది చొరబడుతుంది. గాలికి బ్రతికేవారినందరినీ ఇది చేరదీస్తుంది. మొట్టమొదటగా కాపిటలిస్టు వ్యతిరేక నినాదాలతో వీరినందరినీ కూడగట్టుతుంది. ఈ విధంగా నిరాధారులైన, చైతన్యం పొందని ప్రజలందరినీ కూడగట్టుటకు ఈ ఆర్భాటాలు ముసుగుగా ఉపయోగిస్తాయి.

కొమింటర్న్ ప్రోగ్రాములో ఈ విధంగా చెప్పబడింది.

"విప్లవ కార్మికుల పురోగామి పక్షాన్ని అనగా కమ్యూనిస్టు శక్తులను, శ్రామికవర్గ ప్రధానశక్తులను నాశనం గావించటమే ఫాసిజంయొక్క ప్రధానాశయం. సాంఘికంగా అవీ ఇవీ చేస్తామని ఆర్భాటాలు పల్కటం, మోసం, దాక్షిణ్యాలు, పీటికి కోడు విదేశాంగనీతిలో ఇతర దేశాలను కబళించుటకై తీవ్రమైన దాడులను సాగించటం; ఇవే ఫాసిజంయొక్క ప్రధానలక్షణాలు. సంక్షోభం మరీ తీవ్రరూపంలో వున్నప్పుడు ఫాసిజం కాపిటలిస్టు వ్యతిరేక నినాదాలను బయలుదేరదీస్తుంది. కాని అది ప్రభుత్వాధికారాన్ని చేపట్టిన పిమ్మట కాపిటలిస్టు వ్యతిరేక ధోరణిని పూర్తిగా విసర్జించి కోటీశ్వరుల నగ్ననియంతృత్వంగా బైటపడుతుంది."



# అధ్యాయం 11

# కాపిటలిజంలో వచ్చిన సమకాలీన ప్రపంచ సంక్షోభము

## జనరల్ సంక్షోభంలో ఆర్థిక సంక్షోభం

ప్రస్తుతం చాలాఏండ్లుగా కాపిటలిస్టు ప్రపంచమంతటినీ క్రిందుమీదులు పెడుతున్న సంక్షోభం * అపూర్వమైనది. సామ్రాజ్యవాద యుద్ధంతో బాటుగా ప్రారంభమైన జనరల్ సంక్షోభంతోనే ఈ ఆర్థిక సంక్షోభం ప్రారంభమైనది. కాపిటలిజం పతనదశలో, శ్రామికవర్గ విప్లవముల శకంలో ఈ సంక్షోభం ప్రారంభమైనది.

ఇతర సంక్షోభములకన్న ఈ సంక్షోభం ప్రధానముగు ఒక ప్రత్యేక సందర్భాన్ని గల్గివున్నది. కాపిటలిస్టు ప్రపంచంతోబాటు నేడు సోషలిజం జయప్రదంగా నిర్మింపబడే సోవియటు యూనియన్ ఉన్నది. ఈ రెండు వ్యవస్థలమధ్య శిధిలమై మరణవేదనలో వున్న కాపిటలిజముకు, దినదిన ప్రవర్ధమాన మగుచున్న సోషలిజముకు మధ్య-ప్రత్యేకమగు పోరాటం జరుగుచున్నది. సంక్షోభం కాపిటలిస్టు ప్రపంచాన్ని రాక్షసశక్తితో ఉర్రూతలూపివేస్తుంటే సోవియటు యూనియన్లో సోషలిస్టు ఆర్థికవ్యవస్థ నానాటికీ బలపడుతూ వృద్ధిచెందుచున్నది. ఈ రెండువ్యవస్థల మధ్య జరిగే పోరాటంవల్ల కాపిటలిస్టు సంక్షోభం తీక్ష్ణమౌతుంది. సోవియటు యూనియన్ అస్తిత్వం కాపిటలిజం యొక్క పతనాన్ని రూఢిచేస్తుంది. కాపిటలిస్టు ప్రపంచంలోవున్న అభాగ్యులందరికీ, కటిక దరిద్రం, దౌర్భాగ్యం, దుస్థితులనుండి తొలగి సౌఖ్యప్రదమగు జీవనాన్ని గడుపుటకు మార్గంగలదని సోవియటు ఆర్థికవిధి హెచ్చరిక చేస్తూవుంటుంది.

సామ్రాజ్యవాద యుద్ధమూ, దాని ఫలితాలు, కాపిటలిజం యొక్క పతనాన్ని మరింత దగ్గరకు తెచ్చినవి: దాని సమస్థితిని తల్లక్రిందులు గావించినవి: నేడు మనం యుద్ధముల, విప్లవముల శకంలో వున్నాము: కాపిటలిజమే నేడు ప్రపంచాన్ని అఖండంగా ఏలటంలేదు: కాపిటలిస్టు వ్యవస్థతోబాటు నేడు సోషలిస్టు

* 1929-34 ఆర్థిక సంక్షోభం (అనువాదకుడు)

వ్యవస్థకూడా వున్నది: ఇది నానాటికి పెరుగుచున్నది. విస్తరించుతున్నది. తన మనుగడ ద్వారా కాపిటలిజంలోని కుళ్ళును బైటపెట్టుచూ, దాని పునాదులనే పెకలించి వైచుచున్నది.*"

1929 శరదృతువులో రెండు దూరప్రాంతాలలో, రెండు పరస్పర వ్యతిరేకమగు దేశాలలో ఆర్థిక సంక్షోభం బయలుదేరింది. ఒకవైపున వెనుకబడిన పోలెండు, రుమేనియాలలో, మరోవైపున బలశాలిన కాపిటలిస్టు ప్రపంచంలోకెల్లా భాగ్యవంతమగు అ. సం. రా లో ఒకేసారిగా ఈ సంక్షోభం ప్రారంభమైనది. ఈ కేంద్రాలనుండి కాపిటలిస్టు ప్రపంచమునకు అంతటికి సంక్షోభం ప్రాకింది.

కాపిటలిస్టు ప్రపంచంలోకెల్లా బలవత్తరమగు అ. సం. రా. లనే ఈ సంక్షోభం ఎక్కువ తీవ్రతతో కొట్టింది. చాలా ఏండ్లుగా, అమెరికన్ "సౌభాగ్యాన్ని" గూర్చి బూర్జువా వాదులు, వారి చెప్పులుతుడిచే సోషల్ డెమోక్రాటు పండితప్రకాండులు ఎన్నోకీర్తుల పొగడ్తలు గావించారు. ఈ ద్రోహసిద్ధాంతముల నన్నింటినీ సంక్షోభం నిర్మొగమాటంగా బహిరంగపర్చినది.

యుద్ధానంతర కాలంలో మొట్టమొదటగా ప్రపంచవ్యాపితంగా వచ్చిన సంక్షోభం ఇది. వేర్వేరు దేశాలలో ఇది వేర్వేరుగా వచ్చింది: కొన్ని దేశాలలో త్వరగా, కొన్ని దేశాలలో ఆలస్యంగా వచ్చింది. వేర్వేరు దేశాలకు వేర్వేరు డిగ్రీలలో దీని తాకిడి తగిలింది. కాని మొత్తంమీద కాపిటలిస్టు ప్రపంచమంతా చుట్టుముట్టబడింది: ఏ దేశమూ తప్పించుకోలేక పోయింది.

కాపిటలిజం పతనం ప్రారంభం కాకపూర్వం, సంపన్నకాలం చాలాఏండ్లు వున్నపిదప, కాపిటలిస్టు దేశాల జాతీయార్థికస్థితి పెరిగిన పిమ్మట వస్తూవుండేది. కాని ఈ 'మామూలు' సంక్షోభాలకంటె ప్రస్తుత సంక్షోభం భిన్నమైనది. ఈ సంక్షోభానికిపూర్వం ఏవో కొన్ని కాపిటలిస్టు దేశాలలో గుప్పుగుప్పుమని సంపన్నత వెలిగి ఆరుతూ వుండేది.

వివిధ దేశాలలో 'వ్యాపార వెల్లువలు' (Booms) వివిధ కాలాలలోవచ్చి, స్వల్పకాలం మాత్రమే వుండేవి. జర్మనీలో 1927 – 28 లోనే క్షీణత కన్పించింది. పోలెండులో 1927 – 28 లో వ్యాపారం కోల్కువటం కన్పించింది. జపానులో 1927 లోను, 1929 ప్రారంభంలోను, కాని ఇగ్లండు, ఆస్ట్రేలియా, బ్రెజిలు మున్నగు దేశాలలో కోల్కువటమనేదే లేదు, సంక్షోభానికి పూర్వమే చాలాఏండ్లుగా వ్యాపారం ఎదుగుబొదుగు లేకుండా వున్నది.

---

* స్టాలిన్ యొక్క "16 వ కాంగ్రెసు రాజకీయ నివేదిక" నుండి. ఇది ప్రథమంలో లెనినిజం 2 వ వాల్యూంలో ప్రకటించబడిందిగాని, తర్వాత ప్రకటించబడిన ఒకే వాల్యూంలో ఇదిలేదు.

ఈ కాలంలో కాపిటలిస్టు ప్రపంచంలోని పరిస్థితులను సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 17 వ కాంగ్రెసుకు సమర్పించిన రిపోర్టులో కామ్రేడ్ స్టాలిన్ ఈ విధంగా వర్ణించారు :

"ఆర్థికరంగంలో, ఈ సంవత్సరాలలో, ప్రపంచ ఆర్థిక సంక్షోభం కొనసాగుతూవున్నది. ఒక్క పరిశ్రమలలో నేగాక, ఈ సంక్షోభం వ్యవసాయంలోగూడా వచ్చింది. ఒక్క ఉత్పత్తి వాణిజ్యంలోనేగాక, అరువు వ్యాపారం ధనం చలామణీలలోగూడా వ్యాపించి దేశాలమధ్యవుండే అరువు, క్రెడిట్సులను తారుమారు చేసింది.

"అసలు ప్రపంచ సంక్షోభం వున్నదా లేదా అనే తగాదా పూర్వం ఎక్కడో అక్కడక్కడా వుండేది. కాని ఈనాడు ఆ తగాదా ఏమీలేదు. ప్రతివాడికి కండ్లఎదుట స్పష్టంగా అది కనిపిస్తూనే వున్నది. ఇప్పుడు తగాదా అంతా ఇంకొక దానినిగూర్చి: సంక్షోభంనుంచి బైటపడేమార్గం వున్నదా, లేదా? వుంటే, ఏది ఆమార్గం? అన్నదే ఆ తగాదా."

"సరుకులను కొనేది అత్యధికంగా ప్రజాసామాన్యం. కాని వీరి కొనుగోలు శక్తి చాలాహీనంగా వుంటుంది. కాబట్టి ఉత్పత్తి వీరు కొనగలిగిన శక్తికి ఎంతో మించి, బట్టలు, పంచదార, యంత్రోత్పత్తి సరుకులు, భోజనపదార్థాలు వగైరాలు ఉత్పత్తి అయి వుంటాయి. కాపిటలిస్టు వ్యవస్థలో ప్రజల కొనుగోలు శక్తి అతిహీనంగా వుండుటచే "అదనపు" సరుకులను కాపిటలిస్టులు విధ్వంసమైనా చేస్తారు : లేదా నాశనంగావిస్తారు. బట్టలు, ధాన్యం మున్నగు వస్తువులకు పట్టేదుర్గతి ఇదే. ఈ విధంగా ధరలను పెంచాలని వీరు చూస్తారు. ఉత్పత్తిని తగ్గిస్తారు; కార్మికులను పనిలోనుండి బర్తరఫ చేస్తారు. అధికంగా సరుకుల ఉత్పత్తి అయినందువల్లనే ప్రజలు అధికంగా ఈతిబాధలకు లోనౌతారు.*"

అధికోత్పత్తి అంటే అమ్మకం బందైపోతుంది. మార్కెట్టులో బేరసారాలు తగ్గిపోతాయి. ఫాక్టరీలు పరిశ్రమలు మూతబడుతాయి. ఉత్పత్తి తగ్గిపోయింది అన్నమాట. సరకుల రాసులు అమ్ముడుకాక నిల్వఉండిపోతాయి. ముడి సరుకులు, పారిశ్రామిక సరుకులు, వ్యావసాయిక సరుకులు విపరీతంగా ప్రోగుపడి వుంటాయి. ఈ నిల్వలు మార్కెట్టుపై ఒత్తిడిచేస్తాయి. ధరలు పడిపోరాదని కాపిటలిస్టులు ఉత్పత్తి తగ్గిస్తారు: లేదా నిల్వసరుకులలో కొంతభాగాన్ని నాశనంగావిస్తారు. ఈవిధంగా కొద్దిరోజులు ధరలను నిలబెట్టివుంచవచ్చును, కాని వీరి ప్రయత్నాలకు సంక్షోభశక్తి అతీతమైనది. అమ్మకాలు తగ్గుటవల్ల, బేరసారాలు తగ్గుటవల్ల, సరకుల నిల్వలు పెరిగిపోవటంవల్ల తప్పనిసరిగా "ధరల పతనం" వస్తుంది. సమకాలీన గుత్తసంస్థలు ప్రయత్నించిన కొలదీ తద్వ్యతిరేకమే జరుగుతూవుంటుంది. కొన్ని గుత్తసంస్థలు హెచ్చుధరలను నిలబెట్టుటకు శాయశక్తులా తంటాలుపడి కొంతకాలం

---

* స్టాలిన్ వ్రాసిన 'లెనినిజం' నుండి

† వ కాంగ్రెసుకు స్టాలిన్ ఇచ్చిన రిపోర్టునుండి.

అనుప్రదమౌతాయి. ఇందువల్ల ధరలలో విపరీత వ్యత్యాసాలు ఏర్పడుతాయి. కాని ఈ ధరలు హెచ్చుగావున్నా, ఇతర అన్ని వస్తువుల ధరలు విపరీతంగా పడిపోతాయి.

అమ్మకాలు పడిపోవటం, వస్తువులు నిల్వవుండిపోవటం, ధరలుపడిపోవడం మూలంగా "ఉత్పత్తి తగ్గించబడుతుంది." ఈ ఉత్పత్తి తగ్గించు అనేక దుష్ఫలితాలకు దారితీస్తుంది. "నిరుద్యోగుల" సైన్యం పెరుగుతుంది. పరిశ్రమలను పనిచేయించటం అంతకంతకు తగ్గుతుంది. పరిశ్రమలు పూర్తిశక్తితో పనిచేయవు. ఇందువల్ల ఉత్పత్తి ఖర్చులు పెరుగుతాయి. ఇదేసమయంలో వస్తువులు అమ్మకం ధరలు పడిపోయాయి. కాపిటలిస్టు ఆర్థిక నిర్మాణంలో బలహీన పరిశ్రమలు కూలిపోతాయి. దివాళాలు హెచ్చుతాయి. అరువు, పెట్టుబడివ్యాపారములలో సంక్షోభంబయలుదేరుతుంది.

లక్షలకొలది కార్మికులు నిరుద్యోగులుగా వీధులలోనికి గెంటబడుతారు. ఈ నిరుద్యోగులకు జీవనాధారం ఏమీఉండదు. నిరుద్యోగభృతి దొరికినా అది గంజి నీళ్ళకే సరిపోదు. పనిలోవున్న కార్మికుల కూలికూడా అంతకంతకూ క్రమంగాతగ్గించబడుతుంది. ఇందువల్ల వారి కొనుగోలుశక్తి మరింత తగ్గిపోతుంది. ఇదేకాలంలో వ్యవసాయిక సంక్షోభంకూడా బయలుదేరుతుంది. వ్యవసాయదారుల ఆదాయాలు పడిపోతాయి. రైతులు దివాళాతీస్తారు.

దేశంలో మార్కెటు మూలబడుటచే విదేశమార్కెట్లను సంపాదించుటకై కాపిటలిస్టులలో తీవ్రపోరాటం ప్రారంభమౌతుంది. కాని, విదేశమార్కెట్లను సంపాదించాలంటే ఇతర కాపిటలిస్టు దేశాలనైనా ఆక్రమించుకోవాలి. లేదా వలస దేశాలు, వలసదేశ సమానములైన దేశాలగు వ్యవసాయిక దేశాలనాక్రమించు కోవాలి. ఇది సామ్రాజ్యవాద యుద్ధానికి దారితీస్తున్నది. ప్రతి కాపిటలిస్టు దేశమూ ఇతర కాపిటలిస్టు దేశం దురాక్రమణనుండి రక్షించుకొనుటకై తనచుట్టూ సుంకాల కోటలను నిర్మించుకుంటుంది, దిగుమతి సుంకాలు చాలా అధికంగా విధించబడుతాయి. కొన్ని రకాల సరకుల దిగుమతియే పూర్తిగా నిషేధించబడుతుంది. వ్యవసాయిక సంక్షోభం దెబ్బవలన, సామ్రాజ్యవాద దోపిడివలన వలసదేశాలన్నీ నాశన పరిస్థితులకు వస్తాయి: వీటన్నిటి మూలకంగా విదేశవర్తకం క్షీణించుతుంది. మార్కెట్లకొరకై పోరాటం తీవ్రమౌతుంది: కాపిటలిస్టు ప్రపంచంలో "అంతర్విభేదాలు మిన్నుముట్టుతాయి.

## సంక్షోభములన్నింటిలోనికి ఈనాటిది గాఢమైనది: దీర్ఘమైనది

కాపిటలిజం చరిత్రలో చాలా సంక్షోభములు వచ్చివున్నవి. కాని ఇప్పటి సంక్షోభం అంతటి తీవ్రమైనది, అగాధమైనదీ మునుపెన్నడూ సంభవించియుండలేదు. వ్యాప్తిలో, శక్తిలో, దైర్ఘ్యంలో, కాపిటలిస్టు ఆర్థికవిధానంలోని ప్రతిఒక్క అంగమును దెబ్బకొట్టడంలో, దీనికి సాటియైన సంక్షోభములేదు.

"ముఖ్యంగా ఒక్క విషయంలో, ఇతర సంక్షోభాలనుండి ప్రస్తుతసంక్షోభం భిన్నమైనది. అన్నిటికీ కి ఇప్పటి సంక్షోభం అతి దీర్ఘమైనది : సాగదీయబడుతూ వున్నది ఇదివరకో సంక్షోభం రెండు, మూడు సంవత్సరాలపాటు వుండేది: ఇప్పుడో అప్పుడే 5సంవత్సరాలా సంక్షోభకాలం గడిచిపోయింది. ఈ 5ఏండ్లలోను ఏడాదికేడాది ఆర్థికవినాశనం వృద్ధియౌతుంది. గతకాలంలో కాపిటలిజం పెంచుకున్న కొవ్వంతా ఈ 5 ఏండ్లలోనూ కరిగిపోయింది. అన్ని సంక్షోభములలోనికి ఇది అతితీవ్రమైనదని చెప్పటకేమి సందేహంలేదు" *.

ప్రధానమగు ఇండెక్సు సంఖ్యలు (వివిధ దేశములకు, లేక వివిధములగు విషయములకు సంబంధించిన తారతమ్యాలను చూపు అంకెలు) చూస్తే ఈ విషయం తెలిపోతుంది. ఉత్పత్తి క్షీణతకు, నిరుద్యోగాభివృద్ధికి, జీతముల తగ్గింపుకు, సరుకుల ధరల పతనమునకు, విదేశవ్యాపారం క్షీణతకు, స్టాకుమార్కెటు ధరల పతనానికి సంబంధించిన ఇండెక్సు సంఖ్యలనుచూస్తే ఈసంక్షోభం పూర్వపు అన్నిసంక్షోభముల కన్న బహుతీవ్రమైనదని తెలియగలదు.

ఈ క్రింది ఇండెక్సు సంఖ్యలు పూర్వపు సంక్షోభములకూ, ఈ సంక్షోభంకూ గల తారతమ్యములను స్పష్టంగా తెలియజేయగలవు.

## % లో క్షీణత

| సంక్షోభ సం॥రాలు | ముడి ఇనుము ప్రపంచ ఉత్పత్తి | అ.సం.రా. లో ఇండ్ల నిర్మాణం | ప్రపంచ విదేశ వ్యాపారం | స్టాక్ ధరలు: అ.సం.రా. | స్టాక్ ధరలు: ఫ్రాన్సు | ప్రపంచంలో సరుకుల ధరల క్షీణత |
|---|---|---|---|---|---|---|
| 1873-74 | 8.9 | — | 5 | 30 | — | 20 2 |
| 1883-85 | 10 0 | — | 4 | 29 | — | 20 4 |
| 1890-92 | 6 5 | — | 1 | — | 21 | — |
| 1907-08 | 23 0 | 20 0 | 7 | 37 | 5 | 0 8 |
| 1920-21 | 43.5 | 11.0 | — | 41 | 25 | 21 0 |
| 1929-32 | 66 8 | 85 2 | 60 | 75 | 50 | 47 0 |

కాపిటలిజం యొక్క జీవిత చరిత్రలో కని విని ఎరుగనంతటి హీనంగా ఉత్పత్తి ఈ సంక్షోభంలో పడిపోయింది. పూర్వం ఉత్పత్తి 10% 15% పడిపోతే, అదొక ఉత్పాతమనుకొనేవారు. కాని యిప్పటి ఉత్పత్తి క్షీణతతో జూస్తే పూర్వపు క్షీణత ఒక లెక్కలోనిదే కాదు. ఇప్పుడో 1/3 నుండి 2/5 వరకూ ఉత్పత్తి పడిపోయింది. మరీ ముఖ్యమైన దేశాలలో సగానికి పడిపోయింది.

* 'లెనినిజం' నుండి

ఈ అపూర్వమగు ఉత్పత్తి పతనంవల్ల కాపిటలిస్టు దేశాలు ఎంతో వెనుక్కు వెళ్ళినవి.

కాపిటలిస్టు దేశాలలో వేర్వేరు పరిశ్రమల లెక్కలను చూస్తే ఈవిషయం మరీ స్పష్టంగా కనిపిస్తుంది. 1932 నాటికి ఉత్పత్తి ఎంత క్షీణించి వున్నదో దానివల్ల అర్థంకాగలదు. పూర్వం ఏ సంవత్సరం ఉత్పత్తి ప్రమాణానికి ఇది తగ్గిందో కూడా తెలియగలదు.

| దేశం | రాక్షసి బొగ్గు | ముడి ఇనుము | ఉక్కు | పత్తి అచ్చు |
|---|---|---|---|---|
| అమెరికా సంయుక్త రాష్ట్రాలు | 1906 | 1898 | 1905 | 1893 |
| ఇంగ్లాండు | 1900 | 1860 | 1897 | 18"2 |
| జర్మనీ | 1899 | 1891 | 1895 | 1889 |

ఈ విధంగా కాపిటలిస్టు దేశాలలోని మూల పరిశ్రమలు 25, 40 ఏండ్లు వెనుక్కు పోయినవన్నమాట.

ఉత్పత్తి క్షీణతకు తోడుగానే నిరుద్యోగసమస్య వుంది. నిరుద్యోగం కూడా ఇదివరకు ఏ సంక్షోభకాలంలోనూ లేనంత ఎక్కువగా పెరిగిపోయింది. 1921లో నిరుద్యోగం విపరీతంగా పెరిగినదనుకున్నారు, అప్పుడు నిరుద్యోగులసంఖ్య 1,00,00,000. కాని ఇప్పుడో మరీముఖ్యమైన కాపిటలిస్టు దేశాలలోని నిరుద్యోగుల సంఖ్యయే 4, 5 కోట్లకుపైగా వుంది.

ఈనాటి సంక్షోభం ఇంత తీవ్రంగాను, గాఢంగాను, దీర్ఘకాలం వుండటానికి కారణమేమిటి? సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 17వ కాంగ్రెసుకు ఇచ్చిన రిపోర్టులో స్టాలిన్ ఈ కారణముల నీ విధంగా అన్వేషించాడు:

"ఒకటి: సంక్షోభం ఏ ఒక్క కాపిటలిస్టు దేశమును వదలక ప్రతిఒక్క దేశమును దెబ్బకొట్టింది. అందువే కొన్నిదేశాలు నష్టపడి, కొన్నిదేశాలు బాగుపడుటకు అవకాశం లేకపోయింది.

రెండు: వ్యవసాయిక దేశాలు, అర్ధ వ్యవసాయిక దేశాలు కూడా సంక్షోభంలో ఇరుక్కున్నవి. ఈవిధంగా పారిశ్రామిక, వ్యవసాయిక సంక్షోభములు పెనవేసుకొనిపోయి, మరింత జటిలమైనవి.

మూడు: వ్యవసాయిక సంక్షోభం మరింత తీవ్రరూపందాల్చి ప్రతిఒక్క శాఖనూ తల్లక్రిందులు చేసింది. పశుపాలన కూడా దెబ్బతిన్నది: యంత్రశక్తి వుపయోగం క్షీణించి తిరిగి మానవుని బండపని ప్రారంభం చేయబడింది. ట్రాక్టర్లకు బదులు గుర్రాల వుపయోగం తిరిగి వచ్చింది. కృత్రిమపు ఎరువుల వుపయోగం

తగ్గనైనా తగ్గింది; లేదా పూర్తిగా మూసివేయబడింది. వీటి ఫలితంగా పారిశ్రామిక సంక్షోభం మరీ తీవ్రమైనది.

వాళ్లు : గుత్త కార్టెళ్ళు ధరలను తగ్గనీయకుండా వుంచ చూస్తాయి. అందువల్ల సరుకుల విల్వలు అనబడు అర్ళ్ళ కొను: పైగా బాధ లెక్క వౌతాయి.

అయితే : ముఖ్యమైన కారణం : కాపిటలిజంలో ప్రవేశించిన జనరల్ సంక్షోభకాలంలో, స్వదేశాలలోగాని, పరాధీనదేశాలలోగాని, వలసదేశాలలోగాని యుద్ధానికి, అక్టోబరు విప్లవానికి పూర్వంవున్న అనవశ్యాలు కాపిటలిజం పోగొట్టుకున్న కాలంలో, యుద్ధం మూలంగా పరిశ్రమలన్నీ క్షీణశక్తికో వడి జేయటం దీర్ఘవ్యాధిగా తయారైన కాలంలో, పరిశ్రమలు తీర్చుకోలేనంత హెచ్చుగా నిరుద్యోగుల సంఖ్య పెరిగిపోతున్నకాలంలో, ఈ సంక్షోభం వచ్చింది.

ఈనాటి పారిశ్రామిక సంక్షోభం ఇంతగాఢమూ, దీర్ఘమూ అగుటకు కారణములు పైన చూపబడినవి *"

## ఉత్పత్తి క్షీణత

యంత్రోత్పత్తివల్ల వచ్చిన సంక్షోభం మూలంగా అర్థికరంగంలో అన్ని శాఖలలోనూ ఉత్పత్తి అతితీవ్రంగా పడిపోయింది. అనన్యశాధ్యమగు ఉత్పత్తి క్షీణత 1929 శరద్ఋతువులో ప్రారంభమై, కొనసాగుతూ వచ్చింది.

ప్రతి సంవత్సరం సోవియటు యూనియన్‌లో ఉత్పత్తి పెరుగుతూవుంటే సంక్షోభపు కోరలలో చిక్కిన కాపిటలిస్టు దేశాలన్నింటిలోనూ ఉత్పత్తి అతి శీఘ్రగతిలో తగ్గిపోయింది.

అధికార పూర్వకంగా ప్రకటింపబడిన ఈ క్రింది లెక్కలు మొత్తం సోవియటు యూనియన్‌లో ఉత్పత్తి ఏవిధంగా క్రమాభివృద్ధి పొందుచున్నదో, కాపిటలిస్టు దేశాలలో ఎలా క్షీణిస్తున్నదో తెలియజేయగలదు. †

## పారిశ్రామికోత్పత్తి పరిణామం

| దేశం | 1929 | 1930 | 1931 | 1932 | 19333 |
|---|---|---|---|---|---|
| సోవియట్ యూనియన్ | 100 | 129.7 | 161.9 | 184.7 | 201 6 |
| అ. సం. రాష్ట్రాలు | 100 | 80.7 | 68.1 | 53 8 | 64 9 |
| ఇంగ్లాండు | 100 | 92.4 | 87.8 | 83 8 | 86.1 |
| జర్మనీ | 100 | 85.3 | 71 7 | 5 .8 | 66 8 |
| ఫ్రాన్సు | 100 | 100 7 | 89 2 | 69.1 | 77 4 |

* 'లెనినిజం' నుండి.

† 17 వ కాంగ్రెసుకు స్టాలిన్ ఇచ్చిన రిపోర్టునుండ.

ఈ పట్టీ పారిశ్రామికమైనది. దీనివల్ల తేలేది:

ఒకటి: ప్రతిపెద్ద కాపిటలిస్టు దేశంలోనూ పారిశ్రామకోత్పత్తి అతి దారుణంగా తగ్గిపోతూవుంటే, సోవియటు యూనియన్‌లో అతివేగంగా వృద్ధియౌతూ వున్నది.

రెండు: వుత్పత్తిక్షీణత ప్రారంభించింది 1932 లో. 1929 తో పోల్చితే ఈనాటికి వుత్పత్తి 1/3 వంతు తగ్గింది. 1933 లో కొంచెం తెప్పరిల్లినా: ఇంకా 1/4 వంతు తగ్గియేవున్నది.

మూడు: అన్ని దేశాలూ ఒకేవిధంగా దెబ్బతినలేదు. వేర్వేరు దేశాలు వేర్వేరు విధంగా దెబ్బతిన్నవి.

సంక్షోభానికి పూర్వం కూడా ఈ వేర్వేరు దేశాలలోని పరిస్థితులు కూడా వివిధములుగా వుండేవని గుర్తించాలి. పై పట్టీ బట్టి బ్రిటను స్థితి కాస్తమెరుగుగా వుండేదని తోచవచ్చును. కాని వాస్తవానికి ఇది విరుద్ధం. యుద్ధానికి పూర్వపు లెవెల్‌తో పోలిస్తే ఈ దేశం ప్రస్తుత స్థితిలో వుండే తారతమ్యాలు స్పష్టంగా గోచరిస్తాయి. యుద్ధానికి పూర్వపు లెవెల్, సంక్షోభంనాటి లెవెల్, ఈ క్రింది పట్టీలో యివ్వబడుచున్నవి.

| దేశం పేరు | 1913 | 1929 | 1930 | 1931 | 1932 | 1933 |
|---|---|---|---|---|---|---|
| సోవియట్ యూనియన్ | 100 | 194.3 | 252.1 | 314.7 | 359.0 | 391.9 |
| అ. సం. రాష్ట్రాలు | 100 | 170.2 | 137.1 | 115.9 | 91.4 | 110.2 |
| ఇంగ్లాండు | 100 | 99.1 | 91.5 | 83.0 | 82.5 | 85.2 |
| జర్మనీ | 100 | 113.0 | 99.8 | 81.0 | 67.0 | 75.4 |
| ఫ్రాన్సు | 100 | 139.0 | 140.0 | 124.0 | 96.0 | 107.0 |

ఈ పట్టీవల్ల ఇంగ్లాండు, జర్మనీ దేశాలలో వుత్పత్తి యుద్ధానికి పూర్వం కన్నా తగ్గిపోయిందని తెలియగలదు. అ. సం. రా. లో వుత్పత్తి యుద్ధానికి పూర్వం కంటే 1929 నాటికి 170% పెరిగింది. కాని 1933 నాటికి 10% మాత్రమే పెరుగుదల వున్నది. ఇదేసమయంలో, జారుకాలంనాటి రష్యా వుత్పత్తికంటే 1933 నాటి సోవియటు వుత్పత్తి సుమారు నాలుగురెట్లు వృద్ధియైనది.

ప్రళయభీకరమగు ఈ ఉత్పత్తి క్షీణత వుత్పత్తిశక్తుల వినాశనమునకు కారణమౌతుంది.

కార్మికుల రక్తమాంసాలతో సృష్టింపబడిన వుత్పత్తి పరికరాలు చాలా స్వల్పంగా మాత్రమే వుపయోగింపబడుతాయి. పెద్దపట్టీలు, కొలిమిలు, గనులు,

యంత్రసామాగ్రి పరిశ్రమలు, బట్టలమిల్లులు, మున్నగువాటిలో అత్యధికభాగం మూతబడిపోతాయి. ఏవి యంత్రాలే తగు సంరక్షణలేక శిథిలమైపోతాయి. పనిచేసే పరిశ్రమలలోని యంత్రాలుకూడా చాలా తక్కువ సామర్థ్యంతోనే పనిచేస్తాయి. ఈవిధంగా యంత్రాలు పూర్తి సామర్థ్యంతో పనిచేయకపోవటమనేది కాపిటలిజంలో ప్రవేశించిన జనరల్ సంక్షోభకాలపు చక్కని నిదర్శనము.

ఉదాహరణకు: అ. సం. రా. నే చూడవచ్చును. ఇచ్చట యంత్రాలు చాలాకాలం నుండి తక్కువ సామర్థ్యంతోనే పనిచేయించబడుచున్నవి. 1920 నాటికే గనుల పూర్తిసామర్థ్యంలో 68% మాత్రమే వినియోగించబడుచున్నవి. మానెగనులు 67%: మానెఫ్రకచరు పరిశ్రమలు 76%: ఇనుముతరుగుయంత్రాలు 67%-80% మోటారు 60% లోపు ఉత్పత్తి యంత్రములు యంత్రపరికరాల యంత్రములు 55%: బట్టలమిల్లులు 72%, కొన్ని పరిశ్రమలలో ఇంకా తక్కువగానూ - ఉదాహరణకు సింగాణిపరిశ్రమ 50%: పిండిమరలు 40%: ఉన్ని మిల్లులు 30% వరకే పనిచేస్తూ వుండేవి. అంటే, ఈ దేశంలో మూలపరిశ్రమలశక్తి అధికమైనా అవి తమశక్తి కొలదీ పనిచేయక కొంతవరకు సోమరిపోతులుగా వుంటున్నవని తెలియగలదు. ఇది సంక్షోభమునకు పూర్వమే వున్నస్థితి. ఇక సంక్షోభం వచ్చి సరుకులు విపరీతంగా నిల్వవుండిపోయి, వుత్పత్తి చాలా ఎక్కువగా సంక్షీణించబడినప్పుడు ఈ యంత్రముల సామర్థ్యం ఎంత నిరర్థకమైనదో వూహించవచ్చును.

1932 అక్టోబరు నాటికి అ. సం. రా లో మొత్తం ఉక్కు ఫ్యాక్టరీలలో 18%, మోటారు ఉత్పత్తి కర్మాగారములలో 11% మాత్రమే పనిచేస్తూ వున్నవి. ఆదేకాలంలో జర్మనీ మొత్తం పరిశ్రమల సామర్థ్యంలో 38% మాత్రమే వినియోగంలో వున్నది. తక్కినది మూలబడినది. భారీపరిశ్రమలలో ఇది ఇంకా తక్కువ.

అ. సం. రా. లో 80 పెద్ద బట్టీలు 4 ఏండ్లలో శిథిలమైపోయినవి 1931 నాటికి 7,10,000 టన్నుల ఉక్కును కరిగించగల 12 బట్టీలు, 13 రోలింగు మిల్లులు పీకివేయబడ్డవి. జర్మనీలో 23 పెద్దబట్టీలు, 38 కొలుములు నాశనం చేయబడ్డవి.

కాపిటలిస్టు దేశాలలో చాలాచోట్ల వెలిసిన పరిశ్రమ 'శ్మశానాల' గూర్చిన వర్ణనలను అనేక బూర్జువా పత్రికలలోనే చదువవచ్చును. తలుపులు విరాయించబడిన యంత్రాగారాలు, గిడ్డంగులు, దుమ్ముకొట్టుకుపోయిన 'క్రేనులు,' (బరువుల నెత్తు యంత్రములు) తుప్పులు మొలిచిన రైల్వే రోడ్లు మూలపడిన ఓడలగుంపులు, వంగి విరిగిపోయిన ఫ్యాక్టరీ చిమ్నీలు, అతి భాగ్యవంతమైన కాపిటలిస్టు దేశాలలో కూడా మైళ్ళపర్యంతం వ్యాపించివుంటాయి.

## జాతీయాదాయంలో క్షీణత, జాతీయ సంపద తగ్గుదల

పారిశ్రామిక, వ్యవసాయకోత్పత్తి క్షీణించటం వల్లనూ, రవాణా తగ్గటంవల్లనూ కాపిటలిస్టు దేశాలలో ప్రతి ఏటా వుత్పత్తి అయ్యే విలువల మొత్తం తగ్గుతుంది. అంటే ఆ కాపిటలిస్టు దేశాల "జాతీయాదాయం" తగ్గుతుంది.

సంక్షోభం వల్ల ఒక్క జాతీయాదాయమే కాదు తగ్గేది; పనికాకుండా బూజుపట్టివుండే ఫాక్టరీలు శిథిలమైపోతాయి. సాగుకాని భూములు బీళ్ళుగా తయారౌతాయి. పోషణలేక యంత్రాలు వగైరా తుప్పుపట్టి పనికిరాకుండా పోతాయి. అమ్ముడు కాని అనేకరకాల వస్తువులు అనేకవిధాల నాశనం గావింపబడతాయి. అనేక సంవత్సరాల శ్రమ ఫలితంగా నిర్మించబడ్డ సంపదలు, అనేక విధాలుగా "నిరుపయోగం, నాశనం" గావింపబడుతాయి. అనేక తరాల కష్టఫలితమైన "ఉత్పత్తి శక్తులన్నీ" దుబారాచేయబడుతాయి.

ఒకదేశంలోవుండే యంత్రాలయాలు, ఫాక్టరీలు, భవనాలు, యంత్రాల సామగ్రి, తయారయిన సరుకులూ, ముడిసరుకులూ, ఇవన్నీ కలిపి "జాతీయ సంపదగా" వ్యవహరించబడుతుంది. కాపిటలిస్టు దేశాలలో ఈ జాతీయ సంపద జాతి చేతులలో లేదు. పోనుపోనూ, పరాశ్రయ జీవులగు కొలదిమంది కాపిటలిస్టుల చేతులలో ఇదంతా కేంద్రీకరించబడివున్నది. ఇదే విధంగా జాతీయాదాయంకూడా ఆ జాతిలోని ప్రజాసామాన్యానికిగాక పోతుటీగలవంటి కొలదిమంది సోమరులకు పోతుంది.

సంక్షోభంయొక్క మొదటి రెండు సంవత్సరాలలోనూ, ముఖ్యమగు కాపిటలిస్టు దేశాల జాతీయసంపద, జాతీయాదాయం, ఏ విధముగా పడిపోయినవో ఈ క్రింది పట్టికవల్ల తెలుసుకోవచ్చును:

(కోట్ల డాలర్లలో)

| దేశం | జాతీయ సంపద | | జాతీయాదాయము | |
|---|---|---|---|---|
| | 1929 | 1931 | 1929 | 1931 |
| అ. సంయుక్త రాష్ట్రాలు | 40,000 | 24 000 | 9 000 | 6,400 |
| ఇంగ్లాండు | 11 500 | 6, 900 | 1,900 | 1 140 |
| జర్మనీ | 8,000 | 4 800 | 1,650 | 930 |
| ఫ్రాన్సు | 6 800 | 5 100 | 900 | 670 |
| ఇటలీ | 3 000 | 1 800 | 500 | 300 |

పైలెక్కలేమి చూపుతున్నవి? సంక్షోభం యొక్క మొదటి రెండు సంవత్సరాలలోను ప్రధానమగు 5 కాపిటలిస్టు దేశాలలోనూ, జాతీయ సంపదలో 40% తగ్గుదల (69 300 కోట్ల డాలర్లనుండి 26 700 కోట్ల డాలర్లకు తగ్గుదల) కల్పించింది. జాతీయాదాయంలో కూడా 40% క్షీణత. అంటే సాలీనా ఆదాయం 13,750 కోట్ల డాలర్లనుండి 8,440 కోట్ల డాలర్లకు క్షీణత కల్పించింది.

కాపిటలిస్టు ప్రపంచంలో సంక్షోభం కల్గజేసిన విపరీతనష్టాన్ని, నాశనాన్ని ఈ అంకెలు తెలియజేస్తున్నవి. కోట్లకొలది ప్రజలు దరిద్రము, ఆకలివల్ల మరణం

కూడి వస్తుంటే ఏవిధంగా అనేక సంపదలు బుద్ధిలేకుండా, అతిదారుణంగా నాశనం గావింపబడుతాయో ఈ లెక్కలు రుజువు చేస్తున్నవి.

కాపిటలిజంలో వచ్చిన సంక్షోభం బరువులన్నీ కార్మికవర్గంపై విరుచుకు పడ్డవి. సంక్షోభం మూలకంగా కార్మికవర్గ పరిస్థితులు మరింతహీనమైనవి. నిరుద్యోగం మరింత ప్రబలింది. కార్మికులను దోచుకోవటం మరీ తీవ్రమైనది.

## నిరుద్యోగము : కార్మికుల పరిస్థితులు

1914 యుద్ధంతో ప్రారంభమైన జనరల్ సంక్షోభంతో నిరుద్యోగం వృద్ధియైనది. యుద్ధానంతరం ప్రముఖ కాపిటలిస్టు దేశాలలో ఇది మరీ వృద్ధినొందినది. ఇదివరకు సౌభాగ్యదినాలలో అంతర్హితమయ్యే నిరుద్యోగుల సంఖ్య (కార్మిక రిజర్వు) యుద్ధానంతరం శాశ్వత సైన్యం ఏర్పరచుకొన్నది. ప్రస్తుత సంక్షోభానికి పూర్వమే శాశ్వత నిరుద్యోగుల సైన్యం చాలా పెరిగిపోయింది. ఉదాహరణకు : 1920 నుండి ఇంగ్లండులో శాశ్వతంగా నిరుద్యోగులైనవారి సంఖ్య 20 లక్షలకెన్నడూ తగ్గలేదు. 1926-27 ల మధ్య కాపిటలిస్టులు ప్రవేశపెట్టిన రేషనలైజేషన్ వల్ల నిరుద్యోగుల సంఖ్య మరీ పెరిగింది. శ్రమశక్తిని తీవ్రం చేయటంద్వారా కాపిటలిస్టులు కార్మికుల సంఖ్యను తగ్గించి శ్రమశక్తిని 'పొదుపు' గావిస్తారు. ఇందుమూలకముగా లక్షలకొలది కార్మికులు 'పెద్ద'గా తప్పిస్తారు.

ఇంగ్లండులో 1927 జూన్‌లో నిరుద్యోగులసంఖ్య 8.8%. 1929 ఫిబ్రవరి నాటికి ఈ సంఖ్య 12.2% కు పెరిగింది. ఇదేకాలములో జర్మనీలో 6.3% నుండి 22.3% కు అనగా 2,62,21,000 కు ఈ సంఖ్య పెరిగింది. అ. సం. రా. లో 1927 లో 21,00,000 మంది నిరుద్యోగులున్నారు. 1928 ఆఖరు, 1929 ప్రారంభానికి ఈ సంఖ్య 34,00,000 లకు పెరిగింది.

1929 లో ప్రారంభమైన సంక్షోభంతో నిరుద్యోగుల సంఖ్య మరీ విపరీతంగా పెరిగింది. ఉత్పత్తి తగ్గిపోవడంతో లక్షలకొలది కార్మికులు నిరుద్యోగులైనారు. ఇక పనులలో మిగిలినవారి శ్రమ మరీ హెచ్చుగా పిండబడింది.

మొత్తం కాపిటలిస్టు చరిత్రలో మునుపెన్నడూ లేనంత హెచ్చుగా నిరుద్యోగుల సంఖ్య ఈ సంక్షోభకాలంలో పెరిగింది. ఎంతో తక్కువ అంచనా వేస్తేనే, ప్రధాన కాపిటలిస్టు దేశాలలో 4,50,00,000 మంది నిరుద్యోగు లున్నట్లు తెలుస్తున్నది. వీరి కుటుంబాలనుకూడా కలుపుకుంటే అ. సం. రా. ల. జనాభాకంత పెద్ద సంఖ్య ఉంటుంది. వీరికితోడు వారంలో 2, 3 రోజులే పని దొరికే కార్మికులను కూడా కలుపుకుంటే యిక చెప్పనక్కరలేదు. అయితే, ఒకపూటకు గంజికూడా లేనటువంటి వలసదేశ అభాగ్య ప్రజలసంఖ్య ఈసంఖ్యలకు చేర్చబడలేదు. మొత్తం ప్రపంచంమీద ఈ సంక్షోభ దినాలలో నిరుద్యోగుల సంఖ్య 4, 5 రెట్లు పెరిగింది. కొన్ని దేశాలలో ఇంకా హెచ్చుగాకూడా పెరిగింది.

ఈ సందర్భంలో చాలా కాపిటలిస్టు దేశాలలో సరియగు లోకస్థితిగణనము (Statistics) ప్రచురించబడలేదనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఏ లెక్కలైనా సేకరించబడినా అవి యధార్థ విషయాలను చూపక, తక్కువ అంచనాలనే చూపుతాయి.

అ. సం. రా. ల వంటి ప్రధాన దేశంలోనే నిరుద్యోగుల లెక్కల వివరములు ప్రచురించబడుటలేదు. అయినా, ఆ దేశంలో సంక్షోభం చాలా తీవ్రంగా వున్నప్పుడు, దాదాపు 1,70,00,000 మంది నిరుద్యోగులున్నారన్న విషయాన్ని బూర్జువా పత్రికలుకూడ దాచలేకపోయినవి. ప్రపంచంలోకెల్లా భాగ్యవంతమైన పారిశ్రామికదేశం అ. సం. రా. ఇట్టిదేశంలోనే మొత్తం కార్మిక సంఖ్యలో సగం ఈ విధంగా నిరుద్యోగులై వున్నారు. ఇంగ్లాండులో నిరుద్యోగులకు భృతినిచ్చు సాంఘిక బీమాపద్ధతి (Social Insurance) వున్నది. కాబట్టి నిరుద్యోగులలెక్కలు తెలియుట కవకాశమున్నది. ఈ సాంఘిక బీమాలిస్టుల ప్రకారం ఇంగ్లాండులో 30,00,000 మంది నిరుద్యోగులున్నారు. కాని సంక్షోభ దినాలలో లక్షలకొలది నిరుద్యోగులు సాంఘిక బీమాలిస్టులనుండి తొలగించబడ్డారని గుర్తుంచుకోవాలి. లక్షలకొలది కార్మికులకు ఈ నిరుద్యోగభృతి అందనేలేదు. జర్మనీలో నిరుద్యోగుల సంఖ్య ఎప్పుడూ చాలా తక్కువగానే చూపబడుతుంది. ముఖ్యంగా హిట్లరు పరిపాలన వచ్చిన పిమ్మట ఈ దొంగలెక్కల తయారు మరీ జోరైంది. అయినా ఆ దేశంలో ప్రభుత్వ అంచనాల ప్రకారమే 50,00,000 మంది నిరుద్యోగులున్నారు.

ప్రస్తుత సంక్షోభంలో కుటుంబ యజమానియో, భార్యయో, కుమారుడో, ఎవరో ఒకరు నిరుద్యోగిగా లేనటువంటి కుటుంబం గాలించినా కన్పించదు. అంటే, ఎవరో ఒకరు సంపాదించే ముష్టి మూడు దబ్బులతో కుటుంబమంతా కాలక్షేపం చేయాలన్నమాట. ఈ పనిలోవున్న అతడైనా రేపు పనవని వుంటుందా ఊడుతుందా అనే భయంతోనే సర్వదా కాలం గడపాలి. ఏ సమయంలోనైనా అతని ఉద్యోగం పోవచ్చును.

కొన్ని కాపిటలిస్టు దేశాలలో కార్మిక నిరుద్యోగభృతి యివ్వబడుతున్నది. అదికూడా క్రమక్రమంగా తగ్గించబడుతూనే యున్నది. ఫ్రాన్సు, అ. సం. రా. మున్నగు దేశాలలో అసలు యెట్టి సాంఘిక బీమాపద్ధతులూ లేవు. అక్కడ యెవరైనా నిరుద్యోగులైనారంటే, అడుక్కుతినాలి, లేదా, మలమలమాడి చావాలి. కాని ఇంగ్లాండు, జర్మనీ, మున్నగుదేశాలలో నిరుద్యోగభృతి యివ్వబడుచున్నా 'పొదుపు' పేరతో ఈ భృతికూడా తగ్గించబడింది. కార్మికులలో కొంతమందికి పూర్తిగా ఎగగొట్టబడిందికూడా.

ఈ సంక్షోభకాలంలోనే కార్మికుల జీవన ప్రమాణాలపై బూర్జువావర్గం దెబ్బతీస్తుంది. పనిలోవున్న కార్మికులను దోచుకోవడం మరీ వృద్ధియౌతుంది. చాలా సందర్భాలలో పనిగంటలు పెంచబడతాయి. శ్రమ ఉత్పత్తి ఎక్కువ

చేయబడుతుంది. అర్ధదినంపనిమాత్రమే చేయువారల జీతాలు మరీతగ్గించబడుతాయి. పనిచేయు పరిస్థితులు చాలా హీనమౌతాయి. సంక్షోభకాలంలో కార్మికులందరి జీతాలూ చాలా తక్కువగావించబడినవి.

అ. సం. రా. లో. లోగడ చెల్లించబడిన మొత్తం జీతం బిల్లులో 1932 నాటి 33% మాత్రమే చెల్లించబడింది. అంటే 67% తగ్గించబడింది. జర్మనీలో మూడు ఏండ్లలోను 2600 కోట్ల మార్కుల జీతాలు తగ్గించబడినవి. కాని ఇదే కాలంలో సోవియటు యూనియన్‌లో జీతాలనిధి 800 కోట్ల రూబుల్సునుండి 3000 కోట్ల రూబుల్సుకు పెరిగింది.

ప్రధానమగు కాపిటలిస్టు దేశాలలో గత 10 ఏండ్లలోను వినివేశనాలలో ఎంత పతనం వున్నదో ఒక జర్మన్ అర్థిక శాస్త్రవేత్త పరిశోధించి ఈ క్రింది నిర్ణయాలకు వచ్చారు :

"గత దశాబ్దాంతో గమనించి పోల్చితే ప్రస్తుతం వినివేశనముల ప్రమాణం ఈ విధంగా వుంది : అ. సం. రా. లో గత 50 ఏండ్లలోను వున్నవాటి కంటె ఇప్పుడున్న వినివేశనాల ప్రమాణం తక్కువగా వున్నది. ఇంగ్లాండులో 18 వ శతాబ్దాంతమునవున్న వినివేశనముల ప్రమాణమెంతో ఇప్పుడూ అంతేవున్నది."

ఇతర దేశాల ఉదాహరణలు కూడా దీనినే రుజువుచేస్తాయి.

జర్మనీ : ఇటీవల వినివేశనాల లెవెల్ పడిపోయింది. 1913-14 లో ఈ లెవెల్‌ను 100 గా తీసుకుంటే ఈ క్రింది ఇండెక్సు అంకెలు వస్తాయి.

| | |
|---|---|
| 1913-14 | 100 |
| 1925 | 98 |
| 1928 | 100 |
| 1930 | 89 |
| 1931 | 79 |
| 1932 | 64 |

1933 లో కార్మికుల జీవనప్రమాణం ఇంకాతగ్గించబడింది. నిరుద్యోగుల స్థితి మరీ అధ్వాన్నం. రాజకీయ కారణాలవల్ల కొంతమందికి నిరుద్యోగభృతి ఏమీ యివ్వబడకపోయినా. ఇవ్వబడేవారికైనా అది తగ్గించబడింది.

ఇంగ్లాండు : 1895 - 1903 లో 100 గా తీసుకుంటే 1927లో 98, 1929 లో 97, 1932 లో 94 గా సగటుకూలివుంది. అ. సం. రా: 1922 నుండి పెరుగుతూ 1929 లో ఉచ్ఛదశకు పోయింది 1898-1908 లో సగటు జీతం 100 వుంటే 1929 కి 125 వున్నది. కాని యిక ఒక్కసారిగా క్రిందికి దిగిపోయింది. 1930 లో 105, 1931 లో 91, 1932 లో 71 కి ఈ సగటు జీతం పడిపోయింది.

పరిసరాలలో ఎంగిలిమెతుకులకై కొట్లాడుకొనే అభాగ్యులనూ, చలివేంద్రం దగ్గర గుక్కెడునీళ్ళకై పడిగాపులు పడివుండే దరిద్రులనూ కాపిటలిస్టు దేశాలలో అనేకత్రాకంగా చూడవచ్చును. రాజవీధులలోనే పనిలేక సొక్కుతూపోవటం అ. సం. రా. లలో హెచ్చు అయింది. వేల, లక్షల కుటుంబాలిట్లా వందలు, వేల మైళ్ళు ప్రయాణంగావించిన సందర్భాలు వున్నవి. ఒక జీవకారుణ్యసంఘం అంచనా ప్రకారం, ఇట్టి నిరుద్యోగుల సంఖ్య 15 లక్షలున్నది.

ఆకలి ఎట్టి పనైనా చేయిస్తుంది. ప్రతి కాపిటలిస్టు దేశంలోనూ ఆత్మహత్యలెక్కువౌతున్నాయి. ఒక్క బెర్లిన్ పట్టణంలోనే, ఆకలి బాధకు తట్టుకోలేక సగటున రోజుకు 60 మంది అభాగ్యులు ఆత్మహత్య గావించుకుంటున్నారు.

నిరుద్యోగులకు చేసే సహాయం ద్వారా కాపిటలిస్టు ప్రభుత్వాలు దాదాపు బానిసత్వ పద్ధతులను తెచ్చిపెట్టినవి. చాలా దేశాలలో నిర్బంధపు పని అమలు పెట్టబడింది. నిరుద్యోగులైన వారందరికీ 'క్యాంపులు' పెట్టి పనులు నిర్బంధంగా చేయించేవారు. లేదా సహాయం ఆపివేయబడుతుందని బెదిరించేవారు. సాధారణంగా ఏ పెద్ద ప్రభుత్వ పోరాటాలలో పనిచేయుటకో, సైనిక నిర్మాణములను సాగించుటకో యీ కార్మికులు నియోగింపబడేవారు. ఇవి దాదాపు బందీఖానాలవలె వుంటాయి. జీవితం కూడా జైలు జీవితంలాగానే వుంటుంది. జర్మనీలో ఇటి 'లేబరు క్యాంపులు' చాలా వున్నవి. నిజంగా ఏ దేశంలో కార్మికులకు సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యము లున్నవో, ఎక్కడ పని చేయుటయే ఒక గౌరవంగా, కీర్తిప్రదంగా, వీరత్వంగా పరిగణించబడుతూ వున్నదో అట్టి సోవియటు యూనియన్‌లో 'నిర్బంధ కార్మికసేవ' వున్నదని కాకిగోలపెట్టే కాపిటలిస్టు దేశాలలో అనేకం ఇపుడు అనుసరిస్తున్నవి.

కార్మికుల ప్రధాన క్షేమంమీదనే కాపిటలిస్టులు దాడి ప్రారంభించినప్పుడు కార్మికుల ప్రతిఘటన తీవ్రమౌతుంది. కాపిటలిస్టు ప్రపంచంలో సమ్మెల ప్రవాహం ముంచెత్తుకవస్తుంది. ప్రస్తుత సంక్షోభకాలం పరిస్థితులలో ఈ సమ్మెలు ప్రత్యేక పట్టుదలతో సాగింపబడుతాయి. నిజపరిస్థితులను కార్మికులు గుర్తించునట్లు చేస్తాయి. వారి మిత్రులెవరో, శత్రువులెవరో చూపుతాయి. త్వరలో ఈ సమ్మెలు, కార్మిక ప్రజాసామాన్యాన్ని కలిపివేస్తున్న బూర్జువా ఆర్థిక వ్యవస్థకు సవాలుగా అతి తీవ్ర పోరాటాన్ని ధరిస్తాయి.

## పారిశ్రామిక వ్యవసాయిక సంక్షోభాలు పెనవేసుకొనిపోయినవి

ఈ సంక్షోభం మరీ క్లిష్టరూపం దాల్చుటకు కారణం, పారిశ్రామిక దేశాలలోను, వ్యవసాయిక దేశాలలోను కూడా సంక్షోభం వ్యాపించటం. ఈ సంక్షోభంవల్ల కాపిటలిజంలో వుండే పరస్పర వైరుధ్యాలు బహిరంగమౌటయేగాక పరిశ్రమలకు వ్యవసాయానికి మధ్యగల వైరుధ్యం కూడ బైటపడింది.

"సంక్షోభం సాగుతున్నంతకాలం పారిశ్రామిక వ్యావసాయిక సంక్షోభాలు ఏకకాలమందే సంభవించటమేగాక, పెనవేసుకొనిపోయినవి. ఇందువల్ల పారిశ్రామికోత్పత్తి మరీ దెబ్బతిని, సంక్షోభం మరింత క్లిష్టమైనది" అని స్టాలిన్ 16 వ కాంగ్రెసుకిచ్చిన రిపోర్టులో తెలియజేశాడు.

పారిశ్రామిక సంక్షోభంవల్ల అసంఖ్యాకులగు కార్మికులు నిరుద్యోగులవుతారు. వారి జీవనప్రమాణం పడిపోతుంది. వీరి దారిద్ర్యం హెచ్చు అయిందంటే "వ్యావసాయిక దినుసుల అమ్మకం తగ్గి"పోతుందన్నమాట. ఇంతేగాక వుత్పత్తి కవసరమగు పత్తి, ఉన్ని, జనుము మున్నగు ముడిసరుకుల దిగుమతి కూడా తగ్గిపోతుంది. ఇదేవిధంగా వ్యావసాయిక సంక్షోభంవల్ల దెబ్బతిన్న రైతు జనసామాన్యం పారిశ్రామిక వస్తువులను కొనలేక పోవటంచే వాటి అమ్మకం బాగా తగ్గిపోయి, పరిశ్రమలు దెబ్బతింటాయి.

నవీన ఉత్పత్తి శక్తులన్నిటినీ కాపిటలిజం ఉపయోగించుకోలేదనటకు వ్యావసాయిక సంక్షోభం ఒక చక్కని ఉదాహరణ. ఇంజనీరింగు ఎంతో అభివృద్ధి అవుతుంది. ఇందువల్ల వ్యవసాయంలో ఎక్కువగా యంత్రాల నుపయోగించుటకు, పనిపాటలను నూతనపద్ధతులలో, సులభపద్ధతులలో ఏర్పాటుచేయుటకు వీలవుతుంది. కాని గ్రామాలకు పట్టణాలకు మధ్యనుండే వ్యత్యాసంవల్ల, గ్రామ ప్రజానీకం కడు దరిద్రులుకావటంవల్ల వ్యవసాయం ఈ టెక్నికల్ అభివృద్ధిని వినియోగించుకోలేదు. పట్టణాలు ముందుకుపోతూవుంటే గ్రామాలు కదలికలేక, జీర్ణమై శిథిలమైపోతూ వుంటాయి. ఈ విధంగా కాపిటలిస్టు సంబంధాలవల్లనే వ్యవసాయం అభివృద్ధిచెందక క్షీణించిపోతూ వుంటుంది.

సోవియటు యూనియన్‌లో వ్యవసాయాభివృద్ధితో గనుక పోల్చిచూస్తే కాపిటలిస్టు దేశాలలోని వ్యవసాయ క్షీణత మరీ స్పష్టంగా కనిపిస్తుంది. ఒక్క 1931 సంవత్సరంలోనే సోవియటు యూనియన్‌లో 1 కోటి హెక్టారులు * సాగులోనికి తేబడితే 20 సంవత్సరాలలో కాపిటలిస్టు దేశాలన్నిటిలో కల్సి 9 కోట్ల ఎకరాలే సాగులోనికి తేబడినవి. కాపిటలిస్టు దేశాలలో యుద్ధంవల్ల వ్యవసాయంలోకూడా మహా సంక్షోభం ఏర్పడింది. రైతులు దివాలాతీయడం వ్యవసాయోత్పత్తి బాగా పడిపోవడం దీని ఫలితం. ఈనాడు సంభవించిన (1929-31) సంక్షోభంలో పారిశ్రామిక సంక్షోభం, వ్యావసాయిక సంక్షోభం పెనవేసుకుపోయి, లక్షలు, కోట్లకొలది రైతులకు విపరీత నష్టాన్ని చేకూర్చినవి.

శ్రామికవర్గం, ఇతర కష్టజీవులు అందరూ చాలా హీనవారై పోవటంవల్లా వారి కొనుగోలుశక్తి విపరీతంగా పడిపోవటంవల్లా వ్యావసాయిక పంటలకు డిమాండు బాగా తగ్గిపోయింది. అమ్మకాలు ఆగిపోయినవి. పంటలు విపరీతంగా నిల్వ వుండి

* హెక్టారు అనగా 2.5 ఎకరాలు. (అనువాదకుడు)

పోయి, వాటి ధరలు విపరీతంగా పడిపోయినవి. దీని ఫలితంగా వ్యవసాయోత్పత్తి కూడా బాగా తగ్గిపోయింది.

కాపిటలిస్టు దేశాలన్నింటిలోనూ ధాన్యపు కొట్లన్నీ పూర్తిగా నిండిపోయి స్టాకులు నిల్వవుండిపోయినవి. ఈ అమిత ధాన్యరాసులను తగ్గించాలంటే బూర్జువా వర్గానికి ఒక్కటేమార్గం వుంది. వాటిని తగులబెట్టాలి లేదా పాడుచేయాలి. ఇందువల్ల సాగుబడిని తగ్గించాలని చూస్తారు. అనేక దేశాల్లో లక్షల ఎకరాలలోని గోధుమ, ప్రత్తి, మొక్కజొన్న మున్నగు పైర్లు కాల్చివేయబడినవి. పాలవదులు సముద్రం పాలు చేయబడినవి. జర్మనీలో ధాన్యానికి మందుపూసి, పశువులు తప్పితే మనుష్యులు తినటానికి వీలు లేకుండా చేశారు.

సంక్షోభకాలంలో పంటలధరలు విపరీతంగా పడిపోయినవి. ఉదాహరణకు :- గోధుమధర 70% తగ్గిపోయింది. ప్రత్తి, పంచదార, కాఫీ, ఉన్ని మున్నగు సరుకులధర 50% పడిపోయింది. ఈ విధంగా ధరలు పడిపోవటం వల్ల పట్టణాలలో వుండే కొనుగోలుదారులు లాభం పొందగలరనుకోవచ్చు. కాని ఇది పొరపాటు. రైతులనుండి కొనుగోలుదారులకు చేరులోగా పంటలు అనేకమంది దళారుల, షాహుకార్ల చేతుల ద్వారా మారుతుంది. వీరందరు పెద్ద గుత్తసంస్థలలో ఏకమై తాము రైతులనుండి చౌకగా కొన్నా, చిల్లరధరలను పడిపోనీయకుండా చూస్తారు. వాస్తవానికి అనేక కాపిటలిస్టు దేశాలలో చిల్లరధర లెక్కువగా పడిపోలేదు. జర్మనీవంటి దేశాలలో పెరిగినవి కూడా, కాబట్టి రైతులకు వ్యవసాయపు ఖర్చులు కూడా గిట్టుబాటు కాని ధరలిస్తుండినా, కొనుగోలుదారులు మాత్రం మామూలుగా హెచ్చుధర లిచ్చుకో వలసియే వుంటూవుంటుంది.

రైతులు ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నులు, భూస్వామికి చెల్లించవలసిన కౌలుశిస్తులు, అప్పుమీద చెల్లించవలసిన వడ్డీ, ఇవన్నీ మామూలుగానే వుంటాయి. కొన్నిచోట్ల పెరుగుతాయికూడా. ముఖ్యంగా అప్పుమీద వడ్డీ, పన్నులు మొత్తం పంటలో ఎక్కువ భాగాన్ని ఎగురకొట్టేసుకు పోతుంటాయి. ఈ విధంగా యూరోపులోనేగాక, కాపిటలిస్టులందరూ దాబులపల్కే అ సం. రా. లో కూడా అనేక లక్షలమంది బీదరైతులు, మధ్యతరగతి రైతులుకూడా దివాలా తీశారు.* ఈ విధంగా దుస్థితి పెరుగుతున్న కొలదీ బాంకులను కాపిటలిస్టులకు వ్యతిరేకంగా రైతుల ప్రతిఘటన పెరుగుతుంది. రైతులు ఏకమై సంఘాలను ఏర్పాటుచేసుకొని తమ భూములు వేలం కాకుండా, తమ చేతులనుండి జారిపోకుండా చూస్తారు. అమెరికాలో ఇట్లా జరిగిన ఘటనలనేకమున్నవి. బాంకులు భూములను వేలానికి

* 1930-34 లలో మనదేశంలోకూడా ఈ ఆర్థిక సంక్షోభం వచ్చింది. ఆకాలంలో అనేక లక్షలమందిరైతులు దివాలాతీశారు. ఒక్క మద్రాసు రాష్ట్రంలోనే 4 ఏండ్లలో 20 లక్షల ఎకరాలకు పైగా రైతులభూమి వడ్డీవ్యాపారులకు పోయింది. (అనువాదకుడు)

తెచ్చినప్పుడు రైతులందరూ ఏకమై, ఇతరులెవరూ కొనటానికి వీలులేకుండా ఒక్కొక్క దానికి పాటను కొట్టివేయించారు. ఇందువల్ల బాంకులు వేలాన్ని రద్దుచేయించుకుని బాకీ పరిష్కారానికి వాయిదాలెక్కువ చేయటం జరిగింది.

వ్యవసాయక సంక్షోభం వల్లనూ, రైతులు ఆకస్మికంగా దివాళా తీయటంవల్లనూ, వ్యవసాయం క్షీణిస్తుంది. వ్యవసాయంలో ట్రాక్టర్లను రసాయనిక ఎరువులను వుపయోగించటం తగ్గుతుంది. ఈ విధంగా టెక్నికల్ అభివృద్ధి, నూతన పరిశోధనలు నిరర్థకం చేయబడతాయి.

## సంక్షోభము, గుత్త వ్యాపార సంస్థలు

“పూర్వంవలె ఏ విధంగా కాక పెట్టుబడిదారీ విధానం ఇప్పుడు గుత్తవ్యాపార రూపాన్ని ధరించింది. ఇందుమూలంగా, ఒకమూల అధికోత్పత్తి జరుగుతూవున్నా, ధరలు హెచ్చుగానే వుండునట్లు ప్రయత్నించటంలో కాపిటలిష్టు గుత్తసంస్థలమధ్య సంఘర్షణ హెచ్చుతుంది. ఇందుమూలంగా, కొనుగోలుదారులైన ప్రజా సామాన్యం పైన బాధపడి సంక్షోభం దుస్సహమౌతుంది. సంక్షోభం దీర్ఘమౌతుంది; త్వరగా అంతరించే పరిస్థితులకు అంతరాయం కలుగుతుంది.” అని స్టాలిన్ 16 వ కాంగ్రెసులో యిచ్చిన రిపోర్టులో తెలియజేశాడు.

ఒకమూల అధికోత్పత్తి వున్నా: ధరలను హెచ్చుగానే వుంచటం మూలకంగా సంక్షోభంవల్ల కల్గే దుష్ఫలితాలన్నిటినీ ప్రజాసామాన్యం నెత్తిపై రుద్దాలని గుత్తవ్యాపారులు చూస్తారు. ఇందుమూలంగా, పైమూలుగా అధికోత్పత్తి వల్ల ధరలు పడిపోవలసివున్నా, కొన్నిసరుకుల ధరలు తగ్గనేలేదు. గుత్తవ్యాపారం జరుగుతూవున్న సరుకుల ధరలు ఇతరసరుకుల ధరలకన్న హెచ్చుగానే వుంటున్నవి. ఈ క్రిందిపట్టీవల్ల ఈ విషయం స్పష్టమౌతుంది.

| సంవత్సరం | జర్మని (1928-100) | | ఆస్ట్రియా (1923-31-100) | | పోలెండు (1928-100) | |
|---|---|---|---|---|---|---|
| | కార్టెల్ ధరలు | స్వేచ్ఛా వ్యాపారం ధరలు | కార్టెల్ ధరలు | స్వేచ్ఛా వ్యాపారం ధరలు | కార్టెల్ ధరలు | స్వేచ్ఛా వ్యాపారం ధరలు |
| 1928 | 102 1 | 106 8 | — | — | — | — |
| 1929 | 105 0 | 97 4 | 99 | 100 | 107.7 | 93 6 |
| 1930 | 103 1 | 79 9 | 98 | 87 | 108.9 | 80.9 |
| 1931 | 95.6 | 60 8 | 91 | 76 | 107 8 | 63 8 |
| 1932 | 83 9 | 47.5 | 93 | 73 | 106.1 | 52 5 |
| 1933 | 83.9 | 48 3 | 94 | 73 | 94 8 | 48 8 |

కాని అనేక సందర్భాలలో ఈ గుత్తసంస్థల కట్టుబాట్లవల్ల సంక్షోభం యొక్క అభివృద్ధి ఆగివుంటుంది. ఒక్కసారిగా ధరలు పతనమవటం, గుత్తసంస్థలు కూడా విచ్ఛిన్నమైపోవటం జరుగుతుంది. ముఖ్యంగా ముడిసరుకుల ఉత్పత్తిలో ఈ పరిస్థితి ఏర్పడుతుంది. అంతర్జాతీయ జింక్ కార్టెల్, యూరోపియన్ ముడిఇనుము కార్టెల్, అంతర్జాతీయ టిన్ కార్టెల్, యూరోపియన్ ఉక్కు కార్టెల్, మున్నగునవన్నీ తమ సభ్యులు స్వేచ్ఛగా వాణిజ్యం చేసుకోవటానికి అనుమతి ఇవ్వవలసివచ్చింది. ఇంగ్లీషులో కృత్రిమ పట్టుపరిశ్రమల్లోని గుత్తసంస్థ, జింక్ కార్టెల్ పతనమైనవి. ఫ్రాంసులో ముడిఇనుము సిండికేటు రద్దుగావింపబడినది. ఇట్టి ఉదాహరణలు ఎన్నోవున్నవి.

నవీన కాపిటలిస్టు విధానంలో గుత్తవ్యాపార పద్ధతి రావటం మూలకంగా సంక్షోభం మరింత దీర్ఘకాలం వుంటుంది. స్వేచ్ఛావ్యాపార కాలంలోనైతే, ధరలు పడిపోవటం, చిన్న సంస్థలన్నీ దివాళా తీయటం, ఉత్పత్తి తగ్గటం మూలకంగా క్రమంగా సంక్షోభం తీరిపోయి మరల వ్యాపారాభివృద్ధి, ఉత్పత్తి అభివృద్ధి జరుగుతూ వుండేది: కాని గుత్తసంస్థల ఏర్పాటుతో, సంక్షోభం దానంతట అదే తీరిపోయే పద్ధతికి అంతరాయం కల్గి, చాలా మెల్లిగగాని అంతకాదు. ఈవిధంగా సంక్షోభం మరింత క్లిష్టమౌతుంది.

## విదేశ వ్యాపారం క్షీణత

అమితోత్పత్తి జరగటం, బేరసారాలు సన్నగిల్లటం మూలకంగా విదేశ వ్యాపారం బాగా పడిపోతుంది. లోగడ సంభవించిన సంక్షోభాలకు, ప్రస్తుత సంక్షోభానికిగల తారతమ్యాన్ని ఈక్రిందిపట్టిక తెలియజేయగలదు.

## విదేశ వ్యాపారంలో క్షీణత

| సంక్షోభాలు | శాతము (%) |
|---|---|
| 1873_74 | 5 |
| 1883_84 | 4 |
| 1900_01 | 1 |
| 1907-08 | 7 |
| 1929_32 | 65 |

వ్యాపారం జోరుగా సాగితేగాని కాపిటలిస్టు ఆర్థికవ్యవస్థ సాగదు. సంక్షోభకాలంలో వ్యాపారం, ఉత్పత్తి చాలా ఎక్కువగా క్షీణిస్తాయి. అందుచే ముడిసరుకుల దిగుమతిని పారిశ్రామిక దేశాలు తగ్గించి వేస్తాయి. ఇందువల్ల పరిశ్రమలు వ్యవసాయం, రెండూకూడా దెబ్బతింటాయి.

ముఖ్యంగా మరీ పెద్ద కాపిటలిస్టు దేశాలే ఈ దెబ్బతిన్నవి. ఈ క్రింది పట్టికవల్ల పెద్ద కాపిటలిస్టు దేశాల ఎగుమతులు, దిగుమతులు ఎట్లా క్షీణించినవో అర్థమౌతుంది. (1929 లో ఎగుమతులు, దిగుమతుల ఇండెక్సు నెంబరు 100 గా తీసుకుందాము)

| దేశం పేరు | 1930 | | 1931 | | 1932 | |
|---|---|---|---|---|---|---|
| | దిగుమతి | ఎగుమతి | దిగుమతి | ఎగుమతి | దిగుమతి | ఎగుమతి |
| అ. సం. రా. | 70 | 73 | 46 | 60 | 30 1 | 30 8 |
| ఇంగ్లాండు | 83 | 78 | 73 | 53 | 57 6 | 50 1 |
| జర్మనీ | 77 | 90 | 60 | 73 | 34 7 | 42 6 |
| ఫ్రాన్సు | 90 | 85 | 72 | 61 | 51 2 | 39.3 |
| ఇటలీ | 80 | 79 | 51 | 66 | 38 7 | 45 6 |

ఈ విధంగా వాణిజ్యం పడిపోవటంవల్ల "మార్కెట్లకొరకై పోరాటం మరీ తీవ్రమౌతుంది." మొట్టమొదటగా స్వదేశాలలో మార్కెట్లను స్వాధీన పర్చుకోవటకు కాపిటలిస్టులలో పోటీ తీవ్రమౌతుంది. ఇందుకై విదేశ వర్తకులను ప్రవేశమీయకుండా నిరోధిస్తారు. రక్షణసుంకాలు కోటలు నిర్మించబడతాయి. ఈవిధంగా వాణిజ్య రక్షణలు ఏర్పర్చుకోవటం మాత్రంగా ఇతరదేశాలు తమ సరుకులను తెచ్చి చవుకగా గుమ్మటకు (డంపుచేయుటకు) మరీ హెచ్చుప్రయత్నాలను గావిస్తాయి.

## వడ్డీవ్యాపారంలో (క్రెడిట్) సంక్షోభం :
## నోట్లు ముమ్మరం: మార్కెట్లకై పోరాటం

గుత్త వ్యాపార ప్రభావం కాపిటలిజంలోని అన్నిభాగాలమీద పడుతుంది. ఒకముఖ్యమైన ఫలితం ఏమిటంటే వడ్డీ వ్యాపారంలోకూడా సంక్షోభం బయలు దేరుతుంది. లోగడ సంక్షోభంలో మొట్టమొదటగా దెబ్బతినేవాటిలో వడ్డీ వ్యాపారం ఒకటిగా వుండేది. అమ్మకం జరగక వ్యాపారం దెబ్బతినగానే, ఆ పరిశ్రమలు మూల బడేవి. అవి బ్యాంకులకు ఋణాలను చెల్లించలేకపోయేవి. అట్టి పరిశ్రమలను దివాలాతీసిన పరిశ్రమలంటాము. పరిశ్రమలు దివాలాతీయటం వెనువెంటనే బాంకులు కూడా దివాలాతీసేవి. ఈదేశమయంలో చిన్న సంస్థలు దివాలాతీసినా, పెద్ద సంస్థలు ఈ దివాలాసంస్థలను కొనివేసి సంక్షోభం అంతమగునరికి బ్రహ్మాండమగు సంస్థలుగా తయారయేవి. 1931 సంక్షోభంలో ఈ విషయము స్పష్టంగా గోచరిస్తుంది. గుత్త సంస్థలు సంక్షోభం బరువులను చిన్న సంస్థల తలలపైకి తోయసాగినవి.

సంక్షోభం ప్రారంభం కాగానే పెద్ద గుత్తసంస్థలు, సంక్షోభంవల్ల కల్గే కష్టాలన్నిటినీ, చిన్న సంస్థలపై త్రోయసాగినవి. ఇదే సమయంలో ధరలను హెచ్చుగానే వుండాలనే వుద్దేశంతో ఉత్పత్తిని అత్యధికంగా తగ్గించి వేసినవి. ఉత్పత్తి తగ్గునరికి లాభంరేటు తగ్గుతూవచ్చింది. ఇందువల్ల కాపిటలిస్టులలో వివిధ గ్రూపులమధ్య లాభం, వంపిణీలో పెద్దమార్పులు వచ్చినవి.

అనేక రకాల పారిశ్రామిక సంస్థలు ఈ సంక్షోభంలో దివాలా తీసినవి.

## దివాళాల సంఖ్య

| దేశం | 1929 | 1930 | 1931 | 1932 | 1933 |
|---|---|---|---|---|---|
| అ. సం. రా. | 22909 | 28356 | 19288 | 31882 | 17732 |
| ఇంగ్లాండు | 5900 | 6287 | 6818 | 7321 | 4127 |
| జర్మనీ | 9846 | 15486 | 11254 | 13168 | 3718 |
| ఫ్రాన్సు | 6092 | 6249 | 7220 | 1014 | 8382 |
| పోలెండు | 518 | 816 | 738 | 545 | 251 |

క్రెడిట్ వ్యాపారంలో సంక్షోభం క్రమ్ముకవస్తూ వున్నది. బ్యాంకులతో సంబంధమున్న పరిశ్రమల దివాళాలు, ప్రభుత్వ బడ్జెటు యిబ్బందులు, లాభాల క్షీణత కష్టాల పెరుగుదల, స్టాకుల ధరల పతనం-ఇవన్నీ క్రెడిటు వ్యాపార పతనానికి కారణాలను ఏర్పర్చినవి. 1931 లో ఒక్కసారిగా బ్రహ్మాండమగు పతనం సంభవించినది. మొట్టమొదటిగా క్రెడిటు సంక్షోభం జర్మనీ, ఆస్ట్రియాలలో ప్రారంభమైనది. ఆస్ట్రియాలోకెల్ల పెద్దబ్యాంకు 1931 వసంతకాలంలో దివాలా తీసింది. (ఆ దేశంలోవున్న పరిశ్రమలలో 75%, 80% సంస్థ ఈ బ్యాంకు కంట్రోలులో వున్నది.) దానివెంటనే, జర్మనీలోవుండే బ్రహ్మాండమగు పారిశ్రామిక సంస్థలు దివాలాతీసినవి. 1931 జూన్‌లో జర్మనీలో పెద్దబ్యాంకులలో మూడవదిఅగు "డార్మ్ స్టాట్ నేషనల్ బాంకు" కూలిపోయింది మరొక పెద్ద బ్యాంకుఅగు డ్రెస్డెన్ బాంకు కూడా దివాలాతీసింది. మధ్యయూరోపామంది ఈ క్రెడిటు వ్యాపారందివాలా ఇంగ్లాండుకు అక్కడనుండి ఫ్రాన్సుకు, అమెరికాకు, ఇతర కాపిటలిస్టు దేశాలకు వ్యాపించినది.

ప్రపంచ కాపిటలిస్టులందరికి "కీర్తిప్రదమగు" బ్రహ్మాండమగు అనేక పారిశ్రామిక సంస్థలు 1931, 1932 లలో కూలిపోయినవి. అమెరికన్ కాపిటల్ సహాయంతో పనిచేసే క్రూగర్ అగ్గిపెట్టెల ట్రస్టు (స్వీడన్‌దేశం) ప్రపంచంలోని అగ్గిపెట్టెల వ్యాపారాన్నంతటినీ స్వాధీనపర్చుకోవాలని ప్రయత్నించింది, పోటీయటు

యూనియన్ అగ్గిపెట్టెల ఎగుమతి వ్యాపారాన్ని దెబ్బతీస్తోంకై, ఈ క్రూగర్ మహాశయుడు సోవియటు వ్యతిరేక ప్రచారాన్ని సాగించాడు. కాని ఇట్టి బ్రహ్మాండమగు సంస్థయే కూలిపోయింది. క్రూగర్ ఆత్మహత్య గావించుకున్నాడు. ఆతడు చనిపోయినతర్వాత, ఆతని దగాలు, మోసాలు, ఫోర్జరీలు, బైటపడినవి. ఇంతేగాదు. అనేక దేశాల ఉన్నత ప్రభుత్వోద్యోగులు ఆతని డబ్బుతింటూ ఆతని స్వాధీనంలో వుండేవారనీ, అనేకమంది సోషల్ డెమాక్రటిక్ నాయకులు ఆతని సహాయాన్ని తీసుకుంటూ వుండేవారనీ తెలిసింది.

ఇదేవిధంగా, అమెరికాలో అధిక ధనసంపన్నుడనబడిన ఇన్సల్ కూడా వట్టి దగాకోరని రుజువైనది, ఆతని కంపెనీ 60 అమెరికన్ పట్టణాలలో వుండే ఎలక్ట్రిసిటీని, గ్యాస్ ప్లాంటులను, వీటి సరఫరాలను కంట్రోలు చేసేది. మొత్తం 600 కోట్ల డాలర్ల కాపిటల్ వుండేది. ఇట్టి బ్రహ్మాండమగు సంస్థ 1932 వసంత కాలంలో దివాలాతీసింది.

సంక్షోభం సాగినకొలదీ 'నోట్ల ముమ్మరం' (ఇన్‌ఫ్లేషన్) అనగా 'కరెన్సీ పతీహీకరణ' (బంగారంతో పోల్చినప్పుడు కరెన్సీ విలువ తగ్గుట) అవలంబించబడింది. ధరలు పడిపోవటంవల్ల ఋణగ్రస్తదేశాలు చిక్కులలో పడినవి. ఇదివరకు ఋణం మొత్తానికే, పూర్వంకన్న ఇప్పుడు ఎక్కువ సరుకులు ఇవ్వవలసి వస్తున్నది. ఇంతేగాక, ఋణాలుచేసి వ్యాపారం సాగించిన కాపిటలిస్టుల పనికూడా కష్టసాధ్యమౌతుంది. అందువల్ల మొత్తం దేశమే చిక్కులలో పడుతుంది. దీనినుండి బైటపడటం ఎట్లా? రెండు విధాలుగా కాపిటలిస్టులూ, ప్రభుత్వాలూ ఈ చిక్కునుండి బైటపడజూస్తారు. ఒకటి, మారటోరియం (అప్పుల చెల్లింపుకు వాయిదా వేయుట.) సంక్షోభం వృద్ధియైన కొలదీ ఒక్కొక్క దేశమే ఋణాలను చెల్లించటం మానివేసినవి. కాని ఇంతటితో పరిపోలేదు. రెండో మార్గం అవలంబించబడినది. అదే నోట్ల ముమ్మరం. మొట్టమొదటగా చిన్నదేశాలు నోట్ల ముమ్మరాన్ని ప్రారంభించినవి. పిమ్మట 1931 శరదృతువులో ఇంగ్లాండుకూడా అవలంబించినది. ప్రభుత్వం కాగితం నోట్లకు బంగారాన్ని ఇచ్చేపద్ధతిని మానివేసింది. ఇందువల్ల పౌండు స్టెర్లింగు విలువ పడిపోయింది. ఈ కరెన్సీ పతీహీకరణవల్ల ఋణగ్రస్తదేశాలు, చవుక ధనంతోనే ఋణాలను తీర్చివేయగలవు. ఈ నోట్లముమ్మరంతో "మార్కెట్లకోసం పోరాటం" మరీ తీవ్రమౌతుంది.

కరెన్సీ పతీహీకరణకు పూనుకొన్నదేశం ఇతర కాపిటలిస్టు దేశాలకన్న ప్రపంచ మార్కెట్లను స్వాధీనం చేసుకొనుటకు ఎక్కువ అవకాశాలను కల్గి వుంటుంది. దీని సరుకులు బంగారంలెక్కలో చవుకగా వుండటమే ఇందు కారణం. కాగితపు నోట్లధర ఎంతైనా కావచ్చును. కాని బంగారంతో పోల్చి చూచినప్పుడు, ఎక్కువ కాగితంనోట్లకు వచ్చేసరుకులను, తక్కువ బంగారమే ఇవ్వవలసివస్తుంది.

కాబట్టి ఇతరదేశాలు, తక్కువ బంగారాన్ని యిచ్చి, కాగితపునోట్ల లెక్కలో ఎక్కువ విలువగల ఎక్కువ సరుకులను ఈ దేశంలో కొనగలవు. ఇందువల్ల కరెన్సీ పరిహీనతకు పూనుకొన్న దేశపు వ్యాపారం వృద్ధి కాగలదు. ఇంకా బంగారు ప్రమాణానికే పట్టుకు వేళ్ళాడే దేశాలు నష్టపడగలవు. 1931 శరదృతువులో ఇంగ్లాండు కరెన్సీ పరిహీనతకు పూనుకొన్నది. దీనిపిమ్మట ప్రపంచంలోకెల్లా అధిక సంపన్నమగు అ. సం. రా. కూడా 1933 మార్చిలో కరెన్సీ పరిహీనతకు పూనుకొన్నది. ఇంతవరకు అమెరికన్ డాలరు, ఇంగ్లీషు పౌండుస్టెర్లింగ్ ద్రవ్యశక్తి గలవిగాను, అచంచలమైనవిగాను పరిగణింపబడుతూ వచ్చినవి. అనేక ఇతరదేశాల కరెన్సీలు ఈ డాలర్లు పౌండు స్టెర్లింగుల క్రిందకు మార్చుకొనబడి నిల్వచేసుకోబడేవి, ఎప్పుడైతే ఈ రెండు ప్రముఖ దేశాల కరెన్సీలు దిగజారిపోయినవో, వీటి వెంట అనేక దేశాల కరెన్సీలు కూడా పతనమైనవి. యుద్ధంలో బాగా లాభపడిన మూడవదేశమగు జపాను తన కరెన్సీని దాని బంగారపు విలువలో 1/3 కు తగ్గించింది. ఈ విధముగా కరెన్సీ పరిహీనతతో కాపిటలిస్టులమధ్య అంతఃకలహాలు పెరిగినవి. ప్రపంచ మార్కెట్టును స్వాధీనపర్చుకొనుటకై పోరాటం వృద్ధియైనది. 'నోట్ల ముమ్మరం' అనే కొత్త ఆయుధం వుపయోగంలోనికి వచ్చినది. ఈ ఆయుధంతో "కరెన్సీయుద్ధం" ప్రారంభమైనది.

1933 ఆఖరుకు బంగారు ప్రమాణాన్ని నిలబెట్టి వుంచిన కాపిటలిస్టు దేశాలు నాలుగే నాలుగు. ఫ్రాన్సు, బెల్జియం, స్విడ్జర్లాండు, హాలెండు. ఇతర అన్ని దేశాలు, నోట్లముమ్మరమునకు పూనుకొన్నవి.

"క్రెడిట్ పద్ధతి మూలమట్టానికే కదలిపోయే ఇట్టి పరిస్థితులేర్పడటం వల్ల ఋణాల తిరస్కారం అగిపోయే పరిస్థితులు ఏర్పడగలవు; ఏర్పడ్డవి కూడా. విదేశాలకివ్వబడిన ఋణాలను కూడా చెల్లించకపోవటం, యుద్ధ ఋణాలను చెల్లించకపోవటం, కాపిటల్ ఎగుమతి నిలుపుదలకావటం, విదేశ వ్యాపారం మరీ సన్నగిల్లటం, సరకుల ఎగుమతి మరీ తగ్గిపోవటం, విదేశ మార్కెట్లకై పోరాటం మరీ తీవ్రం కావటం దేశాలమధ్య వ్యాపారయుద్ధాలు జరుగుతూవుండటం, డంపింగు-ఇవన్నీ కూడా క్రెడిట్ సంక్షోభం వెనువెంటనే వస్తాయి. డంపుచేయటం అంటే, యూరోపు, అమెరికా పార్లమెంటులలో కొంతమంది ఘనులు* 'సోవియటు డంపింగు, సోవియటు డంపింగు' అని గొంతులు బొంగురుపోవునట్లు అరిచే హంగామా డంపింగును గూర్చికాదు నేనుచెప్పేది. వాస్తవంగా 'నాగరిక' దేశాలచే జరుపబడే డంపింగును గూర్చియే. ఈ పార్లమెంటులోని పెద్దలు పతివ్రతలవలె నోరు

---

* సో. యూ. కమ్యూనిస్టుపార్టీ కార్యవర్గం పనినిగూర్చి 17 వ కాంగ్రెస్‌కు ఇవ్వబడిన రిపోర్టునుండి.

పెదవకుండా ఊరుకోవడంగా జరుగుతూవుండే దంపిడుగురు గూర్చియే నేను మాట్లాడుతున్నాను."

## నూతన విప్లవాలు, నూతన యుద్ధాలు తిరిగి సంభవించుటకు తొలి కాలం

1929 నుండి కాపిటలిస్టు ప్రపంచంలో చెలరేగుతూవున్న సంక్షోభం కాపిటలిజంలోవుండే బాహ్య, అంతర్గత వైరుధ్యాలన్నిటినీ అతితీక్షం చేసింది. సంక్షోభం దీర్ఘకాలం సాగటంవల్ల శ్రమజీవుల దుస్థితి మిన్నుముట్టింది. అమితమగు నిరుద్యోగం, జీతాల పతనం, దోపిడీవృద్ధి ఇదీ ఈ సంక్షోభకాలంలో కార్మికుల పరిస్థితి. దీనితోపాటు అశేషరైతాంగం వినాశకమగు నాశనమునకు లోనైనది. ఈ విధంగా మనదుస్థితి, దారిద్ర్యం వృద్ధియౌతున్న కొలదీ, కాపిటలిస్టుపద్ధతియెడ ఈ శ్రమజీవుల క్రోధం వృద్ధిపొందుతూ వచ్చింది.

ప్రజల క్రోధం వృద్ధియౌతున్న కొలదీ బూర్జువావర్గం ఇంతవరకూ కార్మికులను అదుపులో వుంచుకుంటూవున్న పద్ధతులను విడనాడవలసివచ్చింది. పార్లమెంటరీ పద్ధతులను, పేరుకైనావుండే ప్రజాస్వామ్య పద్ధతులను విడనాడి బహిరంగంగా ఫాసిస్టు నియంతృత్వ పద్ధతులను చేపట్టుతుంది. జర్మనీలో 1933 లో రక్తపిపాసియగు హిట్లరు నియంతృత్వం ఏర్పడింది. ఇతర దేశాల బూర్జువా ప్రభుత్వాలలో కూడా ఫాసిస్టు లక్షణాలు వస్తున్నవి. జర్మనీలో ఫాసిస్టు నియంతృత్వం ఏర్పడినదంటే, సోషల్ డెమోక్రేట్లు కార్మికవర్గంలో చీలికలుతెచ్చి ద్రోహంచేశారు అనేది రుజువు అవటమేగాక, బూర్జువావర్గంకూడా బలహీనపడినదని, అది యిక యెంతమాత్రం పాతప్రభుత్వ పద్ధతులలో సాగలేదని రుజువు అగుచున్నది. క్రమక్రమంగా ప్రజాస్వామ్య రీతుల కన్నిటికీ స్వస్తిచెప్పి బహిరంగమగు, క్రూరమగు దౌర్జన్య పరిపాలనకు పూనుకొనుచున్నది. కాని ఈ పరిణామం జరుగుచున్న కొలదీ వర్గపోరాటం తీవ్రమౌచున్నదనీ, కాపిటలిజం మొత్తమే ప్రేలిపోయే పరిస్థితులు ఏర్పడుచున్నవనీ గ్రహించవచ్చును.

సంక్షోభం దీర్ఘకాలం కొనసాగడం ద్వారా కాపిటలిస్టుల మధ్యవుండే పోరాటం మరింత తీవ్రమైనది. మార్కెట్లకొరకై పోరాటం వృద్ధియైనది. దంపింగు వృద్ధియైనది. దీనితో ఏ దేశానికాదేశం తనచుట్టూ సుంకాల గోడను కట్టుకోవడం ప్రారంభమైనది. ఋణాలనుఎగవేయటం మూలకంగా ఋణదాత్రు దేశాలు-ఋణగ్రస్త దేశాలమధ్య ఘర్షణ తీవ్రమౌతున్నవి. దీనితోపాటు వివిధ దేశాల అభివృద్ధిలో అసమానత్వం మరీవృద్ధియౌతుంది. ఇందువల్ల వివిధ దేశాల బలా బలాలమధ్య మార్పువచ్చి, సంబంధాలలో కూడా మార్పువస్తుంది వీటియన్నిటి ఫలితంగా దేశాల మధ్యసంబంధాలు చాలా విషమ రూపాన్ని పొందినవి. మరో సామ్రాజ్యవాద యుద్ధానికి బహిరంగంగానే సన్నాహాలు జరుగుచున్నవి. ప్రపంచ పునర్విభజనకొరకై

ప్రతిదేశం పూర్తిగా యుద్ధసన్నద్ధం అవుతున్నది. విపరీతంగా ఆయుధాల ఉత్పత్తి జరుగుతున్నది. ఇతర పరిశ్రమలన్నీ క్షీణిస్తూవుంటే ఒక్క ఆయుధ పరిశ్రమ మాత్రం విపరీతంగా వృద్ధి చెందుతున్నది. జపాను మంచూరియాను ఆక్రమించుకొని ఉత్తర చైనాలోకి జొరబడి చాలాకాలమైనది. ఈ చైనా-జపాను యుద్ధం మూలంగా పసిఫిక్ మహాసముద్రంలో తీవ్రపరిస్థితు లేర్పడుతాయి. ఈ సముద్రం విషయంలో జపాను, అ. సం. రా. ఇంగ్లాండులకు సంబంధాలుండుటచే, వీటి మధ్య తీవ్రఘర్షణ ప్రారంభమౌతుంది.

ప్రతి సామ్రాజ్యవాద దేశంయొక్క సైనికాధికారులు, రాబోవు యుద్ధాలకు ప్లానులు గీస్తున్నారు. అట్టి ప్లానులలో ప్రధానమైనది సోవియటు యూనియన్ పైకి దాడివెడలటకై వేయబడేది ఒకటి.

“కాపిటలిస్టు దేశాలలో అంతర్గతంగావుండే వైరుధ్యాల తీవ్రతవల్లనూ, అంతర్జాతీయ వైరుధ్యాలవల్లనూ విప్లవ సంక్షోభమునకు అవసరమగు పరిస్థితులొక పరవత్యాదశకు వచ్చినవంటే, ప్రపంచంలో మరొకసారి విప్లవాలు, యుద్ధాలు సంభవించేదశ చాలా సన్నిహితంగా వచ్చింది.” *

ఈ అంచనా సరియైనదని అనేక విషయాలవల్ల రుజువైనది. ఫాసిస్టు దేశాలలో గందరగోళం వృద్ధియైనది. జర్మనీలో ఫాసిజానికి వ్యతిరేకంగా కమ్యూనిస్టు పార్టీ అతితీవ్రంగా పోరాడుతున్నది. అంతర్గతంగావుండే ఫాసిస్టు నియంతృత్వాన్ని కూలద్రోయటానికై శక్తులన్నిటినీ కూడదీయుచున్నది. ఫ్రాన్సులో కార్మికుల తీవ్ర ప్రతిఘటన ఎంత దుర్నిరీక్ష్యంగా వున్నదంటే ఫాసిస్టు పరిపాలనను కోరలేని బూర్జువా రాజకీయ వేత్తలందరూ వెరగుపడిపోయినారు. 1934 ఫిబ్రవరిలో, ఆస్ట్రియాలోని కార్మికులు అనేకదినాలు, తమకన్నా మిక్కుటమగు శత్రుసంఖ్యతో, తమనాయకులు తమను ద్రోహంచేసి విడనాడినా, అసమానసాహసంతో పోరాడారు. 6 కోట్ల ప్రజలను గలిగిన సోవియటు చైనా ఒక బలీయమగుశక్తిగా ప్రభవించినది. విప్లవ ప్రతికూలురగు సైన్యాధిపతులు పదే పదే సాగించిన దాడులన్నిటినీ తిరగగొట్టి అజేయమగు ఎఱ్ఱసైన్యాన్ని సోవియటు చైనా నిర్మించుకొన్నది.

“కాపిటలిస్టుకోటను ఒక్కుమ్మడి ముట్టడించి పట్టుకొనే స్థితికి ప్రజా సామాన్యం ఇంకారాలేదు. కాని ఈ విధంగా ముట్టడి చేయాలనే సంకల్పం మాత్రం వారిలో నానాటికీ దృఢపడుతున్నది. ఇందుకు సందేహమేమీలేదు.” *

---

. “కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గంయొక్క 13వ ప్లీనంయొక్క థీసిస్ నిర్ణయాలు” నుండి

* “సో. యూ. కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి 17 వ కాంగ్రెసుకిచ్చిన నివేదిక” నుండి.

కాపిటలిజం దానంతట అదే విచ్ఛిన్నమవదు: దానంతటఅదే కూలిపోదు స్వచ్ఛందంగానే, లేక దానంతటఅదే కూలిపోతుందనే తప్పుడు సిద్ధాంతం కార్మిక వర్గానికి ఎంతో ద్రోహం చేసింది. దోపిడిగాండ్రతో ఎడతెగని దీర్ఘపోరాటం జరపాలి అనేవిషయాన్ని గుర్తించకుండా అడ్డుపడింది. కాపిటలిస్టులు ఏదోవిధంగా తప్పించుకు బయటపడలేనట్టి విషమ పరిస్థితులు ఏర్పడవు. కార్మికవర్గం తీవ్రంగా పోరాడటం వల్లనే అట్టివిషమ పరిస్థితులలో కాపిటలిజం కూలిపోగలదు.

“విప్లవం దానంతట అదే జయంపొందదు. దానికొరకై సర్వసన్నాహాలు చేసుకొని, పోరాడి జయించాలి. బలీయమైన శ్రామికవర్గపార్టీయే అట్లు విప్లవానికి సర్వసన్నాహాలుచేసి, పోరాటంజరిపి జయించగలదు.” *

సమాప్తము



* పై గ్రంథం నుండి.

